# జీవియస్
# నవలలు - కథలు

రచయిత :

జి. వి. సుబ్రహ్మణ్యం

సంపాదకులు :

ముత్తేవి లక్ష్మణరావు

డా॥ ముత్తేవి భారతి

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం
షష్టిపూర్తి ప్రచురణలు
హైదరాబాదు - 500 044.

# GVS NAVALALU - KATHALU

Novels and short-stories of Prof. **G.V. Subrahmanyam**

Edited by **Sri Muktevi Lakshmana Rao & Dr. Muktevi Bharathi**



Shastipurthi Publications

First Edition : July 1996

Copies : 1000

**Price Rs. 90/-**

Cover Design : Sri Seela Veerraju

Copies available at

1. Convenor, Prof. G.V. Subrahmanyam Shashtipurthi Publications
   Sri Vani, 1-8-702/105,
   Nallakunta, Hyderabad-500 044.
   Phone : 7633275.
2. **Visalandhra Publishing House**
   4-1-435, Vignan Bhavan,
   Bank Street,
   Hyderabad - 500 001 &
   other Branches.
3. **Navayuga Book Sellers**
   In front of Arya Samaj,
   Kothi, Hyderabad.

Printed at :

Padmavathi Art Printers
1-1-517/B/1, New Bakaram,
Gandhinagar,
Hyderabad-500080.
Phone : 7611413.

Cover page Printed at :

Vipla Printers Private Ltd.
Near Shankar Math, Nallakunta
Hyderabad - 500044.

భౌతికార్థిక శాస్త్ర విద్యా విచక్షణులు

అశేష విజ్ఞాన ప్రజ్ఞా విలక్షణులు

సాహితీ కళా బంధువులు

కవితా సుధా సింధువులు

# శ్రీ రాయసం వెంకట్రామయ్య గారికి

గౌరవపురస్సరంగా

అంకితం

# సమర్పణ

రాయసము వారు రాయంచరౌతురాణి
పాటపల్లవి సవరించు నేర్పుకాండ్రు
వారు పిండిన వేదగోక్షీర రాశి
నామరుచిఁ దాల్చె వేంకట రామ సుకవి.

అతి రుచిరార్థ వాఙ్మయ కళార్చన శీలుఁ, డనంత శాస్త్ర సం
హితమతి, మిత్రలోక హృదయేప్సిత పూర్ణసుధాంశుమూర్తి, సం
తతహిత పుణ్యకార్య పరతంత్ర చరిత్రుఁ డటంచు పండితుల్
సతతము కీర్తి సేయుదురు సత్కవి వేంకట రామధీమణిన్.

భీమవరముగడ్డ పెంచి యిచ్చిన బిడ్డ
        భారతమాతకు ప్రాభవమ్ము
మావుళ్ళ దేవత మదికి హత్తిన భక్తి
        ధర్మచింతకు ప్రాణధారణమ్ము
భౌతిక శాస్త్రార్థ పరిణత విద్వత్తు
        వస్తు తత్త్వజ్ఞాన వైభవమ్ము
ఆర్థికోన్నత శాస్త్ర సార్థకోద్యోగమ్ము
        విత్త విద్యామర్మ వీక్షణమ్ము
అతడు వేంకటరామయ్య అమల యశుడు
ఒత్తిడుల మధ్య నలిగెడు చిత్తమందు
కవితకోకిల కలకంఠ గాన సుధను
మనుచుకొన్నట్టి సాహితీ మధురమూర్తి

అతని సన్నిధికేగు ఆత్మీయులకు నెల్ల
సౌహార్ద సౌగంధ్య సౌఖ్య మమరు
అతని మందిరమందు అద్భుతమ్ముగ సాగు
బహుశాస్త్ర చర్చలు ప్రజ్ఞ నొసగు
అతని కృతులలోని అరుదైన వ్యంగ్యోక్తి
పూల నెత్తావిగా పుక్కిలించు
అతని లౌకికవాక్కు హాస్యార్థ రుచులతో
వెల్గు విందులు వెట్టి విడియ మిచ్చు
అతడు ఎచ్చట నిల్చిన అచట సాధి
కారికంబైన తెలివికి కనకపీఠి
సహృదయామోద సాహిత్య సరసవృత్తి
మొలక నవ్వులు చిలికించు ముగ్ధరీతి.

అతని దర్శించి హర్షించి ఆత్మపొంగ
స్నిగ్ధ లైనట్టి నవలలు చెన్నుమీర
అతని స్వీకృతి నాశించి ఆశపడిడె
కథలు నవలల వెన్నంటి కలసి నడిచె.

రచన రీతుల రమణీయ రక్తిఁ గాంచి
మనదు మైత్రిని గణియించి మంచి నెంచి
రాయసమువారి వేంకట రామ సుకవి!
కృతిని గైకొమ్ము చిరమైన కీర్తి గనుము!!

—జి. వి. సుబ్రహ్మణ్యం

# ఇందులో

## పూర్వరంగం



## నవలలు



## కథానికలు



## గల్పికలు

# సంపాదకీయం

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారి షష్టిపూర్తి సందర్భంగా వారిని గురించిన కొన్ని కొత్త విషయాలు మాదృష్టికి వచ్చాయి. మనం గౌరవించి అభిమానించే వ్యక్తిని గురించి వీలయినన్ని విశేషాలు తెలిసికోవాలనే కోరిక వుండటం సహజం. అంతేకాక, వారి వ్యక్తిత్వం, పాండిత్యం, ప్రజ్ఞాపాటవాలు ఏ రకంగా రూపొందుతూ వచ్చాయో తెలిసికోవాలనే ఉత్సాహం వుండటంకూడా సహజమే.

పైన మనవి చేసినట్లుగా జీ. వి. యస్. గారి షష్టిపూర్తి సందర్భంగా మాకు తెలిసిన కొత్త విషయమేమిటంటే, ఆయన రెండు నవలలు రచించి కూడా పుస్తకరూపంలో తెచ్చేందుకు శ్రద్ధ వహించలేదనీ, తెలుగు సాహిత్యంలో అడుగిడిన కొత్తలోను, తరవాత రచించిన కొన్ని కథలు పత్రికల్లో అచ్చు అయ్యాయనీ. అవి చదవాలనే కోరిక మాకు కలిగింది. షష్టిపూర్తి సన్మాన సంఘ కార్యకర్తలలో ఒకరైన వారి కుమారుడు విద్యానాథ్ ద్వారా అవి తెప్పించుకుని చదివాము. వాటిని షష్టిపూర్తి సందర్భంగా అచ్చువేసి, సంపుటిరూపంలో తేవటం చాలా ప్రయోజనకరంగా వుంటుందనే మా మనోభిప్రాయాన్ని వారికి చెప్పాము. బహుశః ఇదే అభిప్రాయం వాటి విషయం తెల్సిన జీ. వి. యస్. గారి శిష్యులు, అభిమానులు తెల్పివుంటారు. షష్టిపూర్తి సన్మాన సంఘం ఆ అముద్రిత నవల్ని, వెనుక అచ్చయిన చిన్న కథల్ని ఒక సంపుటంగా ప్రచురించాలనే సముచిత నిర్ణయం తీసుకుంది. షష్టిపూర్తి సన్మాన సంఘంవారు మమ్మల్ని (ముక్తేవి లక్ష్మణరావు, డా॥ ముక్తేవి భారతి) ఆ సంపుటానికి సంపాదకులుగా వుండమని కోరారు. వారి కోరికని ఆదేశంగా స్వీకరించి, ఈ సంపుటానికి సంపాదకుల మయ్యాము మేము.

మేము సంపాదకులుగా, ఆచార్య జీ.వి.యస్. గారి రచనలలో ఒక్క అక్షరం మార్చలేదు, ఒక్క అక్షరం చేర్చలేదు. అయితే, ఆ నవలలను గురించి ప్రధానంగా పాఠకులను దృష్టిలో పెట్టుకుని కొన్ని అంశాలకు వివరణ యిస్తూ మరి కొన్నిటిని సూచీమాత్రంగా చెప్పదలచాము.

## రాగమంజరి :

ఈ సంపుటములో మొదటి నవల రాగమంజరి. ఇది చారిత్రక నవల. ఇది ఆచార్య జీ.వి.యస్ (జీనియస్ అని తొందరలో మీరు చదువుకున్నా ఆయన విషయంలో సార్థక నామధేయమే) ఇరవై రెండు సంవత్సరాల వయస్సులో రాసిన నవల. ఆ విషయం తల్చుకుంటే కొంచెం ఆశ్చర్యంగానే వుంటుంది. ఎందుకంటే, ఈ నవలా వస్తువుకు సంబంధించిన చరిత్రను గురించి సరియైన అవగాహన వుండటం సామాన్యంగా సాధ్యం కాదు. పైగా, చారిత్రక నవల ఎట్లా రాయాలో దాని నియమాలు ఏమిటో ఆకళింపు చేసుకుని రాయటం మరీ ఆశ్చర్యంగా వుంటుంది. తత్కాలీనమైన సాంఘిక, చారిత్రక పరిస్థితుల్ని వివిధ కోణాలలో నుంచి ఊహించుకొని కథావస్తువును మలచుకోవటం సాహిత్య రంగంలో కొత్తగా అడుగిడుతున్న యువకుడికి కష్టమైన పని. ఈ ప్రక్రియను సాధించటమే కాక, సఫలీకృతం చేసికొన్న యోగ్యత, పరిపూర్ణంగా దక్కించుకున్న ఘనత యువకుడైన జీ.వి.యస్‌కు దక్కింది.

చారిత్రక నవల గురించి మాకు తోచిన కొన్ని వివరణలిస్తాము. తాళికోట, రాక్షసతంగడి యుద్ధాలలో విజయనగర సైన్యాలు ఓడిపోవటంతో, విజయనగర సామ్రాజ్యపు ప్రభుత్వం విజయనగరాన్ని వదలి వెళ్ళింది. ఆ సందర్భంగా అళియ రామరాయల తమ్ముడు తిరుమల దేవరాయలు విజయనగర సామ్రాజ్యపు వజ్రసింహాసనాన్ని, నిధుల్ని, ముఖ్యమయిన పరిజనాన్ని విజయనగరం నుంచి తప్పించి, పెనుగొండకు తరలించుకుపోయి, పెనుగొండని విజయనగర సామ్రాజ్యానికి రాజధానిగా చేశాడు. అప్పటికే తిరుమల రాయడు వయోవృద్ధుడు. ఆయన తన ముగ్గురు కుమారులలో శ్రీరంగరాయలను పెనుగొండకి, రామరాయలను శ్రీరంగపట్నానికి, వేంకటపతి దేవరాయలను చంద్రగిరికి అధిపతులుగా నియమించాడు. పెనుగొండకు రాజధాని మార్చిన కొద్ది కాలానికి తిరుమల రాయడు మరణించాడు. ఆ ముగ్గురిలో పెద్దవాడు శ్రీరంగరాయలు పెనుగొండను పదేళ్ళు పాలించినా, ఎన్నో యుద్ధాలు చేసి ఎన్నో కష్టాలు పడ్డాడు. ఆయనకి సంతతి లేదు. రామరాయలు శ్రీరంగపట్నాన్ని పాలించినా శక్తివంతమైన ప్రభువుగా పేరు సంపాదించుకోలేదు. తన ఆధీనంలో వున్న కొన్ని రాజ్య భాగాలు పోగొట్టుకున్నాడు. ఆయనకి ఇద్దరు పిల్లలున్నా, ఆయన మరణకాలానికి వారు చిన్నపిల్లలు. ముస్లిమ్ దండయాత్రలభయం కారణంగా,

సమర్థుడైన రాయ వంశీకుడు రాజ్యభారాన్ని వహించాలనే సామంతుల కోరిక మేరకు, వెంకటపతిదేవరాయలు విజయనగర సామ్రాజ్య శేషభాగానికి ఆధిపత్యం వహించాడు. వేంకటపతిదేవరాయల వ్యక్తిత్వం, ఆయన ప్రాజ్ఞత ఫలిసి వచ్చి, కొండవీడు మినహా మిగతా విజయనగర సామ్రాజ్య భాగాలన్నీ ఆయన ఆధిపత్యంలోకి వచ్చాయి. దక్షిణాది సామంత రాజులందరూ ఆయన అధికారాన్ని అంగీకరించారు ఆ విధంగా వేంకటపతిదేవరాయల పరిపాలన, ఆయన తదనంతరం వారసత్వాన్ని గురించి జరిగిన ఘర్షణలు, చివరికి వేంకటపతిదేవరాయల అన్న మనుమడు రామదేవరాయలు పట్టాభిషిక్తుడవటం ఈ నవలలోని కథాంశం.

ఈ కథావస్తువు ఎన్నుకోటంలో యువకుడు జీ.వి.యస్ తన ప్రత్యేకతని ప్రదర్శించారు. ఆయన అదృష్టమేమో, అప్పటివరకు ఈ కథావస్తువును స్పృశించిన రచయితలు లేరు.

చారిత్రక నవలా రచనా రంగంలో అప్పటికే కాలూనిన విశ్వనాథ, నోరి నరసింహశాస్త్రి,మునిమాణిక్యం కూడా తెలుగుదేశ చరిత్రలోని బహు ప్రాముఖ్యత కలిగిన ఈ ఘట్టాన్ని సాహిత్యపరంగా దర్శించలేదు. కొత్తగా విశ్వవిద్యాలయ విద్యాభ్యాసం పూర్తిచేసుకుని, సాహితీరంగంలో దిక్కులు వెతుకుతున్న యువకుడు జీ.వియ.స్‌కి ఈ చారిత్రకాంశం దృష్టికి రావటం ఆశ్చర్యకరమైన విషయమే.

చారిత్రక నవల రాయటంలో అనూచానంగా కొన్ని నియమాలు పాటింపబడుతున్నాయి. ఈ నియమాలు పాశ్చాత్య సాహిత్య ప్రపంచంలోనూ ఆచరణీయమైనవే- తెలుగు చారిత్రక నవలా రచయితలు కూడా అనుసరించారు. అవి ప్రధానంగా ఇవి:

1) చరిత్రలో ప్రధాన ఘట్టాలను, సర్వులూ అంగీకరించిన విషయాలను చారిత్రక నవలా రచయిత మార్పు చేయకుండా వాడుకోవాలి.

2) చారిత్రక పాత్రలు కాని పాత్రలను కథానుగుణంగా సృష్టించుకోవచ్చు.

3) చారిత్రక ఫలితాలకు రచయిత తోచినరీతిలో అవసరమనుకుంగే వివరణ యివ్వవచ్చు.

4) కథాగమనంలో అవసరమైన నేపథ్యం సృష్టించే బాధ్యత చారిత్రక రచయితపై వుంది.

పై నాలుగు సూత్రాలలో మొదటిది అత్యంత ప్రధానమైనది. చారిత్రకంగా ప్రతిపాదితమైన సంఘటనలను మార్చే అధికారం రచయితకి లేదు. పై సూత్రాలలో నాల్గవది రచయితకి చాలా స్వాతంత్ర్యం యిస్తుంది. అయినా అది ముళ్ళకిరీటం లాంటిది. ఎందుకంటే, తత్కాలీన చారిత్రక నేపథ్యం గురించి సంపూర్ణ అవగాహన వుంటేనే నవలా రచయిత సరిఅయిన రచన చేయగలడు.

పై సూత్రాల నిర్దేశకత్వం దృష్ట్యా నవలను పరిశీలనచేస్తే, ప్రస్తుత కథా వస్తువును యువకుడైన జీ.వి.యస్. అద్భుతంగా తీర్చిదిద్దారు.

ఈ చారిత్రక నవలలో ముఖ్యమైన పురుష పాత్రలు వేంకటపతి దేవరాయలు; ఆయన బావమరది జగ్గరాయలు; ఆంతరంగికుడు, మండలాధీశుడు అయిన యాచమనాయకుడు. నవలలో వేంకటపతి దేవరాయలుగా చిత్రింపబడిన సార్వభౌముడు నిజానికి చరిత్రలో రెండవ వేంకటపతి దేవరాయలు. అచ్యుతదేవ రాయల మరణానంతరం (క్రీ.శ. 1542) ఆయన కుమారుడు వేంకటాద్రి అనే బాలుణ్ణి వేంకటపతిదేవరాయలుగా విజయనగర సామ్రాజ్యాధిపతిని చేశారు. కానీ ఆ మొదటి వేంకటపతిదేవరాయలు కొద్ది కాలానికే అతని మేనమామ సలకం తిరుమలరాజు చేతిలో దుర్మరణం పాలయ్యాడు. మొదటి వేంకటపతి దేవరాయలకి చరిత్రలో చెప్పుకోదగ్గ స్థానం లేదు. బహుశః ఆ కారణంచేతనో, కథాగమనం దృష్ట్యా అనవసరమనో, రెండవ వేంకటపతిదేవరాయలను వేంకటపతిదేవరాయలుగానే రచయిత చిత్రించారు.

ఈ నవలలో చిత్రించబడిన వేంకటపతిదేవరాయలు క్రీ.శ. 1586 లో రాజ్యాని కొచ్చి, క్రీ.శ. 1614 వరకు పరిపాలన చేశాడు. రాజ్యానికొచ్చిన కొత్తల్లో ఉత్తరానవున్న ముస్లిమ్ రాజ్యాలనుండి - ప్రధానంగా గోల్కొండతో యుద్ధాలు సంభవించినా, అన్నిటినీ తట్టుకుని విజయం సాధించి, కొండవీడు మినహా కృష్ణకు దక్షిణంగావున్న తెలుగు కన్నడ తమిళ కేరళ దేశాలపై అధిపత్యాన్ని నిలబెట్టుకున్నాడు. సామంతరాజు లందరినీ తగిన రీతిలో కట్టడిచేసి తన అధీనంలో వుంచుకున్నాడు. ప్రజారంజకుడై, మండలాధీశులందరికీ అభిమానుడై రాజ్యపాలన కొనసాగించాడు. వేంకటపతిదేవరాయల పాత్రను, ఆ సార్వభౌముని వ్యక్తిత్వాన్ని కళ్ళకు కట్టినట్టు ఈ నవలలో చిత్రించాడు రచయిత,

వేంకటపతి దేవరాయల బావమరిది జగ్గరాయలు మండలాధీశుడు. మహా వీరుడు. బావగారికి రాజ్యపాలనలోను, యుద్ధరంగంలోను సహాయభూతుడుగా నిల్చిన వ్యక్తి. అయితే, వేంకటపతి రాయలకి సంతానం లేని కారణంగా జగ్గ రాయలుకి దురాలోచన కలిగింది. జగ్గరాయలు చెల్లెలైన వేంకటపతి దేవరాయల చిన్నభార్య గర్భవతి అని ప్రచారము చేసి, ఒక బ్రాహ్మణ పసికందును తెచ్చి, బాయాంబకు పుట్టిన పుత్రుడుగా వేంకటపతి దేవరాయలను నమ్మించాడు. కానీ కొద్ది కాలానికి మేధావి అయిన వేంకటపతి దేవరాయలు ఆ మోసాన్ని గ్రహించాడు. కాని, రాజ కుటుంబ గౌరవానికి భంగం కలుగుతుందని ఆ మోసాన్ని బయటపెట్టలేదు. బాయాంబను, జగ్గరాజును శిక్షించలేదు కానీ, తన అన్న రామరాయల కొడుకైన శ్రీరంగ చిక్కరాయలను శ్రీరంగ దేవరాయ లుగా ,యువరాజుగా పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. రాజ్య సుస్థిరతకు ఆ చర్య అవసర మని మండలాధీశులందరినీ ఒప్పించాడు వేంకటపతి దేవరాయలు. యాచమ నాయకునికి మాత్రం బాయాంబా జగ్గరాయల మోసాన్ని వివరించి, శ్రీరంగ దేవరాయలకి కుడిభుజంగా వుండమని ఆదేశించాడు. అయితే, వేంకటపతి దేవ రాయల మరణానంతరం జగ్గరాయలు మండలాధీశుల సాయంతో శ్రీరంగ దేవరాయలను మోసంచేసి. అతణ్ణి అతని కుటుంబాన్ని బంధించాడు. బాయాంబ పుత్రుని పేరుతో జగ్గరాయలు రాజ్యపాలన మొదలుపెట్టాడు.

యాచమ నాయకుడు వేంకటపతిరాయలయందు అమితమైన భక్తి కలవాడు. మహావీరుడు, వెలుగోటి మండలాధీశులందరూ ఆయన అను యాయులు, బంధువులు. యాచమ నాయకుడు గొప్ప దేశభక్తుడే కాక రాజ నీతిజ్ఞుడు కూడా. శ్రీరంగరాయల కుమారుణ్ణి చెరసాలనుంచి తప్పించాడు. అయితే, ఆ సంగతి కనిపెట్టిన జగ్గరాయలు తన అధికారానికి ముప్పుతప్పదని తలంచి శ్రీరంగదేవరాయలను సకుటుంబంగా హత్య చేశాడు. యాచమ నాయకుడు బాలుడైన రామదేవరాయల్ని జాగ్రత్తగా కాపాడటమేకాక, తన మండలాధీశుల సహాయంతోను, రఘునాథరాయల సమ్మతితోను, బాలుడైన రామదేవరాయలను వెల్లూరు కోటలో పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. అందరినీ కూడ కట్టుకొని జగ్గరాయలను హతమార్చాడు. చంద్రగిరిని స్వాధీనపర్చుకొని రామ దేవరాయలను సామ్రాజ్యాధిపతిని చేస్తాడు ఆ విధంగా యాచమ నాయకుడు వేంకటపతి దేవరాయ లప్పగించిన బాధ్యత నెరవేర్చిన దేశభక్తుడు, స్వామి భక్తుడు. జగ్గరాయల శౌర్యప్రతాపాలు, అతని నిరంకుశ స్వభావం, దుర్మార్గం;

యాచమ నాయకుని ప్రభుభక్తి, దేశభక్తి, అతని ఉన్నతమైన ఆశయాలు రాజనీతిజ్ఞత, పరిపాలనా దక్షత సౌమనస్యం - జీ. వి. యస్. ఈ నవలలో చిత్రీకరించిన తీరు గమనించదగ్గది.

ఈ నవలరో ప్రధానమైన స్త్రీ పాత్రలు కొండాంబ, బాయాంబ, రాగ మంజరి. కొండాంబ, బాయంబలు గొబ్బూరివంశపు ఆడపడుచులు; జగ్గరాయల అక్కచెల్లెళ్ళు; వేంకటపతిదేవరాయల భార్యలు. వీరిద్దరూ చారిత్రక ఉనికి వున్న పాత్రలే. పట్టపురాణి కొండాంబ పాత్రను. చిన్న భార్యగా బాయాంబ పాత్రను చిత్రించినపుడు కొండాంబలో రాణివాసపు హుందాతనాన్ని, బాయాం బలో మాతృత్వపు కాంక్షని చాలా సహజంగా వర్ణించారు జీ.వి.యస్. (వేంకట పతిదేవరాయలకు ఆరుగురు భార్యలని, ఆరుగురికి సంతానం లేదని ప్రఖ్యాత చారిత్రకులు ఓరుగంటి రామచంద్రయ్యగారు తెల్పారు. కానీ ఇరువురు భార్యలకే కథతో సంబంధం వుంది కనక, ప్రస్తుత రచయిత తక్కిన భార్యల విషయం ప్రస్తావించకపోయివుండవచ్చు.)

వేంకటపతిదేవరాయల భార్యలిరువురికి సంతానం లేకపోపటంతో జగ్గ రాయల పన్నాగానికి అంగీకరించటం కథలో ప్రధానాంశమయింది.

ఈ నవలలోని రాగమంజరి పాత్ర కల్పిత పాత్ర. రాగమంజరి ఆస్థాన నర్తకి అయినా, వేంకటపతిదేవరాయలపై అమితమైన భక్తి విశ్వాసాలున్నాయి. జగ్గరాయల కుట్ర వేంకటపతిదేవరాయలకి అభిమతం కాదని తెలిసికొన్న రాగ మంజరి, యాచమనాయకునికే తన శక్తికొలది సహాయం చేసింది. కల్పితపాత్ర అయిన రాగమంజరి పేరు ఈ నవలకి పెట్టడం, ఇది చారిత్రక నవల అయినా సృజనాత్మక రచన అని పాఠకులకి తెలియచెప్పటం రచయిత ఉద్దేశం కావచ్చు. లేదా తను సృష్టించిన పాత్రమీది మమకారమేమో!

రాగమంజరి నవలలో భాష సరళ గ్రాంథికం. చారిత్రక నవలలో రాయ టానికి సరళగ్రాంథికం చాలా అనువైనట్టిది. ఈ కాలంలో చారిత్రక నవలలు ఎవరు వ్రాసినా కొన్ని పాత్రలలోనైనా సరళగ్రాంథికం వాడక తప్పదేమో!

ఈ చారిత్రక నవలలో యువకుడైన జీ.వి.యస్. కవితాధోరణి చాలా చోట్ల భాసించి, నవలకి నిండుతనాన్ని చేకూర్చింది. ఉదాహరణప్రాయంగా కొన్ని —

1) సభ కన్ను తెరచెను.
2) అతని మాట లాతని భృకుటిలో ముడి వడును. కన్నుల కూడిగ మొనర్చును.
3) ఆమె చంద్ర దర్శనమున చంద్రకాంత శిలవలె చెమ్మగిల్లినది.
4) దేశము ద్వంద్వ యుద్ధమునకై కసరత్తు చేయుచున్నట్లుండెను.
5) మధుర సైన్యము మాత్సర్య సముద్రము పొంగి పొరలినట్లుండెను.

ఈ విధంగా కవితాశోభ గల వాక్యాలు రచనకు శోభను చేకూర్చాయి. ఆసాంతం ఏకబిగిని చదివించేటట్లుగా వుంది ఈ చారిత్రక నవల. అంత చిన్న వయసులో అంత చక్కని చారిత్రక నవల రచించిన జీ.వి.యస్. ఆ ప్రక్రియను కొనసాగిస్తే, మరికొన్ని సుందరమయిన మణిహారాలు తెలుగు సాహిత్య సరస్వతికి అలంకారాలయ్యేవి.

ఈ నవల 1958 లో రచింపబడి, ప్రచురింపబడింది. బి.ఓ.యల్., ఇంటర్‌మీడియేట్ తరగతులకు పాఠ్యంగా చాలా కాలం వుండేది. విద్యార్థులలో కూడా ప్రచారం పొందింది. అటువంటి 'రాగమంజరి'ని షష్టిపూర్తి సన్మాన సంఘం వారు ప్రచురిస్తున్నందుకు అభినందనీయులు.

1-5-96
సికింద్రాబాదు

**ముక్తేవి లక్ష్మణరావు**

## నవమల్లిక :

తెలుగు సాహిత్యంలో స్వాతంత్ర్యానంతరం నవలా ప్రక్రియ బాగా ప్రచారంలోకి వచ్చిందనటం నిర్వివాదాంశం. తెలుగు నవల, అందులోనూ సాంఘిక నవల, పందొమ్మిది వందల ఏభై తర్వాత మరీ వేగాన్ని పుంజుకుని, మధ్యతరగతి జీవన విధానానికి అద్దం పట్టింది. సామాజిక స్పృహ నీడలాగ నవలా రచనతో కలసి నడిచింది. సాంఘిక నవల తెలుగింటి నవలగా రూపుదిద్దుకుంది. కుటుంబ వ్యవస్థ - ఆ కుటుంబాలలో వ్యక్తులు - ఆస్తి వుందని అహంకరించే పెద్దలు- ప్రేమ వివాహాలవైపు పరుగులు తీస్తున్న పిన్నలు, ఆదర్శమూర్తులుగా నిలవాలనే సంకల్పంతో నవ సమాజం వైపు దృష్టి సారించిన

యుపకులు, - ఇలా జీవితరంగంలో అనుక్షణం బతుకుపోరాటంలో కనిపించే విభిన్నమైన వ్యక్తులు పాత్రధారులై నవలా రంగంలో ప్రత్యక్షమవుతున్నారు. శైలిలో, అభివ్యక్తిలో కూడా నవలా రచనలో కొత్త ధోరణులు ప్రబలాయి.

సమసమాజ నిర్మాణావశ్యకత కథాంశంగా తీసుకురావాలనే స్పందన యువ రచయితల్లో బలంగా నాటుకుంది. మనిషిని మనిషిగా గుర్తించాలనే మానవతా వాదం రచయితల్లో బాగా పాదు చేసుకుంది.

ఈ నేపథ్యం లోంచి వెలుగులోకొచ్చిన సాంఘిక నవల 'నవమల్లిక.' 1968 లో ముప్పయి రెండేళ్ళు నిండిన యువకుడైన జీ.వి.యస్ కలం నుంచి వెలువడిన 'నవమల్లిక' నవనవోన్మేషశాలినియైన ప్రతిభకి ప్రతీక!

'నవమల్లిక'లో కథావస్తువు మధ్యతరగతి కుటుంబ వ్యవస్థే ఈ నవలలోని ముఖ్యమైన నాలుగు పాత్రలను నాలుగు కోణాలుగా భావిస్తే, ఆ నాలుగూ ఒకచోట మానవత్వానికి మంగళహారతి పట్టడం ఈ కథాంశంలో పరాకాష్ఠ. యువకుడైన రచయితగా జీ.వి.యస్. యువకులకుండవలసిన ఆదర్శాలను, అభ్యుదయ భావపరంపరలను హరి పాత్ర ద్వారా పోషిస్తూ, మానవతా విలువలకు పట్టం కట్టారు ఈ నవలలో.

హరి, మధు, హేమ వరంగల్ నుండి జీపులో హైదరాబాదుకు బయలు దేరటంతో కథ కదిలింది. జీపు పల్లెటూరు పక్కగా పరిగెడుతుంటే, ఊరి పొలిమేరలో ఓ పాక నుంచి 'చచ్చాను బాబోయ్' అనే ఆర్తనాదం వినిపించింది. నడుపుతున్న జీప్‌కు బ్రేక్ వేశాడు మధు. పాక తలుపును ఒక తన్ను తన్నాడు హరి. ఉక్కులాంటి ఏభై ఏళ్ళ ముసలాడు పద్దెనిమిదేళ్ళ పిల్లపై అత్యాచారం చేయబోతున్న దృశ్యం - ఆ కామాంధుణ్ణి తన్ని, పిల్లని రక్షించాడు హరి.

ఈ అనాథను మనతో తీసికెడదాం అంది హేమ.

వెంటనే అంగీకరించాడు హరి.

"మనిషితోబాటు బాధ్యతలు వెంటవస్తాయి" హెచ్చరిక చేసాడు మధు.

'బరువెత్తుకున్నాను, ఇక మోయకతప్పదు'—హరి ఆ పిల్లతో జీపువైపు నడిచాడు.... ఆ పిల్ల మల్లవ్వ తరవాత మల్లిక అయింది - ఇదే ఇందులో కథ - ఈ కథాగమనానికి ఈ నవలలోని నాలుగు పాత్రలను నాలుగుకోణాలలో నుంచి చూస్తే, రచయిత ఈ పాత్రలను ఎందు కిలా మలచారో, ఈ పాత్రల ద్వారా సామాజిక ప్రయోజనాన్ని ఎలా సాధించారో కూడా స్పష్టమవుతుంది.

ఆనాడు ఆ పాకలోంచి బయటలోకంలోకి తెచ్చిన మల్లవ్వను, ఆధునిక యువతిగా, సంస్కారవతిగా తీర్చిదిద్దాలనే ఆశయంతోనే మల్లికగా ఆధునిక సమాజంకి పరిచయం కలిగించాడు హరి. చదివించాడు. ఆమెలోని సృజనాత్మక శక్తిని గుర్తించాడు. నాటకాలు వేయించాడు. ఒక వ్యక్తిత్వం రూపుదిద్దుకొనేలా ఆమెను పెంచాడు. ఆమెనే వివాహమాడటానికి అతని సంస్కారం అంగీకరించ లేదు. అత్తకూతురు హేమ రేపిన ఆశలు అతని వెంటాడుతూనేవున్నాయి.

విదేశాలకు వెళ్ళి చదువుకుని తిరిగివచ్చిన హరి, మరెన్నో అభ్యుదయ భావపరంపరలు మోసుకొచ్చాడు. మనిషి మానవతావాదిగా ఎంతో ఎదిగి పోయాడు. మధు మరణించాడని తెలిశాక, మాలతికి రెండువందలు చేతిలో పెట్టి మామగారు రామచంద్రయ్య వెళ్ళగొట్టాడని తెలిశాక, హరి మనసు ఆవేదనతో కృంగిపోయింది. ధర్మాన్ని రక్షించాలనే దీక్షతో మనసు పరుగులెత్తింది. కోర్టులో దావావేసి, ఆస్తిలో సగ భాగం మాలతికి యిప్పించిన సౌజన్యమూర్తి హరి. ఏమీ ఆశించకుండా నిర్మలమైన మనసుతో మల్లవ్వను మనిషిని చేసిన నిస్వార్థపరుడు హరి. యౌవనపు పొంగుకు అడ్డుకట్టవేసి, మల్లికని చెల్లిగా చూస్తూ, ఆమె భవిష్యత్తుకు బాటవేసిన సంయమనశీలి హరి. ఆ హరినే యువకు లకు ఆదర్శమూర్తిగా హిమాలయోన్నత శిఖరంపైన నిలబెట్టారు రచయిత.

ఒక బీదపిల్ల అయిన మాలతిని ధనవంతుడయిన మధు, తల్లితండ్రులను ఎదిరించి ప్రేమ వివాహం చేసుకున్నాడు. మధుమంజరి సౌండ్ సిండికేట్ అనే పెద్ద రేడియో వ్యాపార సంస్థను తండ్రి ఆగ్రహానికి గురియై వదులుకున్నాడు. ప్రేమకై జీవితంలో ఎన్నో కష్టాలను ఓర్చిన యువ ప్రేమికుడు మధు. లలితతో జీవితాన్ని పంచుకున్న మధు, ప్రేమించిన స్త్రీకి న్యాయం చేకూర్చాలనే ధర్మానికి కట్టుబడిన ఆదర్శవాది. తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోడానికి అహర్నిశలూ కృషి చేసిన యువకునిగా మధు పాత్రను చిత్రించారు రచయిత.

హరిని ఆరాధిస్తూనే, ఆ మాట ఖచ్చితంగా పైకి చెప్పలేక మనసులో మధనపడిన యువతి హేమ. మల్లికతో హరి స్నేహాన్ని అపార్థం చేసుకుంది. విద్యావతిగా ఎదిగిపోతూ, డాక్టరయిన హేమ, మరణించిన అన్న పేర 'మధు నర్సింగ్ హోమ్' స్థాపించింది. చివరకు ఆ నర్సింగ్ హోమ్‌లోనే, అనాధగా వచ్చి, పిల్లను కని మరణించింది మల్లిక. క్షమాగుణాన్ని గుండెనిండా నింపు కుంటూ, మల్లిక ప్రసవించిన పసిగుడ్డును ఒళ్ళోకి తీసుకుని మాతృమూర్తి అయి, హరి చేయి అందుకుంది హేమ ఆ పసిగుడ్డే "నవమల్లిక".

ఈ నవలలో నాయిక అనదగిన మల్లప్ప, హరి అండదండలతో మల్లిక అయింది. వయోజన విద్య నేర్చింది - నాటకాలు వేసింది. హరితో స్నేహాన్ని లోకం అపార్థం చేసుకునేంతవరకు పెంచింది మల్లిక. స్నేహాన్ని వివాహ బంధంగా మార్చాలని కాంక్షించింది మల్లిక. కానీ, హరి వ్యక్తిత్వం ముందు నిలవలేక, యౌవనపు పొంగులో, మోసగాడైన చంద్రాన్ని నమ్మింది. మద్రాసుకు లేచిపోయింది అతనితో. కాని సినిమా తారగా ఎంత పెరిగిపోయినా, చివరకు పతితయై, మధు నర్సింగ్ హోమ్‌లో పిల్లనుకని, హేమ కందించి కళ్ళుమూసింది మల్లిక. తన సంపాదనలో కొంత హరిహర కళా భవనానికి, కొంత మైనరు బాలికకి, కొంత చంద్రానికి ముట్టచెప్పమని విల్లురాసిన మల్లిక సంస్కారం తలుచుకుంటే పాఠకుడికి కళ్ళు చెమర్చక మానవు.

హరి, మధు, హేమ, మల్లిక - నలుగురు నాలుగు కోణాలు. నలుగురిని నాలుగు కోణాలనుంచి చూస్తే మూర్తిభవించిన మానవతా మూర్తులు. గడ్డి పూవును మల్లికగా చేసిన హరిలాటి నిస్వార్థపరులు, సంస్కారులూ; ప్రేమించిన పిల్లకోసం ఆస్తిని, తల్లితండ్రుల్ని వదులుకోవటానికి వెనుకాడని ప్రేమ మూర్తి మధులాంటి యువకులూ; తన వ్యక్తిత్వాన్ని పెంచుకుంటూ, డాక్టరుగా ఎదిగిపోయిన హేమలాంటి యువతులూ- వీరే మన సమాజం కోరుకునే వ్యక్తులు. సామాజిక స్పృహతో అడుగడుగు ముందుకేస్తున్న యువతని అద్దంపట్టి చూపారు రచయిత ఈ నవలలో.

హరిలో సంయమనాన్ని, హేమలో ఆత్మస్థైర్యాన్ని, మధులో త్యాగ శీలాన్ని, మల్లికలో లోకంలోని మోసాన్ని గుర్తించలేని అమాయకత్వాన్ని, మాణిక్యాంబలో మూర్ఖత్వాన్ని, రామచంద్రయ్యలో అహంకారాన్ని, చంద్రంలో మోసకారితనాన్ని, - ఇలా మానవ ప్రకృతిలో వుండే రకరకాల తత్వాలకు రూపకల్పన చేయబడింది ఈ నవలలో.

రచయిత ఈ నవలకి 'నవమల్లిక' అని పేరుపెట్టి, నవతని పరోక్షంగా ప్రోత్సహించా రనిపిస్తుంది. నవత, యువత అనేవి సమాజానికి రెండు కళ్ళు. ఆ రెండు కళ్ళూ వెలుగుబాటవై పే నడవాలన్నది రచయిత లక్ష్యం.

ఈ సాంఘిక నవలపై, కథ దృష్టితోనే కాక, శిల్పందృష్ట్యా, అభివ్యక్తీకరణదృష్ట్యా కూడా రచయిత ప్రత్యేకమైన శ్రద్ధ వహించారు.

ii)

ఈ సభలలో శాకుంతల నాటకం వేయబడింది.

కన్యాశుల్కం నాటకం ముచ్చటింపబడింది.

హరిహర నాటక కళాపరిషత్తు ప్రారంభింపబడింది.

అమెచ్యూర్ నాటక సంఘాల కడగండ్లు చర్చించబడ్డాయి.

వయోజన విద్యా సూత్రాలు వివరించబడ్డాయి—

—సమాజంలో ఆధునికతకు దగ్గరగావున్న అన్ని అంశాలు స్పృశింపబడ్డాయి.

ఇవే కాకుండా, ఈ నవల సాంఘిక నవలే అయినా, నిత్యసత్యాలు కొన్ని సంభాషణల ద్వారా చెప్పించటం చాలా సమయోచితంగా వుంది.

1. మనం విషం తింటున్నా మన ఎదుటివారికి అమృతమే పంచిపెట్టాలి సుమా!

2. పరాధీనపు బ్రతుకు పాపకూపం లాంటిది. స్వయంభద్రత లేని బ్రతుకు గాలిలో పెట్టిన దీపం లాంటిది. వ్యక్తి స్వాతంత్ర్యం లేని బ్రతుకు గాసు గెద్దు వంటిది.

3. జాతిని ప్రతిబింబించేది నాటకం. ఆ నాటకానికి నటీనటులు ప్రాణం. ఆ ప్రాణం పాడైతే ఆ నాటకం పాడు. ఆ నాటకం పాడైతే జాతి పాడైనట్లే— ఇలాంటి వింకెన్నో జీవితానికవసరమైన మధురమైన సూక్తులున్నాయి ఇందులో.

ఈ నవల ఆసాంతం చదివాక దీనిలో వున్న రసమేమిటని నన్ను నేను ప్రశ్నించుకున్నాను 'ధర్మవీరఏవ రసానాం రసః' అనేది స్ఫురణకి రాగానే, మరోసారి చదివి, ఆ నవలలో ధర్మవీరం వుందని నిశ్చయించాను. మరి పాఠకు లేమంటారో!

## కథానికలు :

ప్రపంచ సాహిత్యంలో పందొమ్మిదవ శతాబ్దం అన్ని రంగాలలోను ప్రత్యేకత సాధించినట్టే, కథారంగంలోనూ ప్రత్యేకతను సాధించింది. పాశ్చాత్య సాహిత్య ప్రక్రియలన్నీ భారతీయ సాహిత్యాన్ని ప్రభావితం చేశాయి. సంఘ సంస్కరణోద్యమాలతోపాటు సాహిత్యోద్యమాలు బెంగాలు

లోనే ప్రారంభమయి అన్ని రాష్ట్రాలకి ప్రాకాయి. ఆధునిక సాహిత్య ప్రక్రియలు అన్నీ తెలుగు సాహిత్యంలోకి చొచ్చుకొచ్చినట్లే, కథానిక కూడా ప్రవేశించి, ప్రాణంపోసుకు నిల్చింది. యుగకర్త గురజాడ తెలుగులో మొదటి కథా రచయితగా ఒక స్థానాన్ని సంపాదించుకోవటం గుర్తింపవగ్గ విషయం. కథానికా రచయితలుగా శ్రీపాద, చింతా, మొక్కపాటి, మల్లాది, కొడవటిగంటి మొదలైన వారెందరో తెలుగు సాహిత్యంలో ఆదర్శప్రాయులు.

కథానికలో ముఖ్యమైన అంశాలు రెండు: సమాజంలోని సంఘటనలు, వ్యక్తిగత అనుభవాలు ఏకోన్ముఖంగా రచనలో సాగటం, శిల్పానికి ప్రాధాన్యత వుండటం, వాస్తవికత కథకి ఊపిరిలా నిలవటం - తెలుగు సాహిత్యంలో కథానికకున్న స్థానాన్ని ఎవరూ తప్పించలేరు.

కథానికారచన కూడా జీ.వి.యస్ చేపట్టారు అని తెలిసినప్పుడు నాకు చాలా ఆనందం, ఆశ్చర్యం కలిగాయి.

జీ వి. యస్. కథలు ఆరు. అందులో రెండు గల్పికలు. మొదటి రెండు కథలూ ఆగష్టు 1951, డిశంబరు 1951 లో వచ్చిన కథలు. రచయిత ఇంటర్మీడియట్ విద్యార్థిగా వున్న రోజులవి. గల్పికలు రెండు. 1976 జనవరి, సెప్టెంబరులలో వచ్చినవి. అంటే కథాప్రక్రియని స్పృశించి వదిలేశారనేది స్పష్టం. అయితే, విద్యార్థిగా వుండగా కథారచన చేపట్టిన రచయిత, కథారంగంలోకి ప్రవేశించకుండా దానిని పక్కకి పెట్టడానికి గల కారణం ఒక్కటే - కథానికా ప్రక్రియపై చిన్నచూపు కాదు - సాహిత్య వికాస వ్యక్తిత్వం దినదినాభివృద్ధి చెందిపోవటమే - కనుకనే, జీ.వి.యస్.గారు వీరరసం సుబ్రహ్మణ్యంగారిలాగ, సాహిత్య విమర్శకారునిలాగా ఎదిగి రావటం జరిగింది. అందుకు వారు అభినందనీయులయినా, కథానికా రచనకూడా కొనసాగిస్తే బాగుండేదనిపిస్తుంది.

"అంతలోనే మార్పు" అనేది సాంఘిక వ్యవస్థలో బాల వితంతువుల పరిస్థితుల్లో వుండే అస్తవ్యస్తత వలన మంచి సంసారాల్లో దంపతుల మధ్య వచ్చే అపార్థాల గురించి చెప్పిన కథ. అయితే, జ్ఞాననేత్రం తెరుచుకుంటే, అపార్థాలు తొలగిపోటం ఎంతసేపూ? - అంతలోనే మార్పు వచ్చేస్తుంది. ఈ కథలో సత్యనారాయణరావు కట్నం తీసుకుంటే తన చదువుకే అవమానమని భావించి కట్నం లేకుండా ప్రసన్న ఫోటోచూసి పెండ్లి చేసుకున్న సంస్కారి.

మరి ఆ సత్యనారాయణ తరువాత తరువాత భార్యను వేధించటం, కొట్టటం, ఇంట్లోంచి వెళ్ళగొట్టటం చేస్తాడు - బాలవితంతువైన రామక్క సాహచర్యంలో, ఆమె తన భార్యపై వుండే అసూయతో చెప్పే మాటలన్నీ నిజమని విశ్వసించిన అవివేకి. మామగారికి కుష్ఠ రోగమొస్తే ఎవరూ దగ్గరికు రాకపోయినా సేవ చేసిన ప్రసన్న సహృదయత్వాన్ని గుర్తించలేని అహంకారి. రెండు నెలలు భార్య పుట్టింట్లో వుండివస్తే, రామక్క మాటల ప్రభావంతో భార్యను శంకించిన మూర్ఖుడు - అయితే, అతను చివరకి ఎలా మారాడూ, - బాలవితంతువయిన రామక్క అవినీతి ప్రవర్తన గమనించినపుడు - శీలవంతురాలు కాని రామక్క తన భార్యపై కల్పించిన అనుమానాన్ని ఇంతవరకు పెంచి పోషించాడు - కానీ, ఎప్పుడైతే విషయం తెలుసుకున్నాడో వెంటనే పశ్చాత్తప్తుడైనాడు - వివేకంతో మెలుగుతూ, చెప్పుడు మాటలు వినకుండా వుంటే, కాపురాలు సరిదిద్దుకునే అవకాశం తిరిగి లభిస్తుంది - రామక్కలాంటి వాళ్ళు వచ్చిని కాపురాలను కూలగొడ్తారు జాగ్రత్త అనే హెచ్చరిక వుంది ఈ కథలో. పరిస్థితులు అనుకూలించనపుడు ఓర్పువహించటమే మార్గం అనే సూక్తి కూడా ప్రసన్న పాత్ర ద్వారా రచయిత చెప్పి, కథను సుఖాంతం చేయిటం బాగుంది. మనసు విరసిస్తే అంతలోనే మంచి మార్పు వస్తుందనీ, ఆశాకిరణం కోసం ఎదురు చూడండనీ దంపతులకు ప్రబోధం కూడా ఉంది ఇందులో.

ఇంటర్మీడియట్ చదువుతున్నప్పుడు రచించినా, భాషలో గ్రాంథిక వ్యవహారికం కలగలపుగా వున్నా, భావుకత అత్యద్భుతంగా వుండటం గమనించాల్సిన విషయం. కథాకథనంలో మంచి బిగివుంది. ఉత్సుకత కలిగించే గుణం వుంది.

"సత్యానికి తల గిర్రున తిరిగింది. ఇంటికి వచ్చాడు. తలుపు తీసేసరికి గృహంలో వస్తువులన్నీ తనను హేళనంగా చూచినట్లు తోచింది. అవన్నీ వెక్కిరించాయి. తననొక వెధవాయిని చేశాయి." - సత్యనారాయణ మనసు మారిపోయిందని అర్థమయిపోయింది పాఠకుడికి. సత్యనారాయణలో పశ్చాత్తాపం కూడ ప్రస్ఫుటంగా అర్థమయింది పాఠకుడికి.

"మర్నాడు ఉదయం ఎక్కడ లేని కాంతితో శాంతమూర్తిగా సూర్యుడుదయించాడు. లోకమెల్ల ఆనందం"-

యువ రచయితకి సత్యనారాయణలో అంతలో మార్పు వచ్చినందుకు ఆనందం కల్గింది. ఒక విధంగా నీతి కథ ఇది!

ప్రజాసేవ చేయాలనే ఉత్సాహం మదనమోహన్‌కి చిన్నప్పట్నుంచీ వుంది. అయితే, ప్రజాసేవ అంటే ఏమిటో మాత్రం పూర్తిగా అవగాహన కాలేదతనికి. "ఏమున్నది, ఆ సత్రపు గదిలో రాత్రింబవళ్ళు చదవకుండా, స్వేచ్ఛగా, స్వాతంత్ర్యంతో ప్రజాసేవ చేయవచ్చు 24 గంటలూ" అంటాడు సరళతో.

చాలా ధనవంతురాలైన సరళ మోహన్‌తో ప్రజాసేవలోనేకాక, జీవితంలో కూడా అతనితో కలసి నడవటానికి సిద్ధపడింది.

భార్యాభర్త లిద్దరూ డాక్టర్లయి ప్రజాసేవ మొదలుపెట్టారు - ఉచిత వైద్యం, ఉచితాన్నం ఎడతెగకుండా రోగులందరికీ అందిస్తుంటే, ఊరంతా పేరు మ్రోగిందికానీ, కొన్ని రోజులకి ఆ భార్యాభర్తలు బీదవారయిపోయారు. ఎవరూ వీరిని పట్టించుకోవటంలేదు. మోహన్ మనసు కలతచెందింది. ఏది ప్రజాసేవ? - తను చేస్తున్నది సరియైంది కాదా? అని మనసులో మధనపడ్డాడు.

శివానందయోగి గారి 'ప్రజాసేవ' ఉపన్యాసం విని ఆశ్చర్యపోయాడు. యోగము ద్వారా ప్రజాసేవ చేయాలనే ఆ యోగి మాటలు బాగా మనసుకి నాటుకున్నాయి మోహన్‌కి. ఆధ్యాత్మిక ప్రాతిపదికమీద వైద్యం సాగించాలనే భావం కుదిరింది. "డాక్టర్లు చేయవలసిన పని ఏదో, యేది ప్రజాసేవో, యేది స్వాతంత్ర్యమో తెలిసివచ్చింది" అంటారు రచయిత.

1950 - 55 మధ్య కాలంలో పెద్దన్నగారు బిరుదు వేంకటశేషయ్యగారి వద్ద వుండి చదువుకుంటూ, బ్రహ్మశ్రీ సాధు శ్రీనివాసశాస్త్రిగారి ఆధ్యాత్మిక ప్రబోధాలకు ప్రభావితుణ్ణయ్యానని, మరికొంతరు పెద్దల వలన ప్రభావితుడనై, 'ప్రజాసేవ' అనే విషయంలో స్పందించి ఈ కథ వ్రాసినట్టుగా జీ.వి.యస్. తెలియజేశారు. అయితే, వారు రాసిన ఆరు కథల్లో ఇదే మొదటి కథ- ఏదో ప్రజాసేవ చేయాలనే ఆరాటంవుండి, ఎలా చేయాలో, ఏం చేయాలో తెలియని అయోమయ స్థితిలో వున్న ఏ యువకుడయినా మదన్‌మోహన్‌లాగే ఆలోచిస్తాడనుకుంటాను!

మహాసాధ్వి, ఆదర్శ గృహిణి సుశీల.

భర్తకు చికాకు కలిగిస్తూ, భర్తపై విసుక్కుంటూ, భర్త ఆ పనీ ఈ పనీ చేయలేవని నేరాలు చెప్తూ కాలం గడుపుతున్న ఇల్లాలు పంకజం. పిల్లల్నీ, భర్తనీ ఏ విధంగానూ సరిదిద్దుకోటం రాని యిల్లాలు పంకజం. వారిద్దరి సంభాషణలో తేలిన విషయమేమిటంటే- ఇల్లు చక్కదిద్దుకునే నేర్పరితనం ఇల్లాలికే వుండాలి. భర్తను ఎంత సాధించినా ఉపయోగంలేదు అనేది. సుశీల అంటుంది పంకజమ్మతో—

"అన్నగారికి క్రమమైన అలవాట్లు లేవని అనడంకన్నా పగలంతా ఆఫీసులో చాకిరిచేసి అలసివచ్చిన వాళ్ళను మనం ఆప్యాయంగా ఉపచరిస్తే వారి హృదయాలు తేరుకుంటాయి. అంతేగాకుండా, ఇల్లు చూసి ఇంటి ఇల్లాలిని చూడాలన్నారు. మనం సిల్కు చీరలు కట్టగానే సరికాదు, ఇంటిని పిల్లలను అదుపులో పెట్టుకోవాలి. ఇల్లు అద్దంలా వుండాలి. మనం ఆదర్శం కావాలి" అంటుంది. అంతేకాక, అన్ని బాధ్యతలు వారిమీదే త్రోసి పారేస్తే వారేం ఊరి పోసుకుంటారా అంది. అంటే, భార్య భర్తతో బాటు బాధ్యతలు కూడా పంచుకోవాలి అని ఆదర్శమైన దాంపత్య జీవితానికి మూలసూత్రాన్ని చిన్న కథలో చక్కగా వివరించారు రచయిత. కథలో ఇల్లాలికి సత్యభామ నచ్చలేదు. ద్రౌపది నచ్చింది.

"నీ గృహ కార్యనిర్వహణం సర్వనీతి సత్తముడగు మంత్రివర్యుని విషయ విభాగంలా నడిచిపోతుంది. అతని ప్రాపున భోగలాలసుడైన చక్రవర్తిలా నీ ప్రాపున సుఖిస్తా"- ఈ గొప్ప ఆనందాన్ని, అదృష్టాన్ని కలిగించిన యిల్లాలు

"పుట్టినరోజు" కథలో విషయంకన్నా కవితాంశ పాఠకుణ్ణి ఆకర్షిస్తుంది. జగన్నాథం గౌరీ దంపతులయ్యారు. అనాథ బాలలుగా వుండి పెరిగిన ఇద్దరి మనసులూ ఏకమయ్యాయి. "అతనికీ ఒక పుట్టిన రోజంటూ ఉన్నదని విన్నది ఆనాడే" అంటూ రచయిత జగన్నాథం స్థితిని కరుణరసాస్పదంగా తెల్పారు. అయితే, "అమ్మని మింగిన హంతకురాలిని, నాకేం తెలుస్తుంది చెప్పండి" అని గౌరీచేత అనిపించి కూడా రచయిత ఈ కరుణరసాన్ని జాలువార్చారు.

ఈ కథలో, గౌరి మాతృమూర్తి కాలేకపోవడమనే అంశం చెప్పడానికి ముందుగా, చెట్టు తొర్రలో వున్న చిలుకపిల్లలను గురించి గౌరి మాట్లాడటం, ఆ తర్వాత, చిలుక తల్లిని గండుపిల్లి కొరికివేయటం, చిలుక పిల్లను ఆ పిల్లి ముద్దుపెట్టుకుని చెట్టుతొర్రలోకి తీసుకు పోయిందని ఒక కల వచ్చినట్టుగా గౌరిచేత చెప్పించారు రచయిత. కానీ చివరకు గౌరి ప్రసవించింది. బిడ్డ మృతిచెందాడు. ఈ విషాదం జగన్నాథాన్ని గౌరిని పూర్తిగా కదిలించివేసింది. "ఇక నా గౌరి తల్లికావడం కల్ల, నేసీరోజున పుట్టివుండటం కల్ల" - నిస్పృహతో నీరుకారిపోయాడు జగన్నాథం.

"ముగిసిన భరతవాక్యంలా, మొదలయ్యే క్రొత్త కథకు నాందీవాక్యంలా హాస్పటలు గోడగడియారం పన్నెండు కొట్టింది."

భరత వాక్యం, నాందీ వాక్యం అనేవి రెండూ నాటక సంబంధమైన పరిభాషాపదాలే. తుది, మొదలు అనే అర్థంలో వాడబడటానికి ఈ పదాలు ఎన్నుకోటం సముచితంగా వుంది

"కలతనిద్ర లేచిన రోడ్డు పుడమితల్లి ఒడిలో మరలా పవ్వళించింది."

"పుస్తకంకన్నా ముందే ఆతని అశ్రుబిందువొకటి ఆమె దోసిట్లో ముత్తెపు చిప్పలోని స్వాతి చినుకులా నిలిచింది."

"మాతృప్రేమలా వెన్నెల లోకంమీద ఒలికిపోయింది"

"ఆమె కన్నులలో సూర్యుని కోల్పోయిన సంధ్యారుణ కాంతులు పోగుపడ్డాయి" ఇలాంటివి ఇంకెన్నో ఈ కథకి కవిత్వాన్ని పూశాయి.

గల్పికలు రెండూ 1976 లో రాసినవే. రచయిత యువభారతి కార్యకలాపాలలో ఉక్కిరిబిక్కిరవుతూ, అవిశ్రాంతంగా కృషి చేస్తున్న రోజులవి.

"రచయితల భార్యలూ - రాత్రి జాగరణలూ" - ఈ శీర్షిక వంకతో భార్యాభర్తల సంభాషణలో "మీరు పెందరాళే ఇంటికి రావాలి - ఇది కొత్త సంవత్సర తీర్మానం" - అంటుంది ఇల్లాలు. ఈ శీర్షికలో అంశం ఒక్కటే - కార్యసాధకుడు రాత్రింబవళ్ళు, కష్టసుఖాలు లెక్కింపడు. భర్తృహరి చెప్పినట్లుగా. ఒకచో నేలను పవ్వళించు, ఒకచో ఒప్పారు పూసెజ్జపై, ఒకచో శాకములారగించు, ఒకొక్కతరిం శాల్యోదనం, ఒకచో బొంతధరించు........" ఇలా కార్యసాధకుడైన కార్యకర్త అర్ధరాత్రి పన్నెండు దాటాక ఇంటి తలుపుకొట్టాడు.

అంటే రెండు ముళ్ళు ఒకటైన సమయం. "ఆ రెండు ముళ్ళకు పల్లెనే పాతకు భరతవాక్యం పాడి, కొత్తకు నాందీ వాక్యం పలికే అదృష్టం ఏ దంపతులకు లభిస్తుంది!" అంటారు చివరలో, 'రెండు ముళ్ళు' శీర్షికలో....

నామకరణం శీర్షికలో పిల్లకి సీత పేరు పెట్టాలని తండ్రి, ఆ పేరు వద్దని తల్లి వాదించుకోటం అంశం. సీత అనగానే వనవాసం, రావణాసురుడు జ్ఞాపక మొస్తున్నారంటుంది భార్య. కానీ, భర్త ఆమె మాటల్ని చమత్కారంగా ఖండించి, "నా జాతిని చూచి పేరు పెట్టుకున్నాను. సీత సుమంగళి. సీత వధువు, సీత పత్ని, సీత సంతానవతి, సీత పతివ్రత, సీత ఒక ధర్మం" అంటూ పిల్లకి సీత అనే పేరు పెట్టేస్తాడు. ఏకాంశానికి ప్రాధాన్య మిచ్చింటే గల్పిక కనక చిన్న కథలోవుండే చాలా లక్షణాలు ఇందులో వుంగవు.

నిజానికి కథారచనలోనే కలాన్ని నడిపిస్తే జీవియస్‌గారు గొప్పకథకులు అయివుండేవారే.

ఈ సంపుటానికి సంపాదకత్వం వహించే గౌరవం మాకు యిచ్చినందుకు షష్టిపూర్తి సన్మాన సంఘంవారికి మా కృతజ్ఞతలు.

1-5-96,
సికింద్రాబాదు.

ము కేవి భారతి

శ్రీ వాకాటి పాండురంగరావు
విజిటింగ్ ప్రొఫెసర్,
తెలుగు విశ్వవిద్యాలయం.

భాగ్యనగరం,
28 ఏప్రిల్ 1996.

# అభినందనలు

ఈ శతాబ్దపు అతి గొప్ప కథకులలో ఒక్కడు సోమర్సెట్ మామ్ 'నేను రాయగలిగిన వాటికన్న ఎక్కువ కథలు నా బుర్రలో మెదులుతుండేవి' అని చెప్పుకోగల్గినంతటి సృజనాత్మకత ఆయనది కథకుడిగా, నవలాకారుడిగా ప్రపంచమంతటా ప్రశంసల వర్షంలో తడిశాక, జీవిత సంధ్యా కాలంలో ఆయన 'The summing uP' అంటూ రచయితగా తన అనుభవాల తాత్పర్యాన్ని పొందుపరుస్తూ ఒక అద్భుత గ్రంథం రాశాడు. నిజానికి అది రచయితలందరూ చదివి తీరవలసిన గ్రంథం.

అందులో మాకు ఒక చోట—"ఒక రచన ఏ మేరకు నీకు అర్థవంతంగా వుంటుందో, నీ జీవితానికి వర్తిస్తుందో ఆ మేరకే దాని ప్రయోజకత్వం. ఓ విమర్శకుడికి ఆ పుస్తకంలో సవాలక్ష సుగుణాలు కన్పించవచ్చు కాని అవేమీ నీకు పనికిరాకపోవచ్చు........పుస్తకాన్ని పుస్తకంగా కాక నా కోసం, నేను దాని లోంచి నా ఆలోచనా శరీర పుష్టికి దోహదం చేసే జీవ రసం కోసం మాత్రమే చదువుతాను" అంటాడు.

మాన్యులు జి.వి. సుబ్రహ్మణ్యం గారితో నా పరిచయం వయసు ఒక దశాబ్దం మీద రెండు మూడు సంవత్సరాలు మాత్రమే. ఆచార్యుడిగా, వక్తగా, రచయితగా, కార్యసాధకుడిగా, విమర్శకుడిగా, తా ననుకున్న దానిని స్పష్టంగా సాధికారంగా సవినయంగా చెప్పడానికి నిష్కు సమలని మనిషిగా తోచాడాయన నాకు. తెలుగు సాహిత్య రంగంలోని విమర్శనాక్షేత్రంనిండా అలుముకున్న రంగుటద్దాల చూపుల్ని సరిదిద్దడం అనే మహత్కార్యానికి పూనుకుని, కొందరు 'పీఠాధిపతుల' ఆగ్రహావేశాలకు గురి అయిన జోదు జీవీ!

అలాంటి బహుముఖ వ్యక్తిత్వంగల ఆయన నవలికలు, కథలు రాశాడు అంటే ఆశ్చర్యపడడం నా వంతయింది. వాటిని ఏర్చికూర్చిన సంకలనానికి

పరిచయ వాక్యాలు నన్ను రాయమని అడిగితే నేను తడబడ్డాను. ఎందుకంటే, నేను సాహిత్యంలోకి పొరబాటున ప్రవేశించిన ఆగంతుకుణ్ణి. అటు తెలుగు సాహిత్యాన్నిగాని, ఇటు విమర్శనుగాని పద్ధతి మేరకు నేర్చినవాడిని కాను. అంచేత ఏవో నాలుగు కథలు రాసినవాడిగా అయిదారు పుస్తకాలు చదివినవాడిగా జి.వి. సుబ్రహ్మణ్యంగారి రెండు నవలికలు, నాలుగు కథలు, రెండు గల్పికలు వున్న ఈ సంకలనాన్ని శ్రద్ధగా చదివాను, మామ్ చెప్పినట్లుగా నాకు అవి స్నేహితుడివలె అన్పించాయి.

ఈ రచనల చివర వారు వాటిని అచ్చువేసిన సంవత్సరాలు ఇవ్వడం - వాటిని అర్థం చేసుకోవడానికి, రచయితగా ఆయనలో వచ్చిన పరిణామాన్ని తెలుసుకోవడానికీ దోహదపడ్డాయి. అన్నిటికన్న నన్ను ఎక్కువగా అలరించింది చివర వున్న రెండు గల్పికలు, వాటిలోని "అల్పాక్షరముల అనల్పార్థములను" వెలయిచేయడం - నాకు వ్యక్తిగతంగా నచ్చే అంశం. చెప్పదలిచిన దాన్ని చెప్పకుండా నవలి పాఠకుడిగా నన్ను సవాలుచేసే ఆకార మాలికలు అంటే నా కిష్టం! - అయితే ఆ రెండు గల్పికలు రచయిత 1976 లో రాశారు.

అంతకు పాతికేళ్ళముందు అంటే 1951 లో వారు రాసిన 'ప్రవాసిని' అనే కథను దాని చివర వారు ఇచ్చిన వివరణ చదువుతే - రెండున్నర దశాబ్దాలలో వారి పరిణతి కొట్టవచ్చినట్లు కనపడుతుంది. కథా స్వరూపం బాగా మార్పు చెందిన 1996 లో పఠిశీలిస్తే ఈ కథలు కొంత 'పాతవి'గా అన్పించవచ్చునుగాని వాటి ఇతివృత్తాలు ఈనాటికీ కథా విషయాలే!

రెండు నవలల్లో మొదటిది - 'రాగమంజరి' (1958). ఎంతో అధ్యయనం వుంటేగాని సృజనాత్మక రచనకు అనువుగా మలుచుకోలేని చారిత్రక ఇతివృత్తం, గ్రాంథిక శైలి, సుదీర్ఘ వర్ణనలు - 'రాగమంజరి'ని ఆంగ్ల భాషలో చెబుతారే అట్లా ఒక 'Period Piece' (ఆ కాలానికి మచ్చుతునక)గా చేశాయి. అయితేనేమి, అందులో ప్రతిపాదించిన "అధర్మం అప్పటికప్పుడు గెలిచినట్లు కన్పించవచ్చుగాని చిట్టచివర హిమాలయమంత ఎత్తున ఎగిరేది ధర్మపతాకమే!" నన్నది చిరంజీవి అయిన భారతీయ దర్శనమే!

ఈ నవలిక రాసిన దశాబ్దం తర్వాత రచించిన పూర్తి నవల 'నవ మల్లిక.' సమాజము - వృత్తి - సంప్రదాయము - సంస్కరణ - వాటిమధ్య

ఎప్పుడూ వుండే సంఘర్షణ, వాటి సమతూకాన్ని నాలుగయిదు పాత్రల ద్వారా చిత్రించిన నవల ఇది. వెనక్కు లాగివుంచే పాత తరం, త్రాళ్ళు త్రెంపుకు ముందుకు పోవాలి అని తపించే కొత్త తరం - వాటిని రచయిత చాల ఆకర్ష ణీయంగా ప్రతిబింబించగలిగారు. మల్లమ్మ మల్లికయి, సినిమా రంగానికి - చంద్రం అనే గాలం ద్వారా - బలి అవడం అన్నది - సినిమాటిక్' గానే వున్నా - నవల మొత్తం చదివాక జీవితం అనే వైకుంఠపాళీ ఆటలోని భ్రమలు భ్రమణాలు అవగతం అయి - ఒక నిండైన రచన చదివిన భావం కలుగుతుంది.

కథల్లో నయినా, నవల్లో నయినా జీవీగారు సంఘటనల ద్వారా కన్న, సంభాషణల ద్వారా ఇతివృత్తాన్ని నడపడానికి ఇష్టపడతారు. ఈ రెండింటి మధ్య మరి కొంత సమతూకం వుంటే బాగుండేమో అన్పించినప్పటికీ - వారి రచనా శైలిలో వుండే వేగం - ఎక్కడా చదువరిని ఆగనివ్వదు. జీవితపు సమస్యలను, సత్యాలను నిర్వచించవలసిన చోట వారి ఆత్మ ఇట్లా పలుకుతుంది:

"నీవు నడిచేది రాచబాట అని నీకు తెలిసి, నా లక్ష్య సాధనకు ఉపయో గిస్తున్న సాధనాలు శుద్ధంగా ఉన్నవని పరీక్షించుకొని, ఆత్మ విశ్వాసంతో పురోగమించి నన్నాళ్ళు నీవు ఒంటరిగా లోకానికి కనపడ్డా నీ ధర్మం నిన్ను వెన్నంటి కాపాడుతూనే వుంటుంది. కావలసింది సహనం, అంతఃకరణశుద్ధి, ఆచరణ దీక్ష." అన్న హరి ('నవమల్లిక') మాటలు అన్ని కాలాలకు దేశాలకు వర్తించే వెలుగు దివిటీలు.

మూకల కేకలే మెదడుకు మేతవుతున్న కాలంలో సైతం - శిల్పం, శైలి, సంవిధానం ఎట్లావున్నా - మార్గదర్శనం చేసే దృష్టియే రచనకు ప్రాణం.

ఆ ప్రాణం అణువణువున స్పందిస్తున్న రచన లివి. రచయితకు గౌరవాభి నందనాలు!

-వాకాటి పాండురంగరావు

డాక్టర్ రాపూరి భరద్వాజ
డి.లిట్.,

'కాంతాలయం'
విజయనగర్ కాలనీ,
హైదరాబాదు - 57
10-6-1996.

# మంచి కథకులు జీవియస్

ఐన్‌స్టీన్ పేరు వినంగానే, సాపేక్ష సిద్ధాంతం గుర్తుకొస్తుంది గానీ, ఆయన వయొలిన్ వాద్యకారు డన్న సత్యం అటు మొన్నదాకా గుర్తుకు రాలేదు.

రవీంద్రుని పేరు వినంగానే, ఆయన గీతాంజలి, వనమాలి, నెలవంక, వంటి మహాకావ్యాలు గుర్తుకొస్తాయి గానీ, ఆయన గొప్ప చిత్రకారుడన్న సత్యం ఆ చిత్రాలను చూసిందాకా గుర్తుకు రాలేదు

మొన మొన్నటి రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు మహా పండితులనీ, గొప్ప అనువాదకులనీ విన్నాను గానీ; సాహిత్యంతో బాటు సంగీతాన్ని కూడా ఔపాసన పట్టారని ఆ మధ్య దాకా తెలీదు.

ఇక బుచ్చిబాబుగారు సరేసరి! వారెవరో తెలీక ముందే, "చివరకు మిగిలేది" నవల చదివి, అందులోని "అమృతం" అన్న పాత్రకు - బుచ్చిబాబుగారికి కాదు సుమా; వారు సృష్టించిన "అమృతం" అన్న పాత్రకు నేనో పుస్తకం అంకిత మిచ్చిందాకా, గిలగిల్లాడి పోతునే ఉన్నాను. ఆయనతో పరిచయమైన తరువాత గానీ, ఆయన మంచి చిత్రకారుడు కూడా అన్న సత్యం నాకు తెలిసింది కాదు

అసలీ విషయాలన్నీ నాకెందుకు గుర్తుకొచ్చినట్టు ?

33 సంవత్సరాలపాటు, పిడికెడు అన్నంకోసమూ, చిటికెడు విశ్రాంతి కోసమూ అవిశ్రాంతంగా పాటుపడవలసిన దుస్థితిలోంచి నాక్కొంచెం ఊరట

నిచ్చింది "ఆకాశవాణి." ఆ సంస్థలోకి నన్నాహ్వానించినవారు జి. పి. యస్. నాయర్‌గారూ, త్రిపురనేని గోపీచంద్‌గారూ. పరోక్షంగా ప్రోత్సహించినవారు - నండూరి విఠల్‌గారు, త్రిపురనేని సుబ్బారావు లయితే, ప్రత్యక్షంగా ప్రోత్స హించినవారు అయ్యదేవర కాళేశ్వరరావుగారు.

"ఆకాశవాణి" నాకూ, నా భార్యా బిడ్డలకూ కడుపునిండా అన్నం పెట్టింది. నన్నేమో - అక్షరాస్యులకూ, నిరక్షరాస్యులకూ పరిచయం చేసింది. నాకు కొత్త విషయాలు చెప్పింది. నా చెంపలు వాయించింది, నా మూడు పగల గొట్టింది. చాటుగా కన్నీరు కార్పించింది. నా గుండెనిండా, వొంటినిండా మంటలు నాటింది. లోతైన గాయాలు చేసింది వీటన్నింటినీ మించి, సాహిత్యో పాసకులయిన సరస్వతీ పుత్రులతో పరిచయాలనూ ప్రసాదించింది.

అల్లాగా - ఆ మహాసంస్థ నాకు ప్రసాదించిన విద్యాసంపన్నులు అనేక మంది నాకున్నారు. వారిలో జి.వి. సుబ్రహ్మణ్యంగారొకరు.

నేనేమో, చాలా సాదా సీదా మనిషిని. ఏవో కథలూ, కబుర్లూ రాసు కొంటూ బతుకొచ్చినవాణ్ణి. "ఆకాశవాణి"లో నేను చేయవలసిన పని, సాదా సీదా రకంది కాదు. నా కన్న ముందున్న మనుషులు నెలకొల్పిన స్థాయి చాలా ఎత్తుగా ఉంది. నేనంత ఎత్తుకు ఎదగనన్నా ఎదగాలి, లేదా ఆ "పని" నుండి తప్పుకోనన్నా తప్పుకోవాలి. వయస్సు అన్నది అడ్డుపడుతోంది గానీ, లేకపోతే "పుత్రవాత్సల్యం" అనే అందును; ఇప్పుడలా అనలేను గనక, "భ్రాతృవాత్సల్యం" అంటాను; అలాంటి వాత్సల్యంతో, నన్నా ఎత్తులదాకా నడిపించినవారు ముగ్గురు నలుగుచున్నారు. ఒకరు పుల్లెల శ్రీరామచంద్రుడుగారు. మరొకరు జి.వి. సుబ్రహ్మణ్యంగారు, ఇంకొకరు జస్టిస్ కొత్తపల్లి పున్నయ్య గారు. ఇక చిట్టచివరివారూ, నిజానికి, మొట్టమొదట ఉండవలసినవారూ, వాద్రేవు పురుషోత్తంగారు.

సుబ్రహ్మణ్యంగారు మంచి పండితులని తెలుసు. మంచి విమర్శకులని తెలుసు. మంచి సమీక్షకులని తెలుసు. మంచి వక్తలని తెలుసు. ఎక్కడ ఏ కాస్త వెలుతురున్నా, దానిని జేగీయమానం చేయగలరని తెలుసు, పదాల మాటునా, వాక్యాలచాటునా, దృశ్యాదృశ్యంగా ఉన్న కవిహృదయాన్ని సామా న్యునికి అవగాహనమయ్యేలా విపులీకరించగలరనీ తెలుసు ఉత్సాహవంతులను ఆశీర్వదించగలరనీ తెలుసు. అహంకార స్థాయికి చేరుకొన్న "ఆత్మవిశ్వాసం"

ఉన్నవారిని ఓసారి మెత్తగా మొట్టి, అదుపులో ఉంచగల నిపుణులనీ తెలుసు. వీటన్నింటినీ మించి మంచి మనసున్నవారనీ, మంచి మిత్రులనీ తెలుసు.

కానీ -

మంచి కథకులని గానీ, మంచి నవలా రచయితలని గానీ నాకింత వరకూ తెలీదు.

వారిని గురించి ఆ సంగతులూ, వీరిని గురించి ఈ సంగతులూ తెలుసు నన్న సంతృప్తితో కాలం గడుపుదామనుకొంటున్న సమయంలో; సన్నిహితులను గురించి కూడా, చాలా విషయాలు తెలియవన్న సత్యాన్ని జీవియస్‌గారు చల్లగా నాకు తెలియజేశారు.

తొలి నవల "రాగ మంజరి", రెండవ నవల "నవమల్లిక." ఈ మొదట నవలను జీవియస్‌గారు తమ 23 వ ఏట రాశారుట. ఇది సరళ గ్రాంథిక భాషలో ఉన్నందుకు నేనాశ్చర్యపోవడంలేదు. నా 16 వ ఏటనో, 17 వ ఏటనో నేను రాసిన "వీరగాధ" అన్న నవల కూడా సరళ గ్రాంథిక భాషలోనే ఉంది! "రాగ మంజరి" చారిత్రక నేపథ్యంలో కొనసాగింది. నా "వీరగాధ" జానపద నేపథ్యంలో కొనసాగింది.

"రాగ మంజరి" కథను నేనిక్కడ మరోసారు చెప్పబోవడంలేదు. ఆ నవలలో నాకు నచ్చిన, వందలాది వాక్యాలను కూడా నేనిక్కడ ఉదాహరిం చడం లేదు.

రెండవ నవల నవమల్లికను చదువుతున్నంతసేపూ, చదివిన తరువాతా, ఆ పాత్రలు నాతో కబుర్లాడుతూనే ఉన్నాయి. ఏ రెండో మూడో తప్ప మిగిలిన వారందరూ నాకు తెలిసినవారూ, బాగా తెలిసినవారూ, మరీ సన్నిహితంగా తెలిసిన వారూనూ.

తనకు లేనిది, ఇంకొకరి కున్నప్పుడు; ఆ "లేమి" - ఒక మనిషి అంత ర్యాన్ని ఎంతగా ప్రభావితం చేస్తుందో తెలియచెప్పే పాత్రలూ; సమున్నత మయిన నైతిక విలువలను, శారీరక సంయోగస్థాయికి చేర్చిందాకా నిగ్రహించు కోలేని పాత్రలూ; ఆర్థికమైన వెసులుబాటును కార్యసాఫల్యతకోసం ఉపయో గించుకొనే పాత్రలూ; ఒకే సత్యాన్ని కాదనలేక, ధైర్యంగా ఒప్పుకోనూలేక, ఒగుడాకులాగా ఊగులాడే పాత్రలూ; 'తనవారు' తనకు కాకుండా పోతు

న్నప్పుడు వారి చుట్టూ పెంచుకొన్న ఆశలు, ఒక్కటొక్కటిగా తూలి పోతున్నప్పుడూ, రాలిపోతున్నప్పుడూ మానవాత్మ అనుభవించే మూగవేదనకు ప్రాతినిధ్యం వహించే పాత్రలూ మనచుట్టూరా, చెదురుమదురుగా కనిపిస్తే, "నవమల్లిక"లో, దగ్గరగానూ కనిపిస్తాయి.

ఈ నవలలోని - మధు, హరి, హేమ, మాలతి, మల్లిక్, మాణిక్యాంబ, చంద్రం లాంటి వారందరూ మనకు తెలిసినవారే! కొందరేమో పడగ చితక పొడిచినా తోకతో కొట్టే త్రాచుపాము లాంటివారు. మరికొందరేమో బడబాగ్నిని దాచుకొన్న మున్నీటిలాంటివారు.

ఈ రెండు నవలలను గురించీ, ఇంకా చెప్పుకొనవలసిన విషయాలూ, ఉదాహరించవలసిన సన్నివేశాలూ చాలా ఉన్నాయి.

ఇవికాక—

నాలుగు చిన్న కథలూ, రెండు గల్పికలూ వెరసి ఆరున్నూ షట్రుచులకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి!

ఈ గ్రంథం—

"వీణియ మోహనరాగ మల్లన సందుకొనెను. రాగమంజరి చరణ మంజీరములు గల్లని మ్రోసెను. సభ కన్ను తెఱచెను" అన్న వాక్యాలతో మన గుండె తలుపులను తెరుస్తుంది. "ఆమె మాట్లాడలేదు. ఆయన పేరు వ్రాసేస్తున్నాడు. ఎదురుగ్గా ఉన్న కోదండరామ పటంలో ఏదో కాంతి మెరిసింది" అన్న వాక్యాలతో ముగుస్తుంది.

అవును—

పతితల హృదయాలలో కూడా కాంతి మెరుస్తుంది, మెరుస్తూ మెరుస్తూ చిరకాలం మెరుస్తూనే ఉంటుంది!

—రావూరి భరద్వాజ

శ్రీమతి అబ్బూరి ఛాయాదేవి

బాగ్‌లింగంపల్లి,
హైదరాబాదు - 44,
20-4-96

# సాహితీ సవ్యసాచి

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం (జీవియస్) గారికి రచనా పాటవమూ పరిశోధనా శక్తీ, జీవిత వివేచనా శక్తీ విద్యార్థి దశ నుంచీ ప్రదర్శితమయ్యేవని ఈ సంపుటంలోని నవలలూ, కథలూ రుజువు చేస్తాయి. సరళ గ్రాంథిక శైలిలో గాని, సులభ వ్యావహారిక శైలిలోగాని, గంభీర రచనల నుంచి గల్పికలవరకూ వేటినైనా ప్రతిభావంతంగా సృష్టించగల మేటి అని స్పష్టం చేస్తాయి వీరి రచనలు.

ఈ సంపుటంలో సముచిత స్థానాన్ని పొందిన చారిత్రక నవల 'రాగ మంజరి'-1958 లో రచించినది. చారిత్రక విషయానికి ఎక్కువ అనుకూలంగా ఉంటుందనీ, శైలిలో సుందర పరిష్కృత సాధ్యమవుతుందనీ సరళగ్రాంథికాన్ని ఎంచుకొని ఉంటారు రచయిత. ఇందులోని కథ పతనమవుతున్న విజయనగర సామ్రాజ్యాన్ని పునరుద్ధరించడానికి కృషిచేసిన పండితుడూ, రాజనీతిజ్ఞుడూ అయిన వేంకటపతి రాయలు గురించి, ఆయన వారసులు గురించీనూ. ఆనాటి ఆచార వ్యవహారాల గురించీ, రాణివాసాల గురించీ, రాజుల, సామంతుల రాజనీతి గురించీ, కౌటిల్యాన్ని గురించీ ఎన్నో విశేషాలు వివరంగా అందించారు. యుద్ధ సన్నాహాలనీ, సన్నివేశాలనీ కళ్ళకు కట్టినట్లు వర్ణించారు. వివిధ వంశాలకూ, పదవులకూ చెందిన చిన్న, పెద్ద వ్యక్తుల పేర్లు వివరించడం వెనక రచయిత కృషీ, శ్రద్ధా కనిపిస్తాయి. (ఈ నవల రాసే నాటికి రచయిత విద్యార్థి దశ నుంచి ఉద్యోగ దశకు చేరుకున్నారు.) వినాయక జననం - నృత్య ప్రదర్శనతో ఆరంభమవుతుందీ నవల. ఆ నృత్యం చేసిన రాజ నర్తకి రాగమంజరి చివరికి - చిన్న వయస్సులో ఉన్న రాజు రామదేవరాయల ప్రాణాల్ని రక్షించి,

ప్రభు భక్తి ప్రదర్శనలో ప్రాణాలర్పిస్తుంది; యుద్ధాన్ని విజయం వైపుకి మళ్ళిస్తుంది. అందుకే ఈ నవలకి ఆమె పేరు.

ఈ సంపుటంలోని రెండవ నవల సాంఘిక నవల 'నవమల్లిక.' ఈ నవలలో రెండు అత్యంత ప్రముఖ నాటకాల ప్రస్తావన ఉంది. 'అభిజ్ఞాన శాకుంతలం' నాటక ప్రదర్శన, 'కన్యాశుల్కం' నాటకానికి సన్నాహాలూ ఈ నవలలో ముఖ్యాంశాలు. 'జీవియస్' గారికి విద్యార్థి దశనుంచీ నాటక ప్రదర్శనలలోనూ, నటనలోనూ కూడా విస్తృతమైన అనుభవం ఉంది. అందుకు నేను ప్రత్యక్ష సాక్ష్యం! (నిజాం కాలేజిలో ఆయన నాకు బాగా 'జూనియర్' అయినా, తరవాత సాహితీరంగంలో ఎంతో 'సీనియర్' అయారు!) ఏ ప్రక్రియని తలపెట్టినా సవ్యసాచిలా సాధించగలరు.

'నవమల్లిక' నవలలో జీవితం, నాటకం, జీవితంలోని మనుషులూ, నాటకాల్లోని పాత్రలూ సమ్మిళితమవుతూ కొంత సంఘర్షణ, కొంత అవగాహనా పడుగుపేకల్లా కలగలిసి సాగుతుంది కథ. ఆదర్శ పాత్రలు కొన్నీ, వాస్తవిక పాత్రలు కొన్నీ, అనూహ్య సంఘటనలు కొన్ని కథను నడిపిస్తాయి. కొంత కవితా ధోరణి, కొంత వ్యావహారిక సరళిలో సంభాషణలూ సాగుతాయి. "జాతిని ప్రతిబింబించేది నాటకం. ఆ నాటకానికి నటనయే ప్రాణం. ఆ ప్రాణం పాడైతే ఆ నాటకం పాడు. ఆ నాటకం పాడైతే జాతి పాడైనట్లే" అని 'గిరీశం'లాంటి పూర్ణచంద్రరావు చేత అనిపించిన రచయితకి నాటకంపట్ల ఉన్న నమ్మకం ప్రస్ఫుటమవుతుంది. దాదాపు మూడు దశాబ్దాల క్రితం రాసిన నవలలోనే స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం ఉండాలనీ, ప్రేమించిన యువతీ యువకులు తల్లిదండ్రుల అభీష్టాన్ని వ్యతిరేకించైనా తమ జీవితాలను తాము తీర్చిదిద్దుకోవాలనీ ప్రతిపాదిస్తున్నట్లు పాత్రల్ని రూపొందించారు రచయిత. సముద్ర గర్భంలో అమూల్యమైన పగడాలూ, ముత్యాలూ దొరికినట్లే ఈ నవలలో అక్కడక్కడ కొన్ని అమూల్యమైన సార్వకాలిక సత్య ప్రవచనాలు కనిపిస్తాయి. రచయిత చిన్నప్పుడే సాధించిన పరిణతినీ, మానసిక వికాసాన్నీ గుర్తించే అవకాశం కలుగుతుంది పాఠకులకి.

ఈ సంపుటంలో ఇంకా నాలుగు కథానికలూ, రెండు గల్పికలూ ఉన్నాయి - 1951 నుంచి అప్పుడప్పుడు రాసినవి. ఇంటర్ మీడియట్ చదువుతున్న కాలంలో రాసిన మొదటి కథ 'ఏది ప్రజాసేవ?'లో భాషాపరంగా

కలగలపు కనిపించినా, అందులోని కథా వస్తువు మహనీయమైనది - ఈనాడు వ్యాపార ధోరణితో వైద్య వృత్తి నవలంబిస్తున్నవారికి ఒక గుణపాఠం అది. పుట్టపర్తిలో భగవాన్ సత్యసాయిబాబా నిర్వహిస్తున్న ఆసుపత్రి వంటి దాన్ని గురించి 45 ఏళ్ళ క్రిందటే రాశారీ రచయిత- "ఆధ్యాత్మిక ప్రాతిపదిక మీద సాగించే హాస్పిటలుకు ఆర్థిక వనరులు అవంతట అవే అమరుతాయన్న" సత్యాన్ని వెల్లడించారు.

భర్తతో ఎలా ప్రేమగా మెలగాలో, ఇల్లుని ఎలా చక్కదిద్దుకోవాలో ద్రౌపదిని చూసి నేర్చుకోవాలని భారతంలోని పద్యాల సాక్షిగా చెబుతారు 'వ్రత శీలి' అనే కథలో. ఆ దృక్కోణంతో రాసిన కథ చదవడం ఇదే. భార్యని అతి శయోక్తులతో ప్రశంసించే భర్త కూడా ఉన్నాడీ కథలో!

సంవత్సరాదినాడు అర్ధరాత్రి ఇంటికి వచ్చిన భర్త గడియారం వైపు చూస్తూ "ఆ రెండు ముళ్ళకు మల్లేనే పాతకు భరత వాక్యం పాడి, కొత్తకు నాందీ వాక్యాన్ని పలికే అదృష్టం ఏ దంపతులకు లభిస్తుంది చెప్పు?" అంటూ చమత్క రిస్తూ తన్ను తాను సమర్థించుకుంటాడు "రెండు ముళ్ళు" అనే గల్పికలో.

ఈ సంపుటంలోని రచనలు 1976 వరకూ సాగినవి. ఆ తరవాత కూడా ఈ ప్రక్రియని 'జీవియస్' గారు కొద్దో గొప్పో కొనసాగించి ఉంటారని నమ్ము తున్నాను.

"బయలుదేరటం ప్రగతి లక్షణం, ఆగకపోవటం అభ్యుదయ శీలం" అని చెప్పిన 'జీవియస్' గారి సూత్రం అందరికి వర్తిస్తుంది.

—అబ్బూరి ఛాయాదేవి

ఆచార్య సి. ఆనందారామం
తెలుగుశాఖ,
హైదరాబాదు విశ్వవిద్యాలయం

హైదరాబాదు,
21-4-1996.

# సృజనాత్మక రచయితగా ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారి పేరు వినగానే మౌలికప్రతిభాన్వితు డయిన ఆంధ్రవిమర్శకుడు పాఠకుల మనో నేత్రం ముందు సాక్షాత్కరిస్తాడు. విమర్శ రంగంలో ఎన్నో నూతన రీతులకు నాంది పలికారు వారు.

వీరి సృజనాత్మక రచనల సంకలనం ఈ రంగంలో సహితం వీరి ప్రతిభకు నిదర్శనం.

సృజనాత్మక రచయితగా వివిధ ప్రక్రియలలో తనదైన బాణిని నిలుపు కున్నారు. సరళ గ్రాంథికంలో సాగిన చారిత్రక నవల సరసనే శిష్టవ్యావహారి కంలో సామాజిక నవలను నడిపించారు. నాలుగు కథానికల్లోనూ, కథానికా సాహిత్యంలోని నాలుగు భిన్న ధోరణులను మెరిపించారు.

"రాగమంజరి" చారిత్రక నవల. దీనిని-

1. రచయిత ధ్యేయం, 2. చారిత్రక నేపథ్యం, 3. వర్ణనా నైపుణ్యం, 4. వర్తమాన సామాజిక స్వరూపం, 5. నవలాశిల్పం అనే అంశాలుగా విభ జించుకోవచ్చును.

'తెలుగురాజులు స్వార్థంతో అంతఃకలహాలలో మునిగి దేశాన్ని పరాయి వారిపాలు చేస్తున్నారు. దీనికి స్వస్తి చెప్పినప్పుడే దేశానికి సముజ్జ్వల భవిష్యత్తు-' ఇది రచయిత సమాజానికి అందించే సందేశం. నవలకు "రాగమంజరి" అని పేరు పెట్టటంలో రచయిత ధ్యేయం ఇదే! పేరులోనే గుబాళిస్తోన్న స్నేహ సౌరభాలు జాతినంతా కమ్ముకోవాలని రచయిత ఆకాంక్ష కావచ్చు.

ఈ నవలకు చారిత్రక నేపథ్యం విజయనగర సామ్రాజ్య క్షీణదశ. ఆనాటి రాచరిక మర్యాదలు, కోటల నిర్మాణాలు, రహస్య ద్వారాలు, యుద్ధ

వ్యూహాలూ, కుట్రలూ, కుతంత్రాలూ మొదలైనవన్నీ చారిత్రక యథార్థాలతో వివరించారు. ఆనాటి సేనా నాయకుల - మండలేశ్వరుల - వివరాలను వారి వారి పేర్లతో సహా ఇచ్చారు. అనాటి కారాగృహాలనూ, వాటి రక్షణ విధానాలనూ కళ్ళకు కట్టేలా వర్ణించారు. వీటన్నింటితో అలనాటి ఆంధ్రరాజుల రాచరిక వ్యవస్థ పాఠకుని మనోనేత్రం ముందు సజీవంగా సాక్షాత్కరిస్తుంది.

నవలను రాగమంజరి నాట్యంతో ప్రారంభించారు. ఆమె మలయమారు తంలా మోహన రాగంతో తన నాట్యం మొదలు పెట్టింది. ఈ రాగంలో శీతలత్వం తోడి ఆహ్లాదంతోపాటు లీలగా సర్పస్పర్శ కూడా దోబూచు లాడుతుంది. భావుక డైన పాఠకుడికి ఇది భావ్యర్థ సూచన. విఘ్నేశ్వర ప్రార్థనతో నాట్యం ప్రారంభం కావటం - రచయిత ఆధునిక రీతిలో సంప్రదాయాన్ని గౌరవించటం తెలియజేస్తుంది.

"గంగా గోదావరీ నదీజలములతోపాటు, కృష్ణ, తుంగభద్ర, కావేరీ, పెన్న మున్నగు నదులయందలి జలములును; చతుస్సముద్రముల పవిత్ర పయస్సులును హేమకుంభములతో దేబడినవి. చిక్కరాయలకు వేదోక్త మంత్ర పఠనముతో రాజలాంఛన సంయుతముగా నభిషేకము జరిగెను." ఈ చారిత్రక నేపథ్యం పాఠకుడికి ప్రాచీన భారతీయ సంస్కృతిని పరిచయం చేస్తుంది.

ప్రకృతిని పాత్రలతో సహానుభూతి చెందుతున్నట్లుగా వర్ణించడం గొప్ప వర్ణనాశిల్పం - ఆంధ్ర సాహిత్యంలో ఈ విధమైన వర్ణనానైపుణ్యం తిక్కనగారి కాలంలో రససిద్ధి నందుకొంది. ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం గారి వర్ణన లన్నింటిలోనూ కేవల ప్రకృతి సౌందర్యం మాత్రమేగాక, పాత్ర గతమో, సన్నివేశగతమో అయిన భావజాలవల్లిక శిల్ప రమణీయంగా వ్యంజిత మవుతుంది. ఈ క్రింది వర్ణన ఒక ఉదాహరణ :

"ప్రభాకరు డస్తమించెను. దిగ్వనితలు తమోభిసారికా వేషములు ధరించుచుండిరి. చంద్రగిరి నగరము కాంతిమంతముగ నలంకరించుకొని వాసక సజ్జికవలె భాసించెను. చంద్రుడు లేని యారాత్రి ప్రోషితభర్తృక చందము వహించెను"

జగ్గరాయలు స్వార్థంతో కుట్రపన్ని ఒక పథకం ప్రకారం శ్రీరంగ రాయలను సమీపించబోయే ముందు చేసిన ప్రకృతి వర్ణన ఇది. ఈ వర్ణనలో ఏదో అపశ్రుతి, అవాంఛనీయత ధ్వనిస్తున్నాయని వేరుగా చెప్పనక్కర్లేదు.

రచయిత చారిత్రక నవల రాసినా, సమకాలీన సమాజాన్ని దానిలో ప్రతిఫలింప చేసినప్పుడే, అది సజీవమై నిలుస్తుంది. వర్తమాన రాజకీయ రంగాన్ని తలపింపచేసే వ్యవస్థాచిత్రణ మనకు ఈ నవలలో కనిపిస్తుంది.

1. సామంత రాజమండలి సభ్యులందరూ రాజధానిలో సమావేశం కావటం; - వారిలో వారు చర్చలు జరుపుకోవటం—

2. వేంకటపతిరాయల మరణానికి సంతాపాన్ని సూచిస్తూ నిశ్శబ్దాన్ని పాటించటం, ఒక తీర్మానాన్ని ప్రకటించటం.

3. జగ్గరాయలు సామంత రాజమండలిలో అధిక సంఖ్యాకులను కూడ గట్టుకొని అప్పటికి రాజుగా ఉన్న శ్రీరంగరాయలకు వ్యతిరేకంగా తిరుగుబాటు ప్రయత్నాలు చేయటం.

4 అకస్మాత్తుగా వెంకటపతిరాయలు కొడుకుకాని కొడుకును (బాయాంబ దత్తపుత్రుని) రాజుగా ప్రకటించటం.

5. రాజవంశంలోని రెండు పక్షాలవారూ, వెంకటపతిరాయల వారి చిత్ర పటాన్ని తమకు అండగా నిలుపుకొని పరస్పరం కుట్రలు పన్నుకోవటం - మొదలైనవి కొన్ని ఉదాహరణలు. నిజానికి ఇలాంటివి ఏవో ఒక కాలానికి పరిమితమైనవికావు. పదవీకాంక్ష కదిలించే పావులుగా ఇలాంటి వ్యక్తులు అన్ని కాలాలలోనూ, అన్ని సమాజాలలోనూ కనిపిస్తారు.

సంఘటనలను భావ్యర్థ సూచకాలుగా ఇతివృత్తంలో పొసగించటం గొప్ప నవలా శిల్పాలలో ఒకటి. జగ్గరాయలు పూజారి కొడుకును బాయ్యాంబ కందించి రహస్య మార్గాన తిరిగి పోతుండగా ద్వారబంధం అతని నుదుటికి తగిలి నుదురు రక్తసిక్త మవుతుంది. ఇది సంకల్పిత సంఘటన ఘటనా - శిల్పం. ఈ సంఘటన నవలాంతాన సర్వనాశనమైన తర్వాత జగ్గరాయలకు స్ఫురణకు వస్తుంది. "ఆనాడు తాను చంద్రగిరి దుర్గమున కొండాంబ యొద్దనుండి వెడలి

పోవుచుండ ద్వారము కొట్టుకొని కారిన రక్తబిందువు లాతనికి జ్ఞప్తికి వచ్చెను."
(P - - -)

రాగమంజరి రామరాయలను, కల్యాణిని తన రెండు కళ్ళుగా చూసుకోవటం, వారి క్షేమానికి, దేశ క్షేమానికి, తనను తాను బలి కావించుకోవటం - ఈ నవల శీర్షికను సార్థకం చేస్తుంది.

రాగమంజరిని మధురభక్తికి ప్రతీకగా మలచటం చెప్పుకోదగిన మరొక విశేషం.

ఒక నాయకుడు కాని, నాయిక కాని, ప్రాధాన్యత వహించకపోవటం ఈ నవలలోని ప్రత్యేకత. మార్క్సిస్ట్ దృక్పథంతోడి నవలల్లో వ్యక్త్యారాధనకు విలువలేక సామూహిక శక్తియే నాయకుడై నిలుస్తుంది - సుబ్రహ్మణ్యం గారు ఎక్కడా తాను మార్క్సిస్ట్‌నని చెప్పుకోలేదు.అయినా ఈనవలలో ప్రత్యేక వ్యక్తులు కాక "దేశభక్త మండలి" ప్రాధాన్యం వహించటం బలవత్తరమైన సామాజిక పరివర్తన దిశను నిర్దేశించేదిగా ఉంది. మొత్తం మీద ఈ నవల మంచి చారిత్రక నవలను చదివిన అనుభూతి నిస్తుంది పాఠకులకు. అగ్రశ్రేణి చారిత్రక నవలల పంక్తిలో నిలుపదగిన నవల.

"నవమల్లిక" సామాజిక నవల. విద్యావంతులు, సంస్కారులు అయిన యువతీయువకులు అత్యాచారానికి బలి కాబోతున్న ఒక పేద యువతిని - ఒక త్రాగుబోతు వాడి కూతురిని రక్షించి, తమతో నగరానికి తీసుకురావటంతో ప్రారంభమవుతుందీ నవల.

ఆధునిక నాగరిక సమాజంలో యువతీయువకు లెదుర్కొనే అనేక సమస్యలను ఈ నవలలో చర్చించారు. "మధు" పాత్ర ద్వారా తరాల అంతరాలను చిత్రించారు. క్రింది వర్గంలోని అనాగరిక స్త్రీని సభ్య సమాజంలోకి తీసుకురావటంలో ఎదురయ్యే కష్ట నిష్ఠూరాలను "డ్రమెటిక్"గా చూపించారు.

హరిహర సమాజంవారు ప్రదర్శించిన "అభిజ్ఞానశాకుంతలమ్" నాటకంలో హరి, మల్లిక - శకుంతలా దుష్యంతులుగా నాటక పరిధిని అతిక్రమించిన భావనాజగత్తులోకి ప్రవేశించినట్లు సన్నివేశ కల్పన చేశారు. ఇది పాఠకుని మనసులో ఒక విధమైన ముగింపుని తోపింపచేస్తుంది. కానీ, హరి పాత్రలో నిగ్రహాన్ని చూపి, అ పాత్ర విలువ పెంచి, ఇతివృత్తాన్ని పాఠకులు ఊహించని మలుపు తిప్పి "ఫార్ములా" తప్పించారు.

నాగరిక సమాజంలో ఉక్కిరిబిక్కిరయిన మల్లిక నాగరికారణ్యంలోకి పారిపోయి, మళ్ళీ మరో అడవిమల్లికగా మారిపోయింది. ఈ పరిణామానికి ఆమె చుట్టూ ఉన్న సమాజానిదే బాధ్యత అంటారు రచయిత - ధీరత్వంతో పైతరం లోని మూఢ భావాలను ఢీకొని నిలిచిన మధు అకాల మరణం పాఠకులచేత కంటతడి పెట్టిస్తుంది. మధులాంటి ప్రగతివాది ప్రాణాలు పోగొట్టుకొన్నా, అతడు వేసిన ప్రగతిబాటలో సమాజం సాగిపోతూనే ఉంటుందని రచయిత చెప్పదలచుకొన్నారేమో!

అమాయక మల్లిక అడవి మల్లికగా మారి కాలగర్భంలో కలిసినా, మరో నవమల్లికను సమాజం చేతులలో పెట్టింది. ఈ నవమల్లికకు అడవి వడగాలి సోకకుండా చూసుకోవలసిన బాధ్యత నవ సమాజానిదేనని రచయిత హెచ్చరిక.

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారి నాలుగు కథానికలూ, నాలుగు భిన్న రీతులకు చెందినవని ప్రారంభంలోనే చెప్పాను.

"అంతలోనే మార్పు" సంప్రదాయాలకు బలి అయిపోతున్న స్త్రీ కథ. ఈ కథలో సంప్రదాయమూ ఉంది. పరివర్తనా ఉంది. ఇదే, "అంతలోనే మార్పు."

ఇల్లు పట్టిన విధవాడపడుచులకు జీవితంలో సంతోషం ఉండదు. అన్యోన్యంగా ఉండే దంపతుల సంతోషాన్ని చూసి వారు సహించలేరు. ఇది ఒకనాటి (ఈనాటికీ) ఇంటింటి కథ, పండంటి కాపురాల్లో చిచ్చుపెట్టే విధవాడపడుచు వెకిలిబుద్ధితో ఇతివృత్తం మలుపుతిరిగింది. కథానికలో ప్రసన్న పాత్రను ఉత్తమ ఇల్లాలిగా నేర్పుతో మలచారు రచయిత.

"ఏది ప్రజాసేవ?" కథ సామాజికమైనదే అయినా తాత్త్విక ప్రాతిపదిక ఆధారంతో అల్లిన కథ. ఈ విషయం రచయిత స్వయంగా చెప్పుకున్నారు. అన్నదానాలు చేయటమూ, ఉచిత వైద్య సదుపాయాలు కల్పించటమూ మాత్రమే కాదు ప్రజాసేవ. మానవుడు తనను వెన్నంటి ఉండే దుఃఖాన్ని ఎదుర్కొగలిగే నిబ్బరాన్ని కలిగించేదే నిజమైన ప్రజాసేవ అని చెప్తుంది ఈ కథానిక,

"వ్రతశీల" దాంపత్య జీవితంలో మాధుర్యాన్ని చూపించే సొగసైన కథ. భారతంలో ద్రౌపది ఉదాహరణతో, భర్తను వశపరచుకొనేవి మంత్రతంత్రాలు కావనీ, - హృదయంలోని అనురక్తి గృహ జీవితం పట్ల అంకితభావమూ, అని చెప్పారు. సుశీలకు, ఆమె భర్తకు మధ్య సాగిన సంభాషణలను రసవత్తరంగా నాట్యమాడించారు రచయిత. ఉపదేశాత్మకంగా ఉన్న ఉల్లాసభరితమైన కథ.

విషాదగర్భితమైన కథ పుట్టిన రోజు. ఎప్పుడు పుట్టాడో తనకే తెలియని జగన్నాథానికి తల్లి ప్రేమకు నోచుకోని గౌరి భార్య అయింది. గౌరికి ఒకటే కోరిక "అమ్మా!" అని పిలిపించుకోవాలని. అతడికి ఒకటే కోరిక గౌరి ముఖంలో ఆనందం చూడాలని. ఆ నిర్భాగ్య దంపతులకు ఇంత చిన్న కోరిక కూడా తీరలేదు - జగన్నాథరావు పుట్టిన రోజు (అనాధ శరణాలయంలో దొరికిన రోజు) నాడే పసిబిడ్డ లోకం వదిలి వెళ్ళిపోయాడు. ఇలాంటి (అనాధ) జగన్నాథ రావులను చూడలేకనే జగత్సాక్షి కనుమరుగయ్యాడా?

కథలో చిలుకల జంటను ప్రతీకాత్మకంగా చూపటం మంచి రచనా ౧౦.

గల్పికలలో "రెండు ముళ్ళు" ఛలోక్తులతో సరదాగా సాగుతుంది. రచయితలు రసవత్తరమైన నవలలూ, కథలూ, వ్యాసాలూ, వ్రాస్తోంటే, రచయితల భార్యలు జాగరణలు చేయవలసిందేనా? అని తోచి నవ్వు తెప్పిస్తుంపి రచన. భార్యాభర్తల మధ్య ఛలోక్తులలో సాహిత్య పారిభాషిక పదాలు దొర్లటం గమనార్హం. ఈ సంభాషణలు వాస్తవికతా భ్రాంతిని కలిగిస్తాయి.

రెండో గల్పిక - "నామకరణం" సీతపేరు కష్టాలకు ప్రాతినిధ్యం వహిస్తుందని భయపడే కొందరికి ఆ పేరే యావద్భారతానికి శిరోధార్యమైన పరమ ధర్మానికి ప్రతీక అని తెలియజెప్తుంది.

ఈ సృజనాత్మక రచనా సంకలనం ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారిని తెలుగు సాహిత్యంలో సృజనాత్మక రచయితగా ఒక విశిష్ట స్థానంలో నిలుపుతుంది.

—సి. ఆనందరామం

# నా మాట

నేను హైదరాబాదుకు 1950 లో వచ్చాను. మా పెద్దన్నగారు బిదురు వేంకట శేషయ్యగారు మేధావి పత్రికకు సంపాదకులుగా బాధ్యతలు నిర్వహిస్తుండేవారు. ఆత్మవిజ్ఞాన కళాశాల పక్షాన ఆ పత్రిక వెలువడుతూ ఉండేది. పూజ్యపాదులు శ్రీ సాధు శ్రీనివాస శాస్త్రిలవారు ఆ కళాశాల గురుమూర్తులు. ఆ పెద్దల సేవలో నేనూ పాలు పంచుకొన్నాను పత్రిక ముద్రణ కార్యక్రమా న్నంతా క్రమంగా నేనే చూడవలసి వచ్చింది. ప్రతి నెలా వెలువడే ఆ పత్రికలో అప్పుడప్పుడూ కథలూ, వ్యాసాలూ వ్రాస్తూండుమని మా అన్నగారు ప్రోత్సహించేవారు. వారి ప్రేరణతో నా పేరుతోనూ, మారుపేర్లతోనూ కొన్ని రచనలు చేశాను. అలా చేసినవాటిలో నా పదహారోయేట రాసినవి కథానికలు రెండు: 'అంతలోనే మార్పు', 'ఏది ప్రజాసేవ.' నా చుట్టూ ఉన్న మనుషులు, జరుగుతున్న సన్నివేశాలు, నేను వాటిపట్ల స్పందించిన వైఖరీ నా కథలకు వస్తువులయ్యాయి.

మొదటి రెండు కథలలో శిల్పం ఉందని నేననుకోను. కాని, ఒక భావాన్ని కథగా చెప్పాలన్న ఆవేదన ఉంది. దానిని అంతశ్శిల్పంతో మలచి ప్రదర్శించాలనే స్పృహకంటె అలవోకగా చెప్పాలన్న తపన ఎక్కువగా ఉండేది ఆ రోజుల్లో. క్రమంగా కథలు ఎలా చెప్పాలో తెలుసుకొన్న కొద్దీ తరువాతి కథానికలలో అభివ్యక్తికి, నిర్మాణానికీ, శిల్పానికీ ఎక్కువ పాత్ర సహజంగా ఏర్పడింది. కథకుడిగా సృజనాత్మక రచయితగా రచనా వ్యాసంగాన్ని ప్రారంభించిన అవకాశం నాకు "మేధావి"పత్రిక కల్పించింది. తరువాతి కథలన్నీ ఆయా పత్రికల కవసరమని ఎవరైనా అడిగినప్పుడే రాసినవి. చివరి రెండు గల్పికలు కూడా యువభారతి వారి 'నందిని' పత్రికకు రాసినవి 'సుశీల' అనే పేరుతో.

మేధావి పత్రికలో రాసిన అనుభవంతోనే 'రాగమంజరి' చారిత్రక నవల రాయటానికి సాహసించాను. 1958లో ఉగాదరోజున మొదలుపెట్టి శ్రీరామ నవమినాడు ముగించాను. ఆ చారిత్రక నవలలోని వస్తువు 'తోపూరు యుద్ధా'నికి సంబంధించింది. నేను ఎం.ఏ., చదువుతున్నప్పుడు 'ఆంధ్రుల చరిత్ర-

సంస్కృతి'ని అధ్యయనం చేశాను. ఆంధ్రుల చరిత్రలో ఎన్నో ఘట్టాలు నా మనసును కదిలించివేశాయి. అంతఃకలహాలతో, స్వార్థాలతో, కుతంత్రాలతో కూలిపోతున్న విజయనగర సామ్రాజ్యం చివరి రోజుల్లో తన అస్తిత్వాన్ని నిలుపుకోటానికి చేసిన మెరుపు సన్నివేశం నా మనసులో ఒక చెదరని ముద్ర వేసింది. 'దేశభక్తి కూటమి' నిర్వహించిన పాత్ర భారతదేశ స్వాతంత్ర్యోద్యమానికి ప్రతిబింబంలా నా కనిపించింది. దానిని 'రాగమంజరి' అనే రాగ సూత్రంతో రచించాను. అప్పటికీ ఇప్పటికీ ఆ వస్తువు నెన్నుకొని చారిత్రక నవల ఎవరూ రాయకపోవటం చరిత్ర నాకిచ్చిన ఒక అవకాశంగా, అదృష్టంగా భావిస్తున్నాను.

'రాగమంజరి' రచనకు ప్రేరకులు ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు. సికిందరాబాదులోని నాగేంద్ర బుక్‌డిపోవారు ఇంటర్‌మీడియట్ స్థాయిలో ఒక ఉపవాచకం ప్రచురించాలని సంకల్పించారు. వారు ఆచార్య అవధానిగారిని ఒక రచయిత పేరు సూచించండని కోరారు. వారు నా పేరు సూచించారు. అప్పుడే ఎం.ఏ. పరీక్షలో ప్రథమునిగా ఉత్తీర్ణుడనై, పార్ట్‌టైం లెక్చరరుగా రెండు మూడు కళాశాలల్లో పనిచేస్తున్నాను. గురువుగారు కల్పించిన అవకాశాన్ని వదలుకోదలుచుకోలేదు. నాలో ఉన్న కథకుణ్ణి నేనే ప్రోత్సహించుకొని ఒక్క ఊపులో రచించాను. ఒక్కొక్క అధ్యాయం నేను వ్రాస్తుండటం, దానిని ముద్రణకు పంపుతూ ఉండటం జరిగింది. రాసినది తిరిగి చూచుకొనే అవకాశం కూడా లేని వేగంతో వెలువడిన రచన అది. ఆ తరువాత ఇంటర్ మీడియేట్‌కూ, బి.ఓ.యల్‌కూ ఉపవాచకంగా నిర్ణయింపబడింది. ఆ సమయంలో చాలమంది ఉపాధ్యాయులు, విద్యార్థులు నన్ను ప్రశంసిస్తూ లేఖలుకూడా రాశారు. నాలోని ఆత్మవిశ్వాసాన్ని పెంచిన నవల 'రాగమంజరి.'

'రాగమంజరి' ప్రథమ ముద్రణకు నేను రాసుకున్న తొలిపలుకులను పేర్కొంటాను - "ఇది యొక చారిత్ర వస్తుకమైన చిన్న నవల. ఇందలి పాత్రలు చాలవఱకు చరిత్రలోనివే. కథా రామణీయకమునకై రెండు మూడు పాత్రలు మాత్రమే కల్పింపబడినవి. సాధ్యమైనంతవఱకు చరిత్ర సన్నివేశములను శ్రద్ధతో ననుసరించితిని. ఈ నవలకు మొదట తోపూరు యుద్ధమని పేరు పెట్టవలె ననుకొంటిని, కాని, రమ్యముగా నుండునను నమ్మికచేతను రాగమంజరి కింద గల యధిక ప్రాధాన్యముచేతను దీనికి పేరు పెట్టితిని. విద్యార్థుల

కుపయుక్తముగా నుండవలెనను దృష్టితో జాతీయము సరళమునైన శైలివాడ యత్నించితివి. ఈ నవలయందలి వస్తువును సంఘటించుటకై పలువురు చరిత్ర జ్ఞులు వ్రాసిన గ్రంథములు చదివితిని, వారి కందఱికిని నా కృతజ్ఞతలు".

నవమల్లిక 1968 లో రాసింది. అందులో నా కళాశాల జీవితంలోని ఎన్నో అనుభవాలు ఈతకొడుతూ కనపడతాయి. నాకున్న నాటకాల పిచ్చి, వాటిమీద నాకున్న అభిప్రాయాలు, సంప్రదాయానికీ మారుతున్న పరిస్థితులకూ మధ్య సాగుతున్న సంఘర్షణలో యువతరం పొందే స్పందనలు, వారి జీవితాల్లో కలిగే ఉల్లోలకల్లోలాలు, వాటిని వారు తరించటానికి చేసే యత్నాలు. ఇవన్నీ నా భావజాలంలో నుంచి పుట్టి, సాంఘిక నవలగా రూపొందాయి. జీవిస్తున్న జీవితమే జీవిస్తున్న నవల- అనే నా అనుభవాన్ని అక్షరాలా ఆవిష్కరించటానికి అవకాశం ఇచ్చింది నవమల్లిక. ఆ రోజుల్లో ఎమెస్కో ప్రచురణలంటే తెలుగు వారు ఎంతో మోజుపడేవారు. ఆ సీరీస్‌లో ఒకటిగా రావాలన్న కోరిక నన్నీ నవలను రాయించింది. అయితే, ఎన్నో తీరని కోరికల్లో అదీ ఒకటిగా మిగిలి పోయింది. ఆ తరువాత నవలారచనకు ఉత్సాహం లేకపోవటానికి అదే కారణ మని అనను గాని, దాని ప్రభావం ఉన్నదని నా మనసు నడిగితే అప్పుడప్పుడూ చెపుతూ ఉంటుంది.

అట్లని కథలు, నవలలు రాయడం మానానని కాదు. రెండు మూడు నవలలు అసంపూర్ణంగా మిగిలి ఉన్నాయి. కొన్ని కథలు రణచిత్తులో ఉన్నాయి. 'సుశీల కథలు' అనే కథావాహిని కొంత దూరం నడిచి విశ్రాంతి తీసుకుంటోంది. వీటిని కొద్దికాలంలోనే పూర్తిచేసి అందించాలనే ఆకాంక్ష నాకు బలంగా ఉంది. భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి ఆశీస్సులతో ఆ పని పూర్తి చేయగలననే నమ్మకం కూడా ఉంది!

ఈ సంపుటికి సంపాదకత్వం వహించి, విలువైన సంపాదకీయం రాసి యిచ్చిన మా హితైషువులు, సాహితీ బంధువులు శ్రీ ముక్తేవి లక్ష్మణరావు గారికి, డాక్టర్ ముక్తేవి భారతిగారికి నా కృతజ్ఞతలు. లక్ష్మణరావుగారు ప్రసిద్ధ న్యాయవాది; డాక్టర్ భారతిగారు రాజాబహద్దర్ మహిళా కళాశాలలోని తెలుగు శాఖలో రీడర్. అయినా ఇద్దరూ ప్రసిద్ధ జంట రచయితలు, కథారచయితలు. ఆ దంపతులు నాపట్ల ఎల్లప్పుడూ చూపే ఆదరాన్నే వారి మాటల్లో రంగరించి లోకానికి అందించిన సహృదయమూర్తులు. వారి సౌజన్యానికి ఈ సంపుటి అక్షరసాక్షి.

కృతిలోని గుణాగుణా లెలావున్నా, నా యందలి అభిమానంతో అంకితం తీసుకోటానికి అంగీకరించిన మాన్యులు, సాహిత్యాభిమానులూ, రసజ్ఞులూ, కర్నాటకాంధ్ర ప్రాంత ఆదాయపు పన్నులశాఖలో ఉన్నతాధికారియైన కమీషనర్ శ్రీ రాయసం వెంకట్రామయ్యగారి పెద్దమనసుతనానికి నా కృతజ్ఞతాభివందనాలు. వారు ఉదాత్తులు, సాహిత్యమర్మజ్ఞులు. వా రంగీకరించిన ఈ కృతి సుకృతి.

ప్రముఖ సాహితీవేత్తలు ఈ రచనమీద తమ అమూల్యాభిప్రాయాలను ముందు మాటలుగా అందించి నన్ను ఆశీర్వదించటం నా అదృష్టం. ప్రముఖ పాత్రికేయులు, రచయితలు అయిన శ్రీ వాకాటి పాండురంగారావుగారు, ప్రముఖ నవలాకర్త, రచయిత అయిన డాక్టర్ రావూరి భరద్వాజగారు, ప్రసిద్ధ రచయిత్రి, విదుషీమణి శ్రీమతి అబ్బూరి ఛాయాదేవిగారు, ప్రఖ్యాత నవలా రచయిత్రి, విమర్శకురాలు అయిన ఆచార్య సి ఆనందారామం గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు. వీరందరు నా రచనపట్ల, నాపట్ల చూపించిన సౌహార్ద భావాన్ని వెలువరించిన ప్రామాణికమైన అభిప్రాయాలనూ నేనెన్నడూ మరచిపోలేను.

'రాగమంజరి'ని నా షష్టిపూర్తి ప్రచురణలో భాగంగా ప్రచురించటానికి అంగీకరించిన నాగేంద్ర బుక్ డిపో వారికి నా ధన్యవాదాలు.

ఈ గ్రంథ ప్రచురణలో నన్ను వెన్నుదట్టి ప్రోత్సహించిన ప్రియ మిత్రులు డాక్టర్ ఎన్. వెంకట్రావుగారికి, షష్టిపూర్తి ప్రచురణల స్థాయీ సంఘ సభ్యులకు, ముచ్చటగా ముఖచిత్రాన్ని రూపొందించిన రేఖాశిల్పి శ్రీ శీలా వీర్రాజుగారికి, అందంగా ముద్రించి ఇచ్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారికీ, ముఖపత్ర ముద్రణం చేసిన విప్లా ప్రింటర్స్ ప్రై. లి. వారికి నా ధన్యవాదాలు.

హైదరాబాదు,
1-7-1996,

—జి. వి. సుబ్రహ్మణ్యం

# రాగమంజరి

## (చారిత్రక నవల)

### మొదటి ప్రకరణము

వీణియ మోహనరాగ మల్లన నందుకొనెను. రాగమంజరీ చరణ మంజీరములు గల్లని మ్రోసెను. సభ కన్ను తెఱచెను.

మేలిముసుఁగు తెరలో పూలసెజ్జపైఁ గూర్చుండియున్న బాయాంబకు మేను జలదరించెను. ఆమెకుఁ బ్రక్కఁగా హేమసింహాసనము నందాసీనురాలైన మహారాజ్ఞి కొండాంబకు మోము వికసించెను. మిగిలిన సభయంతయు నొక చిత్తరువయ్యెను.

రాగమంజరి నృత్య మారంభించెను. చెలి యొకతె రాగ మాలపించెను. మలయమారుత మారాగము వహించి కదలలేక కదలుచుండెను. పుష్పపరాగము నృత్యభంగిమకు నివాళు లెత్తుచుండెను.

విఘ్నేశుని జనన మనోఁటిగాథ. చెలి గీత మందుకొనెను. రాగమంజరి భావానుగుణమగు నభినయ మారంభించెను. బాయాంబా కొండాంబల హృదయములు భావతాదాత్మ్యము వహించెను. లోకమాత కాత్యాయని కాలకంఠుని పాద రాజీవములకుఁ బూజ సల్పుచుండెను. కాని, యామె కన్నులశ్రుపూరితములై యుండెను. నిర్భరమగు నామె హృదయ మెందులకో కరఁగి జాలువాఱెను. ముజ్జగంబులఁగన్న యా ముత్తైదువకుఁ బసిగందుపై మనసు పోయినది. మహేశుని కృపాకటాక్షమునకై యామె కన్నీరు మున్నీరగుచుండెను. రాగమంజరి దాని నభినయించెను. బాయాంబ ముఖము జేవురించెను. కన్నులు చెమ్మగిల్లెను. అధరము వణఁకెను. కొండాంబయు నొక్క నిట్టూర్పు విడిచెను.

బాయాంబ హృదయమున భావములు పెల్లుబికెను. తాను కర్ణాటక క్షమామండలాఖండులగు వేంకటపతిదేవ మహారాయల యనుంగుపత్ని. సర్వ సౌభాగ్య విలాసమైన మహాసామ్రాజ్యము తమకు వశమైయున్నది. అఖిల సామంత నృపాలపుంగవు లనవరతము తమకంపు రత్నరాసులతో మేడలు నిండియున్నవి. కాని, తమ గృహమున వెలుఁగు లేదు. ఒక్క పుత్రరత్నము తమ కన్నులపండువు సేయలేదు. పసిపాప నోటినుండి విరిసిన బోసినవ్వుల రతనాలు తమ హృదయమందిరాల నిండలేదు. ఆ చల్లని వరమునకై తాను మ్రొక్కని దైవము లేదు, తాను పట్టని వ్రతము లేదు.

చెలి రాగము మార్చెను. రాగమంజరి భావము మార్చెను. చెలి గీతము నెత్తెను. రాగమంజరి దాని కభినయమునఁ బ్రాణము వోసెను. బాయాంబ మైమఱపువడి చూచుచుండెను. చంద్రుఁడు మింటిపైఁ గదలకుండెను.

అంబ యభ్యంజన మాచరించుటకుఁ బన్నీరు సిద్ధమైనది. చెలు లామెకు సంపెంగనూనె నంటిరి. శ్రీగంధము నలుగుపెట్టుటకు సిద్ధము చేయఁబడినది. చెలు లెఱ్ఱనీటితో నామెకు హారతి పట్టిరి. గిరిరాజసుత నిమీలిత నేత్రయై సృష్టి కర్తను ధ్యానించినది. నలుగుపిండితో బొమ్మ చేసినది. దానికిఁ బ్రాణము వోసినది. కేకిసలాడు ముద్దుపట్టిని గౌఁగిటఁజేర్చినది. ఆమె మాతృమూర్తియైనది. మాత యా బాలుని ముద్దిడినది. అందుఁ దేనెలు ఊరినవి. ఆమె యాతని నవ్వించినది. అందు శరచ్చంద్రికలు విరిసినవి. ఆమె యా బాలుని మరలఁ గౌఁగిలించినది. విశ్వము పులకరించినది.

బాయాంబ మేను జలదరించినది. ఆమె యాస్థితి నూహింపలేకపోయినది. పుట్టెఁడు దుఃఖము ముంచుకొనివచ్చినది. అంతలో నేదియో యనిర్వచనీ యానందము స్ఫురించినది. ఆ యనుభూతి జన్మజన్మల పుణ్యఫల మనిపించి నది. ఆ యానందానుభూతిలో శరీరము మఱచి బాయాంబ పూల సెజ్జపై సొమ్మ సిల్లినది.

దానినిగాంచి కొండాంబ వణఁకిపోయినది. ఆత్రముతో బాయాంబను సమీపించి మోమున మోముంచి పరికించినది. బాయాంబ తన విశాల నేత్రములు మూసికొనియున్నది. ముఖము వెలవెల్లనైనది. ఆమె హృదయమావేదన నెటిఁగింప వెలికి నుఱికి వచ్చిన వాయువ ట్లామె కన్నులనుండి అశ్రుధారలు జలజల

ప్రవహించుచున్నవి. కాని, యామెకు శరీరమున స్మారకము లేదు. కొండాంబకు ముచ్చెమటలు వట్టినవి. చెలులు కలవరమందసాగిరి. రాగమంజరి ప్రతిమ యయ్యెను. వాద్యములు స్తంభించెను.

అది చైత్రశుద్ధ త్రయోదశి. రాత్రి రెండుజాములు గడచినవి. సుధాంశుఁడు తన శీతల కిరణజాలముతో లోకమునఁ బాల వెన్నెలలు పంచిపెట్టుచుండెను. పగలెల్ల ననవరతము శ్రమనందియున్న లోకము క్రమముగా విశ్రాంతిఁ గొనుచుండెను. బాయాంబ భవనమున నాఁడు వినోద కాలక్షేపము జరిగినది. రాగమంజరి రాజనర్తకి. ఆమె యభినయమున కాటపట్టు. సంగీతమునఁ జదువులరాణి. ఆమె యన్న రాజవంశమున కమిత గౌరవము. 'ఆమె పాడుచు నాడవలెను, మేము చూడవలె'నని రాణివాసపు మతము. బాయాంబ కోరికపై నాఁడు రాగమంజరి విఘ్నేశుని జననము నటించినది.

బాయాంబ మేడపైనున్న ఆయా సువిశాల చంద్రమండపమున నొక్కింతసేపు నిశ్శబ్ద మావరించెను. ఇంతలో నీశాన్యమువనున్న యొక ద్వారమునుండి చెలియొకతె నురుగులు గ్రక్కుచుఁ బరుగున వచ్చినది. నిశ్చలత నిండియున్న ఆ సభనుగాంచి నివ్వెరపోయినది. ఏమి చేయవలెనో దోఁపక క్షణమట్టె నిలిచిపోయినది. వెంటనే ఏదియో స్ఫురణకు వచ్చినట్లు నటించి కొండాంబను సమీపించి యామె చెవిలో నేదియో నూఁదినది. కొండాంబయు నది వినినదో లేదో నేలపైఁ గాలుమోపలేనంత కలతచెంది కాలుగాలిన పిల్లివలె నా మంచము చుట్టు పరవళ్ళు త్రొక్క నారంభించినది.

అంతలో ముఖద్వారమునొద్ద సవ్వడియైనది. ఎల్లర చూపులు నావైపు కేంద్రీకరింపబడినవి. వారికి సమున్నత విగ్రహుఁడొకఁడాసభ ప్రవేశించుట గోచరించెను. అతని రూపముఁ గాంచినంతనే చెలు లటనుండి తొలఁగిపోయిరి. అతఁడు భవనమునఁ బ్రవేశించి నలుమూలలఁ దృక్కులు సారించి ముందుకు నడచుచుండెను.

ఆతనిఁ జూచినంతనే కొండాంబకు ప్రాణము లేచివచ్చినది. హృదయము గొంత కుదుటపడినట్లైనది. అప్రయత్నముగా నామె యాతనివైపు నడచినది.

"జగ్గరాయా! చెల్లె లేమియో యగుచున్నది" అని రుద్ధకంఠముతో నాతనిఁ బలుకరించినది కొండాంబ.

"ఏమి జరిగినదమ్మా?"

"రాగమంజరి నాట్యము చేయుచున్నది. దానిని జూచుచు జాయాంబ సొమ్మసిల్లి పడిపోయినది, మాటలాడుట లేదు" అని ఆత్రముతో కొండాంబ సమాధాన మిచ్చెను.

"అక్కా! చెల్లెలి హృదయము వెన్నవంటిది. అసలే వేదనతో కుములుకున్న యామె హృదయ మెట్టి సున్నితమైన భావమునైనను ఓర్చుకొనజాలదు"

అని జగ్గరాయలు మెల్లగ నొకసారి మందిరము కలయజూచెను. వెంటనే కొండాంబను గాంచి "జాయాంబ కిప్పుడు విశ్రాంతి యెంతయో యవసరము. జనసమ్మర్దము లేకుండఁ జూడవలెను" అని సూచించెను. ఆ చెప్పుటలో నాతఁడు కన్నులు చేరెడంత చేసెను. భ్రుకుటి ముడివేసెను. కన్ను కొలకులలో దృష్టులు నిలిపెను.

కొండాంబ తమ్ముని మోముఁగాంచి ఏదియో గ్రహించినది. మందిరమున నున్న స్త్రీజనమునకుఁ గనుసైగ చేసినది. క్షణములో కాంతామండలి యను మఱుఁగైనది. రాగమంజరి శూన్యభావమువలెఁ దేలికగా నడచిపోయెను. చంద్రుఁడు నల్లని మబ్బు తెరచాటు చేసికొనెను.

మెల్ల జగ్గరాయలు కన్నులతో మాటలాడఁదొడఁగెను. కొండాంబ వానిని గన్నులతో గ్రహించెను. [illegible] యాక్రొత్త [illegible].

తెల్లని వెన్నెల నీలిరంగును రంగరించుకొనినది. మేలి ముసుఁగులో వాలిపోయిన జాయాంబ చెక్కిళ్ళపై నొక్క యశ్రుకణము తళుక్కున మెఱసినది. జగ్గరాయ లొక్క క్షణము జాయాంబను గన్నార్పక చూచుచు నచ్చటనే నిలువఁబడిపోయెను. మందహాస మేదియో యాతని మోమున మసలఁబోయినది కాని, అంతలో నాతడు మెల్ల గాంభీర్యము వహించెను. మునిచీఁకటి తెరలలో దోబూచులాడు వెన్నెల యాతని మోముపైఁ బ్రతిబింబించెను అతఁ డాకాశము వంకఁ జూచుచు నొక యాసనమునఁ గూర్చుండెను.

జగ్గరాయలు సమున్నత విగ్రహుఁడు. కండలు తిరిగిన యాతని మేనొక యినుపకడ్డి. ముఖము కొట్టవచ్చినట్లుండును. విశాలమైన నుదురు, తీక్ష్ణములైన వీక్షణములు, కోరమీసములు నాతనిమోమున కందము చేకూర్చినవి.

ముఖమున స్ఫోటకపు మచ్చలు లేకపోయినచో నాతఁడు సుందరాకారుఁ డనుట కెట్టి సంశయమును లేదు. కాని, యాతఁ డన్నిభావము లను దన ముఖమున ముద్రింపగలఁడు. మితభాషి. ఆవేశము జనించెనా తానెంతసేపు మాటలాడునది యతనికిఁ దెలియదు. ఆతనిమాట లాతని భృకుటిలో ముడిపడును, కన్నుల కూడిగ మొనర్చును. అంతదాక 'మత్తని పురి.'

ఇంతలోఁ బూర్వపరిచితురాలైన చెలికత్తె నిష్క్రమించిన ద్వారము నుండి వేగముగా మఱలఁ బ్రవేశించెను. జగ్గరాయ లచ్చట నుండుట గాంచి యుత్సాహముతో నాతని సమీపమున కరుదెంచెను. దవంతదూరమున నిలిచి నడుము వంచి నమస్కరించి రాయలచేతి కొక నీలిరత్నము నందించెను. రాయ లులికిపడెను. ఆ రత్నమును జేతనందుకొని పరీక్షించెను. మసకచీఁకటిలో నాతని కన్నులు మెఱసినవి. భ్రుకుటి యొక్కింత పైకి నడచినది. అట్టహాసము చేయఁబోయెనుకాని యంతలో మఱల నాతఁడు గంభీరుఁడయ్యెను. చరచర నడచి ప్రక్కనున్న మంచమును సమీపించెను. ఆ పూలసెజ్జ పరివేష్టించియున్న మేలిముసుఁగుఁ దొలఁగించెను. సౌమ్యసిల్లిన బాయాంబ యాతనియెదుటఁ బ్రత్యక్షమాయెను. రాయ లొక్కక్షణ మట్టులే నిలిచిపోయెను. శరచ్చంద్రికల నోఁచుకొనలేక మసకచీఁకటిలో కాంతిని నింపుకొనుచున్న బాయాంబ మోము రాయలు కన్నార్పక చూచెను. అప్రయత్నముగా నాతని కన్నులనుండి రెండు బాష్పబిందువులు రాలినవి.

జగ్గరాయలు కన్నులతో ''బాయాంబ జాగ్రత్త!'' అన్నట్లాచెలి నాజ్ఞాపించెను. ఆమె గ్రహించి నమస్కరించెను. రాయ లొక్కసారి చంద్రునిఁ గాంచి, వెంటనే మోము త్రిప్పుకొని కొండాంబ నడిచినత్రోవఁ బట్టెను. ఆ ద్వార మాతని కిఱుకైనది. నడుమువంచి యందుఁ బ్రవేశించెను. క్రమముగా సోపానము లాతనిని భూగర్భమునకుఁ దీసికొనిపోవుచున్నవి. అతఁడు యంత్రమువలె నడచి పోవుచుండెను. అచ్చటచ్చట నొంటిగా నిలిచియున్న దివిటీ లాతని వేగము గాంచి చలించినవి. జేవురించిన యాతని కన్నులలో నేదియో చెప్పలేని కార్యనిర్వహణ మొండు నిలువున దహింపఁబడుచుండెను. ఆ కన్నులుచూచి దివిటీలు నివ్వెరపోయినవి. ఆతఁడు క్రమముగా నొక సమతలముఁ జేరెను. చుట్టును గలెన శిలానిర్మితమైన కోట కాలపురుషుని కౌఁగిలివలెఁ నతనిచుట్టు నిలిచియున్నది. ఒక్క క్షణ మాతఁ డా భయంకర గుహాభవనమును వీక్షించుచు

నిలువఁబడెను. అతని ఫాలమున స్వేద మంకురించెను. అచ్చట నొక సరోవరము గలదు. అది మహారాజు రాణులతో జలక్రీడ సల్పునది. ఆ మందిరము యుద్ధసమయములందు రాణివాసము దాఁగియుండునది. అచ్చటినుండి యవసరమైనచో పాఱిపోవుట కొక రహస్యమార్గము గలదు. అదియొక దుర్గమారణ్య మధ్యమువఱకు భూగర్భమున వ్యాపించియున్నది. అచటి కొలనునుండి వీచు చల్లనిగాలి రాయనిఁ బరామర్శించెను. ఇంతలో నాతని సమాధి చెదరిపోయెను. పుంజీభవించిన నిశ్శబ్దమును జీల్చికొనుచు నొక శిశువు రోదనము వినవచ్చెను. రాయలు చెవులు నిక్కించెను. ఒక్క నిట్టూర్పు విడిచెను. కొంచెము ముందుకు నడచి కరధ్వని చేసెను. క్షణములో కొండాంబ యాతనిముందు నిలిచెను. ఆమె యిప్పుడు మహారాజ్ఞి వేషమున లేదు, ఒక దాసీవనితవలె నుండెను!

"అక్కా! దైవము చల్లగాఁ జూచెనా?" అని ఆత్రముతో రాయలు ప్రశ్నించెను.

"ఇంతవఱకు కెట్టిలోపమును లేదు. కాని, ముందున్నది ముసళ్ళపండుగ" అని కొండాంబ కన్నులప్పగించినది.

జగ్గరాయలు మూఁగనవ్వు నవ్వెను.

"ఆపై భారము నాకు వదలుడు. దేశముకొఱకై పురుషకారము గావింతును. అది ఫలించెనా నా స్వామికి భక్తి నీరాజనమగును." అతని కన్నులు చలించినవి. ఆతని భావనలు మిన్నంట లేచినట్లైనవి.

ఉప్పొంగుచున్న జగ్గరాయల విగ్రహమును కొండాంబ నిగ్రహముతోఁ గాంచెను. ఉత్తుంగ తరంగములతో నుబ్బెత్తుగఁ బొంగు సముద్రునివలె నాతఁడు గోచరించెను.

"సోదరా! నీ యుత్సాహపూరితమైన ప్రభుభక్తియే మా వంశమును నేడుగడ కావలెను."

"అది మీ సంకల్పబలము మహారాజ్ఞీ!"

''ఆలసింపక నీ వింక కర్తవ్యోన్ముఖుఁడవు కమ్ము.''

''మహారాజ్ఞీ! ఈ వేషములో నుండఁగనే?!''

కొండాంబ కప్పుడు తాను జ్ఞాపమునకు వచ్చెను. తన్నుఁదాఁజూచు కొనెను. తన కన్నులను దానే నమ్మలేకపోయెను. ఒక్కసారి తమ్ముని చూచెను. మఱల తన్నుఁజూచుకొనెను. ఆమె కన్నుల నీరు నిండెను. స్వచ్ఛంద మైన త్యాగభావ మెద్దియో యామె మోమున గోచరించెను. దివిటీ కాంతు లామె కన్నులలో జలకమాడెను.

జగ్గరాయలు కదలిపోయెను. ఆతఁ డామె కన్నులలో నెన్నియో జన్మల నుండి కరుడుకట్టిన భావసాంద్రత కరఁగి జాలువాఱుటఁ గాంచెను. ఆ మోము చూడలేక తలవంచుకొనెను.

''సోదరీ! రాచకార్యము కత్తిసాము వంటిది. మెలఁకువతో మెలఁగ వలెను. అంతఃపురభారము మీది, అఖిల సామ్రాజ్యభారము నాది.''

జగ్గరాయలా సోపాన మందిర ద్వారమునుండి నిష్క్రమింపఁబోయెను. అది చాల ఇఱుకైన ద్వారమైయుండుటచే నావేశమున వెడలు జగ్గరాయల ఫాలము ద్వారమును బలముగాఁ దాఁకెను. రక్తమాతని యుద్వేగము సూచించు నట్లు పైకిఁజిమ్మెను. అతఁడు తన చేతితో దాని నదిమిపట్టెను.

కొండాంబ యాతని రక్తసిక్తమగు వదనముఁగాంచి వెఱఁగుపడెను. పడగవిప్పి కాటందు కోడెత్రాఁచును ముంగిస లొటికినట్లనిపించెను. కొండను డీకొను భద్రగజము కుంభస్థలము వ్రయ్యలైనట్లయ్యెను. కొండాంబ కన్ను లొత్తుకొని వెనుకకు నడచెను.

తొలికోడి కూఁతతో బాయాంబకు స్మృతి కలిగినది. బలహీనముగా నామె కన్నులు తెఱచినది. ఆమె నిజముగా వాస్తవిక జగత్తును జూచుటలేదు. కన్నులు తెఱచియే యున్నను ఆమె దృష్టి యాంతర ప్రసృతమైయున్నది. రాగమంజరీ నృత్యమునందుఁ దాదాత్మ్యము నొందిన హృదయ మావాసన వీడలేదు పార్వతి పసిగందు నాడిలో నిడికొనియున్న దృశ్యమింకను డెందమునుండి చెదరలేదు.

ఆమె పార్వతిగా లేచి కూర్చుండెను. విఘ్నేశుని రమ్మని పిలిచినది. ఆ పసిగందామె కౌఁగిటఁ జేరినట్లైనది. ఆమె యాతని ముద్దాడినది. వేయి మందా కిను లామె దేహమునఁ జలువలు ముంచెత్తినవి. వేయి యమృతభాండము లామె హృదయమునఁ బొంగి పొరలినవి. ఆమె బాయాంబయైనది;

"ఈ రూప మెవ్వరిది? తాను నెలలతరబడి యెవరి రాక కొఱకై వేచి యుండి పడిగాపులు గాచెనో యా దేవుని దివ్యస్వరూపమా? ఎంత కోమలమైనది? రమ్మని పిలువఁగనే క్రొత్త చేయక చెంతఁజేరె నాదేవుఁడు! ఈతఁ డెంత దయామయుఁడు? ఎంత భక్తవత్సలుఁడు?" బాయాంబ కానందము పాలసంద్రమైనది. అవధి దాఁటి ఆశాంతము వ్యాపించినది. దానిలో దేవుఁడు బాలుఁడై తేలియాడి పటపత్రశాయియైనాఁడు. ఆతనిఁ గాంచి మఱల బాయాంబ సొమ్మసిల్లినది.

లోకము కన్ను తెఱచినది. భానూదయముతో వేంకటపతిదేవ మహారాయలకుఁ బుత్రోదయమైనదను వార్త చంద్రగిరి నగరము నలుమూలల వ్యాపించినది. ప్రజలు గట్లు తెగిన యేరులవలె రాచనగరు చొరఁబడిరి. వారి సంతోషమునకు మేరలేదు. ప్రజారంజకుఁడగు వేంకటపతిరాయల వంశవృక్షము చిగురించిన దనఁగనే వారి హృదయముల వసంతము మోసులెత్తినది. ఆ మధుర క్షణమునకై దేశము కొన్ని వత్సరముల తరబడి కన్నులలో వత్తులు పెట్టుకొని కాచుకొనియున్నది. ఆ సమయము నాఁడాసన్నమైనది. వారి కొడలు పరవశమైనది. వారవ్యక్తముగా గొంతెత్తి పాడఁదొడఁగిరి, ఆడఁదొడఁగిరి.

జక్కులు కురువంజులను యక్షగానములను బాడుచు నాడఁదొడఁగిరి. ఒకవైపు శ్రీకృష్ణజననము, మఱియొకవైపు శ్రీరామజననము, మఱియొకవైపు వామనావతారము, మఱియొకచోట కూచిపూడినుంచి వచ్చిన సిద్ధేంద్రయోగి శిష్యుల భాగవతము, వేశ్యాబృంద మొక్కచోఁజేరి 'చొక్కంపు మురుగులు, చిక్కణీలు' పాదకటకములు కదలుచుండ కోలాట మారంభించిరి. మందాకిని నుండి రాయంచలు దిగివచ్చి గొబ్బినృత్యము చేయుచున్న వనిపించెను. జానపద స్త్రీలు వలయాకారముగాఁ దీరి చప్పట్లు చఱచుచు గొబ్బిపాటలు, జోలపాటలు, హారతులు, ఏలపాటలు, జాజరపాటలు, ఆనంద గీతములు గొంతెత్తి పాడఁదొడఁగిరి. బ్రహ్మకు బాఠముఁ జెప్పనేర్చిన విప్రశ్రేష్ఠులొక్కచోఁగూడి చతుర్వేదములు పఠించుచుండిరి. వీర భటులొక్కయెడ కత్తులతో సాము లొనరించుచుఁ దమ వీరావతారములను ప్రదర్శించుచుండిరి. ఇంతలో రాచనగరునుండి సీమంత కుండములు తేఁబడెను. వెదురుకఱ్ఱతోఁ జేయఁబడిన శృంగములు వసంతోత్సవమునకు సిద్ధము చేయఁబడినవి. పన్నీరు, శ్రీగంధము, చందన తైలము, సిందూరము, పుప్పొడి, సున్నితమైన వర్ణచూర్ణములు పాత్రలకెత్తి ప్రజల మధ్యకు దేఁబడినవి. మధుమూర్తి ప్రజలకుఁ బ్రత్యక్షమైనట్లయ్యెను. సూర్యుఁడు

తన కోమల హస్తములు చాచి ఆసులపు రాగమూర్తుల నొసఁగెను. హోలికుల యుత్సాహ మతిశయించెను. సుగంధ ద్రవ్యములను పిచ్చిలపిచి నొకరిపై నొకరు వెదఁజల్లుకొన నారంభించిరి. బాలలనియు, వృద్ధులనియు, స్త్రీలనియు, పురుషులనియు భేదము కానఁబడుటలేదు. అందఱును ద్రివర్ణమూర్తు లయిరి. వారుపయోగించు సుగంధ తైలములు ధారారూపమున మింటికెగయుచు వసంతునికి మంగళ నీరాజనము పట్టినట్లగుచుండెను. రాచనగ రాదిన మెన్ని సంవత్సరముల నుండియో వసంతవియోగమునఁ బరితపించి, యాతని పునర్దర్శనము కాఁగా నాతనిని వేయిచేతులతోఁ గౌఁగిలించినట్లు కనిపించెను. ఆతని కొఱకు నూతనాలంకారములు ధరించి పుత్తడి బొమ్మయైఁ మురిపెముఁ జూపుచున్నట్లు గోచరించెను. కర్ణాటక సామ్రాజ్యలక్ష్మి క్రొత్త పెండ్లికుమార్తె సోయగము వహించెను. ఆనాఁడు రాజనగర ప్రాంగణము కాలపురుషుఁడను చిత్రకారుఁ డేదియో వర్ణచిత్రమునకై రంగులు సిద్ధము చేసికొనిన ఫలకముగా మూర్తీభవించెను.

ఇంతలో నచ్చటి జనమున నిశ్శబ్దము వ్యాపించినది. చీమ చిటుకుమనుట లేదు. అందఱికన్నులు నెవరికొఱకో వేచియున్నట్లగుపించెను. ప్రజలు మోము లెత్తి రాజప్రాసాదపు మూఁడవ యంతస్తువైపు చూచుచు నిలుచుండిరి. సమున్నతమైన రాజప్రాసాదము వారికి మేరుపర్వతమువలె గోచరించెను. మూఁడవ యంతస్తునందర్ధ చంద్రాకారముగా ముందుకు వచ్చియున్న యొక మంటపము గలదు. దానియందప్పుడే యగ్గరాయలు ప్రవేశించి యొకతూరి చేయెత్తెను. దానితోఁ బ్రజలు శాసనబద్ధులైరి. మహారాజుల ప్రవేశమును సూచించునట్లు వందిమాగధులు బిరుదములు పఠించిరి. వేంకటపతిదేవ మహారాయలు ప్రజలకు దర్శనమిచ్చెను. జయజయధ్వానములు భూ నభోంతరాళము నిండెను మహారాయలా మందిర మధ్యమున మహోన్నతాసనమునఁ గూరుచుండెను. మహారాజ్ఞి కొండాంబ పట్టుపొత్తిళ్ళలో నొక బంగారు మొలక తెచ్చి యాతని హస్తముల నుంచెను. లోక మాదృశ్యముఁజూచి యానంద పులకితమయ్యెను. జనులు భావి సామ్రాజ్య నిర్వహణ ధౌరేయుఁడగు నా పసిగందును కన్నులారఁ గాంచుటకై త్రొక్కిసలాడుచుండిరి. మంగళవాద్యములు మ్రోయ మొదలిడెను. రాజ పురోహితుడు సముచ్చైస్స్వరముతో వేదపఠనము గావించి శిశువును, రాజ దంపతులను ఆశీర్వదించెను. అతనికి రాజు గురుదక్షిణ నిచ్చెను. దండనాథు లింతలో రాచనగరునుండి వస్త్రాలంకార సముదాయములను దెప్పించి ప్రజలకందఱకుఁ బంచిపెట్టుచుండిరి. ప్రజలు వానిని గొని సంతుష్టాంతరంగులై హృదయ పూర్వకముగ రాజవంశమును దీవించిరి.

# రెండవ ప్రకరణము

తాళికోట యుద్ధానంతరము విజయనగర సామ్రాజ్య లక్ష్మి తన వైభవముఁ గోల్పోయినది. పరరాజుల చేతులలోఁబడి పలు యాతనల ననుభవించినది. ఆర్వీటివంశ రాజు లామె యొక్క పూర్వ వైభవమును బరిపోషింపవలయునని శక్తివంచన లేకుండ యత్నించిరి. కాని, కాలపురుషుని కఠిన శాసనమందులకు సమ్మతించినదికాదు. పాతాళమునకు జాఱి పడఁబోవుచున్న కర్ణాటక రాజ్యలక్ష్మికిఁ జేయూఁతనిచ్చి నిలిపినాఁడు తిరుమలరాయలు. తానతి వృద్ధుఁడగుటచే నతఁడు త్రిమూర్తులవలె తనయింట వెలసిన తన మువ్వురు పుత్రుల నామెను రక్షించుటకు నియోగించెను. పెద్దవాఁడగు మొదటి శ్రీరంగరాయలు పెనుగొండ కేంద్రముగా తెలుఁగునాఁటిని శాసించెను. రెండవ వాఁడగు రామరాయలు శ్రీరంగపట్టణము రాజధానిగా కన్నడ ప్రాంతమును పాలించెను. మూఁడవ కుమారుఁడగు వేంకటపతిరాయలు చంద్రగిరినుండి ద్రావిడ దేశము నేలెను. తిరుమలరాయ లుత్తరమున పెట్టనికోటగా నిలిచెను. కాని, రెండు సంవత్సరములు తిరుగుసరికి తిరుమలరాయలు దివంగతుడయ్యెను. ఆతని తరువాత శ్రీరంగరాయలు సింహాసన మధిష్ఠించెను. కాని, శ్రీరంగ రాయలకును రామరాయలకును కాలము కలిసిరాలేదు. పన్నెండు సంవత్సరముల రంగ రాయల పరిపాలనము బిజాపూర్, గోల్కొండ సుల్తానులతోను, కన్నడ సామంతులతోడను యుద్ధములు సలుపుటతో సరిపోయినది. పర్యవసానము ఫలవంతముగా లేకపోవుట యటుండ కొండవీడు, ఉదయగిరి, బెల్లంకొండ, మైసూరు దుర్గములు వీరి చేతినుండి జాఱిపోయినవి.

శ్రీరంగరాయలు తనువు చాలించుసరికి రాజ్య మల్లకల్లోలముగ నుండెను. ఎచ్చటఁ గాంచినను తురుష్కుల దండయాత్రలకు ఫలితముగ చిందరవందరై పోయిన గ్రామ సముదాయములే; వ్యవసాయ సదుపాయములు లేక బీడులు గట్టిన సేద్యపు భూములే. నాఁడు ప్రజా సమూహ మొక దుర్భర జీవయాత్ర నడుపుచుండెను. దీనికిఁదోడు సామంతుల స్వాతంత్ర్యాభిలాష పరిస్థితులను మఱింత క్షీణదశకుఁ దెచ్చినది. కండగలవాఁడు నాయకుఁడు. వాని క్రింద కొంత ప్రదేశము, దాని కతఁడు స్వతంత్ర ప్రభువు. ఒకరిని మించి మఱియొకరు రాజ్యవిస్తీర్ణమును పెంచవలయునని కాంక్షించుచుండిరి. సార్వభౌమత్వము వెలయింపవలెననెడి యాశ సర్వసాధారణము.

ఇవి యన్నియు నేకముఖముగా విజృంభించి యాంధ్ర సామ్రాజ్యమున నైక్యమున మ్రింగివేసినవి. పరస్పర విరోధములు కారణముగా దేశమున ఈర్ష్యా దావాగ్ని పెచ్చు పెరిగినది, అట్టి పరిస్థితులందు సమర్థుఁడైన రాజ చంద్రుని అండకొఱకు కర్ణాటక దేశము తపస్సు చేసినది. శ్రీరంగరాయ లనపత్యుఁడు. రామరాయలు సమర్థుఁడు కాఁడు, అతని తనయులగు తిరుమల రాయలు, చిక్కరాయలు నల్పవయస్కులు. వీరెవ్వరును కల్లోలితమగు రాజకీయ మహాసముద్రమును కడముట్ట నీఁదలేరు. దానికి సమర్థుఁడు వేంకటపతి రాయ లొక్కఁడే. అతఁ డొక్కఁడే ద్రవిడ దేశ సామంతగజముల నొక్క యంకుశమున నడపఁగలిగి కీర్తివహించిన ధీరుఁడు. తురుష్క చమూసందోహ దారుణాఘాతములకు సొమ్మసిల్లిన రాజ్యలక్ష్మిని సేదతీర్చి కైదండ నొసంగఁ గల్గిన వీరుఁడు. ఈర్ష్యాస్వాతంత్ర్య మత్తచిత్తులైన సామంత కిశోరముల నొక్క త్రాట నడిపింపఁగల్గిన యోధుఁడు. అతనిని కర్ణాటక సామ్రాజ్యలక్ష్మి వరించి నది. తత్ఫలితముగా పార్థివ (శాలివాహన శకమున 1507 వ సంవత్సరము) నామ సంవత్సర మాఘశుద్ధ ఏకాదశినాడు (21 జనవరి 1586) పెనుగొండలో వేంకటపతి మహారాయలు మూర్ధాభిషిక్తుఁడయ్యెను.

వేంకటపతిరాయ లెంత పండితుఁడో యంత రాజనీతిజ్ఞుఁడు. ఎంత పరాక్రమవంతుఁడో యంత యుద్ధ శాస్త్ర పారంగతుఁడు. ఎంత సమర్థుఁడో యంత ప్రజారంజకుఁడు. అట్లగుటచే నాతఁ డిరువది యెనిమిది సంవత్సరము లేకచ్ఛత్రాధిపత్యమును వహించి ప్రచండుఁడై వెలుఁగఁగలిగెను. గోలకొండ నవాబు పీచమడఁచి కృష్ణానదిని దాఁటునట్లు తఱిమి తన యశ్వముల నా పవిత్ర నదీమతల్లి యొసంగు వయస్సులఁ దనివితీరఁ ద్రాఁగునట్లొనర్చెను. తమిళ సామంతుల తిరుగుబాటు శాశ్వతముగా నణఁచివేసెను. దేశమును నిష్కంటక మొనర్చెను. సామంత ప్రభువులకు సింహస్వప్నమయ్యెను అందఱి నొక్కట సమైక్యపఱచి సర్వ సామంతమండల రూపమైన యొక మహత్తరాభేద్య దుర్గ మును స్థాపించెను. వేంకటరాయ సేనానుల భుజాసంరంభము విన్న శత్రు రాజుల గుండెలు దద్దరిల్లఁదొడంగెను. అతఁ డపూర్వ సామ్రాజ్య సమైక్య నిర్మాత యని కీర్తి వహించెను. సద్గుణములచే నతడు తన జనులు తన పూర్వి కుల మఱచునట్లొనరించెను. అతఁ డంతటితో నాగక ప్రజాక్షేమమున కెంతయో కృషి యొనర్చెను. దేశమున వృత్తులను, ఆర్థికవ్యవస్థను, సాహిత్య కళాభివృద్ధిని,

వ్యవసాయమును సభివృద్ధిచేసెను. ఏతత్ఫలితముగా నతడు లోకమునఁ జిరంతనమైన కీర్తి సముపార్జించెను.

రాయలకు మహారాజ్యభార మొకయెత్తు, ఆత్మసామ్రాజ్యభార మొక యెత్తు. దేశము సుభిక్షమై శాంతియుతముగా నున్నను అతని హృదయమున శాంతిలేదు. తనకు వయోగుణ రూపలావణ్యములం దనురూపమైన మహారాజ్ఞి కొండాంబకు సంతానము లేదు. వారు రాజభోగముల వలన నెంత సంతుష్టి వహింప యత్నించినను వారి డెందముల నీ దురదృష్టము శల్యమై బాధింపఁ దొడఁగెను. కొండాంబకు బాయాంబయను నొక చెల్లెలు కలదు. వారిద్దఱికి శరీరములు వేఱైనను ఆత్మ లొక్కటే. ఒకరిని విడిచి యొక రుండలేనివారు. కొండాంబ కత్తగారింట నొక్కటె యుండుట కష్టమనిపించినది. తండ్రియగు గొబ్బూరి ఓబరాజు నొప్పించి సోదరిని దన యొద్దనే యుండునట్లేర్పాటు గావించుకొనినది. చిన్ననాఁటి నుండియు బాయాంబ సోదరియొద్దనే యుండుటచే నామెకును కొండాంబకును పీడలేనంత యనురాగ మేర్పడెను. బాయాంబ యుక్తవయస్కురా లయ్యెను. ఓబరాజామెకు వివాహ యత్న మొనరించు చుండెను. కొండాంబకు వయసు ముదురుచున్నది. ఇఁక సంతానము కలుగు నన్న యాశ క్రమముగా నంతర్ధానమగుచున్నది. అందువలనే కొండాంబ తానే వేంకటపతి రాయలకు తన సోదరియగు బాయాంబను సమర్పించుట యుక్తమని భావించినది. చెల్లెలివలననైన తన వంశము నిలుచునని యాశించినది. అట్లని రాయలకు ప్రార్థించినది. రాయలు మొదట సంగీకరింప లేదు. కొండాంబాబద్ధ మనస్కుఁ డాతఁడు. తన హృదయము మఱియొకరి కంకితము చేయలేననినాఁడు. కాని, కొండాంబ తనకొఱకు, తన వంశము కొఱకు, తన రాజ్యముకొఱకు, తన పరలోక గతులకొఱకు, మఱియొక భార్యను స్వీకరించి, పుత్త్రిలబడయుట మంచిదని పట్టుపట్టినది. బాయాంబ యందు తన యాత్మ భాసించునని రాజునకు నచ్చఁజెప్పినది. ఆమెను చేపట్టినచోఁ దానే యాతనియందు మఱొక జన్మమెత్తి నిలిచినట్లగునని బోధించినది. రాయల హృదయ మందుల కంగీకరించినది. బాయాంబ రాయల రాణియైనది. ఆతని హృదయము నాకర్షించినది. అతని కపూర్వ నూతన సౌఖ్యము లొసంగినది. ఆతఁడామెయందు నూతన తేజము వహించెను. ఆమె యాతని [illegible] పది సంవత్సరములు గడిచినవి. [illegible]

పండలేదు. రాయల శరీర దార్ఢ్యము సడలుచున్నది. బాయాంబ మేన కోరికలారుచున్నవి. కాని, పుత్త్రి సంతానాకాంక్ష హృదయమును దహించుచున్నది.

పుత్త్రోదయ మైనదని విన్న వేంకటపతిరాయల కదృష్టభానుఁ డుదయించినట్లనిపించెను. తనదికాదని వదలుకొనిన సిరి యెద్దియో తన చేతి కందినట్లైనది. అంధకారావృతమైన తన భావి జీవితమున నొక వెలుఁగుబాట వెలసినట్లైనది. వేయి రేకులు వాడిపోవుచున్న హృదయకమలమున కెద్దియో నూతన వసంత మనుభూతమైనది. అతఁ డాస్థితియం దెట్లుండవలెనో యాతనికి బోధపడినది కాదు. మొట్టమొదటిసారి కొండాంబ పసిబాలుని తన చేతులలో నుంచిన క్షణమున తానున్న యవస్థ నొక్కసారి రా జూహించుకొనెను. శరీరము పులకించెను. అట్లే యా భావముననే, యా యనుభూతిలోనే జన్మాంతరమువఱకు నిలిచిపోదమని యాతని కనిపించెను. హంసతూలికా తల్పమునుండి దిగ్గున లేచెను. ఒంటరిగా రాజప్రాసాదము దిగెను. పాదచారియై బాయాంబ భవనమువైపు నడువ నారంభించెను.

రాచనగరులోని గడియారము 15 గడియలు కొట్టెను. ఆకసమున నులిమబ్బు వ్యాపించియుండుటచే మూఁగ వెన్నెల కాయుచుండెను. లోకము నిద్రాదేవి వెచ్చని కౌఁగిలిలో గుఱ్ఱుపెట్టుచుండెను. అచ్చటచ్చట రాజభటుల పహరా శబ్దములుతప్ప రాచనగరున నెట్టి యలికిడియు వినఁబడుటలేదు. అంతకొక గడియకు పూర్వమే వేంకటపతిరాయలు సామంతయోధ మహామండలి సమావేశమునఁ బాల్గొనియుండెను. రాజ్యమునందలి నిర్మాణాత్మక శాంతి కార్యముల గూర్చి చాలసేపు చర్చలు నడిపియుండెను. అతఁడే విషయము గైకొనిన నా విషయమందు హృదయ మప్పగించి యాలోచించును. దానిని కూలంకషముగ విచారించిగాని విశ్రాంతిగొనఁడు. అతని యా పట్టుదలయే పెక్కు సామంత యోధుల కాదర్శప్రాయమై పూజనీయత నంది యున్నది.

అంగరక్షకులు కొందఱు మహారాజు ననుసరింప నుంకించిరి. కాని రాజు బాయాంబా రాజ్ఞిగారి యంతఃపురమునకు వెళ్ళుచున్నారని గ్రహించి ముఖద్వారము నొద్దనే యాగిపోయిరి. ఆ కాలమున రాజున కొక ప్రత్యేక భవనము, రాణులకొక్కొక్కరికి కొక్కొక్క యంతఃపురమును నుండుట యాచారము. కాని, యవి యన్నియు బలిష్ఠమగు నొక రాతి ప్రాకారముచే

పరివేష్టింపఁబడియుండును. అందే ప్రతి భవనమునకు ఉద్యాన వనములు, జలయంత్రములు, విహార భూములు, క్రీడా ప్రదేశములు, చంద్రశాలలు, సరోవరములు, కృతకాద్రులు, పరిచారికా బృందము వేర్వేఱుగా నియమింపఁబడియుండును. ఒక్కొక్క భవన మొక్కొక్క చిన్ని రాష్ట్రముగా భాసించును. అంతిపురములందెల్ల నందందు నివసించు రాణుల మనస్తత్వముల ననుసరించి విధి నియమములు మాఱుచుండును. అందు ప్రవేశించుట, అందలి వార్తలు తెలిసికొనుట, అందు వసించుట ప్రత్యేకాచార బద్ధములై రాజమర్యాదలను పుణికి పుచ్చుకొనుచుండును. ఒక్కొక్క రాజభవన మొక్కొక్క వ్యావహారిక విజ్ఞాన సర్వస్వము.

రాజునకు దినచర్య నియమబద్ధము. తొలికోడి కూసినది మొదలు రాత్రి రెండు జాముల వఱకు నతఁడు రాజకార్య నిర్వాహణమునందు నిమగ్నుఁడయి యుండవలెను. మధ్యాహ్న సమయములందు భోజనాదులకు రెండు ఘడియల కాలము విశ్రాంతి దొరకును. బంధుజనులతోడను, ఆత్మీయులతోడను రాజా సమయమున విందారగించును. తరువాత నాతఁడు రాత్రిగాని యూపిరి పీల్చుకొనలేఁడు. ఈ విధముగా నాఁటి రాజులు తమ జీవితములను ప్రజల కంకితమొనర్చి ప్రజాసేవకులైరి. వారి స్వవిషయములను, వినోద విశేషములను జూచుకొనుటకు రాత్రి భోజనానంతరమునగాని వీలుపడదు. వేంకటపతిరాయలు పుత్త్రోదయానంతరము ప్రతిదినము మధ్యాహ్నమున బాయాంబ గృహమున విందారగించుచుండెను. రాణి బాలెంత యగుటచే నామె రాజుగారితో భుజించుట లేదు. ఆమెకు పథ్యపానాదులు ప్రత్యేకముగా నడచుచుండెను. ఆమె స్థానమున మహారాజ్ఞి కొండాంబ యాతనిచెంత భుజించుచుండెడిది. అతనితోఁ గలసి యుండెడిది. అందుచే రాయలకు బాయాంబను మనసారఁ బలుకరించుటకుఁగాని, బాలెంత సోయగము నరయుటకుఁగాని తగిన యవకాశము, లభింపకపోయెను. అది యాతని హృదయమునం దొకమూల తీఱని కోరికయై వేధించుచుండెను. ఈ రోజాతని కెంతయో యుత్సాహముగ నున్నది. ఆతని హృదయము బాయాంబా మాతృమూర్తి గతమైన భావనా పరంపరతో నిండిపోయెను. బాయాంబ బాలు నెత్తుకొని తనముందు నిలువఁబడినచో ఫలభారమున వంగిన తీగవలె మెఱయును. ఆమెకుఁ దన వరము నందించి తాను 'సహకార' బిరుదము ధరించును. ఆ పసికూన చిన్నిమేనులో బాయాంబ యెందఱు దాతృష్ణుల

వీక్షింపఁ గల్గుచున్నదో, అవ్యక్త మధురమైన యా బోసినవ్వుల సింగారములో బాయాంబ యెన్ని జగత్తులను దర్శించుచున్నదో, ఆహా! స్త్రీ జన్మకు పుత్రోదయ మొక్కఁ పుణ్య పర్వోదయము కదా!

రాయ లేడు గవాక్షములు దాఁటెను. మఱొక యంతస్తు నధిరోహించెను. అందైదు మందిరములను దాఁటెను. రాయలు బాయాంబ శయనించియుండు మందిరము సమీపించెను. పుత్త్రోదయానంతరము రాయలు బాయాంబ భవనమునకు విచ్చేయుట కదియే ప్రథమము. చెలులు రాజుగారు ప్రవేశించుచున్నారని యుత్కంఠ వహించిరి. రాణిగారి కెఱింగింప నుద్యుక్తులైరి కాని, వేంకటపతిరాయలు వారిని జేతిప్రేలితో వారించెను. వారు కిమ్మనకుండఁ బ్రక్కకుఁ దొలఁగి యూరకుండిరి. మందిర ద్వారములు మూయఁబడి యున్నవి. చెలులెవ్వరు నా ప్రాంతమున లేరు. రాజున కాశ్చర్యము కలిగెను. రాణి మందిర మొక్కటియు ప్రత్యేకమగు నంతస్తునందున్నది. అందు విహరించుట కారుబయలు, విశ్రాంతిఁ గొనుటకు మణిమయాసనములు అమర్పఁబడి యుండెను. రాయలా విశాల ప్రదేశమున నున్న యొక్క యాసనముపైఁ గూర్చుండెను. బాయాంబ రాయలకు సుపరిచితయు, గృహిణియు నైనను ఆనాఁ డాతని కెందులకో యామె చెంతఁ జేరుటకు కొంత క్రొత్త యగుచున్నది. హృదయమునం దారాటముగ నుండెను. కొంచెము గాలి పీల్చికొనినఁగాని శరీరము కుదుటపడునట్లు లేదు. అందుకై యాతఁడు కూర్చుండి యిట్లు తలపోసెను: "బాయాంబ లోపల శయనించి యున్నది. మందిరద్వారము బంధింపఁబడి యున్నది. ఆమెను గాంచవలయునన్న ముందామెను నిద్రనుండి లేపవలయును. ఆమెకు నిద్రాభంగము కావచ్చును. ఆమెమాట యటుంచి యా పసికందు నిద్రలో నులికిపడి యేడ్వవచ్చును. ఆతని నుపశమింపఁజేయుట తరువాత దుర్లభమగునేమో! ఎట్లగును? దాసీజనులు పెక్కురుగల రాతని నోదార్చి యూరడించుటకు. కాని యీ రాణిమందిరము చెంత నెవ్వరును చెలులు లేరు. రాణియొక్కతెయు నంత నిశీథమున నొంటిగ నుండుకొని యుండునా? దాసీజనులను దగినట్లు శిక్షింపవలెను."

ఇంతలో బాయాంబ మందిరమున శిశువేడ్వ నారంభించెను. ఆతని గుండె కొట్టుకొన నారంభించెను. శిశువు గ్రుక్కపట్టెను. రాజుక్కిరిబిక్కిరయ్యెను. శిశువు గాఢముగా నేడ్చుచుండెను. రాజు బాధపడుచుండెను. ఆ శిశువునకుఁ

వనకు నేమి సంబంధము? ఎందులకీ హృదయ స్పందనము? ఆతని కాలో చించుటకుఁ దోఁచినదికాదు. తోడనే యాతఁడా మందిరద్వారము సమీపించెను. ముఖద్వారమునకుఁ గుడిచేతివైపునఁ బది యడుగుల దూరమున నొక వాతాయనము గలదు. దానినుండి శిశుకంఠము పరిస్ఫుటముగా వినవచ్చుచుండెను. అప్రయత్నముగా నా నా ప్రాంతమునకు రాజు నడచి పోయెను. అందుండి లోపలికి చూచెను. తా నెప్పుడు నట్టిపని చేసియుండలేదు. కాని, యౌచిత్యానౌచిత్యములఁ బాటించు విచక్షణత యాతనియం దిప్పుడు లేదు. ఆతఁడు చూచుచుండెను. బాయాంబ నిశ్చింతగా నిద్రించుచుండెను. రాజు దినమును జూచు వేషమున లేదామె. ఆమె యాతఁ డూహించుకొన్న బాలెంతకాదు, పూర్వపు బాయాంబయే! శిశువామె ప్రక్కలో నుండెను. ఆమె వెనుదిరిగి పరుండి యుండెను. శిశు వేడ్చుచుండెను. ఆమె చలింపకుండెను. ఆ దృశ్యము గాంచి రాజు సందేహింపలేకపోయెను. అమ్మను నమ్మి జీవించు ప్రాణి యా శిశువు. ఆమె తన రోదనము విననిచో నా బాలుని గతి యేమి కావలయును? అయినను మాతృ హృదయ మాతనియెడ నంతనిర్లక్ష్యముగ, నిర్దాక్షిణ్యముగ నుండునా? అట్లున్నచో నా వనిత స్త్రీ యనిపించుకొనునా? శిశువును ప్రాణతుల్యముగాఁ గాపాడని యమ్మకన్న పాషాణమై పడియుండు బొమ్మయే మేలు.

ఇంతలో రాయల కన్నులు చెదరినవి. ఆ మందిరము నుండి జలక్రీడా విహారమునకు భూగర్భ గృహమున నిర్మింపఁబడియున్న సరోవరమునకుఁబోవు ద్వార మొండుగలదు. అది నెమ్మదిగా తెఱువఁబడినది. రాజప్రమత్తుఁడై కత్తిపై చేయియుంచెను. కాని, చేయి యంతలో నాగిపోయినది. ఆ రహస్య ద్వారము నుండి యొక స్త్రీమూర్తి ప్రవేశించినది. ఆమె సన్నవిమేను చాల శుష్కించి యుండెను. తెల్లనిచీర, నడుముకట్టు, తలపై ముసుఁగు, చెవులలో చిన్న యుల్లి పొరలు పొదివిన దూడె, నోట నెఱ్ఱగా పండిన తాంబూల రేఖ కలిగియుండెను. ఆమె యెవ్వియో యగోచరములగు ప్రేమపాశములచే లాగఁబడుదానివలె ముందుకుఁ ద్రోసికొనివచ్చెను. బాయాంబ పార్శ్వమున శయనించియున్న బాలుని నా వనిత యాప్యాయముగాఁ జేతికిఁ గైకొనినది. వాత్సల్యము మూటగట్టి నాతని మోముపై ముద్దిడినది. బాలుఁ డేడ్పు మానలేదు. మందిరమున నొక పార్శ్వమునందున్న యాసనముపైఁ గూర్చుండి యామె బాలునికి స్తన్యమిచ్చినది. ఆతఁడు తన్మయుఁడై మజల నిదురించెను. ఆమె నేత్రము లశ్రుపూరితము

లయ్యెను. ఆమె యా బాలుని కన్నులు చేరెడంతచేసి చూచుచుండెను. ఆమె యశ్రుబిందువు లాబాలుని మూర్ధము నభిషేకించుచున్నవి.

"తండ్రీ! ఈ నిర్భాగ్యురాలు నిన్ను నవమాసములు మోసి, పెంచినను నీచే 'అమ్మా!' యని పిలిపించుకొనఁజాలకపోయినది. నీవంటి బంగారు తండ్రిని పరులయింట నుంచిన యీ నీచురాలి కదియే తగినశిక్ష!" అని యా వనిత శిశువును మోమునఁజేర్చి శోకింపఁ దొడఁగెను. బాలుని పొత్తిళ్ళామె కంటినీటితో ముద్దయైనవి. బాలుఁ డామె యెదయందు ముకుళించుకొని పవ్వళించెను. ఆమె దీర్ఘ నిశ్వాసము వదలెను. ఆతనిని గాఢముగాఁ గౌఁగిలించుకొనెను. ఆమె కన్నులు మూఁతపడిపోయినవి. ఆమె మోము నించుక పైకెత్తెను. రెండశ్రు కణము లా బాలునిపై రాలినవి. ఆమె కన్నులలో నవ్యక్త మగు వెలుఁగొకటి వకాశించెను. త్యాగశీలమెద్దియో యామె ఫాలమున మెఱసెను.

"పుత్రా! నీవు సర్వంసహా చక్రవర్తివై కొలువుతీరిచియుండఁగా జూచు భాగ్య మీ కన్నుల కున్నదో లేదో!.... కాని, అనాఁడును నేనమ్మను కాదుగా తండ్రీ!" అని యామె మఱల బాపురుమన్నది. బాలుఁడు తన కోమలహస్తము నామె చుబుకముపై నుంచెను. ఆమె యాచేతిని ముద్దిడి చందన శీతలత్వము ననుభవించినది.

ఇంతలో బాయాంబ కదలినట్లైనది. ఆ స్త్రీ యులికిపడినది. త్వరగాఁ గన్నులొత్తుకొని గాంభీర్యము వహించి బాలుని నామె ప్రక్కలోఁ బరుండఁ బట్టినది. ఆతని వీడలేక వీడలేక, వెనుకకుఁ జూచుచు, ముఖమున వస్త్రమిడుకొని శోకించుచు మఱల నా రహస్యద్వారమున నిష్క్రమించినది. బాయాంబ కివి యన్నియుఁ దెలియవు. ఆమె శిశువువైపు మఱలి పరుండెను. ఆమె ముఖమున నా నూతన వనితయందున్నంత మాతృభావము రాజునకు స్ఫురింపలేదు. పైఁగా 'నేను కోరుకొన్నది లభించినది, దిగులేమి?" యను అహంకార మామె యందు గోచరించినది.

రాజునకు తన పాదములక్రింద భూమి తిరిగినట్లయ్యెను. కల గను చున్నట్లనిపించెను. పంచాగ్ని మధ్యమున నిలిచినట్లుండెను. అతఁడు నిలువలేక గ్రక్కున మఱలి తన భవనమునకు చరచర నడచిపోయెను.

రాజిట్లు వితర్కించుకొనెను: "అతఁడు బాయాంబ కుమారుఁడు కాఁడు. ఆమె నన్ను మోసగించినది. అట్లుగానిచో పుత్రవ్యామోహమున నాటకమాడినది. దీని కామె యొక్కతెయే బాధ్యురాలు గాఁజాలదు. కొండాంబకు, జగ్గరాయల కును ఇందు భాగమున్నది. అందఱు కలిసి యీ గూఢతంత్రమును నడపి యుందురు. బాయాంబ గర్భవతియైనది మొదలు వ్రతదీక్ష పూనినది. పుత్త్రోదయ మగునంతవఱకు భర్త ముఖముఁ జూడకూడదని నియమము వహించినది. ఇట్టి నియమవ్రత మింతవఱ కెన్నఁడు వినలేదు. కాని, యామెయందలి యధిక వ్యామోహమున దానిని సమ్మతిని. జగ్గరాయలకుమాత్ర మంతఃపురమునఁ బ్రవేశమున్నది. సోదరుఁ డొక్కఁడుమాత్ర మామెను గాంచవచ్చునఁట! ఎంత విచిత్రమైన నియమము? దీని నిప్పుడు నిశితముగాఁ బరిశీలించి చూచినచో నేదియో రహస్యవ్యాపార మిందు నడచినట్లు గోచరించుచున్నది.

"శిశువునకు స్తన్యమిచ్చిన ఆ వనిత యెవ్వరు? తేజమునుబట్టిమాడ నగ్ర కులజ యని తోచుచున్నది. బాయాంబ పుత్రసంతానాకాంక్ష యెంతదూరము తెచ్చినది!

"ఆ బాలుని నాత్మజుఁ డనుటకు వీలులేదు. కాని, యాతని యందింత యనురాగమెందులకు? అది యాపగతమైన బలహీనత. పుత్త్రముఖ దర్శనము నకై హృదయము తప్తమయి యుండుటచే దానియం దేశీతలబిందువు పడినను తాపము నణఁచుచున్నది. అంతియే. ఆతనికిని నాకును రక్తసంబంధము లేదు. కాని, లోకమున నాతఁడు నా పుత్త్రుఁడని వ్యాప్తిచెందెను. నేఁడు కాదనినచో నా వంశగౌరవము నష్టేట మునుఁగును. అట్లని యీతఁడు నా కుమారుఁడనీ యంగీకరించుటే? అటు కాదనుటకు వీలులేదు, ఇటు ఔననుటకన్న గత్యంతరము లేదు."

రాజు రాజప్రాసాదోపరిభాగమున నిలువఁబడి యుండెను. శూన్యాకాశములోనికిఁ జూచుచుండెను. చుక్కలాతనిని వెక్కిరించుచున్నట్లు మినుకు మినుకుమని వెలుఁగుచుండెను చంద్రుఁ డాతనిమోముఁగాంచ నిచ్ఛగింపక యస్తమించెను.

"ఇన్ని సంవత్సరములుగా నీ సామ్రాజ్యమును స్వీయ భుజాపంచమున నిలిపినది చివరకు బ్రాహ్మణబాలున కర్పించుటకా? మత్తేభములవంటి దండ నాథులను సమైక్యపఱచి సామంత వీరులందఱి నిర్మించిన దీ శిశువునకు దానోహ

మనుటకా? తురుష్కుల నదలించి కృష్ణానదీపర్యంతము సువ్యాప్త మొనర్చిన ఈ సామ్రాజ్య మీతనిపాలఁ బడుటకా? అతఁడు నా కాత్మజుఁడు కానప్పు డాతనికి రాజ్య మెట్లు సంక్రమించును? సంక్రమించినచో నది యానువంశిక మెట్లగును? అతఁడు నా వంశజుఁడు కాఁడు. నా తరువాత సింహాసన మధి ష్ఠించుట కర్హుఁడుగాఁడు. అదృష్టముననో దురదృష్టముననో నా కుమారుఁడని ప్రతీతిఁ గాంచెను. దీనినిఁ గాలద్రోసినచో కులగౌరవము, రాణివాసపు గౌరవము, బంధుగౌరవము, ప్రజాగౌరవము నాపట్ల నశించును. రాణుల మనస్సులకు నొప్పి కలుగును. కావున నీ శిశువు వ్యవహారమున పుత్త్రుఁడు మాత్రమే. నా హృదయ మాతనియందు రమించదు. నా సామ్రాజ్యశ్రీ యాతనిని వరించదు."

రాయల కేదియో స్ఫురణకు వచ్చినట్లయ్యెను. వెంటనే ద్వారపాలకునిఁ బిలిచి యాచమనాయనిఁ బిలువనంపెను. ఒక్క క్షణములో యాచమనాయకుఁడు ప్రవేశించెను. ఇంత అర్ధరాత్రమున నెద్ది ముంచుకొనివచ్చెనో యను వార్త మా నాయని మోమున గోచరించెను. రాయలేదియో హృదయవేదనలో నున్న ట్లాతఁడు గ్రహించెను. నాయకుఁడు రాయలకు నమస్కరించి, యాజ్ఞకొఱకు వేచియుండెను. రాజేమియు మాటలాడక యొక్క క్షణముండి నాయనిఁదోడ్కొని యాంతరంగిక సభా భవనమునకు వెడలిపోయెను.

## మూఁడవ ప్రకరణము

**బాయాంబ :** నెలరోజులనుండి చిరంజీవికిఁ బ్రభువుల దర్శనము లేదు.

**వేంకటపతిరాయలు :** చిక్కరాయల పట్టాభిషేక సన్నాహమునందు నిమగ్నుఁడ నగుటచే నొక్క క్షణముగూడ తీఱిక దొరకకున్నది.

**బాయాంబ :** బాయాంబకూడ నీమధ్య మఱపునకు వచ్చినట్లున్నది!

**వేంకట :** అట్లనకు దేవీ! నీవు నా ప్రియతమవు. నా జీవితముకన్న నిన్నెక్కు వగా ప్రేమింతును. కాని, రాజకీయములు కత్తులబోను వంటివి.

**బాయాంబ :** మీ అర్ధాంగికి మీ కష్టములను బంచుకొను నధికారము లేదా?

**వేంకట :** నిన్ను నానుండి వేఱుపఱచినప్పుడు కదా నీవట్లు చింతపడవలసినది? నీవెల్లప్పుడు నా మేని సగభాగమున వసించుచు, నా కష్టసుఖములను సమముగా ననుభవించుచున్నావు.

ఛాయాంబ క్షణము మౌనము వహించెను. చిరంజీవిని రాజు తన హస్తములం దుంచుకొని యుండెను. కాని, యాతఁడా బాలునిఁ జూచుటలేదు. ఎద్దియో తీవ్రమగు నాలోచన యందు వ్యగ్రుఁడై యుండెను. అతని దృగ్రేఖలు నీలాకాశమును బరామర్శించుచుండెను. అతఁ డొక నిర్లిప్త చిత్రునివలె భాసించెను.

ఛాయాం : మహాప్రభూ! ఈ విపరీత మేమి?

వేంకటపతిరాయ లులికిపడి యామెను చూచెను. "దేవి! యేమనుచున్నావు!"

ఛాయాం : నేను మొలకెత్తిన తరువాత గూడ ధాన్య మెరవుగొనుట యెందులకు స్వామీ!

వేంకట : మొలకెత్తినంతమాత్రమున మన కుపయోగము లేదు గనుక.

ఛాయాం : అట్లనుచున్నా రేమి ప్రభూ!

ఛాయాంబ కలవరమందెను. రాజామెను గమనించెను. ఇంచుక చలించి మరల స్థిమితుఁడయ్యెను.

వేంకట : మొలకఁ పెరిగి పెద్దది కావలయును. అది రుచ్యములగు ఫలమీయవలెను. అప్పటికిఁ గదా యది భోగార్హత వహించునది?

ఛాయాం : చక్రవర్తుల యకుంఠిత రక్షణా ధౌరంధర్య మింతఁగా నుండ దాని కేమి భయము?

వేంకట : గురురక్షణ యున్నను ఆత్మ సంస్కారము దోహదము కావలదా?

ఛాయాం : రక్షణ నిచ్చు గురుఁడు శిక్షణ నీయఁజాలఁడా?

వేంకట : జీవికి రక్షణ శిక్షణలకన్న మిన్నయైన పూర్వజన్మ కర్మ పరిపాక మొండు కలదు. అది భాసించిననే దాని జీవి వికసింపఁడు.

ఛాయాం : మీ ఛాయనే మీరిట్లు శంకించుచున్నారా ప్రభూ?

వేంకట : పూర్వజన్మకర్మము బంధుత్వమునుబట్టి మాఱదు దేవీ! సర్వసర్వంసహా చక్రవర్తికన్నను సామాన్యుఁడగు బడుగు బాపని యదృష్ట మొక్కొకతఱి ములుసూపుచుండ వచ్చును.

ఛాయాంబ యదరిపడినది. మోము వెలవెల్లనయ్యెను. ఫాలమున స్వేదము నిలిచినది. రాజామెను గ్రీఁగంట గమనించెను. ఆకసమువంక దృష్టి సారించెను. మఱల భాషణము కొనసాగించెను :

"నిన్న మొన్నటివఱకు నీవు చిరంజీవిని బడయుదువని యనుమానించితివా? ఇదియంతయు దైవమాయ. అతఁడు మహాత్ముఁడై యీ యానందసింధువు నందించెను. నీవు దానిని వహించితివి. బాయాంబా! నిజముగా నీవు చాల ధన్యవు."

బాయాంబ స్తిమితపడెను. పుత్త్రోదయానంతరము రాజునోట నట్టిమాట లామె యెఱుఁగదు. ఆమెకు మఱల గణేశుని జనన నృత్యము జ్ఞాపకమునకు వచ్చెను. ఆమె కన్నుల నీరు నిండెను. రాయల చేతులలోనున్న బాలునిఁ గైకొని యొకసారి ముద్దాడెను. రాయలమోము తిలకించెను. ఆమె ముఖ మప్పుడు స్వాతిచినుకులమధ్య నిలిచియున్న పద్మమై తోఁచెను. వేంకటపతిరాయ లామె చెక్కిళ్ళను స్పృశించెను. ఆమె తన్మయత్వమున గన్నులుమూసెను. ఆమె దీర్ఘనిశ్వాస మొనర్చుచుండెను. బాలుఁ డామెయెదపై నిద్రించుచుండెను.

రాయ లామె ఫాలమును ముద్దాడెను. తన ఆమె శిరము నాతని వక్షమున వ్రాల్చెను ఆతఁ డామెను బిగికౌఁగిటఁ జేర్చెను. ఆతనికి నామెకుమధ్య బాలుఁడు నిద్రించుచుండెను. రాజునకు బాయాంబా పరిష్వంగమున విశేషము గోచరింప లేదు. ఆమెలో మార్పులేదు. ఆమె శృంగారలీలా విలాస మోహనమూర్తియే.

బాలునికి నిద్రాభంగమైనది. కలఁతనిద్రనుండి మేల్కాంచుటచే నాతఁ డేడ్వనారంభించెను. బాయాంబ కలఁత చెందినది. ఆమె కనుకొలుకు లించుక యెఱ్ఱవాఱినవి. రాయల కనతి దూరమున నా బాలునికి స్తన్యమిచ్చుచు గూర్చుండెను. ఆ దృశ్యము గాంచినంతనే యాతని కలనాఁటిరాత్రి కాంచిన మాతృమూర్తి కన్నులయెదుట నిల్చినట్లైనది. కాని, యందలి నిండుదన మిందు లేదు. అందలి వాత్సల్య మిందులేదు. అందలి మాధుర్య మిందులేదు. అందలి చల్లఁదన మిందులేదు. రాయలు కనులొప్పగించి కూర్చుండెను. బాయాంబ బాలుని యూయెలయందుఁ బరుండఁబెట్టినది. రాయలు బాలునియొద్ద కేగెను. బాలుఁడు నిశ్చింతుఁడై నిద్దురపోవుచుండెను. రాయల కాశ్చర్యము వేసినది. "ఈతఁడిద్దఱుతల్లుల బిడ్డ. ఈతని కిద్దఱినుండి వాత్సల్యము లభించుచున్నది. కాని, యీతనికి లోకజ్ఞానమేర్పడుసరికి తల్లి యొక్కతె యగును. అయినను ఇతనియందు రెండు మాతృరక్తము లిమిడియుండును. ఈతని యాత్మ బ్రాహ్మము. తనువు క్షాత్త్రము."

రాయలును, బాయాంబయు శయ్యను జేరిరి. రాయల పాదములను బాయాంబ యొత్తుచుండెను. అతఁడు నిమీలితనేత్రుఁడై పరుండెను. ఆమె కన్నులార నాతనిఁ గాంచెను.

బాయాం:- నాథా! చిరంజీవి నేమిచేయుదురు?

రాయలు కన్నులు తెఱచెను. బాయాంబ గట్టునిండ నీరుపాలు మహానది వలె గోచరించెను. మహా ప్రళయము జీర్ణించుకొన్న ప్రకృతిగా భాసించెను. ఆమె కన్నులలోఁ దీరని యాకాంక్ష యొందు తరఁగలై మెఱయుచుండెను.

రాయలు : ప్రేయసీ! ఎందులకట్లు బేలవగుచున్నావు?

బాయాం : రాజ్యము పరుల హస్తగతమైన తరువాతఁ జిరంజీవికిఁ దగిన యాదరము లభించునా?

రాయలు : ఇందు పరులెవరున్నారు? చిక్కరాయలు మనవాఁడే. మనకీ కుమారుఁ డెట్లో, అతఁడును అట్లే.

బాయాంబ : కాదని నేననుట లేదు. కాని, మీరు దక్షులై రాజ్యచక్రము ద్రిప్పుచుండ నిప్పుడింతటి మార్పున కవసరము లేదని నా భావము.

రాయలు : పొరబడుచున్నావు దేవీ! నాతరము వెళ్ళిపోయినది. సమర్థుఁడైన యువరాజొక డిప్పుడు దేశమున కత్యంతావశ్యకము. ఏ క్షణమున నేముప్పు వచ్చునో తెలియదు కదా!

బాయాం : మీరు సింహాసనమున నుండునంతవఱ కెట్టి ముప్పులును దలచూపలేవు.

రాయలు : దానికి నేను గాదు కారణము : అఖిల సామంత వీరమండలి. దానియం దెంతవఱ కచంచల రాజభక్తి వసించునో అంతవఱకీ సామ్రాజ్యమున కెట్టి మోసమును లేదు.

బాయాం : కాని, ప్రభూ! నా కెందులకో భయమగుచున్నది.

రాయలు : (ఒక్క పెట్టున నవ్వి) అఖిల సామంత వీరమహా మండలి కధ్యక్షుఁడగు జగ్గరాయల సోదరియే యిట్లన్నచో నింక లోకమునకు శరణ్యమే లేదు.

బాయాంబ నివ్వెరపోయినది. రా జామెను గౌఁగిటఁజేర్చెను. ఆ రాత్రి ఘ్రూతఁ డామె గృహమున శయనించెను.

వేంకటపతిరాయలు తనకు వారసునిగాఁ జిక్కరాయల నియమింపఁ దలంచెను. అతనికిఁ బట్టముఁగట్టు విషయమున నాతఁడు మాసము దినముల నుండి వ్యవధి లేక ప్రయత్నములు సలుపుచుండెను. అతఁడు శాసించినచో నెదురాడు వారెవ్వరును లేరు. కాని, యాతని హృదయ మట్లంగీకరింపక ప్రజా సమ్మతిపై నా కార్యమును నిర్వర్తింపఁదలంచెను. మొదట సామంత వీర మహా మండలిచే నీ విషయము నొప్పించవలయును. వా రంగీకరించినచో దేశమంగీక రించినట్లే.

చిక్కరాయలు రామరాయల రెండవ పుత్త్రుఁడు. రామరాయలు మృతి నొందిన తరువాత చిక్కరాయలు వేంకటపతిరాయల నాశ్రయించియుండెను. తిరుమలరాయలు చిక్కరాయల యన్న. అతనికి రాజకీయములందంత పరిచ యము లేదు. కాని, చిక్కరాయల కారంగమున మంచి ప్రవేశము లభించినది. వేంకటపతిరాయలకు చిక్కరాయ లనిన వాత్సల్యము మెండు. అతఁడు చాల వినయ సంపన్నుఁడు, మృదు స్వభావుఁడు, కళాప్రియుఁడు. పై పెచ్చాతఁడు శ్రీరంగరాయల పోలికలు కలిగియుండెను. అతనిని గాంచినపుడెల్ల రాయలకు తన పెద్దన్నగారైన శ్రీరంగరాయలు జ్ఞప్తికి వచ్చుచుండెను. అందువలననే చిక్కరాయలను "శ్రీరంగా" యని పిలుచుట పరిపాటియైనది. పెనుగొండనుండి చంద్రగిరికి రాజధానిని మార్చినప్పుడు రాజు చిక్కరాయలను పెనుగొండ యందే కొంతకాలము పురపాలకునిగా నియమించియుండెను. తదుపరి చంద్ర గిరికిఁ బిలిపించుకొనెను.

రామరాయలు శ్రీరంగ పట్టణమున రాజ్య మొనరించు సమయమున నాతఁ డెట్టి పరిపాలనా చాకచక్యమును జూపలేకపోయెను. అతఁడు రోగగ్రస్తుఁ డగుటచే నాతని ముఖ్య పట్టణమగు శ్రీరంగపట్టణమునే సామంతుల వాడిలోఁ గోలుపోవుట సంభవించెను. అది ప్రధాన కారణముగా శ్రీరంగరాయల తరువాత నాతఁడు పొందవలసిన సింహాసనమును బొందఁజాలకపోయెను. ఆతని కుమారుఁడీ చిక్కరాయలు. ఈతఁడును పౌరుష పరాక్రమాదుల యందంత పేరు వడసినవాఁడుకాఁడు. ఏ యుద్ధములందును బాల్గొనినవాఁడు గాఁడు. గారా బముగ నంతఃపురమునఁ బెరిఁగినవాఁడు. కాని, కళాపిపాసి. సరసుఁడు. మెత్తని హృదయముఁ గలవాఁడు. ఎవరినైనను దనవానిగా నమ్మెడివాఁడు.

సామాన్యముగాఁ బ్రభువు మాఱు సమయమున బ్రతి దేశమునందును గొంత కల్లోలము రేఁగుచుండును. యువరాజు కొందఱ కిష్టుఁడును, మఱి కొందఱ కనిష్టుఁడు నయినప్పుడు సామంతులు మఱియు విజృంభించి పిదైనంత వఱకు స్వతంత్ర రాజ్యములు స్థాపింప యత్నించుచుందురు. వేంకటపతి రాయల యనంతరము చిక్కరాయలు రాజ్యమునకు వచ్చునని నిట్టి పరిస్థితులే చంద్రగిరియం దేర్పడెను. సర్వసామంతవీర మహామండలియు నిందులకు సుముఖత్వము వహించి యుండలేదు. అట్లంగీకరింపని వారిలోఁ బ్రధానులు జగ్గరాయలు, తిమ్మనాయకుడు, మాకరాజు, రావిళ్ళ వెంకయ, చిన్న ఓబ రాయలు ముఖ్యులు. మధురనేలు వీరప, చెంజి ప్రభుపు కృష్ణప, సారమూరు దండనాథుఁడు మున్నగువారీ క్రొత్త యేర్పాట్లను లోలోన గర్హించుచుండిరి. కాని, యవన్నియుఁ బైకి పొక్కుటలేదు.

వేంకటపతిరాయలు చాల చిక్కునఁబడెను. తన కుమారుఁడని చెప్పు కొనుట కానూతన శిశువునం దాతనికి విశ్వాసము లేదు. తన వారసుఁడని ప్రకటింపనున్న చిక్కరాయలపై దేశమునకు హృదయపూర్వకమైన విశ్వాసము లేదు. అనువంశికముగా రాజ్యపాలనము జరుగవలయుననిన చిక్క రాయ రాయలొక్కఁడే రాజార్హుఁడై యున్నాఁడు. అతనిని రాజు జేయుటకన్న గత్యంతరము లేమ. అతనియందు శ్రీరంగరాయల రూపసామ్యమును గాంచుచున్న తనకుఁ గొంత సంతృప్తి కల్గుచున్నది. కావున నెవ్విధమునన్నైన సామంత లోకము నంగీకరింపఁ జేయుటయే ప్రధాన కర్తవ్యము. వారును సామముతో నీ విషయమును సమ్మతించునట్లు లేదు. అట్టియెడఁ దన యధికారము నుపయోగింప వలసి వచ్చుచున్నది. కొందఱు వేంకటరాజుగారి యాజ్ఞచేఁ గట్టుబడి తూష్ణీంభావము వహించుచుండిరి. మొత్తమునకు నూతన వ్యవస్థ కారణముగా నంతకుపూర్వ మేర్పడిన సామంత సమైక్యశక్తి ముక్కలుగా ఛేదింపఁబడు సూచనలు గాననగుచుండెను. రాజట్టిది జరుగకుండ శక్తివంచన లేకుండ యత్నించుచుండెను. అహోరాత్రము లాతఁడా చింతతో క్రుగ్గిపోవుచుండెను. భావగతమైన వార్ధక్యము ననుభవించు చుండెను. దుర్భరమైర యశాంతి హృదయమునఁ జెలరేఁగుచుండెను.

జగ్గరాయ లొకదినము బాయాంబ మందిరమున కరిగెను. బాయాంబా కొండాంబ లొక్కచో నుండిరి. జగ్గరాయలు కొండాంబకు నమస్కరించెను. బాయాంబను బరామర్శించెను.

జగ్గ : అక్కా! మహారాజులు చిపర కిట్లయినా రేమి?

కొండాం : చిరంజీవి దురదృష్టము.

బాయాం : వా రేదియో హృదయమున వేసికొనినారు. దానిపై నింతగా బాధ పడుచున్నట్లు నాకుఁ దోఁచుచున్నది.

జగ్గ : మహామండలి యంగీకారవిషయమై యుండునా?

బాయాం : అంతకన్న నతీతమైన మఱియొండు విషయమేద్దియో వారిని గలవర పెట్టుచున్నట్లు వారి మాటలయందు ధ్వనించు చున్నది.

కొండాం : చిరంజీవి జన్మరహస్య మేమైనఁ దెలియలేదు కదా?

జగ్గ : అసంభవము జగ్గరాయల గొంతులో నూపి రుండువఱకు దేశమున మనకుఁదప్ప మఱెవ్వరికీ విషయము తెలియదు.

బాయాం : వారి మాటలు చాల గూఢముగా నున్నవి. అందర్థములు బహుముఖ ములై నడచుచున్నవి. కాని, మనయం దెట్టి యపోహను వారు ప్రదర్శిం చుట లేదు,

జగ్గ : అర్థము లెట్లున్నను యుంచుకొనిన సట్లు గ్రహింపుము. ఆ విషయమున నెట్టి భయమును లేపనుకొందును.

కొండాం : అయిన చిక్కరాయల పట్టాభిషేకము నిశ్చయమైనట్లేనా?

జగ్గ : అక్కా! దానిపై వానోపవాదములకుఁ దావులేదు. సింహము గర్జించినది. జంతువులు కదలుటకు భయపడుచున్నవి

బాయాం : అట్లని మహారాజునకు విన్నవింపరాదా?

జగ్గ : పిల్లి మెడలో గంటగట్టు ధైర్య మేయెలుక కున్నది?

కొండాం : అయిన, రాజ్య మన్యాక్రాంతము కావలసినదేనా?

జగ్గ : అని విచారించి లాభము లేదు మహారాజ్ఞీ! అనంతర కర్తవ్య మ్మూహిం చుటే ప్రస్తుత కర్తవ్యము.

కొండాం : అనఁగా నీ భావము?

జగ్గ : చిక్కరాయల తరువాతనైనను రాజ్యము చిరంజీవికి దక్కునట్లు చూచుట.

బాయాం : ఈ విషయమై వారిని ప్రస్తావింపఁగా, మహామండలి యధ్యక్షుడు, శ్రీ యన్న జగ్గరాయ లుండఁగా శ్రీకేమి భయమని సెలవిచ్చిరి.

జగ్గ : నిజమే. కాని, చిక్కరాయలు ప్రజాకంటకుఁడైనచోఁ పెకల్ప చిక్కులు వాటిల్లును. వేళ్ళు పాతిన మహావృక్షమును పెకలించుట చాల దుష్కర మగును.

కొండాం : అయిన, దీనికిఁ దరణోపాయ మేమైనఁ గలదా?

జగ్గ : లేకేమి? కాని, యది చాల క్రూర కార్యము.

కొండాం ; రాజనీతికిఁ గ్రూరమనునది కలదా?

జాయాం ; అయినను మహారాజులే స్వయముగాఁ జిరంజీవిని సింహాసన మెక్కించుట కంగీకరించిరని వారిమాటలవలనఁ దేలుచున్నదిగదా!

కొండాం : అది నిశ్చయమే. కాని, కాలమును గురించిన ప్రశ్న మనలను వెన్నంటుచున్నది.

జగ్గ : ప్రభువులకు చిక్కరాయల యనంతరము చిరంజీవికి రాజ్యమిచ్చుటయే యిష్టమైనచో నీక్రొత్తరాజును రక్తికట్టనీయక రాజ్యభ్రష్టునిఁ జేయు బాధ్యత నాది. పరోక్షముగ నా తంత్రము ప్రభుసేవాంకితమై సార్థక్యము నొందగలదు.

జగ్గరాయలు అక్కసెల్లేంద్ర యొద్ద సెలవు గైకొని వెడలిపోయెను. అతఁడు గవాక్షములు దాఁటి పోవుచుండ భవిష్యత్తును జీల్చుకొనిపోవు యుగ పురుషునివలె గోచరించెను.

అనవరత తీవ్ర మనోవేదన కారణముగా వేంకటపతిరాయల ఆరోగ్యము చెడెను. భిషగ్వరులు రాజునకుఁ బూర్తి విశ్రాంతి కావలయు ననిరి. శయ్యనుండి యాతఁడు కదలుటలేదు. చిక్కరాయల పట్టాభిషేక ముహూర్తము సమీపించుచున్నది. జగ్గరాయలు రాజుగారి పక్షమున పట్టాభిషేక మహోత్సవ సర్వకార్య నిర్వహణ భారమును వహించెను. రాజునకు రోజురోజున కారోగ్యము క్షీణించుచుండెను.

చిక్కరాయల పట్టాభిషేక మహోత్సవ దిన మాసన్నమాయెను. చంద్రగిరి నూతన వధువువలె నలంకరింపఁబడెను. ప్రజలు పెండ్లి పెద్దలవలెఁ జరింపఁ దొడగిరి. సూర్యోదయమగుసరికి సర్వ సామంతవీర మహామండలి పట్టాభిషేక భవనమున హాజరయ్యెను. ప్రజలు సభలో క్రిక్కిఱిసి యుండిరి. స్త్రీజనమునకు రెండవ యంతస్తునఁ బ్రత్యేక సదుపాయము లొనర్పఁబడినవి,

వారు మేలిముసుఁగుల పొరలద్వారా పట్టాభిషేక దృశ్యమును విశదముగాఁ జూడఁగలరు. వేంకటపతిదేవ మహారాయలు శరీర మస్వస్థముగనున్నను నెట్లో యోపిక చేసుకొని యున్నతాసనముపఁ గూర్చుండియుండెను. అతని ప్రక్కగా గొప్ప హేమసింహాసన మొకటి యమర్పఁబడియుండెను. దానిపై చిక్కరాయ లభిషిక్తుఁడగును.

గంగా గోదావరీ నదీ జలములతోపాటు కృష్ణ, తుంగభద్ర, కావేరి, పెన్న మున్నగు నదులయందలి జలములును, జతుస్సముద్రముల పవిత్ర పయస్సులును హేమకుంభములతోఁ దేఁబడినవి. చిక్కరాయలకు వేదోక్త మంత్ర పఠనముతో రాజలాంఛన సంయుతముగా నభిషేకము జరిగెను. తరువాత వేంకటపతిరాయల యాజ్ఞ చొప్పున చిక్కరాయలు (రెండవ) శ్రీరంగ రాయల బిరుదము వహించెను. అతని శిరముపై హేమకిరీట ముంచఁబడెను, అతని హస్తమున నధికారదండ మొసంగఁబడెను. సభయంతయు శ్రీరంగ రాయల నుతించెను,

రాగమంజరి రామపట్టాభిషేక నృత్య మొనర్చెను. సభ్యులు రసానంద హృదయారవిందులైరి. వేంకటపతిరాయల పజ్జనున్న శ్రీరంగరాయ లింద్రుని చెంతనున్న కిరీటివలె వెలింగెను. రాగమంజరి దేవేంద్ర సభాభవనమున నృత్య మొనరించు నూర్వశివలె గోచరించెను.

పట్టాభిషేక సమయమున సామంతులు శ్రీరంగ రాయలకు[1] విలువగల కానుకలఁ జదివించిరి. రాజు వారెల్లర కుచిత సత్కారములఁ గావించెను, శ్రీరంగరాయలు వేంకటపతిరాయల పాదములకుఁ బ్రణమిల్లెను; అతఁడు హృదయపూర్వకముగా నాతని దీవించెను. ప్రక్క నిలిచియున్న జగ్గరాయలను జూపి "నీ రాజ్యనిర్వహణమున నీతఁడు నీ కండగా నిలువఁగలఁడు. ఆతనిఁ గాపాడుకొను" మని చెప్పెను. సభ ముగిసెను.

---

1. ఇచ్చటినుండి చిక్కరాయలను శ్రీరంగరాయలనియే వ్యవహరింతము.

# నాలుగవ ప్రకరణము

ప్రభాకరుఁ డస్తమించెను. దిగ్వనితలు తమోనీలాంబర వేషముల ధరించు చుండిరి. చంద్రగిరి నగరము కాంతిమంతముగ నలంకరించుకొని వాసకసజ్జికవలె భాసించెను. చంద్రుఁడు లేని యారాత్రి ప్రోషిత భర్తృకచందము వహించెను.

జగ్గరాయలు రాజప్రాసాద సింహద్వారమును సమీపించెను. తిమ్మనాయకుఁడు మాకరాజు ఆతని ననుగమించు చుండిరి. ముగ్గురును బలిష్ఠములగు యుద్ధాశ్వముల నధిరోహించి యుండిరి. ప్రాసాదమునుండి యొక వార్తావహుఁడు కమ్మ యొకటి చేతఁబూని సంరంభముగా బయటి కరుదెంచెను. ఆతఁడు జగ్గరాయలను జూచి నివ్వెరపోయెను. కాని, వెంటనే మోము త్రిప్పుకొని యచ్చటి కిరువది గజముల దూరమున నున్న యొక గుఱ్ఱము నెక్కి చీఁకటిలో నంతర్ధాన మాయెను. ఆతని దుస్తులనుబట్టి దూర దేశయాత్ర చేయవలసిన వార్తావహుఁ డని యూహించుట చాలా సులభము.

సామాన్యముగా నెట్టి ప్రభుత్వోద్యోగియైనను జగ్గరాయలఁ గాంచినచో నభివాదన మొనర్పక పోవువాఁడు కాఁడు. కాని, యీ భటుఁ డట్లు చేయలేదు. జగ్గరాయల కన్నులు లెఱ్ఱవాఱినవి. అంతియకాక యాతఁడు తన్నుఁజూచి [illegible] పడుట మఱియు సంశయమునకుఁ గారణమైనది. రాయలు తన దండనాథుల వైపు చూచెను. కన్నులు పెద్దవి చేసి, కనుకొలుకులయందు దృష్టి నిలుపుచు, భృకుటి కదల్చెను. వారశ్వములను వెనుకకు మఱల్చి, క్షణములో నదృశ్యులైరి. రాయలు సింహద్వారమునొద్ద నశ్వము దిగి, లోనికి నడచిపోయెను.

శ్రీరంగరాయల యనుమతిని గైకొని జగ్గరాయలు లోనికరిగెను. ప్రభు వభ్యంతర మందిరమున నొంటిగఁ గూర్చుండియుండెను. తీవ్రముగా నాలోచించుచుండిన కతమున నాతని మో మించుక వాడి యుండెను. జగ్గరాయలు ప్రభువును రాజోచితముగాఁ బరామర్శించెను. గంగరాయ లాతనిని గౌరవముగా నాదరించెను.

''మామా! తల్లులు కుశలమా?''

''చిరంజీవులగు మీరు వేయికన్నులఁ గాపాడుచుండ, వారి సేమమున [illegible]?''

''పినతండ్రిగారి వియోగమువలన దుఃఖము నుండి వారు క్రమముగా తేరుకొనుచున్నారని తలంతును.'' రంగరాయల స్వరము రుద్ధమాయెను.

''ప్రభూ! అది వారి పాలిటఁ దీయఁజాలని హృదయ శల్యము. కాని, యీ చిరంజీవియందు సార్వభౌముని రూపము నూహించుచు నెట్లో కాలము వెళ్ళఁబుచ్చుచున్నారు.''

జగ్గరాయలు తల వంచి కన్నుల నొత్తుకొనెను. రంగరాయలు ముఖము చిట్లించెను. వెగటుఁదనమును ప్రకటించెను. జగ్గరాయలు దాని నోరచూపులతో గ్రహించెను.

''శ్రీరంగరాయా! మీ తల్లులగు బాయాంబా, కొండాంబలు పంపగా వారి యనుమతిపై మిమ్మొకటి యభ్యర్థించుటకు వచ్చితిని.''

''ఎంతమాట! తల్లు లభ్యర్థించుటేల? ఆజ్ఞాపింపవచ్చునే. నేను పరుఁడనా?''

"అని వారును అనలేదు. రాజలాంఛనము గనుక నేనే యట్లంటిని."

"చిన్నవానికా యిట్టి మర్యాదలు? మామా! కాలము మాఱినదికాని, వేంకటపతి మహారాయలనాఁటి నీ మనస్తత్వము మాత్రము మాఱలేదు."

రంగరాయలు నవ్వెను. ఆతని ముఖము గంభీరముగా నుండెను. కాని, యాతని కన్నులలో నేదియో వికటత్వము ప్రతిబింబించెను. దానిని జగ్గరాయలు గ్రహించెను. ఆతని ముఖము కందగడ్డాయెను.

"ప్రభూ! బంధుత్వ మితర విషయములందువలె రాచకార్యములందుఁ బ్రయోగింపరాదు. అది యొక్కొక్కసారి కీడునకు దారితీయవచ్చును."

రంగరాయలు చలించెను. "మామా! ఇఁక నీ ప్రసక్తి నాపివేయుడు. ఇంతకుఁ దల్లుల యాజ్ఞ యేమి?"

''వారిట్లని నాచేఁ బుత్తెంచుచున్నారు. 'చిరంజీవి శ్రీరంగరాయల కాశీస్సులు. మీ పినతండ్రి గారి వంశాంకురమగు నీ బాలుని కింకొక పక్షము దినములలో నొక్క సంవత్సరము నిండును. రాయల కేకైకపుత్త్రిఁ డౌటచేఁ పట్టణమున నాతని కుచిత లాంఛనములతో జన్మదినోత్సవము జరిపింపవలయు నని కోరుచున్నాము. దానివలన వాని తండ్రిగారి యాత్మకుఁ గొంత శాంతి చేకూరవచ్చునని తలంచుచున్నాము. నీ తమ్మునివండుగ నీ చేతులమీఁదుగనే జరుగవలెను. అంగీకారము తెల్పుదువని ఆశించుచున్నాము.'''

రంగరాయల కాలోచించుటకు వ్యవధిలేదు. ఐనను వారంపిన దభ్యర్థన కాదు; వ్యంగ్యముగా నొక శాసనము. దాని నంగీకరించుటయా? త్రోసిపుచ్చుటయా? వేంకటపతిరాయల నిర్యాణానంతరము రాణులు మొదటిసారిగాఁ గోరిన కోరిక యిదియే. దానిని దృణీకరించినచో జగ్గరాయలీ యవకాశమును గైకొని గోరంతలు కొండంతలు సేయఁగలఁడు. అంగీకరించినచో వారు కొంత శాంతింపవచ్చును. ఇందును ఏదైన నాటక మిమిడియుండునా? ఒకవేళ అట్లై యున్నను అంగీకరింపనిచోఁ గల్గు పరిణామములకన్న నష్టదాయకములు కాకుండును. లోకము కొఱకైనను దీని నంగీకరింపక తప్పదు.

"మామా! నాకెంతయో సంతోషము. హృదయ పూర్వకముగా దీని నామోదించుచున్నాను. అట్లని మా తల్లులకు దయతోఁ దెలుపుఁడు. సూర్యోదయమగుసరి కధికార పత్రము పంపుదును. దేశమునఁ బ్రకటింతము."

"మహాభాగ్యము."

"మఱియొక అభ్యర్థన. మీ రనుభవజ్ఞులు. పినతండ్రిగారు తమ తరువాత మా కండగా మిమ్ములనుఁ జూపి వెళ్ళినారు. నా పట్టాభిషేక సంభారములు మీ చేతులపై నెట్లు నడచెనో దీనినిగూడ నట్లే కావింపుఁడు."

"శ్రీరంగా! అట్టి సదవకాశమునకై వేచియుంటినయ్యా!"

జగ్గరాయలు వెడలిపోయెను. శ్రీరంగరాయలు చాల బాధపడెను. తనకుఁ దెలియకుండఁగనే తన కాలు జాఱినట్లయ్యెను. తన హృదయమును దానే వంచించుకొనినట్లనిపించెను. జీవితములో నెన్నఁడును జేయని గొప్ప తప్పు తానానాఁడొనర్చినట్లు ఖేదము వహించెను. కన్నుల నీరు నిండెను. అతఁడు తన శయ్యపైఁ బరుండెను.

అతని తలలో వెనుకటి యనుభూతి యొకటి తొంగి చూచినది. దానినే వితర్కించుకొనుచుఁ గన్నులు మూసికొని పరుండెను.

"నాయనా! నా యవతారము ముగియవచ్చినది" అని వేంకటపతిరాయలనెను. అతని ముఖమున మృత్యుదేవత తాండవించుచుండెను. తానొక్కఁడే యాతని ప్రక్క నిలిచియుండెను. "నీకుఁ జెప్పఁదగినవన్నియుఁ జెప్పితిని. ఆ బాలుఁడు బ్రాహ్మణుఁడు. ఇది జగ్గరాయలు, - అతని అక్క చెల్లెండ్రు చేసిన మోసము. వారెన్నటికైనను నీ కపకారులే. కాని, వారిని నీ చేతులారఁ జంపవద్దు.

నీ మనసును గొంత చంపుకొని కాలమును నీ వశము చేసికొనుము. నీవారితో నిన్ను రక్షించుకొనుము. నీ సంతతితో రాజ్యము నేలింపుము. ఇది నా జీవుని వేదన."

శ్రీరంగరాయలు బాలునివలె నేడ్చెను. అతఁడు హృదయముతో జీవింప నేర్చినవాఁడు. హాలాహలము మ్రింగి అమృతము వర్షించువాఁడు. పాషాణమునఁ గూడ మానవత్వముఁ గాంచనేర్చినవాఁడు. అది రాజకీయములం దొక్కొక్కతఱి విషతుల్యమగును. అతఁడు దానిని జంపుకొన యత్నించెను. కాని, యది ఉగ్గు పాలతో వచ్చిన విద్దె యగుటచే నసాధ్యమైనది. అతఁ డెట్టులో యారాత్రి గడిపెను.

శ్రీరంగరాయల వయస్సు ముప్పదియైదు సంవత్సరములు. అతనికొక కుమారుడు గలడు అతనివయ స్సప్పటికి నాలుగేండ్లు. ఆ బాలుఁడు తన తండ్రి పోలిక యగుటచే రాజాతనికి రామదేవరాయలను పేరిడియుండెను. అతఁడు పుట్టినప్పటినుండియు రాజున కదృష్టము కలసి వచ్చుచుండెను. జ్యోతిష్కు లాతనికి రాజ్య నిర్వహణరేఖ యున్నదని తెల్పిరి. కాని, యాతనిది కష్ట జాతకము. ఆతని జీవితమునిండ గండములే. అందువలనఁ దల్లిదండ్రు లాబాలునిఁ గడు గారాబముతోఁ బెంచుచుండిరి. శ్రీరంగరాయలు మనశ్శాంతి లేని సమయములందుఁ బాలునిఁ బ్రక్కలో నిడికొని నిద్రించును.

ఆ రాత్రికూడ రాజు కుమారునిఁ దన శయ్యపైఁ బరుండఁబెట్టుకొనెను. వామ పార్శ్వమున మఱియొక సెజ్జపై రాణి నిద్రించుచుండెను. తెల్లవాఱు జామున రాణి యొక్కపెట్టున నిద్దురలో నేడ్వ నారంభించి యులికిపడిలేచి రాయలఁ గౌఁగిలించుకొనెను. ఆమె గాలికల్లాడు చిగురాకువలె వణఁకి పోవు చుండెను. ఆమె నూఱడించుటకు రాయలు చాలసేపు యత్నించెను. ఆమె నిద్దురలో నులికిపడినది. రాయలెంతయో ధైర్యము చెప్పిన తరువాత నామె స్థిమితమనస్క యయ్యెను.

"దేవీ! ఎన్నఁడులేని యీ యదురుపాటెందులకు?"

"స్వామీ! ఎన్నఁడెఱుఁగని దుస్స్వప్న మొకటి వచ్చినది."

"అయిన భయము లేదు. నీ హృదయము వ్యాకులమొంది యుండును. అది స్వప్నమైనది. త్రాడునుగాంచి పామనుకొంటివి కాఁబోలు!"

"అది యంత తేలికగాఁ దోఁచుటలేదు ప్రభూ! ఏదియో భావికాల ప్రళయరూపథమునకు నాందివలె నున్నది."

స్త్రీలు సహజముగఁ గోమలులు. వారు కలలోఁ గూడ గాఠిన్యమును ధరింపలేరు. ఇంతకు దాని నెఱుఁగింపుము, దాని స్వరూపము తేటపడును."

"ఒక మహారణ్యములో గో వృషభములు మేయుచున్నవి. అందుఁ గోమాత కొకలేగ. వెనుకనుండి చిఱుతపులి యొండువచ్చి యా మిధునముపై నుఱికి గొంతు కొఱికినది. లేగ ప్రక్క పొదలో నుండుటచే దాని పాలఁబడలేదు. ఇంతలో నొక సింహ మా చిఱుతపులిని డీకొనెను. ఆ ఘోర యుద్ధమున నా చిఱుతపులి పడిసెను. సింహము వెడలిపోయెను. లేగ యీ పడియున్న తల్లిదండ్రులఁజూచి యేమగును? నాకు దుఃఖము పొరలివచ్చినది. అనిర్వచనీయమైన భయము జనించినది."

"నీవు చాల పొరబడితివి. ఆ లేగ తల్లిదండ్రులను బ్రతికించును."

"అయిన భయము లేదు" అని ఆమె యాతని యురముపై నిశ్చింతగా నిద్దురపోయెను. బాలుఁడు నిర్మలముగాఁ బరుండి యుండెను.

శ్రీరంగరాయలు భార్య హృదయశాంతికై యట్లనెను గాని నిజముగ నాతని యుద్దేశ మదికాదు. అట్లనకపోయినచోఁ దనతో మఱియొక హృదయము దహింపఁబడు చుండును. ఇప్పుడు తానొక్కఁడే దానినిగూడ వహింపవచ్చును. అతని కన్నులయెదుట నున్న దివిటీ దహింపబడుచున్నది. దాని కాంతిలో విశాలమైన మందిరము ప్రశాంతముగా నున్నది. రాయలగుండెలో మండు చుండెను. గుండెపై నాతనిభార్య, పుత్త్రులు చల్లగా నుండిరి. ఆతఁడిప్పుడు దావాగ్ని మ్రింగి గోకులము రక్షించిన శ్రీకృష్ణ భగవానుఁడు . హాలాహలము కంఠమున నిలిపి లోకము రక్షించిన మహాదేవుఁడు.

తెల్లవాఱెను. శ్రీరంగ రాయలు సూర్యోదయమగుసరికి బాయాంబా మందిరమునకుఁ దన సమ్మతిపత్రమంపెను. వేంకటపతి రాయల మరణానంతరము రాణు లిరువురు నిదివఱకుండు రాజమందిరములందు నివసించుట లేదు. చంద్రగిరి యందు సామంతవీరమండలి సభ్యులకు యోధులకుఁ బ్రత్యేక భవనములున్నవి. అందు మొదటిది జగ్గరాయలది. అచ్చట విశాలమైన రాచబాట గలదు. దాని పై భాగమున నొక పెద్ద భవన మొకటి యుండెను. అది రాజబంధువు లెవరైన వచ్చినచో నాతిథ్య మిచ్చునట్టిది. రాచనగరెంత వైభవముఁ గల్గియుండునో యదియు నంత గౌరవముతోఁ గాపాడఁబడు చుండును. ఆ భవనమునకును రాజప్రాసాదమునకును సుమారు మైలుదూర ముండును. అందు రాణులు బాయాంబా కుమారునితో నివసించుచుండిరి.

ఆనాఁడు రాజకుమారుని[1] జన్మదినోత్సవముతో పాటు మఱికొన్ని రాజకీయ ప్రకటనలు జరిగినవి. ప్రభుత్వమున రెండు మంత్రిపదవులు, ఒక మహాదండనాథ పదవి, సాంఘిక సాంస్కృతి కోద్ధరణాధికారుల పదవులు రెండు మహారాజు పరిపాలనా సౌలభ్యము కొఱకై సృజింపఁ బోవుచున్నారని వాని వలనఁ దెలియవచ్చినది. చంద్రగిరి నగరమునఁ బ్రతి కేంద్రస్థానము నందును అవి చాటింపఁబడినవి.

మఱునాఁడు మఱికొన్ని ప్రభుత్వాధికార పత్రములు శ్రీరంగరాయల యధికారముద్రతో వెలువడినవి. అవి ప్రజానీకమున కుద్దేశింపఁబడినవి కావు, సామంత వీరమహామండలి యందలి సభ్యుల కొక్కరి కొక్కొక్క పత్రము మాత్ర మందింపబడినది. అందలి సారాంశమిది: మండలి యందలి ప్రతి సభ్యుఁడును ప్రభుత్వాధికారమునకు బద్ధుఁడై యుండవలెను. మహారాజుల యభిమత మున కెదురాడుట పాపముగా నెంచవలెను. సామంతులును వీరులును, స్వార్థపరులు గాకుండ దేశక్షేమమునకై పాటుపడవలెను. యుద్ధములందు రాజద్రోహము సేయననియు, సాధ్యమైనన్ని శత్రుదుర్గములను సాధించి రాజ్యవిస్తృతిఁ బెంచుదుననియు, మండలి యభివృద్ధికై యథాశక్తి ద్రవ్యసహాయ మొనర్చెద ననియుఁ బ్రతిసభ్యుఁడును బ్రతిజ్ఞ సేయవలెను.

మానవుఁ డతిక్లిష్టపరిస్థితు లెదురొడ్డవలసి వచ్చినప్పుడు మనస్థైర్యము నిలుపుకొనుట యసంభవము. పరిస్థితు లగ్ని పరీక్షకుఁ బూనుకొనినప్పుడు వాని నేవిధముగనో సవరించి, యాత్మరక్షణమొనరించుకొనుట కాతఁడు యత్నించును. అట్టి మానవ ప్రయత్నము సఫలము కావచ్చును. లేక యొక్కొక్క యెడ విపరీతము కూడఁ గావచ్చును. అది దైవసాహాయ్యముపై నాధారపడి యుండును. శ్రీరంగరాయలు పట్టాభిషిక్తుఁడగు సమయమునకుఁ బ్రజలాతనియం దధికప్రీతిని గల్గియుండలేదు. వేంకటపతిరాయలు సజీవుఁడై యుండినంత వఱకుఁ గొంత గుంఫనముగా పరిపాలనము నడచినది. రాయలే యాంతరముగా శ్రీరంగరాయల కండగాఁ గొందఱయోధుల నియమించి యుండెను. అందు యాచమనాయఁ డొకఁడు. అతనిద్వారా తంజావూరు రఘునాథ రాయల సహాయ

1. పూర్వపరిచితుఁడగు నాశిశువు నీనామముతో వ్యవహరింతము.

మభ్యర్థించుటకు యత్నములు నడచుచుండెను. రాజధానియందు శ్రీరంగ రాయలకుఁ జెప్పుకొనఁదగు నందలేదు. వేంకటపతిరాయ లేర్పఱిచిన ప్రభుత్వ విధానము రాజ్యమున సుస్థిరమై, యాతని యనంతరముకూడఁ జలనములేక యుండెను.

శ్రీరంగ రాయలకు విరోధులు లేకపోలేదు. కాని, వారు బయటపడుట లేదు. ఆతనికి కోటలో శత్రువుల మధ్య తిరుగుచున్న ట్లనిపించుచుండెదు. అందువలన నతఁడీ నూతన విధానము నవలంబించెను. అది యాతఁడు స్వయముగా నొనరించినదే. అతఁడు మఱెవ్వరి సాయము నభ్యర్థించి యుండలేదు. ఇతరుల హృదయము లాతఁడు తెలిసికొనుటకు యత్నింపలేదు. తన హృదయమునకు నచ్చిన సిద్ధాంతము లోకమున కెందుల కంగీకృతము గాదని యాతని మతము. హృదయవాదమున నాతనికి వ్యక్తిభేదము లేదు.

లోకమున సుజనుఁడు మంచికోరియే పనుల నారంభించును. కాని యొక్కొకఁడు తన దృష్టి పనియందే కాని దాని చుట్టునున్న వాతావరణముపైఁ బ్రసరింపఁజేయఁడు. దేశకాల పాత్రములను బట్టి యొక్కొక్కతఱి మంచి చెడ్డదగును. చెడుగు మంచిదగును. దానిని గుర్తెఱింగి జనుఁడు నడువవలెను. అట్లు నడవనిచో నాకాలము వానిని సహింపదు. శ్రీరంగరాయలాత్మరక్షణార్థమై తన మంచిని లోకముపై బులిమెను.

సామంతవీర మహామండలి యొక్కచో సమావేశమై పది నెలలు దాటినది. వేంకటపతి మహారాయలు మంచమెక్కిన నాఁటినుండి మహామండలిని దలఁచినవారు లేరు. ఒక మహాదేశము సంచలనాత్మకముగా నుంచు మహత్తర యంత్రముగా నామండలి యిదివరలో కీర్తి వహించియుండెను. అందు సామంత ప్రభువులు, మహా సేనానులు, దండనాథులు సభ్యులుగా నుండిరి. అట్టిది నేఁడు త్రుప్పుపట్టినదా యన్నట్లు కదలుటలేదు.

గుత్తికొండ దుర్గమునేలు మట్లి ఎల్లపరాజు, అతని సుతుఁడు మట్లి అనంతుఁడు, అతని కుమారుఁడు తిరువేంగళనాథుఁడు, మట్లి ఎల్లయ మొదలగు మట్లి వంశపు సరదారులు; వెలుగోటి కస్తూరి రంగప, అతని కుమారుఁడు యాచమనాయకుఁడు, అన్న కుమారుఁడు చెన్నప, ఇతని సుతుఁడు వెంకటపతి మొదలగు వెలుగోటి వంశ వీరులు; గండికోట నేలు పెమ్మసాని తిమ్మయ,

రాయలసీమ ప్రాంతము నేలు చుండే దేవప్పనాయకుఁడు, గొబ్బూరి వంశము నందలి గొబ్బూరి జగ్గరాయలు, రామరాయలు, మాకరాజు, యతిరాజు మొదలగు వారు; ఉదయగిరినేలు కువలానందుఁడు, మఱియు దామెర్ల చెన్నయ, రెండవ మలువాగలు, జగదేవరావు గుల్‌రంగసెట్టి, పాపయ్యసెట్టి, దాయప, సింగప, అయ్యప, దామెర్ల కట్టిచెన్న, చెఱకు వెంగళయ్య, కేతిరెడ్డి, పాపాడ కృష్ణయ్య, చిన్నరౌతు పెద్దరౌతు, తిత్తెపసెట్టి, షట్టిమొదలి, చెంగాడు జగ్గయ్య మొదలగు వారందు సభ్యులు. ఇట్లు దేశమునందలి భుజబలమంతయు నేకముఖముగ నిలిచి, శత్రుభయంకరముగ విలసిల్లినది.

వీరందఱు మాసమున కొకసారిగాని, మూడు మాసములకు రెండుసార్లు గాని యొక్కచో సమావేశమై దేశపరిస్థితులను సమీక్షించుచుండెడివారు. దేశమునఁ బ్రధాన సంస్కరణలన్నియు వీరి యామోదముద్ర నొందినఁగాని యములులోనికి వచ్చుటకు వీలులేదు. వీరిలో నొక్కొక్క రొక్కొక్క ప్రాంతమునకుఁ బ్రతినిధులై నిలిచి, యచ్చటి ప్రజోపకారములను మండలి సమ్ముఖమున చర్చించి రాజామోదము నొందుచుండెడివారు. ఇది యొకవిధముగాఁ బ్రజాప్రతినిధి ప్రభుత్వ మన్నను సత్యదూరము కాదు. కాని, యిందు బలవంతుఁడై నవాఁడే సాధారణముగా సభ్యుఁడగుటకు వీలున్నది. అయినను వారు శాంతి కాలమునఁ బ్రజాశ్రేయస్సును దృష్టియందుంచుకొని సంస్కరణల నమలుపఱచెడివారు.

గొబ్బూరు జగ్గరాయ లీమండలి కధ్యక్షుఁడు, ఈతఁడు వేంకటపతి దేవరాయల మఱఁది యగుటయు, నాతనిచే పురరక్షణము, చార శాఖాధికారము, ఆయుధాగారాధిపత్యము పొందియుండుటయు నాతనికి స్థానికముగాఁ బేరుకలుదుటకు హేతువయ్యెను. దీనికిఁదోడు కంపిలి, సత్యవీడు, పొదలకూరు, కల్లూరు ఓగూరు, పాలెమకోట మొదలైన దుర్గమ దుర్గము లీతని వంశీయుల చేతులలో నుండెను. వారీతఁ డెట్లుచెప్పిన నట్లు నడచుకొనెడివారు. మట్లి వంశమునం దతనికి మంచి పలుకుఁబడి యుండుటచే నావంశీయులంద ఱాతనిని సమర్థింతురు. ఇట్లు మండలియం దెక్కువ సంఖ్య జగ్గరాయలను బలపఱుచుచుండుటచే నాతఁ డధ్యక్షుఁడు కాఁగలిగెను. సామాన్యముగా సమావేశముల నీతఁడే జరుపుచుండెను.

రాజకీయ ప్రకటనము జరిగిన వారము దినములకు జగ్గరాయలు సామంత మండలిని సమావేశము జరుగునట్లేర్పాటు గావించెను. అందు చర్చనీయాంశము

రాజకుమారుని జన్మదినోత్సవము. వేంకటపతి రాయలు దివంగతులైన తరువాత దేశమున శాంతిభద్రతలను కాపాడుటకై సామంతులు తమ తమ రాష్ట్రముల కరుగుదెంచి యుండిరి. జగ్గరాయలు వారికి వార్తాహరులతో నాహ్వానము లందునట్లు పంపియుండెను. అందు మట్లివంశ వీరులకు, గొబ్బూరువంశపు సరదారులకుఁ బ్రత్యేకముగా లేఖలు వ్రాసి, కొందఱు వీరులను బిలిచి వచ్చుటకుఁ బంపియుండెను. చంద్రగిరియందు సమావేశమునకు పలయు నేర్పాట్లు సర్వసంసిద్ధము చేయించుచుండెను.

నిర్ణీత సమయమునకు సభ యారంభింపఁబడెను. కాని, నాఁడు మందలి దాదాపు మూఁడవంతు హాజరు కాలేదు. వెలుగోటి వంశపు సరదారులు, వారి యనుయాయులు నాఁటి సభకు రాఁజాలమని ప్రత్యుత్తరము లంపియుండిరి. జగ్గరాయ లానాఁడా సభ కధ్యక్షత వహించెను.

అతఁడొక యున్నతాసనమునఁ గూర్చుండి యుండెను. అదియొక యెత్తైన ప్రదేశమునఁ గలదు. దాని పైభాగమున మహారాజ సింహాసన ముండెను. రాజు సభయందు పాల్గొనినప్పు డాతఁ డందుఁ గూర్చుండును. సభ పరిష్కరింపలేని విషయములపై రాజు తీర్పుల నిచ్చుచుండును. నాఁడు శ్రీరంగరాయల కం దవసరము లేదు గనుక నాతని యనుమతిపై నా సభ జరుగుచుండెను. సభ్యులెల్లరు ప్రప్రథమమున గతించిన వేంకటపతిరాయల మృతికిఁ దమ విచారమును బ్రకటించుచు నొక తీర్మానము చదివి, యాతని యందలి భక్తిప్రపత్తులను బ్రదర్శించునట్లు కొన్ని క్షణములు నిశ్శబ్దము వహించి నాఁటికి సభను జాలించిరి.

మఱునా డదేసమయమున సభ యారంభమగును. జగ్గరాయలారాత్రి మట్లి, గొబ్బూరువంశ నాయకులలోఁ గొందఱిని వ్యక్తిగతముగాఁ గలిసికొని యేదియో చర్చించుచు చాలకాలము గడిపెను. దాని ఫలితముగా మఱునాఁటి కార్యక్రమమున సభ్యులు ప్రభుత్వమున కీవలసిన ప్రతిజ్ఞల గుఱించి కూడఁ జర్చించుటకు నిశ్చయించుకొనిరి. కాని, యది బయటికి రాలేదు.

రెండవనాఁడు సభ ప్రారంభమయ్యెను. కార్యక్రమము ప్రకారము నాఁటి విషయముపై సధ్యక్షుఁడు ప్రథమమున నుపన్యసించును. తదుపరి సభ్యులు పాల్గొందురు. జగ్గరాయ లిట్లుపన్యసించెను :

సామంత వీర మహామండలికి నమస్కారములు. శ్రీ శ్రీ కర్ణాటక క్షమారమణులగు శ్రీరంగరాయలవారి యనుమతిపై నీసభ జరుగుచున్నదని తెలుపుటకు సంతసించుచున్నాను. వారి దయాదృష్టికి మండలిపక్షమునఁ గృతజ్ఞ తలు ప్రకటించుచున్నాను.

ఈనాఁటి చర్చనీయాంశములు రాజకుమారుని జన్మోత్సవాది విషయ ములు. వేంకటపతి మహారాయలు తన జీవితమునకు సంతానప్రాప్తి లేదని తలంచి నిస్పృహులై యుండిన సమయమున నీ బాలుడు వారి కానందసింధు వై జన్మించెను. ఆనాఁడు సర్వ ప్రజాసమూహ సమక్షమున మహారాజ్ఞి కొండాంబ ఆ శిశువును తమ చేతులలో నుంచినప్పుడు డావృద్ధ నృపతి పొందిన యానందము మన మింక మఱువలేదు. ఇంతలో విధి వ్యాధిరూపమున వారిని హరించినది. లేకపోయినచో నా బాలుని జన్మదినోత్సవమును పట్టాభిషేకోత్స మును జూచి యెంత యానందించి యుందురో! రాణు లిది తలఁచుకొని కుమిలి పోవుచున్నారు.

జగ్గరాయల మోమెఱ్ఱవడెను. కన్నుల నీరు నిండెను. రెండు బాష్ప కణములు చెక్కిళ్ళపై దొరలెను. ఆతఁ డెంతయో దుఃఖమును దిగమ్రింగుకొను చున్నట్లు కానవచ్చెను. సభ్యు లాతనిఁ గాంచి కదిలిపోయిరి. తమ పూర్వ చక్రవర్తి జ్ఞప్తిచే సభ ఖిన్నయయ్యెను. జగ్గరాయ లిది గమనించెను.

వేంకటపతి మహారాయల కీ శిశువనఁగా ప్రాణము. నే నతని దగ్గఱి బంధువు నగుటచే నివి యన్నియుఁ దెలిసికొనఁ గల్గితిని. అంత్యకాలమున బాయాంబా మహారాజ్ఞిని గాంచి రాజుగా రిట్లనిరట: 'సర్వ సామంతవీర మహా మండలియందు రాజభక్తి యెంతకాలము వసించునో అంతవఱకు మీకును, నా శిశువునకును నెట్టి భయమును లేదు. వారే యాతనిని రక్షింతురు, వారే గద్దె నెక్కింతురు' అని ఆ మాటలు జ్ఞప్తి చేసుకొనుచుండగా నా ప్రభువుల మూర్తి కనులయెదుట నిలిచినట్లగుచున్నది.

జగ్గరాయ లాసనమునఁ గూర్చుండెను. తలవంచి యావేదనతో గూడిన దుఃఖము నభినయించెను. సభ నిస్తబ్ధమయ్యెను. మహారాజులను గుఱించిన మాటలు సభ్యుల హృదయ కుహరములందు మాఱు మ్రోఁగినవి. ఆతనికి ప్రాణమైన యా బాలుఁడు వారి యభిమానపాత్రుఁ డయ్యెను. సభ్యుల హృద

యము రాజభక్తితో నుప్పొంగెను. జగ్గరాయలు కనుకొలుకులనుండి వారిని గమనించెను. మఱల నిబ్బరించుకొన్నట్లు లేచి నిలువఁబడెను.

రాయలు గతించిపోవుచు మనపై నీ కర్తవ్యమునుంచి పోయినారు. మన రక్తమం దచంచల రాజభక్తి జీర్ణించియున్నచో రాజుగారి ఈ చరమ వాంఛిత మున కెట్టి యడ్డంకులు నుండవని భావింతును. అంతియగాక, మనల సందఱిని ఐక్యపఱిచి, తురుష్కుల చెండాడి, రాజ్యము సుభిక్షమొనర్చి మనల నాదరించిన యా చల్లని ప్రభువున కదియొక భక్తి నీరాజన మగును.

సభ్యులు వేంకటపతి రాయలకును, రాజకుమారునకును జయజయ ధ్వానములు సలిపిరి. జగ్గరాయ లుత్సాహవంతుఁడయ్యెను.

రాయలీ సామంతవీర మహామండలిని దన శరీరభాగముగాఁ బోషించి నారు. దేశమునం దెచ్చట నల్లరి జరిగినను మనతోఁ జర్చించి మనచేతనే వానిని సమయఁజేసినారు. వారికి మనపైఁగల విశ్వాస మటువంటిది. మనము వారికి హృదయముల నిచ్చినాము. కాని, ఎట్టి ప్రతిజ్ఞలు లిఖిత పూర్వకముగా వ్రాసి యీయలేదు. మనకి వ్రాఁత కోఁతలకన్న నతీతమైన ప్రభుభక్తియే ప్రమాణము. నేఁడు మన మందఱము ప్రభుత్వము ముందు ప్రమాణము సేయవలెనని శ్రీరంగ రాయలవారు ప్రకటించిరి. ఇది మన రాజభక్తి కొక పరీక్ష.

సభలో సంచలన మేర్పడెను. ఒకరితో నొకరు గుసగుసలాడఁ దొడం గిరి. జగ్గరాయలు గొంతు సవరించుకొనినట్లు కొంత విరామమిచ్చి వారి భావ ములను గమనించెను.

నిప్పులేనిదే పొగ పుట్టదని లోక న్యాయము. రంగరాయలవారు సామం తులును వీరులును స్వార్థపరులు గాకుండ దేశ క్షేమమునకై పాటుపడ వలయునని ఆజ్ఞాపించినారు. అసలు వారికీ స్వార్థపరత్వసంశయ మేలరావలయును? రెండు దశాబ్దులకుపైఁగా నీ మండలి రాజభక్తిని బ్రకటించి వారి యోగ క్షేమములు యోచించుచుండఁగా, నేఁడెందులకీ యపోహలు? గోలకొండ నవాబులు దేశ ముపై దండెత్తినప్పుడు వారి చేతులలోని గుత్తికొండ, కమలకూరు, కొచ్చెర్ల కోట, గోలకొండ దుర్గముల నుత్తుఁతలూగించిన మట్లి యనంతయ్య, వెలుగోటి కస్తూరి రంగప్ప మున్నగువారు స్వార్థపరులా? ఉదయగిరి పాలకులగు కువలా నందుగారు స్వార్థపరులా? ముమ్మడి తిమ్మనగౌడు, సావెండ్ల కృష్ణమరాజు,

కొండ్రాజు తిరుపతిరాజు తిరుగుబా టొనర్చినపుడు ప్రాణములకైనకు లెక్క సేయక యుద్ధమునందు దూకిన హండె దేవప్ప నాయకులు, పెమ్మసాని తిమ్మయ స్వార్థపరులా? గండికోట దుర్గమును ఘోర సమరానంతరము సాధింనగల్గిన వెలుగోటి చెన్నప్ప, గుల్ రంగసెట్టి, మనుపరాజు స్వార్థపరులా! వీరే స్వార్థపరులైనచో దేశమున నెవ్వఁడు స్వార్థపరుఁడు గాఁడు?! వేంకటపతి మహారాయల కిట్టియభిప్రాయ మేకోశమునందును లేదు. ఉన్నచో మీ యము చరుఁడైన నన్నుఁ జూపి శ్రీరంగరాయల పట్టాభిషేక సమయమున నాతనితో నట్లనునా? మిత్రులారా! స్వార్థపర్వతమునకు నిర్వచన మేమియో తోఁప కున్నది.

జగ్గరాయ లాసభనందలి పెద్దలను బేర్కొని యుదాహరించెను. అంత టితో వారి యనుయాయులును వారిలో వారు రోషము వహించిరి. శ్రీరంగ రాయలు తమ్మనుమానించుచున్నట్లు వారు భావించిరి. వీరావతారములవలెఁ గన్పట్టిరి.

దీనికిఁదోడు ప్రభుత్వమునఁ గ్రొత్త పదవులు కొన్ని నిర్మింపఁబడఁ బోవుచున్నవి. వాని విషయము మండలివారికిఁ దెలియదు. వేంకటపతిరాయలే రాజైయున్నచో నిద్ది మన మధ్య ప్రప్రథమమునఁ జర్చింపఁబడియుండెడిది. నేఁడు మనము వేఱైపోతిమి. ప్రభుత్వమునకు దూరమైతిమి. అనఁగా,నింతవఱకు మన దేహమునందున్న యాత్మ మనకు దూరమగుచున్నదన్నమాట! కొన్ని రోజులకు మనము కొయ్యబొమ్మల మగుదుము.

సభలో పౌరుషము రెచ్చిపోవుచుండెను. దానిని జగ్గరాయ లుత్సాహ ముతో గమనించుచుండెను. జగ్గరాయ లొక యుత్తరము బైటికిఁ దీసెను. దానిని సభకు జూపుచు నిట్లనెను :

"దానికి లేఖ నిదర్శనము. దీనిని గాంచినచో సర్వము మీకే వ్యక్తము కాఁగలదు." జగ్గరాయ లాయుత్తరమును మాకరాజున కిచ్చి సభలో ముఖ్యుల కందునట్లొనరించెను. "అది శ్రీరంగరాయల రాజముద్రను వహించియున్నది. తంజావూరు రఘునాథ రాయలవారికి వ్రాయఁబడినది. వారి రాష్ట్రమునందు ప్రజ్ఞావంతులైన కొందఱు వీరులను నూతనాధికారములందు నియోగించుటకై పంపవలెనని వేఁడుట యందలి సారాంశము. దీనిని తిమ్మనాయకుఁడు, మాకరాజు చాకచక్యముతో వార్తాహరునినుండి గ్రహించిరి. అది మీ ముందు పెట్టుచున్నాను." సభ యాశ్చర్య ముద్ర వహించెను.

తంజావూరు రఘునాథరాయలు మనకు సన్నిహితుఁడే. కాని, మన దేశమున సామంతుఁడు కాఁడు. అతనిది ప్రత్యేక రాజ్యము. ఇతర దేశస్థులను మన రాజ్యపు టాయువుపట్టులగు స్థానములం దుంచుట గుండెపై బండ పెట్టుకొన్నట్లు కాదా? అంతవఱ కెందులకు? ఆ పదవులను నిర్వహింప నేర్చినవారీ దేశమున లేకపోయిరా? అఖండ పరాక్రమ శోభితులు, రణరంగ పాండితీ మండితులు, అనుభవజ్ఞులు, రాజభక్తియుక్తులు నను నీ సభయందలి సభ్యులెవ్వరు నా పదవుల కర్హులుకారా? ఇది స్వార్థము కాదేమో? కుట్ర కాదేమో? కాని, శ్రీరంగరాయలవారు మనకుఁ బ్రభువు. అఖండ సౌమనస్య విలసితమగు నీ సభయందు వెలుగోటి వంశమువారిలో కొందఱిని విడఁదీసి మనలో మిత్రభేదముఁ గల్పించి, నిరంకుశత్వము వెలయింపఁజూచుట రాయల స్వార్థపరత్వము కాదేమో? కాని, శ్రీరంగరాయలు మన ప్రభువు. మనలను స్వార్థపరులని శంకింపఁగలిగిన ప్రభువు! శంకించు భర్తతోఁ కాఁపురము చేయుచున్నది నేఁడు మన కర్ణాట సామ్రాజ్య లక్ష్మి.

ఇట్లతఁ డుపన్యసించెను. సభ యేకముఖముగా నొక నిర్ణయమునకు వచ్చెను.

## అయిదవ ప్రకరణము

రాజకుమారుని జన్మదినోత్సవదిన మానాఁడు. చంద్రగిరి పట్టణము దేవేంద్రనగరమువలె వెలుఁగొందెను. అంతకుఁ బూర్వ మెన్నఁడును నంత సుందరముగాఁ బట్టణ మలంకరింపఁబడియుండలేదు. నగరపాలకుఁ డగు జగ్గరాయలు ప్రత్యేక శ్రద్ధ తీసికొనుటయే దానికిఁ గారణము. రాణుల నివాసము నుండి శ్రీరంగరాయల కోట ముఖద్వారమువఱకు వ్యాపించియున్న రాచబాట కన్నుల పండువుగ నుండెను. పది గజముల కొక్కొక కమాను లతాపుష్పాదులతోఁ గట్టఁబడెను. రాకుమారుఁడు వచ్చుచున్న సమయమున వానినుండి పుష్పవర్షము గురియును. ప్రతి కేంద్రస్థానమునందును వేంకటపతి మహారాయల చిత్రములు ప్రజలందఱు గాంచుటకు వీలగున ట్లమర్పఁబడియుండెను.

రాణుల భవనమునందుండి సూర్యోదయ మగునరికి పెద్ద ప్రజావాహిని బయలుదేఱెను. మునుముందు సైనిక వాద్యములు, వాని వెనుక రెండువేలమంది సాయుధ కాల్బలము పంక్తులుదీర్చి నడచుచుండెను. తరువాత క్రమముగా

మంగళవాద్యములు, సామంత వీర మహామండలి సభ్యులు, రాజకుమారుఁడధి వసించిన భద్రగజము, ఆ వెనుక రెండువేల మంది యాశ్వికులు, అటుపై ప్రజాసమూహము నెమ్మదిగ కదలుచుండెను. సూర్యరశ్మిలో నా యుత్సవము బంగరు తరఁగల యేరు సమతలమున నిలిచి పాఱుచున్నట్లనిపించెను.

కోటయుఁ బట్టాభిషేక మందిరము నపూర్వ రామణీయకముగా తీర్చి దిద్దఁబడియుండెను. ఊరేగింపు కోటద్వారమునకుఁ జేరెను. సైనికవాద్యములు, కాల్బలము కోటలోనికిఁ బ్రవేశించెను. మండలి సభ్యులు, రాజకుమారుఁడు పిమ్మటఁ బ్రవేశించిరి. ఆశ్వికదళము కోట వెలుపలనే యాగిపోయెను. ప్రజా సమూహము లోనికిఁబోరాదు. ఆ యుత్సవము సర్వజనుల కుద్దేశింపఁబడినది కాదు. ఆహూతులైన కొందఱు ప్రముఖులు తప్పఁ దక్కినవా రందుఁ బాల్గొను టకు వీలులేదు. ఆశ్వికదళము కోటచుట్టును కాపుండెను.

రాజకుమారుఁ డధిరోహించియున్న భద్రగజము పట్టాభిషేక మండప ప్రాంగణమున నాగెను. ముందు నడచు కాల్బలమునందలి వేయిమంది మండపములోనికి నడచిపోయిరి. మిగిలినవారు మందిరమును బరివేష్టించిరి. రాజసభలోని కిందఱు సైనికులు ప్రవేశించు టంతవఱ కెన్నడును జరుగలేదు. రాజకుమారుఁడు భద్రగజము దిగెను. ఆతనిని మాకరా జెత్తుకొనియుండెను. జగ్గరాయలు అందఱి మధ్యనుండి నడచుచుండినను కన్నులతో నెవ్వరికెట్టి యాజ్ఞ లొసఁగవలయునో యా యాజ్ఞ లిచ్చుచునేయుండెను. అతనితోఁ గొన్ని నెలల పరిచయముండినఁగాని యాతని కన్నుల బాస యర్థముకాదు. ఆనాఁడు జరుగుచున్న కార్యక్రమమంతయు జగ్గరాయ లేర్పాటు చేసినదే. అది నియమ బద్ధముగా నిశ్శబ్దముగా జరిగిపోవుచుండెను.

రాజకుమారు నెత్తుకొని యున్న మాకరాజు ముందు నడచెను. అతని వెనుక జగ్గరాయలు, అతని పిఱుఁద మహామండలి సభ్యులు. మాకరాజు సింహా సన ప్రాంతమునకు బాలునిఁ దీసికొని వెళ్ళెను. సభ్యు లిదివఱకే నిర్దిష్టములైన యాసనములందుఁ గూర్చుండిరి. సైనికులు విచ్చు కత్తులతో నియమిత ప్రదేశ మున నిలువఁబడియుండిరి. నాఁ డా సభ యలంకరింపఁబడి యున్నను పండుగ శోభలు వెల్లివిరియుటకు బదులు భయంకర వాతావరణము వెడలఁ గ్రక్కు చుండెను. ఆనాఁడు కోటపైఁ గలి నిద్రించుచున్న ట్లనిపించెను.

స్త్రీజనమున కానాఁడు ప్రవేశములేదు. మాకరాజు బాలుని సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టెను. నియమముచే మూర్ధాభిషిక్తుఁడు గానివారు దానిపైఁ గూర్చుండుటకు వీలులేదు. కాని, నాఁడది యుల్లంఘింపఁబడినది. మందిర ప్రాంగణమున వాద్యములు మ్రోఁగుచుండెను. జగ్గరాయలు సింహాసనమునకు ప్రక్కనున్న యొక యున్నతాసనముపైఁ గూర్చుండి యుండెను. సింహాసనముపైఁ బాలుఁ డధివసించియుండెను. అతని కిరుప్రక్కల మహామండలి సభ్యుల యాసనము లుండెను. మాకరాజు రాజకుమారుని కంగరక్షకుఁడయ్యెను. సభ స్తబ్దమయ్యెను, ఎవ్వరేమియు మాటాడలేదు. జగ్గరాయలు తన దక్షిణ భుజమెత్తెను. సభ రాజకుమారుని గూర్చిన జయజయ ధ్వానములతో మాఱుమ్రోఁగిపోయెను.

శ్రీరంగరాయలు రాజకుమారు నాశీర్వదించుటకు విచ్చేయుచున్నట్లు వందులు స్తోత్రపాఠము చదివిరి. వానిని వినుటచే జగ్గరాయలు పండ్లు పటపట కొఱికెను. అతని కన్నులు చింత నిప్పులయ్యెను. ఫాలము ముడుతపడెను. శ్వాసలో హాలాహలము రేఁగెను. రాయలు ముఖద్వారమునఁ బ్రవేశించెను. జగ్గరాయ లాతని వైపు నడచెను. రంగరాయలు బాలుని గద్దెపైఁ గాంచెను. జగ్గరాయలు సభ తిలకించెను, నాఁ డేదియో ప్రచండ సంఘటనము కొరకు కాలపురుషుఁడుడు వేచియున్నట్లనిపించెను, రంగరాయ లాశ్చర్యపోయెను. అతఁడు తాను బెబ్బులి వసించు గుహాంతరమున కరుదెంచినట్లు భావించెను.

జగ్గరాయలు శ్రీరంగరాయలకు మోఁకాలిపై వంగి నమస్కరించెను. ఇది యెన్నఁడు జరుగనిపని. రంగరాయలు శంకించెను. జగ్గరాయలు లేచి నిలిచి రంగరాయల ననుగమించెను. రంగరాయలు సింహాసన ప్రథమ సోపానమునకుఁ బది యడుగుల దూరమునకు వచ్చెను. మహామండలి సభ్యులు తన్ను పరివేష్టించి జగ్గరాయలవలెనే నమస్కరించు చుండిరి. తిమ్మానాయకుఁడు రాయల పాదములముందు వ్రాలెను. జగ్గరాయలు రాయల వెనుక నిలువఁబడి యుండెను. శ్రీరంగరాయలు సంభ్రమముతో సభ్యులను దిలకించుచుండెను. తిమ్మానాయకుఁడు రాయల పాదముల నొడిసి పట్టుకొనెను. రంగరాయలు వదిలించుకొను ప్రయత్నమున నించుక నడుము వంచెను. జగ్గరాయ లాతని రెక్కలు విఱిచి పట్టెను. రావిళ్ళ వెంకయ రాయల ముఖము పటముతోఁ గప్పెను. చినయోబలేశుఁడు రంగరాయల బంధించెను. పదిమంది సాయుధ భటులు రంగమున దూఁకి రంగరాయల నెత్తుకొని పోయిరి. మత్తగజము నేమ తలమని నమ్మి గోతిలోఁబడి వేఁటకాండ్ర చేతికి జిక్కెను.

జగ్గరాయలు విలయ మార్తాండమూర్తి యయ్యెను. సభ కాతనిని గాంచి నంతనే గుండె బెదరినది. అతని ముఖమునందు రుద్రరేఖ తాండవించినది. అతనిమేన సమవర్తి యావేశించినట్లైనది సభ్యులందఱు రాజకుమారునికి జయ జయలు వెట్టిరి. మండలి సభ్యులెల్లరు రాజకుమారునికి రక్షకునిగా జగ్గరాయలను గీర్తించిరి. జగ్గరాయలు హేమకిరీట మా బాలుని శిరమునందుంచెను. జయజయ ధ్వానములు కోట శిఖరమునఁ బ్రతిధ్వనించెను. జగ్గరాయలు బాలు నందఱకుఁ జూపించెను. సభ్యులెల్లరు చేతులెత్తి మ్రొక్కిరి. సభ యంతటితో ముగిసెను.

సర్వసామంత వీరమహామండలి పక్షమున రాజకుమారుఁడు కర్ణాటక సామ్రాజ్య ప్రభువని ప్రకటింపఁబడెను. మండలి పేరు వినఁగనే ప్రజలు కిమ్మనక యూరకుండిరి. దానియందు వారికంత విశ్వాసము. వారము దినములు పట్టణమున పండుగ చాటింపఁబడెను.

రాత్రి జాముప్రొద్దుపోయెను. జగ్గరాయ లొక్కఁడు కోట శిఖరమున కెక్కెను. ఆనాఁ డెందులకో యాతనికి సంతోషము పట్టశక్యమగుటలేదు. ఆనంద మనుభవించుట కాతని దేహము చాలదనిపించెను. శిఖరము నుండి యాతఁడు పట్టణమును దిలకించెను. సామాన్యముగ ప్రాగ్దక్షిణోత్తర దిశలందు పర్వత పంక్తులును, ఆగ్నేయ, పశ్చిమములందు పల్లపు భూములును వ్యాపించియున్న ప్రకృతి యెదుమైళ్ళ విస్తీర్ణమువఱకు నచ్చటికి గోచరించును. కాని, చీఁకటి యగుటచే నుత్సవ సందర్భమునఁ గాంతిపుంజము విరజిమ్ముచున్న చంద్రగిరి మాత్రమే యాతనికి దృగ్గోచరమయ్యెను. ఆతని కంధకారమునందలి సౌందర్య మన్న ప్రీతి. ఆనాఁటి నగర మాతనికి రాక్షస వివాహమున గ్రహించిన రాచ కన్నెవలెఁ గానిపించెను.

రాజకుమారుని జన్మకాలమునఁ దన కన్నులలో మెదలిన కోట శిఖరము నేఁడు తన పాదముల క్రింద నున్నది. వేంకటపతి మహారాయల కాలమున దిగ్దంతులని పేరుగాంచిన యోధవరులు నేఁడు తనకు దాసోహమనిరి. కర్ణాటక సామ్రాజ్య నిర్వహణ భారము తన భుజాదండమున నిలచినది. తానిప్పు డిది వఱకుఁ గన్నకలలు నిజముగా ననుభవించుచుండెను. తానిప్పు డిదివఱకూహించిన జగ్గరాయలు. తాను లక్షించిన గమ్యము సులభముగఁ జేతికందినది. జగ్గ రాయలు కడుపార నవ్వెను. తన జన్మలో పెద్దగా నవ్విన నవ్వది యొక్కటే! అంతలో భటు డొకఁడు వచ్చి రాణుల ప్రవేశము సూచించెను.

జగ్గరాయలు శిఖరము దిగివచ్చి రాణులకు దర్శనమిచ్చెను.

కొండాంబ : సోదరా! కార్యక్రమ మూహించినట్లు ముగిసినదా?

జగ్గ : మీ తమ్ముని యూహ కంచుకోట మహారాజ్ఞీ! దానికిఁ జలనము లేదు.

బాయాం : శ్రీరంగరాయల నెచ్చట నుంచితిరి?

జగ్గ : సకుటుంబముగా భూగర్భ కారాగారమున.

కొండాం : భార్యా పుత్త్రిలనుగూడ బంధించితివా?

జగ్గ : నేనుగాదు, దేశము బంధించినది.

బాయాం : కాని, జాగ్రత్తగ నుండవలెను. రాజకీయములు క్షణ క్షణ పరివర్తమానములు.

జగ్గ : నిజమే. కాని, వానిని మనవైపు త్రిప్పుకొనుటయే నీతిజ్ఞుని లక్షణము.

కొండాం : యాచమనాయని వృత్తాంత మేమైనఁ దెలిసినదా?

జగ్గ : అతఁడు గండరగండఁడు. ఎచ్చటనైనను క్షణములోఁ జొరవ చేయఁ గలఁడు. కాని, వాని నవరంధ్రములు త్వరలో బిగింతును.

కొండాం : అతని నెవరైన సమర్థించుచున్నారని తెలిసినదా?

జగ్గ : వెలుగోటి వంశము వారు తప్ప నింతవఱకు నాకుఁ దెలిసినంతలో నెవ్వరును లేరు. అందునుఁ గొందఱు మన పక్షమున నున్నారు. అదియును గాక యుదయమువఱకుఁ జంద్రగిరి మహాప్రభు వాతనివాఁడు. అతఁ డేవిషబీజములు నాటెనో తెలియదు.

కొండాం : పుర రక్షణ మెట్లున్నది?

జగ్గ : పూర్వోద్యోగులను నేను పూర్తిగా నమ్మియుండలేదు. వారిపై నావారినిఁ గాపుంచితిని. మాకరాజు దానిని నిర్వహించుచున్నాఁడు.

బాయాం : ఈ దినము రాగమంజరి నాట్యము సేయలేదఁట!

జగ్గ : సోదరీ! అచ్చట దాని ననుభవించి యానందించు బాయాంబలు లేరు. అయినను ఆ సమయమున వినోదము కుంపటిలో తామర వెట్టినట్లుండును. కాన, నేనే వలదంటిని. రాగమంజరి పెనుగొండకుఁ బయనమాయెనా?

బాయాం : తమ్ముఁడు యతిరాజుటు తీర్థయాత్రకు బయలు వెడలెను. అమ్మె పెనుగొండకు వెడలిపోయె.

జగ్గ : యతిరాజు కళ్యాణినికూడఁ దీసికొని వెళ్ళెనా?

బాయాం : దానికి నడచు నీడుకాదు, ఎత్తుకొను నీడును గాదు. రాగమంజరి యొద్ద సంగీత నాట్యములు నేర్చుకొనుసని దానితోఁ బంపినారు.

జగ్గ : వాఁడొక వెఱ్ఱివాఁడు. లేనిచో నీయీడున తీర్థయాత్ర లేమిటి?

బాయాం : మేమైనచోఁ గొంత వయోధర్మము కలిసి వచ్చెడిది.

జగ్గ : సరి. మీరండఱు కాశికి వెళ్ళినచో నీ బాలునిగతి యేమి? మీరీ దినము నుండి రాజమందిరమునందుండి బాలునిఁ గాచుకొనుచు రాజమాతలు కండు.

భటుఁడు మాకరాజు వచ్చెనని తెల్పెను. రాణులు లోనికి వెడలిపోయిరి. భటుఁ డాతనిని ప్రవేశపెట్టెను. మాకరాజు చాల ఆత్రముతో జగ్గరాయలకు నమస్కరించెను. ఆతఁడు స్విన్నగాత్రుఁడై యుండెను.

జగ్గ : ఏమి విశేషములు?

మాక : ప్రభూ! యొక వింత విషయము.

జగ్గ : ఎచ్చట?

మాక : మన కారాగార ప్రాంతమున.

జగ్గరాయ లదరిపడెను. భ్రుకుటి ముడివైచెను. వామ హస్తమున దక్షిణ ముష్టిఘాత మొసర్చెను.

జగ్గ : ఎచ్చటనైన ఆ పురుగులు చలించినవా?

మాక : కొంత యనుమానముగనే యున్నది.

జగ్గ : జరిగిన సంగతి త్వరగాఁ దెల్పుము.

మాక : నేను మీ నిర్దేశము ప్రకారము కారాగారమునకుఁ బ్రక్కగానున్న కొండలపై నెత్తైన శిఖరము నధిరోహించి పరీక్షించుచుంటిని. ఒక రెండు గడియలకు పూర్వము కారాగార శిఖరమున కెదురుగనున్న కొండజాతిపై నొక కాగడా వెలుతురు కనఁబడెను. దానికి సమాధానమా యన్నట్లు కారాగా రోపరిభాగమునందలి బురుజుపై మఱియొక కాగడా వెలిగింపఁ బడినది. రెండును కొద్దికాలముపాటు సాంకేతికమైన సంజ్ఞ లొనర్చు కొనినవి. వెంటనే రెండును ఆరిపోయినవి. నేనా కాగడా వెలిగిన ప్రాంతమ్మును గాలించితిని. చీఁకటియే మిగిలియున్నది.

జగ్గ : (పండ్లు పటపటకొఱికి) విషబీజములు మొలకెత్తినవి.

ఇద్దరును సంభ్రమమున నశ్వారూఢులై కారాగారమువైపు వెడలిపోయిరి. కోట కెదురుగా నరమైలు దనుక రాచబాటపైఁ బోయి, యటనుండి తూర్పుగా మరలు విశాలమైన మార్గమున మఱియొక అరమైలు పోయినఁగాని కారాగారము రాదు. కాని, వారాబాటను త్యజించి, దగ్గఱ త్రోవయగు నిఱుకుమార్గముపట్టి క్షణములోఁ గారాగార మధ్యమునఁ బ్రత్యక్షమైరి.

అట్టి నిశీథ సమయమున జగ్గరాయల నచ్చట చూచుటతోఁ గారాగారాధ్యక్షుని ప్రాణములు నిలువున నెరిగిపోయినవి. ఆతఁడు వణఁక నారంభించెను. జగ్గరాయల కనుమానము హెచ్చెను. శ్రీరంగరాయలు బంధింపఁబడిన గృహమును బరీక్షించెను. అందు రామదేవరాయలు లేడు. జగ్గరాయ లాజ్యము పోసిన యగ్ని యయ్యెను. తానిన్నాళ్ళు సమర్థముగా నిర్మించుకొనిన మహా సౌధము పునాదులు పెకలించిన యా యధికారిపై నతఁడు విఱుచుకొనిపడెను. అతఁ డేమి చేసెనో యాతనికే తెలియదు. అతనితో పాటు కారాగారాధికారుల కందఱకు నదియేగతి యని యఁతడు శాసించెను. కాని, యొక ముదుసలి ప్రాణభయమున నాబాధ కోర్వఁజాలక జరిగిన వాస్తవము చెప్పివేసెను.

కారాగార రక్షణాధికారు లందఱు బంధింపఁబడిరి. రాయలయాజ్ఞచే సాయుధబలము కోటను కావలా కాయుచుండెను. మాకరాజు రాయలచేఁ గారాగారాధ్యక్షునిగ నియమింపఁబడెను.

జగ్గరాయ లారాత్రి గుఱ్ఱముపై చంద్రగిరి చుట్టును ప్రదక్షిణము చేసెను. అతఁ డెందుల కట్లు చేసెనో యాతనికే తెలియదు. హృదయ మంబరమున విహరించుచుండెను. దేహము గుఱ్ఱముపైఁ దిరిగివచ్చెను. ఆనాఁటి రాత్రి యాతఁడు నిప్పులపైఁ బండుకొనెను.

తెల్లవాఱినది. సూర్యోదయముతో రావిళ్ళ వెంకయ్య రాయలను దర్శించి గడచినరాత్రి పెనుగొండ వెళ్ళుచున్న రాగమంజరి శకటముపై దుండగులు కొందఱు దాడి చేసిరనియు, కళ్యాణితో సహా ఆమెను బందిగాఁ దీసికొనిపోయిరనియు; అశ్వములను, కావలివారిని జంపివేసిరనియు వేగు తెలిసినదని విన్నవించెను.

జగ్గరాయలకు సలసలకాగు నూనెలో మునిఁగినట్లయ్యెను. వేయితేళ్ళులు మేను కుట్టినట్లనిపించెను. ఆతఁడు సింహమువలె గర్జించెను. పట్టుతప్పిన

యుడుమువలె నాసనమునఁ గూలఁబడెను. ఆ రోజతఁ డామందిరము వీడి బయటికి రాలేదు. నిజముగా నాతఁడా మందిరములో నొక్క క్షణమైన నుండలేదు.

ఆనాఁ డమావాస్య. రెండుజాముల ప్రొద్దుపోయినది. మాకరా జొక యుత్తరము తెచ్చి రాయల కిచ్చెను. అతడుఁ చదువుకొనుచుండెను. మధ్య మాకరా జిట్లనెను:

"ప్రభూ! నేను నిన్నటి సంకేతముల బాటించితిని. ఈ లేఖతో నొక బాణము నా పాదములచెంత వ్రాలినది" అని యొక బాణము రాయలచేతికందించెను. దానిని రాయలు పరికించెను. దాని ముఖముపై యా.నా. అను నక్షరములు చెక్కఁబడి యుండెను. రాయలు నిలువున మండెను. కాని, యాతఁ డంతలో నిబ్బరించుకొని యొక లేఖను మరల వ్రాసి మాకరాజున కిచ్చెను. అతఁడు దాని నెడమచేతితో వ్రాసెను.

"ఇదియొక క్షణములో నొక భటునితో నా సంకేతమునకుఁ జేరవలెను. సంకేతాక్షరములు 'బ్రహ్మన్న.'"

మాకరాజు వెడలిపోయెను. జగ్గరాయలు కోట శిఖరమున కెక్కఁబోయెను.

తెల్లవాఱెను. రాణుల మ్రొక్కుఁబడి తీర్చుటకై తిరుపతి వేంకటేశ్వరులను దర్శింప నాఁడు సాయంకాలము జగ్గరాయలు బయలుదేఱి వెళ్ళునని చంద్రగిరియందు ప్రకటింపఁబడినది. అతఁడు తనవెంట నైదువేలమంది కాల్బలమును, అయిదువందలమంది యాశ్వికబలమును సహాయార్థము కొనిపోవుననిగూడఁ బ్రకటితమయ్యెను.

జగ్గరాయలు కదలిపోవుచుండ నది యాత్రఁవలెగాక యొక రాష్ట్రముపై దండు వెడలి నట్లనిపించెను. సింహము గుహనుండి సంచారార్థ మరుగుచున్నట్లు కనిపించెను.

అర్ధరాత్ర మయ్యెను. ఆగ్నేయముగా తిరుపతివైపు నడచిపోయిన రాయలసైన్యము నాల్గుమైళ్ళదూరము నడచి యచ్చట రాత్రి యగునంతవఱకు విశ్రమించెను. నలుమూలల చీఁకటులు మూసికొని రాఁగనే వారు మఱల

యానము సాగించిరి. ఆనాఁడుకూడ చంద్రుఁ డుదయింపఁడు. కాని అమవస యంత గాఢాంధకారము లేదు. జగ్గరాయలు ముందు నడువ వారు పాము కన్నులతోఁ జూచుచు సాగిపోవుచుండిరి. అతఁడు దక్షిణమునకుఁ దిరిగి కొండ లలో, గుట్టలలో, చిట్టడవులలో దారితీయుచుండెను. అఱ్వైదుమైళ్ళు నడచిన తరువాత జగ్గరాయలు రావిళ్ళ వెంకయ్య కాశ్వికదళము నప్పగించి కారాగారమునకు రెండుమైళ్ళ దూరముననున్న నొక కొండ మలుపులో వేచియుండుమని తగిన నియమములన్నియుఁ దెల్పి తానా కాల్బలమును గొని కారాగారమువైపు నడచిపోయెను.

కారాగారము చంద్రగిరి పట్టణమునకు వెలుపల నైఋతిమూల నొకొండ గుట్టలమధ్య నిర్మింపఁబడి యుండెను. చీఁకటిపడినచో నయ్యది పాతాళ గృహమువలె భయంకరముగా నుండును. జగ్గరాయలు తన సేనతో నిశ్శబ్దముగా నందుఁ బ్రవేశించెను. మాకరా జప్పటికే సేన నుంచవలసిన విధమున సిద్ధము చేసియుండుటనే నొక్క క్షణమునఁ గొంత సేన భూగర్భ గృహములకు నడచి యొదిగి నిలిచినది. కొంత సైన్యము కారాగారోపరిభాగముపై కదలక పరుండి యాయుధములు సిద్ధముగ నుంచుకొనెను. కొంత సైన్యము చుట్టునుండు కొండరాల మఱుఁగునను, గుట్టల చాటునను దాఁగి నిలిచినది.

అర్ధరాత్ర మగుసరికి చంద్రగిరికి దక్షిణదిక్కుననున్న కొండప్రాంతములలో కొన్ని కరదీపములు గనవచ్చెను. జగ్గరాయ లొక బురుజునం దుండి వానిని గాంచుచుండెను. మాకరాజు వారి నుద్దేశించి యథాపూర్వముగా దివిటీతోఁ గొన్ని సంకేతము లొనర్చెను. కారాగార ముఖద్వారము పూర్తిగా తెఱవఁబడెను. కావలి వారెవ్వరు నచ్చట లేరు.

క్రమముగా నా దివిటీలు సమీపమున కరుదెంచెను. వారైదువందలమంది యాశ్వికులు. దివిటీకాంతిలో వేలూరు దుర్గాధిపతియైన ఈటె యోబళేశుని ధ్వజము మెఱయుచుండెను. వారు సరాసరి కారాగారద్వారము దరిఁ జేరిరి. మాకరాజు సమయోచితములగు సంకేతముల నిచ్చుచుండెను. జగ్గరాయ లంతకుఁబూర్వమే భూగర్భ గృహమునఁ జేరియుండెను.

ఈపె యౌబలేశుఁ డశ్వము దిగెను. సైనికులంద అశ్వములు దిగిరి. ప్రధానద్వారము తెఱచియుండెను. ఔబలేశుని ముఖమున చిఱునవ్వుదయించెను. అతఁడు కత్తిఁ బైకిఁదీసి కారాగారము ప్రవేశించెను. కొంత దూరమున నొక యధికారి యాతనికి "బ్రహ్మన్న" అనుచు నమస్కరించెను.

"సర్వము సిద్ధమైనదా?"

"మీ కొఱకే యందఱము వేచియున్నాము."

"రాయలుండు ప్రదేశమునకుఁ ద్రోవ యెచ్చట?"

"మీరిచ్చిన వాగ్దానము చెల్లించినచో!"

ఔబలేశుఁడు నవ్వెను. ఒక్కతూరి వెనుకకుఁజూచెను. నాణెములు నింపి కుట్టిన రెండు సంచుల నిద్దఱు సైనికు లాతని కిచ్చిరి. అతఁడు సంతసించినట్లు భావము ప్రకటించెను. అధికారి యొక సేవకునిఁ బిలిచి యౌబలేశునికిఁ ద్రోవ చూపించుమని యాజ్ఞాపించెను. ఔబలేశుఁ డైదుగురుభటులను వెంటఁ బెట్టుకొని లోనికరిగెను. మిగిలిన సైన్యమంతయు సువిశాలాంతర ప్రదేశమున నిలచి యుండెను. వారి చుట్టును వలయాకారమున కారాగార భవన మావరించి యుండెను.

భటుఁ డౌబలేశుని భూగర్భ గృహమునకుఁ గొంపోయెను. వంపులు తిరిగిన యిఱుకుబాటలలో నెంతయో దూరము కొనిపోయెను. చివరకొక విరామ ప్రదేశము వచ్చెను. అచ్చట నొక్క దివిటీ మాత్రము కాలుచుండెను. వారు దాని మధ్య నడచి వెళ్ళిరి. ఈశాన్యమునం దొక్క పూనిసి పట్టునంత ప్రమాణమున ద్వార మొండు కలదు. దాని ముఖమున నా భటుఁడు నిలిచి యొక తాళపు చెవుల గుత్తి యాతని కందించెను. ఔబలేశుఁడు తన యైదుగురు భటులను ముందు లోని కంపెను. వారు మఱల తిరిగివచ్చి రాయలు సకుటుంబముగా నున్నట్లు సూచించిరి. ఔబలేశుఁ డుత్సాహముతో నాభటునిఁ గాంచెను. తాను నా ద్వారమునఁ బ్రవేశించెను.

ఔబలేశుఁ డొక భటుని చెవిలో నేదియో యూదెను. అతఁడు వచ్చిన త్రోవనే తిరిగిపోయెను. ఔబలేశుఁడు రంగరాయల కారాగారద్వారము తెఱచెను. రంగరాయలకు "ప్రభూ!" అనుచు నమస్కరించెను. రాయ లాశ్చర్యపోయెను.

తన నలుగురు భటులను రాయల సంకెళ్ళు విప్పుటకై యాజ్ఞాపించెను. వారు ప్రయత్నించుచుండిరి. ఇంతలో కారాగార ద్వారము బంధింపఁబడుచున్నట్లు శబ్దమయ్యెను. అంద ఱావైపు కాంచిరి. జగ్గరాయ లట్టహాసము చేసెను. అది కారాగార శిఖరమున ప్రతిధ్వనించెను. ఔబలేశుఁడు నివ్వెరపోయెను.

ఔబలేశుని భటుఁ డశ్వముపైఁ గారాగారము వీడి చీఁకటిలో లీనమై పోయెను. ఇంతలో కోటలో జగ్గరాయల నవ్వు మ్రోసినది. ముఖద్వారము బంధింపఁబడినది. లోననున్న సైన్యసమూహముపై కోటపైభాగమున వేచియున్న సైనికులు కొందఱు బాణవర్షము కురియించిరి. కొంద ఱగ్నివర్షము కురియించిరి. దారితెన్నులు లేక యా సైన్యము వలలోఁజిక్కిన చేపలవలె కొట్టుకొనెను.

భటు డరమైలు దూరము వెళ్ళెను. వెనుక హాహాకార శబ్దములు విన నయ్యెను. ఒక్కసారి వెనుకకుఁ గాంచెను. కోటపై రెండువేలసైన్య మతనికి దృగ్గోచరమయ్యెను. ఆతని గుండె వగిలెను. అతఁడు వెనుదిరుగక పరుగెత్తెను. ఆతని కరదీపము రెపరెప కొట్టుకొనెను.

రావిళ్ళ వెంకయ్యకు జగ్గరాయ లిచ్చిన యాజ్ఞల ప్రకార మా దివిటీని శ్రద్ధతోఁ బరికించుచుండెను. అది తనను దాఁటి మైలుదూర మరిగినది. దానిని జూచి మఱి యేఁబది దివిటీలు వెలిగింపఁబడినవి. వెంకయ్య కొడలు పొంగి పోయెను. అవి ముందుకు నడచివచ్చినచో నాహుతి యొనర్పవలెనని యతఁ డుత్సాహపడుచుండెను. కాని, యాతఁ డూహించినట్లు జరుగలేదు. ముందుకు నడచుటకు బదు లా దివిటీలు వేగముగా వేలూరుదిక్కు పరుగిడిపోవుచుండెను. వెంకయ్య యవుడు గఱచెను.

జగ్గరాయల యావేశమున కంతులేకపోయెను. అతఁడు రెక్కలు విచ్చిన రాబందువలె రెచ్చిపోయెను. నేఁడు కర్ణాటక సామ్రాజ్యమున కాతఁడు ప్రభువు. తన కదృష్టము కలిసివచ్చినది. దేశము తనను దేవుఁడని నెత్తి కెక్కించుకొన్నది. తన ముందు ప్రభునని పేరుపెట్టుకొని శ్రీరంగ రాయ లౌబలేశునిచే నమస్కారము గొనినాఁడు, తనముందు మఱియొకఁడు ప్రభువన్నచో నతని కొడలు మండుచున్నది. తా నింతవఱ కాపదవిని తుడిచి వేసితినని సంతోషించుచుండెను. కాని, అది యొక వ్యక్తి నాశ్రయించుకొనిన దిచ్చట. అనాథయైన కర్ణాటక సామ్రాజ్యలక్ష్మి తనసుఁ బొందవలెనని యతఁ డిన్నాళ్ళుగన్న స్వప్నము.

కాని, శ్రీరంగరాయల నౌబలేశుఁడు ప్రభువనినాఁడు. యాచమనాయఁ డీతని రక్షింప యత్నించుచున్నాఁడు. ఈ నాటకము తాను సహింపలేఁడు. ఈ వ్యక్తుల నంతమొనర్చినఁగాని ఈ నాటక మంతముగాదు. ఆతనియందు పది జన్మల క్రూరత్వము మూర్తీభవించెను. నిర్దయ రక్తము నావరించెను. ఆతఁడు లయకాలుని యవతారమయ్యెను.

ఆతనినిగాంచి బందీకృతులు నిశ్చేష్టులైరి. జగ్గరాయలు తన వాడికర వాలము నెత్తి వరుసగా వారి శిరములన్నిటిని ఖండించెను. శ్రీరంగరాయలు, ఆతని భార్య, ఔబలేశుఁడు, నల్గురుభటులు తెగి విలవిల తన్నుకొనుచుండిరి. చిమ్ముచున్న వారి రక్తము జగ్గరాయల శరీరము తడుపునుండెను. అతఁడు రాక్షసునివలె నొక పెద్దనవ్వు నవ్వెను.

## ఆఱవ ప్రకరణము

పూజారి గోపాలబాలునికి నీరాజనమిచ్చెను. రాగమంజరి యా దేవుని దివ్యమంగళ విగ్రహమును భక్తి పురస్సరముగా హృదయమున నిల్పినది. ఆతని పాదరాజీవములపైఁ బూజింపఁబడియున్న గులాబీపూవులు బృందావనమున నాతని కర్పితమైన గోపికా హృదయములవలె నొప్పారుచుండెను. రాగమంజరి పుష్పాక్షతలు దేవుని పాదములయం దుంచెను. రాధ తన మేను గోవింద పాదార్పిత మొనరించినట్లయ్యెను.

పూజారి పూజ ముగించి, తీర్థప్రసాదములు రాగమంజరి కిచ్చి వెడలి పోయెను. రాగమంజరి యా దేవదేవుని గర్భాలయ పార్శ్వమున ధ్యానముద్ర పట్టెను. మినుకు మినుకుమనుచున్న యచ్చటి దీపము కాంతి నింపుకొనెను.

ఆమె రాధయైనది. బృందావనమున మాధవునికొఱకు మేనంత కన్నులుగా వెదకుచున్నది. ప్రతి వృక్షము, ప్రతి లత, ప్రతి పుష్పము, ప్రతి ఫలము ఆమె కామనోహరాకారుని రూపమున భాసించెను. ఆమె వాని దరి చేరును. ఆమె తన కన్నుల నమ్మలేకపోవును. అతని పద పంకేరుహ సేవా నిరతికై ఆమె హృదయము పరువు లెత్తుచుండెను. ఆమె కన్నుల నీరునింపి హృదయ వీణాతంత్రులను మ్రోఁగించి నీలమేఘశ్యాముని గీర్తించెను. ఆతని ముగ్ధమోహన మూర్తి యామె కన్నులయెదుట ప్రత్యక్షమయ్యెను. ఆమె వివశయై యాతని పాదములను హృదయమునకు హత్తుకొనెను. ఆనందాశ్రు

బిందు సందోహమున వాని నభిషేక మొనర్చెను. అతఁడు తన కరుణారస తరంగితమగు దృగ్ప్రవంతుల నామెయందుఁ బ్రసరింపఁ జేసెను. ఆమె తన యానంద పరవశత్వమున నాతనిముం దేతై జాలువాఱెను. అటి త్రివేణీ సంగమము గోచరించెను.

రాగమంజరీ దేహమున పులకలు మొలకలెత్తినవి. ఆమె చంద్రదర్శనమునఁ జంద్రకాంత శిలవలె జెమ్మగిల్లినది. ఆమె లోకమును వీక్షించినది. ఎదుట రామదేవరాయలు దేవునిముందు ధ్యానమగ్నుఁడై కూర్చుండి యుండెను. ఆమె యాతనిని కన్నులార గాంచినది. స్వీయజన్మ సార్థక్యమునకై యెవరిని దాను మనసార పూజించుచుండెనో యా దేవుని లీల లాతనియందుఁ గానఁబడినవి. వానిని క్షణకాల మామె కన్నులతోఁ ద్రాగివేసెను. ఆమె యమృతము త్రాగినట్లైనది.

ఆమె మఱల కన్నులు మూసినది; ఆమె చంద్రగిరి కోటలోని పట్టాభిషేక భవనమున నిలిచినది. ఆమె శివుని విల్లు విఱిచిన శ్రీరామునికి సీతయై మందారమాల నలంకరించినది. రామునివీడి యశోకవనమున నాతనికొఱకుఁ బరితపించినది. అతని సమాగమాకాంక్షతో చిక్కి శల్యమైనది. రావణ సంహారి యగు శ్రీరాముని సమున్నత దివ్యాకార మామెకు వేయి వసంతాల పంట యనిపించినది. అయోధ్యాపురీ రాజ్య సింహాసనమందున్న రామునిఁజూచి యామె జన్మసార్థక్యమందిన ట్లాతని యంకమున వసించినది. నాఁడు తాను నటించిన స్మృతి రాగమంజరి కీనాఁడు మఱల కలిగినది. తనముందున్న సింహాసనాధిష్ఠుఁడైన శ్రీరంగరాయల శృంగారలీలా విలాస విగ్రహ మామె కన్నులపండు వొనర్చెను. ఆమెయం దెన్నఁడెఱుఁగని యామని తొంగిచూచెను. ఆమె హృదయ మెద్దియో మకరందాస్వాదనకొఱ కళ్లులు సాచినట్లయ్యెను. ఆమె యా యనుభూతియందు జీవితము పునీత మొనర్చుకొన తలంచినది. కాని, అది కొనసాగలేదు. ఆ తీరని యాకాంక్ష హృదయమున నవ్యక్త రేఖయై నిలిచిపోయినది. ఆ దేవుఁడు కనుమఱుఁగై పోయెను. ఆకాంక్ష నిలువున కుమిలిపోయెను. కాని, నేఁడీ బాలునియం దేదియో తద్గతమాధుర్యము కొంత గోచరించుచున్నది. ఈతఁడా యఖండ జ్యోతిఃపుంజమునుండి ప్రసరించిన యొక కాంతికిరణము. అందు శ్రీరంగరాయలు ప్రతిబింబించెను. ఆమె కనిర్వచనీయ వాత్సల్య మంకురించెను.

ఆమె యాతని పాలమును ముద్దాడెను. అతఁడు కన్నులు తెఱచి "అమ్మా!" యని కౌఁగిలించెను. ఆమె యశోదాదేవి, కౌసల్యాదేవి యయ్యెను. ఆమెయందు వేయి మకరంద భాండములు తొణికిసలాడినవి. ఆమె గోపాలదేవుని పాదములపై సాష్టాంగపడెను. బాలుఁడు రివ్వున నెగిరిపోయెను.

రాగమంజరి వేంకటపతి మహారాయల యాస్థాన నర్తకి. ఆమె కులమునకు వేశ్య. చిన్ననాఁటినుండియుఁ గృష్ణ భక్తురాలు. ఆమె మేను మహాయోగినికి వలె కాంతి మంతముగ నుండును. ఆమెకన్నులలో క్షమ జీవనము నింపుకొనును. ఆమె ముఖము చంద్రుని కందము నప్పుపెట్టును. ఆమె కిరువది యైదేండ్లు. ఆమె కన్నె. శ్రీకృష్ణునకు జీవితము సంకితము చేసెను. అతఁ డేకొమ్మ కెగురుమనిన తా నాశాఖ నాశ్రయించును. తన కొకతూరి యాలంబనమైన శాఖ కూలిపోయెను. తాను మఱల గోపాలుని యంతఁ జేరినది. ఆజన్మాంతము తానందు నిశ్చింతగా నిలువఁదలఁచినది.

ఆమెకు వెల్లూరు కోటలో జీవిత మొక విధముగా నానందమయమై యుండెను. అందామెకుఁ బ్రత్యేక భవన మీయఁబడినది. అది చాల ప్రశాంతమైనది. కమనీయమైన యుద్యాన వన మా భవనమును బరివేష్టించి యున్నది. తన్మధ్యమున వేణుగోపాలుని దేవాలయము పాలరాతితో కట్టఁబడి యుండెను. ఆమెకు వసతి యా భవనము, నివాస మీ దేవుని మందిరము.

దీనికిఁ దోడు తనకు బాలల సహవాసము. పిల్లలతో సహవాసమన్న రాగమంజరికిఁ గడుప్రీతి. వారు దేవునికి సన్నిహితులు, ప్రతినిధులు. విషపూరితమై లౌకిక వాతావరణము వారిని దాసులుగా నొనరించుకొనని స్వచ్ఛంద మూర్తులు. వారి హావభావములందు, ఆటపాటలయందు దైవలీలలు గోచరించును. వానిలో రాగమంజరి ముల్లోకముల దర్శించుచుండును.

రాగమంజరి దేవాలయమునుండి బయటికి వచ్చెను. ఆమెకు పిల్లల మాటలు వినవచ్చెను. ఆవైపు దృష్టి సారించెను.

రామదేవరాయలు, : దొంగ! నేను చదువుకొనుచుండఁగా కన్నులు మూసెద వెందులకు?

కల్యాణి : నన్ను పిలవకుండ నేల చదువుచుంటివి?

రామ : చదువునకుఁగూడ నిన్నుఁ బిలువవలెనా?

కల్యాణి : నీవు నాకన్న పెద్దవాఁడవు. అందువలన నన్ను పిలువవలసినదే.

రామ : బాగున్నది, రేపు భోజనమునకుఁగూడ పిలువవలె నందువు.

కల్యాణి : కాదు కాదు, పిలిచి అన్నము తినిపించుమందును.

రామ : అందుకనియే నేను పిలువను.

కల్యాణి : అట్లైన నిన్నుఁ జదువుకొననీయను.

రామ : అమ్మతోఁ జెప్పుదును.

కల్యాణి : ఆమె దేవుని గుడిలో నుండి యిప్పుడు రాదు.

రామ : ఆమె జపము నుండి లేచినది.

కల్యాణి : అది నీకెట్లు తెలియును?

రామ : నేనిప్పుడే యచ్చటికి వెళ్ళితిని. అందువలననే పాఠ మాలస్యమైనది. చదువుకొనవలెను. గోల చేయఁబోకుము.

కల్యాణి : ఎంత స్వార్థపరుడవు మామయ్యా?

రామ : ఏమి?

కల్యాణి : నాతోఁ జెప్పకుండ నమ్మయొద్దకు వెళ్ళితివి. నాకుఁ జెప్పకుండఁ జదువుకొనుచుంటివి.

రామ : ఇఁక రేపటి నుండి యిట్లు చేయనులే! ఇదుగో,యీ పద్యము చదువుము.

కల్యాణి : నీవు చదువుము. నీవు పాడుచున్నచో బాగుండును, నా కాఁకలి గూడ వేయదు.

రామదేవుఁడు భాగవతము గానముసేయ ప్రారంభించెను. కల్యాణి యాతనిముందు చిత్తరువయ్యెను. అతఁడు నిమీలిత నేత్రుఁడై పద్యములు చదువు చుండెను. ఆమె కన్నులు మూసి యాతని యంకమునఁ తలయుంచి పరుండెను. అతఁడు గోపికాగీత లాలపించెను. ఆమె కన్నుల జలజల నీరు కార్చెను.

రాగమంజరి నిలువున ద్రవించెను. ఆమె కన్నులలో రాధాకృష్ణులు ప్రత్యక్షమై నట్లయ్యెను. తా ననుదినమును వారిసేవ చేయుచున్న ట్లనిపించెను. రామదేవుఁడు రాగమాపివేసి కన్నులుమూసి కూర్చుండెను. కల్యాణి తన్మయత్వమున నాతని కంఠము కౌఁగిలించెను. రాగమంజరి మఱల కృష్ణుని విగ్రహమ్మునకు నీరాజన మెత్తెను.

దేవుని లీలలు చిద్విలాసములు. ఈ వనికూనలందు రాధాకృష్ణులు నిలిచి యున్నారు. లేనిచో నిట్టి యనురాగమునకుఁ గారణమేది? ప్రాకృతికముగాఁ జూచినచో వీరిద్దఱు బద్ధ విరోధుల బిడ్డలు. వీరికి జన్మసంబంధ మెక్కడిది?

రామదేవుఁడు జయదేవుని గీత మాలపించుచుండెను. కల్యాణి నాట్యము సేయుచున్నట్లున్నది. తాళము తప్పకుండ చిఱుగజ్జెల సవ్వడి రాగమంజరి చెవులందు మ్రోఁగుచున్నది. మఱల వారిని జూడవలయు ననిపించినది.

బాలుఁడు కల్యాణి నాట్యమునకు మెఱుగు పెట్టుచున్నాఁడు. కల్యాణి యాతని పాటకు రూపము నిచ్చుచున్నది. అతఁడామె ముఖమున దృష్టినిలిపెను. ఆమె యాతని లలాటమునందు భావము నిలిపినది. రామదేవరాయలు కన్నులు మూసెను. కల్యాణియుఁ గన్నులు మూసెను. ఆతనియందు కల్యాణి నాట్యము సేయుచుండెను. ఆమెయందాతఁడు సమాధి గతుఁడయ్యెను. ఆతఁడు రాగ మాపెను. ఆమె నాట్యమాపెను. వారిద్దఱు ముఖమున ముఖముంచి యేడ్చిరి. ఇద్దఱు దేవాలయమున కరుదెంచిరి. రాగమంజరి ప్రక్కకొదిగి నిలువఁబడెను. వారిద్దఱు కృష్ణునిముందు నిలువఁబడిరి. గంధ పుష్పాక్షతలు గైకొనిరి. రామ దేవుఁడు నిశ్చలుఁడై నిలువఁబడెను. కల్యాణి పుష్పములను కృష్ణుని పాదము లందుంచినది. రామదేవుఁడు కదలుటలేదు. కల్యాణి యాతని వైపు చూచినది. కృష్ణుని విగ్రహము గాంచినది. మఱల నాతనిఁ గాంచినది. ఆమె కన్నుల నీరు నిండినది. ఆమె యతని చేతులందున్న పుష్పాక్షతలఁ గైకొనినది. తానే కృష్ణుని పాదముపై నిడినది. దేవునికి నమస్కరించినది. రామదేవునికి నమస్కరించినది.

ఆమె హస్త స్పర్శచే రామదేవుఁ డులికిపడినట్లయ్యెను. కల్యాణి తన కన్నులచే నతని ముఖమునకు నీరాజన మెత్తుచుండెను. ఆతఁడు తన మనః పుష్పముల నందుంచెను.

రామ : అమ్మకు నమస్కరింతమా?

కల్యా : దేవునికి నమస్కరించినచో నమ్మకుఁ జెందినట్లే.

రామ : ఈ సాకుతోనైన నామె పాదముల నొకసారి కన్నుల కద్దుకొనవచ్చును.

కల్యా : ఎందులకు? ఆమె యెప్పుడు నా కన్నులలోనే నిలిచియుండును.

రాగమంజరికి దుఃఖము పట్టశక్యము కాలేదు. ఆమె నోటిలో గుడ్డనదుముకొని యేడ్చెను. వారు రాగమంజరి వెడలిపోయిన దని దేవాలయము వీడిపోయిరి.

ఆ 'అమ్మ' పదములో నెంత మాధుర్యము! ''అమ్మా!'' యని పిలిపించు కొన్న స్త్రీ జన్మ స్త్రీజన్మ. అందలి మాధుర్యము రాగమంజరి కీనాఁడు తెలిసివచ్చి నది. "నేను గోవిందుని నమ్మియుండినందుల కీ సంతాన మిచ్చినాఁడు. వీరిని నా సంసార భవాంబుధి దాఁటుటకు పూల తెప్పలుగా సృజించినాఁడు. తానే యీ రూపమున నాకుఁ దరణోపాయముఁ జూపినాఁడు. అతని యిష్టప్రకారము నడచుకొందును" అని తలపోసెను.

కళ్యాణి పదేండ్లబాలిక. ఆమెను సంగీత నాట్యాదులు నేర్చుకొనుటకై యతిరాజు రాగమంజరివద్ద నుంచి సకుటుంబముగాఁ దీర్ఘయాత్ర కేగెను. అతఁడు చాల సాత్త్వికుఁడు, దైవభక్తి సంపన్నుడు. అతని పుత్త్రికయైన కల్యాణి యాతనికిఁ దగినకుమార్తె. ఒక పుత్తడిబొమ్మ. ప్రేమ జీవములుగల మమతల బొమ్మ.

ఆమె రామదేవరాయలను ప్రేమించుచున్నది. వారిద్దఱిమధ్య నేదియో సాత్త్విక బంధములు పెనవేసికొని యున్నవి. ఒకరికై మఱియొకరు హృదయ ముతోఁ బరితపింతురు; మనస్సుతో జీవింతురు. ఇందు రామదేవుఁడు రాగ మంజరి నమ్మా యని పిలుచును. అప్పుడు రాగమంజరి కనిర్వచనీయమైన అంతఃశాంతి యేర్పడును. పుత్త్రివాత్సల్య మామెను ముంచెత్తును. శ్రీరంగ రాయలయం దామెభావము రమించినది. అది యీ జన్మ కెందమావులైనది. కాని, రామరాయ లిప్పు డామె మనసుకు కొంత చల్లఁదనము నిచ్చుచున్నాఁడు. ఆమె యాత్మకు అవ్యక్తమైన ఆనందము కల్గుచున్నది. రాయలయాత్మ నాతని యందు నిక్షిప్తమైనది. ఆమె యాత్మ నాతని కంకిత మొనర్పఁదలచినది.

ఇంతలో రాగమంజరి హృదయమందిరమున "ఆమె యెప్పుడు నా కన్నులలోనే నిలిచియుండును" అను మాటలు ప్రతిధ్వనించినవి. ఆమె లంగరు తీసిన నావవలె గోచరించెను. కల్యాణి తనయొద్ద నాట్యము నేర్చినది. తన శిష్యురాలైనది. పైపెచ్చు కృష్ణుని భక్తురాలైనది. తనకు శ్రీరంగరాయ లను, శ్రీకృష్ణుని గాంచినప్పుడు కలిగిన యనుభూతినే యామె రామదేవరాయ లను, శ్రీకృష్ణుని గాంచినప్పుడు పొందుచున్నది. ఆమెయం దేదియో తన తత్త్వము మెఱయుచున్నది. "నే నామె కన్నులలో నిలిచినాను. క్రమముగా నా యాత్మ యామెయందు నిక్షిప్త మొనర్చెదను. నాయందు ఫలమందని యొకా నొక భావ మామెయందు ఫలమందును. నా యాత్మ దానితో ధన్యమగును" అనుకొని రాగమంజరి నెమ్మదిగా నా మందిరము వీడిపోయెను.

పూజారి వంట చేసినది. ఆమె వడ్డించెను. రాగమంజరి భుజించెను. ఇద్దఱు నేమియు మాటాడుకొనలేదు. ఆమె యేదో ఆలోచనలో నున్నట్లు పూజారి గ్రహించి యూరకుండెను. రాగమంజరి కామెచేతి యన్నమన్న చాల ఇష్టము. ఆమె యొకనాఁడు వెల్లూరునకు దక్షిణమున రెండుమైళ్ళ దూరమున నున్న యొక కొండపై వెలసియున్న చెన్నకేశ్వరస్వామిని దర్శింపబోయెను. ఆనాఁడామె భూరిదానము లొనర్చెను. కాని, అన్నిదానములకన్న అన్నదానము బహుపుణ్యఫలదమని చదువుకొని యుండుటచే నామె యానాఁడు వంటలు చేయించి బ్రాహ్మణ సంతర్పణ చేయవలెనని తలంచెను. కాని, వంటచేయు బ్రాహ్మణు లెవ్వరిని వెంటతీసికొని వచ్చినదికాదు. ఆ విషయమై యాత్రము చెందుచుండఁగా నొకమూల గువ్వవలె నున్న యొక బ్రాహ్మణవనిత యామె ముందునకు వచ్చి నిలువఁబడెను. ఆమె ఎన్నియో దుర్భర కష్ట పరంపరలను జీర్ణ మొనర్చుకొన్నట్లు కన్నులలో గోచరించు చుండెను. అమెను చూడఁగనే రాగమంజరికి చాల దయ కల్గెను. ఆమెయే యానాఁడు వండి వడ్డించెను. ఆనాఁడామె చేతిభోజనము అమృతమయమై, రాగమంజరి హృదయమును జూఱగొనెను. అనాథయగు నామెను తనవెంటఁ గొనివచ్చి, దేవతా పూజనమునకును, వంట వండి పెట్టుటకును. తన యింట నుంచుకొనెను. ఆమె చాల మితభాషిణి యగుటచే నామెతో గౌరవముగ నేకొద్దిసేపో రాగమంజరి మాటాడుచుండును.

రాగమంజరి గృహమునకు యాచమనాయఁడు వచ్చెను.

యాచ :- తల్లీ, రాగమంజరీ! రామదేవరాయ లెట్లున్నారు?

రాగ :- అతఁడు దైవాంశ సంభూతుఁడు, కృష్ణభక్తుఁడు, ఆతని కేమి?

యాచ :- అదియంతయు నీ చలువయేనమ్మా!

రాగ :- పెద్దలు మీరు నన్నభిమానముతో గౌరవించుటతప్ప ఇందు నా ప్రయోజకత్వ మేమియు లేదు.

యాచ :- అట్లుగాదు, దైవమే మానవరూపమున మనముందు నిల్చి రక్షించుచుండును.

రాగ :- మీరా దృఢవిశ్వాసమున నున్నవారలు గనుక మీ కెట్టి దుఃఖము ఖుండవు.

యాచ :- వేంకటపతిరాయలు మాకు నేర్పిన జీవిత పాఠ మదియే.

రాగ:- అతఁడు సాక్షాన్మహానుభావుడు. అట్టివాఁడు మఱల దొరకుట కష్టము. కాలము మాఱుచున్నది.

యాచ :- వారికి నీయం దవ్యాజమైన వాత్సల్య ముండెడిది. దేశము సుభిక్షముగా నుండవలయునన్న మీవంటివారు కొందఱు వ్యక్తులు దేశమునం దుండవలయునని వారనుచుండెడివారు. అందువలననేకదా, మీరు కొంత శ్రమయైనను పెనుగొండకు వెళ్ళుచున్న మిమ్ములను రహస్యముగఁ దెప్పించినది.

రాగ : మీయందు దేవుఁడు ప్రవేశించి యాపని చేయించినాఁడు. లేకపోయినచో పచ్చిరక్తముతో తడిసిన యీ దేశమున నేను జీవించి యుండెడిదానను కాను.

రాగమంజరి కన్నుల నుండి యప్రయత్నముగా రెండు బాష్పబిందువులు చెక్కిళ్ళపై జాఱినవి. యాచమనాయఁడు మోము వంచుకొనెను.

యాచ :- రాయలవారి రక్తబిందు వొక్కొక్కటి యొక్కొక్క జీవిని బలిగొనును. నేను నిజముగా వారి నమ్మిన సేవకుఁడ నైనచో వారి యాధ్యాత్మికశక్తి నాయందుఁ బ్రవేశించి నన్ను విజయమార్గమున నడిపించును. నా రాజభక్తి నా హృదయమున స్థిరపడునట్లు శ్రీకృష్ణుని ప్రార్థించు రాగమంజరీ!

అతని కావేశముతోఁ గూడిన దుఃఖము వచ్చెను. ఇంతలో రామదేవుఁడు "తాతా!" అనుచు చెంగున దూఁకి యాతని మెడ కౌఁగిలించుకొనెను. అతఁడు పంద్రెండేండ్ల వయస్సుఁ గలిగిన బాలుఁడయ్యున్నను యాచమనాయకునికి పసిబాలునివలె గానుపించెను. ఆ బాలుని నాతఁడు మోమున ముద్దు పెట్టుకొనెను. వేంకటపతిరాయలు మఱల యాచమనాయనిలో నావేశించి తన వాత్సల్యము నొలకఁబోయుచుండెనా యని రాగమంజరి భావించెను. కల్యాణి రాగమంజరి వీఁపుపై వండుకొని వెనుకనుండి యామె కంఠము కౌఁగిలించెను. యాచమనాయఁడు, రాగమంజరి బొమ్మల పెండ్లిండ్లకై వధూవరుల నెత్తుకొనియున్న తోఁబుట్టువులవలె భాసించిరి.

# ఏడవ ప్రకరణము

యాచమనాయఁడు వెలుగోటి వంశస్థుఁడు. ఆ వంశమునకు మూల పురుషుఁడు చెవ్విరెడ్డి. అతనినిఁ గూర్చి చిత్రమైన గాధ కలదు. అనుమగల్లను గ్రామమునం దనుమగంటి గోత్రజుఁడైన చెవ్విరెడ్డి యను కాఁపు గలఁడు. అతనికి రేచఁడను పంచముఁడు నమ్మినబంటు. ఆ గ్రామమునకు దక్షిణమున భైరవస్వామి వెలసియుండెను. అతని దయావీక్షణమువలన నా ప్రాంతమున వింశతి కుచ్చెళ్ళ విస్తారముగ గల్గిన క్షేత్రము సుభిక్షమై యుండును. చెవ్విరెడ్డి కాప్రాంతమునఁ గొంత నేల కలదు. దానిని రేచఁడు సాగు చేయుచుండును. ఒకనాఁ డాతఁడు క్షేత్రమును దున్నుచుండఁగా నాగేటిచాలున నొక రాగిరేకు దొరకినది. దాని నతఁడు తన ప్రభుపున కర్పించెను. అం దచ్చట భైరవస్వామి పేర నొక నిధి యున్నదనియు, నరబలినిచ్చి దాని నెవరైనఁ గొనవచ్చుననియు లిఖింపఁబడియుండెను. చెవ్విరెడ్డి కేమియుఁ దోఁచినదికాదు. వెంటనే రేచఁడు తన ప్రభువును గాంచి తనను బలియిచ్చి యా ధనము పొందుఁడని సలహా యిచ్చెను. అతని నందుల కొప్పించెను. కాని, తన ప్రభువు నాతఁడు కొన్ని కోర్కెలు కోరెను.

తన మరణానంతరము తన రేచర్ల గోత్రము చెవ్విరెడ్డి ధరింపవలె ననియు, ఏచఁడను పేరు బేతిరెడ్డి వంశమువారు తమ సంతానములకుఁ బెట్టుకొనుచుండవలెననియు, వివాహాది శుభ సమయములందుఁ దమ కులము వారిచే గంధాక్షతలు కొనవలయుననియు నభ్యర్థించెను. చెవ్విరెడ్డి దాని కంగీక రించెను. అతఁడు రేచని నా నిధికి బలియిచ్చి యింటికిఁ దిరిగి పోవుచుండెను. మార్గమధ్యమున గాలివాన వచ్చెను. అతఁడా ప్రాంతమున సువిశాలములైన శాఖలు వ్యాపించియున్న యొక మఱ్ఱిచెట్టు చెంతచేరి. మూలమున తలదాఁచు కొనెను. ఆ వృక్షముపై నొక బేతాళుఁడుండి యాతనిపై నుఱికెను. కాని, యాతఁడు ధైర్యము వహించి యాతని నెదురొడ్డెను. అతనిని మెచ్చి బేతాళుఁ డాతనికిఁ దన నాపు మొసంగి, దానిని దాల్చుటవలన నాతని వంశమువారికి వేయి సంవత్సరముల వఱకు తఱుగని యైశ్వర్యముండునని యనుగ్రహించెను. నాఁటినుండి చెవ్విరెడ్డి బేతాళ నాయుఁడయ్యెను. తరువాత నా నిధి త్రవ్వించి విశేషధనమును గ్రహించి యా ప్రాంతమునకుఁ బ్రభువయ్యెను. కాకతి గణపతి దేవుఁ డాతని గౌరవించి, లక్షసీమయు, డాలును, ధమారంబును, తాళిచేకట్టును,

గజహయములను నిచ్చెను. అతనికి పిల్లలమర్రి బేతాళనాయని కనుపము నొసంగెను. అతఁడు రేచర్ల యను గ్రామము గట్టించెను. రేచర్ల పుంప్పెషము నుండి జనించిన శాఖయే వెలుగోటి వంశము.

వీరి వంశము ప్రభుభక్తికిని దేశభక్తికిని పెట్టినది పేరు. కాకతీయ సామ్రాజ్య పతనాంతర మాంధ్రదేశము తురుష్కుల చేతులలోఁ గడగండ్ల పాలాయెను. హైందవ సంస్కృతి వారి దారుణ హింసాకాండమునఁబడి కొన యూపిరి వహించి యుండెను. అట్టి సమయమున నీ వంశమునందు జనించిన కాపయనాయకుఁడను వీరుఁడు దేశభక్తిని వహించి, దేశభక్తుల కూటమి నేర్పరచి, తురుష్కుల నోరుగల్లునుండి పాఱఁద్రోలి, యనంతర మాంధ్ర రాజ్యము కొనసాగించెను. పండితుఁడును, శ్రీనాథాది మహాకవి పండిత పోష కుఁడును, రాచకొండ రాజ్య మేలిన ప్రభువును నగు సర్వజ్ఞ సింగభూపాలుఁడీ వంశమునందలి వాఁడే. వీరి వంశమునఁ బదునెనిమిదవ తరమువాఁడైన ఘని తిప్మ విజయనగర ప్రభువులగు శ్రీకృష్ణ దేవరా యాచ్యుతదేవ రాయలకు సామంతుఁ డగుటచే విజయనగర ప్రభువులతో వారికి స్నేహ సంబంధ మేర్పడెను. నాఁటినుండి వారిసేవలు విజయనగర సామ్రాజ్య రక్షణమునందును, విస్తృతియందును సంకీతములైనవి. వెలుగోటి కస్తూరి రంగయ్య, వెలుగోటి చెన్నయ్య వేంకటపతి మహారాయల కుభయభుజములుగా నిలిచియుండి యనంత యశమును గాంచియుండిరి.

యాచమనాయఁడు కస్తూరి రంగయ్య పుత్త్రుఁడు. కుమార రంగప్ప నాయఁడు, సర్వజ్ఞ సింగమనాయఁడు అను సోదరు లాతనికిఁ గలరు. యాచమ నాయనికి యాచశూర యను మఱియొక పేరు గలదు. ఈతని కెనిమిది మంది పుత్త్రిలు. వారు క్రమముగా కుమార రంగప్పనాయఁడు, వెంకటాద్రి నాయఁడు, తిమ్మానాయఁడు (జగ్గరాయల సేనానికాఁడు), కుమారనాయఁడు, రామభద్ర నాయఁడు, కుమార యాచమనాయఁడు, వేంకటప్పనాయడు, చిన వెంకటప్ప నాయఁడు అనువారు. వీరియందు కుమార యాచమనాయఁడు నాయకమణివలె

యాచమనాయఁడు వెలుగోటి చెన్నయ్య చేతిక్రింద మెలఁగెను. వేంకటపతి మహారాయల కాలమున నాతనితో నుత్తరమల్లూరు యుద్ధమునందుఁ జాల్గొని ధావళపావని నోడించి గొప్ప కీర్తి వహించెను. తిరువతి మన్నెరాజుల పీచ

మడఁచెను. మహారాయల హృదయమును చూఱగొన్న వీరాగ్రేసరులలో యాచమనాయకుఁడు ముఖ్యుఁడు. వినయము, ప్రభుభక్తి యాతనికి వెన్నతో వచ్చిన గుణములు. అందువలననే మహారాయల కతఁడు తలలోని నాల్కయయ్యెను.

వేంకటపతి మహారాయలను రాణివాసము మోసము చేసి, బ్రాహ్మణ కుమారు నాతని కుమారునిగాఁ బ్రదర్శించిన తరువాత రాయలా విషయమును గ్రహించి మొట్టమొదటిసారి యాంతరంగికముగా యాచమనాయని కెఱింగించెను. ఆతనిచే తంజావూరు రఘునాథరాయల కావిషయమై వర్తమానమంపెను. శ్రీరంగరాయల రక్షణమును, అతని సంతతినే సింహాసన మెక్కించు భారమును నాయనిపై నుంచి, దానికి తోడ్పడవలసినదిగా రఘునాథరాయల ప్రార్థించియుండెను. ఇవియొక స్వరూపమునకు వచ్చునంతలోఁ జంద్రగిరియందు పరిస్థితులు విషమించినవి.

సర్వసామంత వీర మహామండలియందు యాచమనాయఁ డొక వర్గమునకు నాయకుఁడు. వెలమలంద ఱీతఁ డెట్లు చెప్పిన నట్లు వర్తింతురు. వెలుగోటి వంశీయులు మండలిలో సభ్యులుగాఁ గొందఱు మాత్రమే యున్నను వారిది గంపెడంత బలగము. వారంద ఱీతని కనుసన్నల వర్తింతురు. ఈతని యందుగులు చెంగల్పట్టు, మధురాంతకము, తిండివనము, తిరువడి, వలదాపురము, వందవాసి, పెనుగొట్టూరు, తిరుపత్తూరు, అసమందూరు. కట్టలై, అర్కాట దుర్గముల నేలుచుండిరి. దీనితో యాచమనాయని పలుకుబడి తూర్పు సముద్ర తీర ప్రాంత దేశమునందు బాగుగానున్నదని చెప్పవచ్చును. కావేరివఱకీతఁడు నిశ్చింతగా తిరుగవచ్చును. దక్షిణమున తంజాపుర నాయకరాజుల ప్రభుత్వమున్నది. దాని నేలుచున్న రఘునాథరాయ లపర శ్రీకృష్ణరాయలవలె వెలుగొందుచుండెను. అతఁడు పెక్కు యుద్ధములందు వేంకటపతి మహారాయలకు సహాయ మొనర్చి, దేశమున శాంతిభద్రతలు నెలకొల్పుటలో సాయ మొనర్చియుండెను.

ఈబె యోబలేశుఁడు గొప్ప శూరుఁడు. వెల్లూరు దుర్గాధిపతి. ఆతఁడు యాచమనాయని బాల్యమిత్రుఁడు. అతనికి స్వార్థము మెండు. అయినను మిత్రుఁడగు యాచమ నాయఁడు చంద్రగిరి పరిస్థితులు తెలిపిన తరువాత నాతనికి నాంతరముగా చేయూఁత నిచ్చెను. అందాతని స్వార్థము కొంత లేకపోలేదు.

ఆ విధముగనైన నాతఁడు కర్ణాటక రాజ్య సామంత బిరుదము నూడఁ దీసికొన వలెనని తలపోసెను. ఔబలేశుఁడు జగ్గరాయలు నిర్వహించిన సామంతవీర మహామండలి సమావేశమునకు హాజరయ్యెను. జగ్గరాయల వృత్తాంతము రహస్యముగా యాచమనాయని కందఁజేసెను. రాజకుమారుని పట్టాభిషేకమునకుఁ బూర్వమే చెంజి నేలు కృష్ణప్రభువు మొదలగువారు తమ తమ దుర్గములం దల జడి లేకుండఁ జూచుకొనుటకై వెడలియుండిరి. వారివలెనే ఔబలేశుఁడు వెల్లూరు చేరియుండెను. వచ్చునప్పుడే చంద్రగిరి కారాగారాధ్యక్షునితో సంప్రదించి, లంచమిత్తునని యాశ పెట్టి శ్రీరంగ రాయలు బంధింపఁబడిన రాత్రికే యొక చాకలివాని ద్వారా రామదేవ రాయలను గుడ్డల మూటలలోఁ జుట్టి యొక సంకేత మనకుఁ బంపున ట్లేర్పాట్లు గావించి వచ్చెను. ఆ తరువాత శ్రీరంగరాయల విడిపించు మార్గము నవలంబింతునని చెప్పియుండెను. నిర్ణీత ప్రకారము కార్యక్రమము నిర్వర్తింపబడినది గాని, శ్రీరంగరాయలను మాత్రము యాచమనాయఁడు దక్కించుకొనలేకపోయెను. అతనితో ఔబలేశునిగూడఁ గోల్పోయెను. ఔబలేశుని తరువాత వెల్లూరు దుర్గమును దాను స్వాధీన మొనర్చుకొని, చంద్రగిరి రాజకుమారుని పాలనమం దవిశ్వాసము ప్రకటించెను.

ఆతని ప్రకటనయందలి ముఖ్యాంశము లివి: ప్రస్తుత మేర్పడిన చంద్రగిరి కేంద్రప్రభుత్వ మశాస్త్రీయమైనది. రాజకుమారుఁడు వేంకటపతిరాయల తనూజుఁడు గాఁడు; అనాథ బ్రాహ్మణ బాలుఁడు. ఇది యంతయు కొండాంబా, బాయాంబలను కూడఁగట్టుకొని వారి సోదరుఁడగు జగ్గరాయలు పన్నిన పన్నాగము; రాజకుమారుని పేరుపై సామ్రాజ్యము హస్తగత మొనర్చుకొనుటకై జగ్గరాయలు కావించిన కుతంత్రము. ఆనువంశికముగా శ్రీరంగరాయలుగాని, అతని సంతతివారుగాని కర్ణాటక సామ్రాజ్య సింహాసనమున కర్హతఁ గల్గియుందురు. అందువలన వేంకటపతి రాయ లాబాలుని రాజుగా నిర్ణయింపలేదు. అందులకు మహారాయలు స్వీయముద్రతో రఘునాథ రాయలవారికిఁ బంపిన కమ్మ ప్రబల సాక్ష్యము.

జగ్గరాయలు తన యధికారము దుర్వినియోగ మొనరించుచు నిరంకుశుఁడగుచున్నాఁడు. శ్రీరంగరాయలవారిని సకుటుంబముగా వధించు హక్కాతనికి లేదు. బంధించి మహామండలి యనుమతించిన తరువాత నట్లు గావింపవలసినది.

రాయల నేకారణముచే రాజ్యభ్రష్టు నొనర్చెనో యాతఁడా యంశమునే

యనుసరించుచున్నాఁడు. కావున, చంద్రగిరి కేంద్ర ప్రభుత్వమునపై మా వెలుగోటి వంశ సామంత వీరులకు విశ్వాసము లేదు. మా యాధీనమునందున్న కోటలు, వెల్లూరు దుర్గము స్వతంత్రములైనవని యిందుమూలమునఁ బ్రకటించుచున్నామని చాటఁబడినది. పరిసర దుర్గములకు, రాజులకు, జగ్గరాయలకు, మండలి సభ్యులకు నీ వర్తమానము లంపఁబడెను.

యాచమనాయఁ డొకనాఁ డిట్లూహించెను. "జగ్గరాయలు పగపట్టి బుస కొట్టు త్రాచువలె నున్నాఁడు. ఔబలేశునిదాడి యాతని మఱింత ప్రజ్వలింపఁజేసి యుండును. అతఁ డేనాఁడైన యుద్ధమునకుఁ గాలు ద్రవ్వక మానఁడు. అతఁడు నివురుగప్పిన నిప్పు. ఏ క్షణమునయైన చుఱ్ఱుమనవచ్చును. నేనందులకు సిద్ధమై యుండుట నా కర్తవ్యము. నేను, నావారు తప్ప నేఁడు నాకు కలసివచ్చువారు లేరు. కాఁగా, మహారాయల దయవలన రఘునాథ రాయలవారి స్నేహమొకటి చెక్కుచెదరక యున్నది. అతఁడప్రతిహత శత్రువీరుఁడు. గొప్ప విద్వాంసుఁడు. రణవిద్యా కోవిదుఁడు. ఆతని సలహాపై నీ పవిత్ర యజ్ఞము సాగించుట యుత్తమము. అందులకు స్వయముగా నాతని కడకు రాయబారమేగి వచ్చుట సమంజసము.

ఆతఁ డొక రణయజ్ఞము తలపెట్టెను. దాని కధినాథుఁడు రఘునాథుఁడు. హోత తాను. ఋత్విజులు వెలుగోటివీరులు. యజ్ఞపశువులు జగ్గరాయలు, ఆతని యనుచరులు. ఆ యజ్ఞము రామదేవాంకితమైనది.

దాని కొక శుభముహూర్తము నిశ్చయింపఁ బడెను. రాగమంజరి యానాఁడు శ్రీకృష్ణుని పాదములపై నుంచి పూజించిన రక్షయొకటి యాచమనాయని భుజమున బంధించెను. తన నెత్తురుచుక్కతో నాతని ఫాలమున వీరతిలకము దిద్దెను. ఆనాఁడు యాచమ నాయఁడు దేశభక్తుల కూటమును స్థాపించెను. దేశముపైని, మహారాయల రాజవంశముపైని, స్వీయధర్మ నిర్వహణముపైని భక్తియున్నవారందఱు నందు సభ్యులగుట కర్హులు. అందు కుల మత విచక్షణ లేదు. దేవుని పెండ్లి కందఱు పెద్దలే యన్నట్లు రాజకార్యమున నందఱు సమాన ప్రాముఖ్యము వహింపవలసినవారే. దేశభక్తుల కూటము యొక్క లక్ష్యము మహారాయల వంశాంకురమైన రామదేవరాయలను కర్ణాటక రాజ్య పట్టాభిషిక్తునిఁ జేయుట. ఇందులకై ప్రతిసభ్యుఁడును తన యంతశ్వాస యాడునంతవఱకు శక్తివంచన లేకుండ కృషి చేయవలెనని బద్ధకంకణుఁ

కావలెను అని యగ్రగనాయకులు కొంచ జానాడు తీర్మానించుకొనిరి. వెలమ దొరలు, వెలుగోటి సరదారులు, ప్రజాభిమానులు కొందఱు అందుఁ బాల్గొనిరి. దానిని దేశమునఁ బ్రకటించి వ్యాప్తి నొందించుటకై తన పినతండ్రి కుమారు లైన సింగప, రాయప, అయ్యప, దామెర్ల చెన్నఁడు అను వారిని నాయఁడు నియోగించెను. వెల్లూరు దుర్గ రక్షణ భారము తన సేనానులగు కట్టి చెన్నడు, చెఱకు వెంగళయ్యల కప్పగించి, తాను రఘునాథుని దర్శించుటకు తంజావూరు బయలుదేఱెను.

రఘునాథరాయలు యాచమనాయని నాదరముగ నాహ్వానించెను. నాయఁ డాతనికి సగౌరవముగ నమస్కరించెను.

రఘు : కర్ణాటక రాజ్యమందు పరిస్థితు లెట్లున్నవి?

యాచ : అల్లకల్లోలముగ నున్నవి. వేంకటపతి మహారాయలతోడనే శాంతి యంతరించినది.

రఘు : జగ్గరాయలు ప్రభావ మింకను సాగుచున్నదా?

యాచ : ఆతఁడు క్రూరుఁడు. కపటమున రాజ్యముఁ జేఁజిక్కించుకొని ప్రభుత్వము వెలయించుచున్నాఁడు. అతని తేనెమాటలకు లోనై మహావీరులు సైతము మోసపోయినారు. ఆతఁడు నిరంకుశుఁడై యున్నాఁడు.

రఘు: శ్రీరంగరాయల హత్య ప్రజాహృదయముపై నెట్టి పరిణామమును గలిగింపలేదా?

యాచ: అది యింకను బయటికి పొక్కుటలేదు. మొత్తమునకు దేశమున కాతని తేనెపూసిన కత్తితనము తెలిసిన దనుటలో నెట్టి సంశయమును లేదు.

రఘు: ఇప్పు డాతని బలగ మెంతయున్నది?

యాచ: మా వంశమువారు తప్ప అంద ఱాతనివై పే యున్నారు.

రఘు: అందు బలవంతు లెవరు?

యాచ: మట్లి తిరువేంగళనాథుఁడు, తిమ్మానాయకుఁడు, మాకరాజు, రావిళ్ళ వెంకయ్య, యతిరాజు, సాకమూరుయోధులు, చిన్నరౌతు, తిప్పరౌతు, ఘట్టిమొదలి. వీరంద ఱొకయెత్తు - చెంజి కృష్ణప్రభువు, మధుర ముత్తు వీరప్ప నాయకుఁడు మఱియొక యెత్తు.

రఘు: గొబ్బూరి వంశము వారిప్పు డేయే దుర్గములందు వ్యాపించి యుండిరి?

యాచ: కంపిలి, సత్యవేడు, పొదలకూరు, కుల్లూరు, ఓగూరు, పాలెమకోట మున్నగుచోట్ల నున్నారు

రఘు: అయినచో పాలేరు కావేరి తూర్పు కనుమల మధ్య మీరు రాజ్యము వ్యాపింపఁ జేయవచ్చును గదా!

యాచ: ఒక్క చెంజిదుర్గము పట్టువడినచో నట్లు గావించుట చాల సులభము.

రఘు: చెంజి కృష్ణప్ప వెనుక నాచేతఁ దిన్నతన్నులు మఱచిపోయెను గాబోలు!

యాచ: ఖలునికి నీతియు, లజ్జయు నుండవు.

రఘు: ఆ తుచ్ఛుని పనిపట్టుటకు మీ బలము చాలును. సమయము చూచి చుట్టును మూగి వానిని నలిపివేయుఁడు.

యాచ: అందు మీ చేయి యున్నచో బాగుగా నుండునేమో?

రఘు: కాని, దక్షిణమున మఱియొక దుర్మార్గుఁడు మధురనుండి మనపై నొక్క కన్నుంచియున్నాఁడు. వానిని నేను కావేరి దాఁటనీయను.

యాచ: అయినచో నాకీ రాజకీయ తరంగిణి నీదుటకు మీరిచ్చు నుపదేశ మేమి?

రఘు: బాలునివలె నడిగెదవేమయ్యా? ఉత్తరమల్లూరు యుద్ధమున నీకే రఘునాథుఁడైనా సలహా యిచ్చెనా? నీవు స్వయముగాఁ బ్రతిభావంతుఁడవు. నాకన్న లోకజ్ఞానమునం దెంతయో వృద్ధుఁడవు, నీకు నేనుజెప్పుటయా? ఏటిమాటలుగాని, నీవెప్పుడు కాకిచేఁ గబురంపిన నప్పుడు రెక్కలు కట్టుకొని వ్రాలెదను.

యాచ: ధన్యుఁడను!

యాచమనాయఁ డుత్సాహముతో వెల్లూరునకుఁ దిరిగి వచ్చెను. అచ్చట భక్తులకూటము తీవ్రముగాఁ బనిచేయుచుండెను. అందు దినదినమునకు సభ్యుల సంఖ్య వేలపై పెరుగుచుండెను. అందఱును దేశముకొఱకై దేహశక్తి నంకిత మొనరించిన వీరులే. వీరందఱికి శిక్షణ నిచ్చుటకు వెలుగోటివారి కోటలు ప్రధాన కేంద్రములైనవి. దేశము ద్వంద్వ యుద్ధమునకై కసరత్తు చేయుచున్నట్లనిపించెను.

వెల్లూరుకోట యాచమనాయకునికిఁ బ్రధాన కేంద్రమయ్యెను. అతఁడు ధాత్రింబవళ్ళు తన కార్యక్రమమును రూపొందించుకొనుచుండెను. దానికిఁ గోత్ర

వన్నె చిన్నెలు కల్పించుచుండెను. ఒకనాఁ డాతఁ డిట్లు తలపోసెను: "నేను రామదేవరాయలకు పట్టముఁ గట్టుటకై యీ యుద్యమముఁ బ్రారంభించితిని. అతఁడు పదునాలుగేండ్ల బాలుఁడైనాఁడు. పైపెచ్చు వెల్లూరునందే యున్నాఁడు. కాని, యాతని పేరు పెట్టి నేనీ వ్యవహారము నడపుచుంటిని గాని, యాతనిని రాజు చేసి యుండలేదు. దీనిని గొందఱు నా స్వార్థమున కాతని నామ ముప యోగించు చున్నానని వ్యాఖ్యానింపవచ్చును. నే నప్పుడు జగ్గరాయలరన్న హీనుఁడ నగుదును. కావున రామదేవరాయలకు నా యధీనమునందున్న దుర్గ ముల కన్నిటికిఁ గలిపి వెల్లూరున పట్టాభిషేక మొనర్చెదను. లోకమున కాతఁడు లక్ష్యమై నిల్చును. నాయెం దెట్టి యపార్థము కలుగకుండ నుండును. అబ్బ! రాజకీయములలో హృదయముండువాఁడు జీవింపలేఁడు కదా!"

ఈ విషయము తంజావూరునకు వేగునడపి, నాయఁడు రఘునాథుని యాశీస్సుల నందుకొనెను. తరువాత దుర్గాధినాథులను సమావేశపఱచి వారి యంగీకారమును దేశభక్త మండలియందలి సర్వసభ్యుల యంగీకారమును బొందెను.

ఒక శుభ ముహూర్తమున రామదేవ రాయలకు వెల్లూరు కోటలో ప్రజలు జయజయ ధ్వానము లొనరించుచుండ దేవేంద్ర వైభవముతోఁ బట్టాభిషేక మహోత్సవము జరుపఁబడెను. దేశమున నా విషయము ప్రకటితమయ్యెను. ఇతర దుర్గముల కీవిషయము తెలియఁబఱుపఁబడినది. వెలుగోటివంశ వీరుల దేశభక్తమండలి యను ముత్యాలహారమునకు నాయకమణి కూర్చినట్లైనది. అయ్యది కౌస్తుభ మణివలె భాసించినది.

రామదేవరాయ లిప్పుడు రాజు. అతడుఁ రాజభవనమునందు నివసించు చుండెను. అతని జీవిత మిప్పుడు నియమబద్ధము. అతఁ డిష్టమువచ్చినట్లు తిరుగు టకు వీలులేదు. అతనికి బంగారు సంకెళ్ళు వేసినట్లనిపించెను.

కల్యాణికి రామదేవ రాయలు దూరమయ్యెను. ఆమె దిగులుపడినది. ప్రతి దినమును మామిడి చెట్టుక్రింద కూర్చుండి రామదేవరాయలు భాగవతము చదువుచున్నట్లు, జయదేవుని గీత మాలపించుచున్న ట్లామె మనమున తల పోయును. చివరకు కొంతవడి దుఃఖించి కృష్ణునికి నమస్కరించి రాగమంజరి యొద్దకు వచ్చును

ఒకరోజున రామదేవరాయలు రాగమంజరి గృహమునకు బంగరు పల్లకి యెక్కి వచ్చెను. అతని చుట్టును నలురు భటు లాయుధముల ధరించి వెంట నడచుచుండిరి. కల్యాణి యాతనిని చూచి గబగబ యాతనివైపు పరుగెత్తి కౌఁగిలించుకొనఁబోయినది. రాగమంజరి "కల్యాణీ!" యని కేకవేసినది. కల్యాణి యామె కంఠధ్వని విని నిలచిపోయినది. ఆమె కన్నులనుజూచి నివ్వెరపోయినది. ఆమెకు హృదయమున్నదిగాని యాచారము లేదు. ఆమె కాతఁడు రామదేవరాయలు కాని, కర్ణాటక సార్వభౌముఁడు కాఁడు. అందువలన నామె కేమియుఁ దోఁచినదికాదు.

రామదేవరాయలు రాగమంజరి పాదములకు నమస్కరింపఁబోయెను. ఆమె యాతని వారించెను. కల్యాణి రామదేవరాయల పాదములపై మోమువంచి నమస్కరించినది. ఆతని పాదముల కభిషేకమైనట్లయ్యెను. తాను హేమసింహాసనమున మూర్ధాభిషిక్తుఁడైనప్పుడును నట్టియానంద మాతనికిఁ గలుగలేదు. ఆతని కంటినుండి జాఱిన రెండు కన్నీటిబొట్లు కల్యాణి శిరమును ముద్దాడినవి.

రాగమంజరి మందిరమున రాయలకు బహు గౌరవములు జరిగెను. అతఁడు యథేచ్ఛముగా వనమున కల్యాణితో నాడుకొనవలయునని తలంచి వచ్చెను. ఆతని రాచఱిక మూతనిని కదలనిచ్చుటలేదు. రాజ నియమము లాతనిని కొయ్యబొమ్మను జేయుచున్నవి.

రామదేవ రాయలు రాజమందిరమునకు బయలుదేఱెను. రాగమంజరి యాతని దింపివచ్చుటకు లేచెను. రామదేవరాయ లామెను గౌఁగిలించుకొనెను, మోమున మోముంచి——

"అమ్మా! కళ్యాణి లేనిచో నాకీరాజ్యము దుర్భరము" అని రుద్ధకంఠమున నుడివెను. రాగమంజరి గ్రుడ్లనీళ్ళు గ్రుక్కుకొనెను. అతఁడు వెడలిపోయెను. ఆమె శ్రీకృష్ణుని మందిరము ప్రవేశించెను.

కల్యాణి పూజారియొద్దకేగెను. ఆమె యొక మూల విచారముగాఁ గూర్చుండి యుండెను. ఆమెలో నేవియో యగ్నిపర్వతములు ప్రేలుచుండెను.

కల్యాణి :- అట్లున్నా వేమమ్మా?

పూజారి :- నాపై కృష్ణుఁడు కోపగించెను.

కల్యాణి :- నీవేమైన నేరము చేసితివా?

పూజారి గొల్లున నేడ్చెను. కళ్యాణి బాధపడెను.

కల్యాణి :- అయినచో నేనాతనిఁ బ్రార్థించెదను. నాతో గుడికి వచ్చెదవా?

పూజారి :- పోవుదము పద.

ఇద్దఱును గోపాలుని కోవెలకు వెళ్ళిరి.

# ఎనిమిదవ ప్రకరణము

తిరువేంగళనాథుఁడు : నన్నెందులకో పనియుండి పిలిచినారఁట?

జగ్గరాయలు ; అవును. ఈ యుత్తరమును గాంచుఁడు.

తిరువేంగళనాథుఁడు దాని నందుకొని యిట్లు చదువుకొనెను :

"గొబ్బురి జగ్గరాజు లోకకోటి మతేఁబది కోట్లు
మాకరాజబ్బలు నూఱుకోట్లుపయి నాఱ్వురు రావెల వెంకు
లైన హన్నిబ్బర గండఁ డేచ ధరణీశ్వరు ముందఱ నిల్వశక్యమే
గబ్బులుగాక బెబ్బులి ముఖాముఖి మేఁకలు నిల్వశక్యమే?"

తిరు : దీని నెవ్వరు వ్రాసిరి?

జగ్గ : తెలియదు. ఇది కారాగారాధ్యక్షుని పాదములముందు బాణముతో వ్రాలినది. బాణముపై సంకేతాక్షరము లేమియు లేవు.

తిరు : ఎవరై యుందురని మీరు భావించుచున్నారు?

జగ్గ ; ఈ బాణములతో నుత్తరములు పంపు పరిపాటి యాచమనాయనిదే.

తిరు : అతనికి యుద్ధములు క్రీడలుగా నుండును.

జగ్గ : కావచ్చును. తిరువేంగళనాథునితో పోలికకు రాఁడు కదా?

తిరు : అది పూర్వపు మాట. ఇప్పుడు నేను వృద్ధుఁడ నగుచున్నాను. అతని దార్ఢ్యమింకను సడలలేదు.

జగ్గ : మీ చేతలకన్న మాటలే శత్రు భయంకరములుగా నుండును.

తిరు : కాని, పరిస్థితులు మాఱినవి.

జగ్గ : మనుష్యులు మాఱకున్నచో పరిస్థితులు వానియంత నవే తిరిగి వచ్చును.

తిరు : ఆ మాఱుటకుఁ బరిస్థితులే కొంతవఱకుఁ దోడ్పడవచ్చును.

జగ్గ : పరిస్థితులపై నాధారపడువాఁడు వట్టి యసమర్థుఁడు.

తిరు : ప్రకృతినుండి మానవుఁ డంత త్వరగా విడివడఁడు.

జగ్గ : మనమధ్య అర్థోక్తు లెందుకు? తేట తెల్లముగా మాటాడుకొందము. ఈ యుత్తరమునుబట్టి యాచమ నాయఁడు మనపై సవాలు తీయుచున్నట్లున్నది.

తిరు : ఇందుకు ప్రత్యేక కారణము లేమున్నవి?

జగ్గ : ఏమున్నవి? ఆ రామదేవరాయల పేరుతో కర్ణాటక రాజ్యమును స్వాహా చేయవలయునని తలంపు ప్రధాన కారణమై యుండును.

తిరు : రామదేవరాయలను వెల్లూరునందు పట్టాభిషిక్తు నొనర్చెను కదా?

జగ్గ : అది రాజకీయమైన తంతు. లేకపోయినచో నా యనామకుని నింత పెద్ద చేయవలసిన యవసరము లేదు.

తిరు : ఆతఁ డాతని కనామకుఁడుగాఁ గానవచ్చుట లేదు. లేకపోయినచో తమ దుర్గములన్నియు నాతని యేలుబడిక్రింది కెట్లు తెచ్చును? సర్వ దుర్గాధిపతు లెట్లంగీకరింతురు? దేశభక్తమండలి యెందులకు దాసోహమనును?

జగ్గ : దేశభక్తమండలి పేరునకు గొప్ప. దానినిండ చలిచీమల పుట్టలున్నవి; వీరు లెవ్వరును లేరు.

తిరు : కావచ్చును. చలిచీమలన్నియు నేకమైనచో మహోరగము సైతము ప్రాణములు గోలుపోవలసి వచ్చును.

జగ్గ : గూడలత్తూరు దుర్గమునుబట్టి నాయకరాజుల తిరుగుబాటు నణఁచి దిగంత యశమును సంపాదించిన మీరే యిట్లు నీళ్ళు నములుచున్నా రెందులకో నా కర్థమగుట లేదు.

తిరు : చేవలుడిగి కాదు, చేతము విఱిగి.

జగ్గ : ఎవరిపై?

తిరు : రాజకీయములపై.

జగ్గ : అట్లంటి రేల?

తిరు : అందు సత్యము, రాజభక్తి, స్వచ్ఛంద వర్తనము, స్వార్థత్యాగము మఱుగుపడుచుండినందున.

జగ్గ మీ రనుచున్న మాటలు నర్మగర్భితములుగా నున్నవి.

తిరు : ఇందు రహస్య మేమియు లేదు. దేశ మీ విషయమున నట్టుడికిన ట్లుడుకుచున్నది.

జగ్గ ఏమది?

తిరు యాచమనాయఁడు రాజకుమారుఁడు బ్రాహ్మణబాలుఁ డనును. మీ రాతని పేరుతో రాజ్యముఁ గైకొని, శ్రీరంగ రాయలవారిని సకుటుంబముగా ఘోరముగా హింసించి నిరంకుశు లగుచున్నా రనును. మీ రాతనిని స్వార్థపరుఁడని తెల్పుచున్నారు,

జగ్గరాయల ముఖము వెల వెల్ల నాయెను. అతఁ గొంతక్షణము మాటాడ లేదు. అతని గొంతులో తడి యెండినది. అతఁడు సంబాళించుకొని మఱల మాటాడఁదొడఁగెను.. తిరువేంగళనాథుని కనుమానము తోఁచెను. జగ్గరాయ లుంగిడి తగిలిన వృషభమువలె గోచరించెను.

జగ్గ : సామంత వీర మహామండలి యంగీకరించిన విషయముపై మీ రిట్లనుమాన పడుట చాల ఆశ్చర్యముగ నున్నది.

తిరు : ఇప్పుడా యంగీకృతి పరీక్షించినచోఁ బాక్షికముగాఁ బఱ్చింపఁబడినట్లు కనఁబడుచున్నది.

జగ్గ : మహామండలి ప్రజాభిప్రాయమునకు ప్రతినిధి. దానినే మీరు త్రోసి రాజనుచున్నారు.

తిరు శ్రీరంగరాయలవారి హత్యతో నా మండలియు హత్య గావింపఁబడినది.

జగ్గ మీరు శత్రువుల కూటమునఁ జేరినట్లున్నారు.

తిరు మా కార్జవ మున్నది. మాట నిచ్చి దాటువారము గాము.

జగ్గ అయినచో రాజకుమారుని సమర్థింతురా?

తిరు మేము సేవావృత్తి వీడఁదలచితిమి.

జగ్గ అనఁగా మీ భావము?

తిరు మేము ప్రభుత్వ పక్షమున దండనాథులవలె నిలుచుటకన్న ప్రత్యేక వ్యక్తులమై యుండుటయే గౌరవమని తలంచుచున్నారము.

జగ్గ : మీరిప్పుడు తటస్థులన్నమాట?

తిరు : నిజము తేలువఱకు ప్రస్తుతము మా నిశ్చయ మంతియే.

తిరువేంగళనాథుఁడు వెడలిపోయెను. అతఁడు మట్లె వంశమునందు పెద్ద. మట్లె ఎల్లపరాజు, మట్లె అనంతుఁడు మట్లె తిరువేంగళనాథునకు తాత తండ్రులు. వీరి పలుకుబడి చెన్నూరు, దువ్వూరు, కమలాపురము, పోరుమిళ్ళ, బద్వేలి సీమలయందు సుప్రతిష్ఠితమైయున్నది. తిరువేంగళనాథుఁడు తాటస్థ్యము వహించెననఁగా వారందఱు తాతని ననుగమించువారే.

సామంత వీరమహామండలి ముక్కలయినది. ప్రతి సభ్యుఁడు స్వతంత్రుఁడై నిలిచిపోయెను. కర్ణాటకమున మఱల సమైక్యశక్తి నశించినది. దానికిఁ గారణము శ్రీరంగరాయల హత్య. అతని రక్తపాతమును గుఱించి వినిన యెల్లరకు

రక్తముడుకెత్తుచున్నది. యాచమనాయని ప్రచారము హృదయసీమ ధ్వనించు చున్నది. దేశభక్త మండలియందు దభిమానము పొంగుచున్నది.

రాజకుమారునికి జబ్బుచేసినది. అతఁడు నానాఁటికి చిక్కి శల్యమగు చుండెను. అతఁడు ప్రాణములు విడిచినచో జగ్గరాయల యాశ లడుగంటును. జగ్గరాయలు నిర్మించుకొనుచున్న భవన మసలే యాచమనాయని ప్రచారమను పెనుగాలికి వెనుకకు ముందుకు నూఁగుచున్నది. అంతలో నీ విషమ సంఘటన మేర్పడుటచే నతని భవనము నేలమట్టమగునట్లుండెను. అందువలనకై యతఁడా బాలుని యారోగ్యమునందు చాల శ్రద్ధవహించెను. భిషగ్వర్యుల పదిమందిని నియమించెను. కాని, వారి చికిత్సలవలన నేమియు లాభము కలుగుచుండుట లేదు. అతనికి మాతృస్తన్యముతో నౌషధము నిప్పించిన వ్యాధి కుదురుట సంభవమగునని వారు సూచించియుండిరి.

బాయాంబ, కొండాంబలు లోలోన మెలికలు వడిరి. ఆ కుమారుఁడు ముద్దుల మూటగట్టిననాఁడు బాయాంబ కాతనియందు ప్రేమ ప్రవహించినది. కాని, బాలు డిప్పుడు వికృతాకారుఁడై, యెముకల గూడువలె నున్నాఁడు. అతనిఁ జూచినచో నామెకు నాతనిదఱిఁ జేరుటకే మనస్కరించుట లేదు. అతని పోషణ వేఱు దాసీజనములచేఁ జేయించుచుండెను.

కొండాంబది వ్యవహార దృష్టి. అతఁడు బాయాంబ కుమారుఁడు కాదని లోక మెక్కడ ననుమానించునో యని యామె భయము. యాచమనాయని ప్రచారముతో నామె ప్రాణము లప్పటికే సగము పోయినవి. ఆ దిగులుతో నామె మంచము పట్టినది. రాజమందిరము జ్వరపువాసన కొట్టుచుండెను. బాయాంబకు ధూమావృతమైన వంటయింటి యందు నివసించినట్లుండెను.

జగ్గరాయలీ బాలుని జీవిత ముండఁగనే యాచమనాయని యంతు తేల్పఁ దలఁచెను. అతని దేశభక్త మండలిని మసిచేయఁబూనెను. అతఁడు కార్చిచ్చువలె మండ నారంభించెను. దేశమున యుద్ధ సన్నాహములు ప్రారంభించెను. యువకు లెల్లరును సేనలోఁ జేరవలెను. ఈ శాసనము నెదిరించినవానికి మఱుక్షణమున తల నిలువదు. జగ్గరాయల చండశాసనమున చంద్రగిరి నగర కుటుంబములం దన్నింట చిచ్చురగుల్కొనెను. ప్రతి మాతృ హృదయము ఘోషించెను. ప్రతి నూతన వధువునకు కాటుక చెక్కిళ్ళపై కరఁగి జాలువాఱెను. ప్రతి సోదరి గుండెయు గట్టులు తెగి యల్లకల్లోలమయ్యెను. ఇవన్నియు హాహాకారములై

చంద్రగిరి కోట చుట్టు నంబరమున నల్లల్లాడెను. జగ్గరాయలు ప్రేతపతివలె జడలు విచ్చి తాండవము ప్రారంభించెను.

చంద్రగిరినుండి చెంజికిని, మధురకును వేగులు నడచినవి. రహస్యముగా యుద్ధ సన్నాహములు జరుగ నారంభించెను. చంద్రగిరి, చెంజి, మధుర దుర్గములు సైనిక శిబిరములుగా రూపొందినవి.

మైసూరు, దానికి పశ్చిమమున నుండు రాజ్యములు, దక్షిణమున తిరువాన్కూరు ఈ కల్లోలమున ప్రవేశించుట కిచ్ఛగింపలేదు. అందువలన జగ్గరాయలు పశ్చిమముగా తన పలుకుబడి కొనసాగించుకొనఁజాలకపోయెను. తన రాజ్యములో నున్న మట్లి వంశీయులు తాటస్థ్యము వహించుటతో రాయలసీమనుండి పూర్తి సహకారము దొరుకలేదు. ఇఁకపోగా పశ్చిమమున మైసూరు రాజ్యమునకు, తూర్పు కనుమలకు మధ్య నున్న ప్రాంతము మాత్ర మీతని వశమందుండెను. అది యాతనికి కొంత బలమును జేకూర్చెను. మధురనుండి చంద్రగిరికి రావలెనన్న నదియే మార్గము. దక్షిణమున పాలేరు ఉత్తరపుటొడ్డు వఱకు తన యధికారమున్నది. దీనిని జగ్గరాయలు కాపాడుకొనినఁజాలును.

చెంజి కృష్ణ ప్రభువు విజృంభించి వెలుగోటివంశమువారి దుర్గముల వశమొనర్చుకొని పాలేరు పినాకినుల మధ్య దేశమున తూర్పు కనుమలవఱకు రాజ్యము విస్తరింపఁజేసి యతఁడు రాయలకు సాయపడగలడు. ఇక మధుర ముత్తు వీరప్ప నాయకుఁడు తిరుచునాపల్లియొద్ద కావేరిదాఁటి యాగ్నేయముగా విజృంభించి పినాకిని వఱకు రాజ్య మాక్రమించుకొనును. జగ్గరాయలు తూర్పు కనుమల పశ్చిమ భాగమునుండి తూర్పునకు కొంత సేన నడిపి చెంజి, మధుర ప్రభువులకు తోడ్పడును. ఇందు విజయము సేకూరెనా - కృష్ణానది మొదలు కావేరి వఱకు వ్యాపించియున్న రాజ్యము మఱల జగ్గరాయల హస్తగత మగును.

జగ్గరాయల యుద్ధప్రణాళిక కిది యాయువుపట్టు. దీని నాధారముగాఁగొని యాతఁడు తన వ్యూహ రచన మొనరించుకొనుచుండెను.

మట్లి వంశపు సరదారులు జగ్గరాయలకు సహాయము చేయకపోయినను, ఆతని సేన బలిష్ఠముగా నుండెననియే చెప్పవలయును. సాకమూరు వంశస్థులంద ఱాతనిని సమర్థించుచుండిరి. మిగిలిన మహామండలి సభ్యులెల్ల రాతని చండశాసనత్వమునకు వెఱచి యుద్ధమునఁ బాల్గొనుచుండిరి. దేశరక్షణమునకుఁ బోఁగా

కుపయోగించు సైన్యము ఎనుబదివేలకుఁ బైఁబడినది. దానిని జగ్గ

రాయలు నాల్గువంతులుగా విభజించెను. ఇరువదివేల సైన్యము చంద్రగిరి నుండి జగ్గరాయల నాయకత్వమున బయలుదేఱును. ఇరువదివేల సైన్యము చెంజి కృష్ణ ప్రభువు నాయకత్వమున తూర్పుకనుమల పశ్చిమ పార్శ్వమున వ్యాపించి యుండును.

జగ్గరాయ లొక శుభముహూర్తమున చంద్రగిరియందు యుద్ధయాత్ర నారంభించెను. చంద్రగిరి దుర్గము టిట్టిభసెట్టి నాయకత్వమున పదివేలమంది సైన్యముతో రక్షింపఁబడు చుండెను. కారాగార రక్షణము ఘట్టిమొదలి వహించెను.

వెల్లూరులో దేశభక్త సైన్యము సర్వసంసిద్ధమయ్యెను. ఆ సైన్యమునకు సర్వసైన్యాధ్యక్షుఁడు దామెర్ల చెన్నయ్య. అతఁడు రెండువేల సైన్యముతోఁ జెంజిని ముట్టడించుటకు నైఋతి దిక్కుగా బయలు వెడలెను. అతనికి సాయముగా సింగప వెళ్ళుచుండెను. యాచమనాయుడు మఱి రెండువేల సైన్యముతో జగ్గరాయలను తూర్పు కనుమలయొద్ద డీకొనుటకు వాయవ్యముగా నడచివెళ్ళెను. చంద్రగిరినిఁ బట్టుటకు రాయప, అయ్యవలు పదివేల సైన్యముతో వెడలుచుండిరి. వెల్లూరుకోట రామదేవరాయల నాయకత్వమున నైదువేల సైన్యముచే రక్షింపఁ బడుచుండెను.

జగ్గరాయలు పశ్చిమముగా మైదాన ప్రాంతమున తన సైన్యముల నఱువది మైళ్ళు నడిపెను; ఇఁక కోలారుజిల్లా తీర రేఖమీఁదుగా దక్షిణమునకు తిరుగవలెనని యాతని యూహ. జగ్గరాయ లొకదినము సైన్యమునకు విశ్రాంతి నిచ్చెను. యాచమ నాయఁడు జగ్గరాయలను పసికట్టెను. తన సైన్యమును రెండుగా విభజించెను. ఒక భాగమునకు కట్టి చెన్నని నధినాథుని గావించెను. అతనిని పశ్చిమముగాఁ బంపి తూర్పు కనుమల పశ్చిమ తీరమునఁ గాపుండున ట్లేర్పాటు గావించెను. ఈతఁడు చంద్రగిరి కేఁబదిమైళ్ళ దూరమున జగ్గరాయలు సాగిపోయిన బాటను గట్టివేసెను. అచ్చటినుండి యంచెలంచెలుగ జగ్గరాయల వెన్నంటి పోవుచుండెను. జగ్గరాయలు క్రమముగా దక్షిణమునకు యాత్ర సాగించెను. కోలారు ప్రాంతమున కొన్ని కొండలను, అడవులను జగ్గరాయలు దాఁటవలసి వచ్చెను. అది చాల దుర్గమమైన త్రోవ. దానియందు సైనికులెల్లో యుత్సాహము తెచ్చుకొనుచు, మందముగా నడచుచుండిరి. చంద్రగిరి సేనలు సుశిక్షితములు కావు. అందు చాలమంది బలవంతముగ సైన్యమునఁ జేర్పఁబడి

కొద్ది యభ్యాసముతో రణమునందు కాలిడినవారే. జగ్గరాయలవంటి యగ్రనాయకులు కొందఱు రణపండితులు. యాచమనాయుని సేనయంతయు దేశభక్త మండలి యందలి సభ్యులే. వారు వెల్లూరుకోటయందు దామెర్ల చన్నయ్యగారి క్రింద శిక్షణ పొందినవారు. వారు బాణయుద్ధము, అశ్వయుద్ధము, గజయుద్ధము, కొండయుద్ధము మొదలగు యుద్ధ రహస్యములు బాగుగా నేర్చియుండిరి. వారు నాయని బలవంతమున యుద్ధము సేయుచున్నవారు కారు; తమ దేశము కొఱకై ప్రాణదానమునకు సంసిద్ధులైన త్యాగవీరులు!

యాచమనాయుఁ డకస్మాత్తుగా జగ్గరాయలపైకి వచ్చుచున్నాడని వార్త నంపెను. జగ్గరాయల ప్రాణములు తేలిపోయెను. సైన్యమునకు మంచి తిండి లేదు. మఱి యేఁబది మైళ్ళు వెళ్ళినచో నారమూరుయోధుల దుర్గములు వచ్చును. ఆపై గొబ్బూరివారి దుర్గములు వచ్చును. ఈ మధ్యప్రదేశ మాతనికి దుస్సహమైన ప్రదేశము. దీని నేవిధముగానైన దాఁటినచోఁ దనను జయించువారుండరని యతఁడు తలపోసెను. అతఁడు తన సైన్యమును వడిగా ముందుకు నడిపించెను. వా రతిశ్రమతో నాదుర్గమారణ్య మార్గమున వెడలుచుండిరి. ఇంతలో నెదురుగా రెండు మైళ్ళలో కత్తిచెన్నఁడు విడిసియుండెనను వార్త తెలిసినది. జగ్గరాయలు యుద్ధము సేయక తప్పినది కాదు. సైనికులలో కొండ యుద్ధమున సుశిక్షితులైనవారు కొలఁదిమంది మాత్రమే యున్నారు. ఐనను ధైర్యము వీడక జగ్గరాయలు యుద్ధమునకు కాలుదూసెను. యాచమ నాయఁడు వెనుకనుండి డీకొననున్నాఁడు. కత్తిచెన్నఁడు ముందునుండి తనపై సైన్యములు నడుపుచుండెను. తా నప్రమత్తుఁడై రెండు వైపుల సైన్యమును వర్తులాకారమున వ్యూహరచన గావించుకొనెను, ముందు కాల్బలము. దానిమధ్య అశ్వబలము నిలిచియుండెను.

కత్తిచెన్నఁ డర్ధచంద్రాకారమున సైన్య వ్యూహము పన్నెను. యాచమనాయఁ డర్ధచంద్రాకారమున వ్యూహము రచించి ముందుకు నడచెను. రెండు వైపుల నుండియు నశ్వ సైనికులు వేయిమంది శరవేగముతో జగ్గరాయల [illegible] వారికి సంకులసమర మేర్పడెను. జగ్గరాయలు ప్రచండుఁడై [illegible] శత్రు శిరముల నెరవేయుచుండెను. వారిప్పుడొక కొండమలుపున యుద్ధమొనర్చుచుండిరి. ఇంతలో మహారణ్య మధ్యమునుండి యాచముని సేనలు [illegible] ముందుకు నడచెను. అందొక్కొక్క సైనికుఁ డొక్కొక్క యాచ

ముఁడు. ఈ వైపు జగ్గరాయ లొక్కఁడే. సైన్య మధిక మైనను శిక్షణ లేకపోవుటచే జగ్గరాయల సైన్యము క్రమముగాఁ గూల నారంభించెను. ఇంతలో వెనుకనుండి కట్టిచెన్నఁ డగ్నివర్షము, శరవర్షము గురియించెను. అతఁడు కొండ బండల మధ్యనుండి గూఢయుద్ధమున జగ్గరాయల సేనను పీచమడఁచుచుండెను. జగ్గరాయల సైన్యమసలే నీరసముగ నుండుటయు, కట్టిచెన్నఁడు గూఢయుద్ధ మొనర్చుటయు వారి నుక్కిరిబిక్కిరి యొనర్చినవి. జగ్గరాయలు నిలువున నీరై పోయెను. అతనికి గొబ్బూరి దుర్గములఁ జేరుటకన్న గత్యంతరము కనఁబడుట లేదు. అచ్చటినుండి చెంజి ప్రభువు సేనల సహాయముతో మరల విజృంభించుటయే ప్రస్తుత కర్తవ్య మనిపించెను. అతఁడు రహస్యముగా గుఱ్ఱమునెక్కి దక్షిణమునకుఁ బాఱిపోయి, అరణ్యములలో నంతర్ధానమందెను. సైనికులు నాయకుని పలాయనము గాంచి, యాచమనాయని శరణు వేఁడిరి. అతఁడు వారిని జెఱపట్టి వెల్లూరుకుఁ బంపివేసెను.

చెంజి కృష్ణప్రభువు కోటలో సన్నాహములు వడివడిగా నొనరించుకొనుచుండెను. సైన్యము సమకూరినది. యాత్ర కనువైన సమయమునకై యతఁడు వేచియుండెను. ఇంతలో దామెర్ల చెన్నయ్య, సింగప తనపైకి వచ్చుచున్నారని తెలిసెను. అతఁ డిదివఱకే పెక్కుసారులు దెబ్బలు తినియున్నవాఁడు. దానికిఁ దోడు జగ్గరాయల సైన్యము చంద్రగిరినుండి బయలుదేఱెనని వార్తయేకాని అది యెంతవఱకు నడచివచ్చినదో తనకు విశదముగాఁ దెలియలేదు. రావిళ్ళ వెంకయ మధుర సైన్యము విజృంభించినతోడనే తాను తూర్పునకు వచ్చుటకు సంసిద్ధముగ నున్నానని తెలిపెనుగాని మధుర సైన్యములు కావేరి దాఁటి నట్లింకను వార్తలు రాలేదు. అందువలన నాతని కేమిచేయుటకును దోఁపలేదు. చెంజిదుర్గ మభేద్యమైనది. దానియందు వసించినచో నినుపకోటయం దున్నట్లే. దామెర్ల చెన్నయ్య, సింగపలు కోటను ముట్టడి చేసిరి. అతనికి స్వీయరక్షణము కన్న వేఱు కర్తవ్యము గోచరింపలేదు. కొంతకాల మట్లు నిలిచినచో నింతలో చంద్రగిరి సేనలు తనకు సహాయము వచ్చుననియు వానితోఁగలసి దేశభక్తమండలి సైన్యమును జెండాడుట సులభమనియు కృష్ణరాజు తలపోసి కోట తలుపులు మూయించి, అగడ్తలు నింపి కోటను రక్షించుకొనుచుండెను.

దామెర్ల చెన్నయ్య, సింగప కోటను ముట్టడించి శతఘ్నులతో కోట గోడలను ప్రేల్చుచుండిరి. అది దుర్భేద్యమగు కోట. చాల బలిష్ఠమైన దగుటచే

వారము దినములు వరుసగా గోడలపైఁ బ్రేల్చుచున్నను అది చెక్కుచెదరలేదు. ఇంతలో యాచమనాయఁడు జగ్గరాయల సైన్యము నోడించి కల్మలి, సత్యవీడు దుర్గములవైపు నడచుచున్నాఁడని వార్తలందెను. కోటలోని కృష్ణప్రభువున కొడలు చల్లఁబడెను. కోట వెలుపలి చెన్నప్ప కొడలు పొంగెను.

కృష్ణప్రభువు చేయునదిలేక కోటతలుపులు తెఱపించి రెండువేల సేనతో ముందుకుఁ ద్రోసికొని వచ్చెను. అట్లు చేయుట యాతనిపాలిట తీరని నష్టమై నిలిచెను. చెన్నయ్య శతఘ్నులు ప్రేల్పించెను. కృష్ణప్రభువు సైన్యము సగము చిందరవందరయ్యెను, వానిని సింగన యశ్వబలముతో హత మొనరించుకొనుచు కోటలోనికిఁ జొరఁబడెను. చెన్నయ్య కృష్ణప్రభువుతో డీకొనెను. కృష్ణయ్య భద్రగజము నధిరోహించి యుండెను. చెన్నయ్య యున్నతాశ్వము నెక్కి యుండెను. కృష్ణయ్య యీటెలను ప్రయోగించుచుండెను. చెన్నయ్య యశ్వమును వివిధగతుల త్రిప్పుకొనుచు వానినుండి రక్షింపఁబడుచు, శత్రుసేనలను జెండాడు చుండెను. అదియొక సంకుల సమరమయ్యెను. చెన్నయ్య రౌద్రాకారుఁడై కృష్ణప్పయెక్కియున్న భద్రగజము సమీపించెను, కృష్ణప్ప యాతనిపై తన గజమును నడపించెను. చిన్నయ్య దాని బారినుండి చాకచక్యముగా బ్రక్కగాఁ దప్పించుకొని తన కరవాలముతో దాని తొండము నఱకెను. అది మేరువు విఱిగి కూలినట్లు నేలపైఁబడెను. కృష్ణప్పకు తీవ్రమైన గాయములు తగిలెను. అతఁడు సొమ్మసిల్లి పడిపోయెను.

పరిజనులు కృష్ణప్రభువును సేదతేర్చి కోటలోనికిఁ గొనిపోయిరి, చెన్నయ్య దుర్గము నాక్రమించెను. కృష్ణప్ప యాతని శరణు వేఁడెను. దేశభక్త మండలియందుఁ జేరెను. అశేష ధనము వారి కిచ్చెను. రామదేవరాయల సామంతుఁడుగా మఱల చెంజికోటను పొందెను.

జగ్గరాయలు పాఱిపోయెనని తెలియఁగనే టిట్టిభశెట్టి పట్టణము విడిచి పరుగెత్తెను. చంద్రగిరియందు దేశభక్త మండలిపైఁ బ్రగాఢగా నభిమానము వహించియున్న మహామండలి సభ్యులుండిరి. వారి తాటస్థ్యమువలన రాయవ, అయ్యవలు చంద్రగిరిని సులభముగా వశమొనర్చుకొనిరి.

చెంజికోటను చెన్నయ్య స్వాధీన మొనర్చుకొనుటతో రావెళ్ళ వెంకయ్యకు తూర్పునుండి సహాయమేమియు లేకుండపోయెను, జగ్గరాయలు తన రెండు వేల సైన్యమును గోల్పోయి మధుర సైన్యములకై వేచియుండెను. తంజావూరు

రఘునాథరాయలు తన సైన్యములను గొన్నిటిని తిరుచునాపల్లి వైపునను, మఱికొన్ని సైన్యములను కావేరి ఉత్తరపు టొడ్డునను నిలిపి, తిరుచునాపల్లి వైపున నొత్తిడి గావించెను. మధుర సైన్యములలో సగము తిరుచునాపల్లి యొద్ద కేంద్రీకరింపఁబడెను. మఱి సగము కావేరీనది దాఁటలేకపోయెను. మధుర కాత్మరక్షణమే కష్టమైనది. అందువలన నచ్చటినుండి జగ్గరాయల కెట్టి సహాయమును వచ్చుటకు వీలులేకపోయెను.

జగ్గరాయలు కర్మిలికోటను బలపఱిచి యచ్చట కాలుఁద్రొక్కి నిలువబడెను. రావిళ్ళ వెంకయ్య సత్యవీడున సిద్ధమయ్యెను. యాచమనాయఁడు దక్షిణమునుండియు దామెర్ల చెన్నయ్య తూర్పునుండియు వచ్చి యా కోటలను దాఁకిరి. సైన్యములు సుశిక్షితులగు నాల్గువేలమందితో నిండియుండెను. చెన్నయ్య సైన్యమునందు శతఘ్నులుపయోగింపబడెను. జగ్గరాయలసైన్యము రెండువేలు. కోటలు బలిష్ఠములైనను అవి చెంజివలె శతఘ్నుల కెదురొడ్డి నిల్చునవి కావు. కావున జగ్గరాయ లచ్చట మఱియు దెబ్బతినెను.

తన వంశీయులగు కొందఱు వీరులతోడను, సాకమూరు వంశపు సరదారులతోడను, రావిళ్ళ వెంకయ్య, తిమ్మనాయకుఁడు మాకరాజు మొదలగు సహచరులతోడను మధుర రాజ్యమునకు పాఱిపోయెను. కర్ణాటక సామ్రాజ్యము నేకచ్ఛత్రాధిపత్యముగా నేలఁదలంచిన జగ్గరాయలు చిట్టచివర కాదేశమునే విడిపోవలసివచ్చెను. దైవము తోడ్పాటు లేనిదే పురుషకార్యము లన్నియెడల ఫలింపజాలవు.

## తొమ్మిదవ ప్రకరణము

కల్యాణి : పూజారి యెచ్చటికి వెళ్ళెనమ్మా?
రాగమంజరి : శ్రీకృష్ణుని సన్నిధానమునకు.
కల్యాణి : మఱల మనయొద్దకుఁ దిగిరి వచ్చునా?
రాగ : రావలసిన యవసరము లేదు.
కల్యాణి : నీ వెప్పుడైన శ్రీకృష్ణుని యొద్దకు వెళ్ళితివా?
రాగ : అతని పిలుపునకై వేచియున్నాను.

కల్యాణి తోఁటలోనికిఁ బరుగెత్తెను. రాగమంజరి కన్నుల నీరు నిండెను. అందు పూజారి చరిత్రము గిఱ్ఱున తిరిగెను.

చంద్రగిరి దుర్గము వశమైన తరువాత రాయప, అయ్యప కారాగార వాసుల నందఱిని సంతోష చిహ్నముగా వదుదల గావించి, రాజపుత్త్రిని బాయాంబ సహితముగా వెల్లూరునకు సగౌరవముగాఁ దీసికొనివచ్చిరి. జగ్గ రాయల పరాజయము వినఁగానే కొండాంబ వజ్రపుపొడి మ్రింగి కన్ను మూసినది. బాయాంబ కుమారునితో మిగిలినది. ఆమె శల్యమైన యా బాలుని సేవగించుకొనెను. ఆ బాలునిమాట వినఁగానే పూజారి చాల జాలినొంది యాతనికి శ్రీకృష్ణ తీర్థ ప్రసాదముల నిత్తునని రాగమంజరితో పదేపదే పలుకసాగెను. ఆమె కన్నులయందొక తీక్ష్ణమైన యాకాంక్ష, వాత్సల్యము ప్రతిఫలించి రాగ మంజరిని మాఱు పలుకకుండఁ జేసెను. ఒకపరి బాలుని తెచ్చును. పూజారి ప్రతిదినమును శ్రీకృష్ణుని గర్భాలయమునఁ దలుపులు వేసికొని యా బాలు నితోఁ గొంతసేపు కాలము గడుపును. ఆమె యేమి తీర్థ మిచ్చుచుండెనో యెవ్వరి కెరుకలేదు. కాని, బాలుఁడు శుక్లపక్ష చంద్రునివలె తిరిగిన కళల నింపుకొనుచుండెను. అతఁడు పదునేను దినములలో సంపూర్ణారోగ్యవంతుఁ డయ్యెను.

యాచమనాయఁడు బాయాంబ కోరికపై నామెను పుత్త్రిసహితముగా మధుర కంపివేసెను. పూజారి నాఁటినుండి మఱల కనఁబడలేదు. ఆమెకు నా బాలునికి సంబంధమేమి? ఆమె శ్రీకృష్ణునిముందా బాలుని కేతీర్థ మిచ్చినది? తల్లి.. పాలతో. కుదిరెడి. యా బాలునిరోగ మెట్లు తిరుగుమొగమయ్యెను? ఆ ప్రశ్నలు రాగమంజరి హృదయము నిండిపోయినవి. ఆమె రాజకుమారుని తల్లి యని అంతరాత్మ ఘోషించెను. ఆమె తన కుమారునికి మఱల ప్రాణము పోసిపోయినది.

వేంకటపతి మహాదేవరాయలు గతించిన తర్వాత జగ్గరాయ లా బాలునిఁ గన్న బ్రాహ్మణ వనితను కోటనుండి వెడలఁగొట్టెను. ఆమె యనాథయై దేశ మునఁ దిరుగుచు రాగమంజరివద్ద పూజారిగాఁ గుదురుకొనెను. అచ్చట నామె పని ముగిసినది. అచటినుండి యామె ప్రకృతిమాత యొడిలోనికిఁ బరుగెత్తినది.

ఆమె యర్ధరాత్రమున పాలేరు దక్షిణతీరముఁ జేరవచ్చెను. అదియొక చిట్టడవి. వెన్నెల గాయుచుండెను. అచ్చట నొక వృక్షమూలమున నొక పురుష శరీర మామెకు గానవచ్చెను. అతఁడు నీరసముగాఁ బరుండెను. ఆమె నడచు నప్పు డెండిన యాకులు కాలిక్రిందఁబడి చప్పుడయ్యెను. అతఁడు కన్నులు

తెలిపెను. ఆతని ముఖముఁజూచి పూజారి భయమంది గడగడ వణఁకుచు నది వైపున కురికెను.

అతఁడు లేని సత్తువఁ దెచ్చికొనుచు నామెవెంటఁ బరుగెత్తెను. ఆమె వెనుజూడక పరుగెత్తి నదీమతల్లి గర్భమునఁ డలఁ దాచుకొనెను. ఆతఁడు నిశ్చేష్టుఁడై కొంతవడి యొడ్డున నిలిచి, యామె మునిఁగిన తావును గాంచుచు దుఃఖించెను. అతని తలలో గతస్మృతులు గిఱ్ఱున తిరిగెను.

తానొకనాఁటి రాత్రి దొంగలఁ బట్టుటకై వనమునఁ దిరుగుచుండెను. తానప్పుడు చంద్రగిరి కారాగారాధికారియగు బ్రహ్మన్న. తానొక యనాథ యొక పొదరింటఁ దలదాఁచుకొనుట గాంచెను. ఆమె దీనవదనముఁగాంచి జాలి కలుఁగుటకుమాఱుగా జన్మ జన్మాల పాప ఫలితమో యన్న ట్లతనికిఁ గామ ముదయించినది. దానితో నామెను బలవంతమున తన వశత్వమున కెరగావించి. యాతఁడు నిర్లిప్తుఁడై వెడలిపోయెను. ఆమె యానాఁడు శపించినది. "నీవు బ్రాహ్మణుఁడవయ్యు నీకీ పాడుబుద్ధి పుట్టినది. నన్ను బలవంత పెట్టిన నీ చేతులు విఱిగిపోకుండ నుండునా?" అని. అట్లే జగ్గరాయలచేఁ దన చేతులు పోయినవి. ఇప్పుడు తా నొక మొండి వృక్షము. తా నొనర్చిన పాపమునకుఁ బరిహారము లేదు. ఆమె దివి కేగునంతలోఁ దానుగూడి నామెను జేరి క్షమాపణ వేఁడుటయే కర్తవ్యమని యాతనికిఁ దోఁచినది. అతఁడుగూడ నామె ననుగమించెను.

యాచమనాయఁడు బాయూంబను మన్నించి మధుర కంపి యౌదార్యముఁ బ్రకటించెను. కాని, అది జగ్గరాయల హృదయమున విషమ పరిణామము నొందెను. రాజకుమారునిఁ గాంచిన తోడనే యాతని యందు పూర్వవాసనలు పెల్లుబికినవి. తాను మఱల పూర్వపు జగ్గరాయలయ్యెను. యాచమ నాయనిచేఁ బడ్డ పాట్లాతని హృదయమున కొలుములై నిలిచినవి. మాత్సర్యము వాని నూది మండించినది. జగ్గరాయ లగ్నిహోత్రుఁ డయ్యెను.

అతఁడు మూలనుంచిన కత్తికిఁ బదనుపెట్టెను. నిద్దురవోయిన మెదడును మేల్కొల్పెను. మధుర నాయకునికి ఫురి యెక్కించెను. ప్రక్కనున్న మిత్ర వీరులను పొంగించెను. మఱల నాతఁడు చేవవహించెను.

రామదేవరాయ లిప్పుడు కృష్ణా కావేరీ నదుల మధ్యనున్న రాజ్యమున కధినాథుఁడు. కాని, యాతని శత్రుమండలి సంపూర్ణముగాఁ గన్ను మూయలేదు. యాచమనాయఁడు వారి నొక కంటఁ గనిపెట్టియే యుండెను.

యాచమనాయఁ డొకనాఁ డిట్లు తలపోసెను : "లోకమున స్వార్థము సేయఁజాలని పనిలేదుకదా! స్వార్థము కొఱకు లజ్జ నుజ్జగించి జీవించుటకన్న మరణము మేలు. జగ్గరాయలు స్వార్థముకొఱకై మహాదేవరాయలను మోసగించి రాజ్యము కాఁజేయఁ జూచెను. దేవుఁడు కన్ను తెఱచి వాని నడవుల పాలు చేసెను. అతఁడు మధుర ముత్తువీరప్ప నాశ్రయించి బ్రతుకుచున్నాఁడు. కాని, యాతనినుండి మాత్సర్యము, స్వార్థము వీడిపోలేదు. రాజకుమారునిఁ గాంచి యాతఁడు మఱల విజృంభింప నుంకించు చుండెను. అతఁడు మదాంధుఁడు. కావుననే మఱల యుద్ధము తల పెట్టుచుండెను. ఇప్పటి రామదేవరాయల సామ్రాజ్యమును, బలమును, రఘునాథ రాయల సహాయమును నూహించుకొని నచో నతఁ డట్లు చేయఁడు. అతఁడు గ్రుడ్డిగా ముందుకుఱుకుచున్నాఁడు. అతఁడు గోయిలో పడును. అతని ననుగమించువారు నాగతియే పొందుదురు. పాపము పెరుఁగుచున్నది. అది విఱుగు కాలము దాపురించినది. దేవుని యాదేశ ప్రకారము నేనీయుద్ధమునఁ బాల్గొనక తప్పదు. కాని, నా రాజభక్తిని వేయి కన్నులఁ గాపాడు భారము దైవముపై నుంచుచున్నాను. లోకమున దయాసత్య దాక్షిణ్యములకు పూజలు జరుగునట్లు కరుణింపుమని ప్రార్థించుచున్నాను."

జగ్గరాయలు బాయాంబయు నొకనాఁడు మధురలో నిట్లు వితర్కించు కొనిరి:

జగ్గ : సోదరీ! మన చిరంజీవిని సింహాసనాధికారిని చేయువఱకు నాకు మనశ్శాంతి లేదు.

బాయాం : కాని, విధి యెదురుతిరుగుచున్నది.

జగ్గ : విధిని నమ్మి అవకాశములను వీడుట నాకుఁ జేతకాదు.

బాయాం : అట్లయినను మన కిప్పుడు మంచి వాతావరణ మెక్కడిది?

జగ్గ : దానిని నేను సృజించుచున్నాను. మధుర పాలకులు, మన సోదరులు, స్నేహితు లందఱము కలిసి, ఒక్కుమ్మడి కర్ణాటకముపై దండెత్త నున్నాము.

బాయాం : పోయిన యుద్ధమునందు పడినపాట్లు చాలవా అన్నయ్యా?

జగ్గ : సోదరీ! నీకు రాజకీయములు తెలియవు. మే మప్పు డొకరి నొకరు సంబంధము లేక వారిచేఁ జిక్కినాము. ఇప్పుడు సమైక్యశక్తితో నెదురొడ్డఁ బోవుచున్నాము.

బాయాం : మన శత్రు పక్షములు మాత్రము మనపై సమైక్యముగా దండెత్తవని నమ్మక మేడ?

జగ : (అవ్వుడుగఅచి) రానిమ్ము. రణమున జయాపజయములు నిర్ణయించుట కష్టము. ఒకసారి వారు గెలిచిరి. ఈతూరి నాకు విజయము లభింప వచ్చును.

బాయాం : అన్నయ్యా! నాకీ యుద్ధమనిన హృదయ మదరుచున్నది. ఇది మన వంశ నాశనమునకు వచ్చినట్లనిపించుచున్నది.

జగ్గ : మహారాజ్ఞివి, బేలవయ్యెదవేలనమ్మా? ఒకవేళ అట్లే యగుననుకొందము. ఇప్పుడుపు గూడు భుజించుటకన్న నప్పరమపద మనుభవించుట మేలు కదా?

జగ్గరాయలు వెడలిపోయెను. బాయాంబ నిశ్చేష్టయై నిలిచిపోయినది.

"నేను జేసిన పాపము ఫలించినది. నేనీ సోదరునికి మనసిచ్చి, పుత్రి లాభము కొఱకు, సామ్రాజ్య సౌఖ్యము కొఱకు, నా భర్తకు దూరమైతిని. దీనిని ప్రోత్సహించిన నా సోదరి కొండాంబ ప్రతిఫల మనుభవించినది. నా యన్న యిప్పుఁడు కాలమున కెదురీఁదుచున్నాఁడు. అతని విజయ మాతనికే సంశయ ముగా నున్నది. సోదరుని కెట్లైనను లాభమున్నది. అటు జయించెనా - రాజ్య లాభము; గతించెనా-వీరస్వర్గము! కాని, మధ్య చెడిపోయినదానను నేను. నాకీ పుత్త్రిఁడు దేహజుఁడు కాఁడు. అందువలన నీతనివలన నాకుఁ బరలోక గతులు లేవు. పైపెచ్చు బంధువులతో విరోధము. నాకీ సమయమున మరణమే శరణ్యము. కాని, యీ బాలుని గతియేమి? ఆ పూజారికైన నిచ్చివచ్చిన బాగుగా నుండెడిది. నాకు లేని వాత్సల్య మామెయం దెట్లుండును? నా యందలి మాతృత్వము నశించినది. నేను గొఱ్ఱాలను. నన్ను రాయ లెన్ని జన్మలకైనను క్షమింపరు. నాకు నిష్కృతి లేదు" అని వాపోవుచు సొమ్మసిల్లెను.

మదుర ప్రభువైన ముత్తువీరప్ప నాయకుఁడు యాచమనాయనిపై యుద్ధము ప్రకటించుటకు విపులమైన సన్నాహములను గావించుచుండెను. తన యాస్థానమున జగ్గరాయలు, మాకరాజు, రావిళ్ళ వేంకయ్య, సాకమూరు వీరులు, చిన్నతౌతు, తిప్పరౌతు, టిట్టిభశెట్టి, ఘట్టిమొదలి, ఇంకను కొంధఖు గొబ్బూరి

వంశవీరులు శరణార్థులై యుండిరి. వీరందఱు జగజెట్టులే. వారి సహాయమున నైన తంజాపుర రాజ్యము వశము చేసికొని కావేరీ దక్షిణప్రాంత భూమినంతను నేలఁదలఁచెను. వీరప్ప కొక స్వార్థము, జగ్గరాయల కొక స్వార్థము, ఇతర వీరులకు దుర్గాధిపత్యముల నాశించిన స్వార్థము; ఇట్లందఱొక్కొక్క లాభమును హృదయమం దుంచుకొని యొక్కచోఁ గూడినారు. వీరిలో దైహిక సంబంధమే కాని హార్దిక సంబంధము లేదు. అందువలన వీరియందుఁ బవిత్రమైన సమైక్యము కుంటుపడినది.

తంజావూరు రఘునాథరాయలు డచ్చివారితో యుద్ధమొనర్చి ఘన విజయము సాధించి ''పాయింట్ కాలిమర్''లో నుండెను. యాచమనాయఁ డాతనికి వేగుపంపెను. మధుర సన్నాహములనుగాంచి రఘునాథరాయ లేవగించుకొనెను. ఆతఁడు తన సామ్రాజ్యమున కెప్పటికైన చీడపురుగే యనియు, నాతని శీఘ్రముగా నంతమొందించినఁ గాని తనకు ప్రశాంతి లభించదనియు భావించి యాతనిపై తక్షణమే దండువెడల నిశ్చయించెను. యాచమనాయనికన్న మధురదండయాత్రలో రఘునాథరాయలు అధికమైన ఉత్సాహము ప్రకటించెను. ఆతఁడే స్వయముగా యాచమనాయనికి యుద్ధతంత్ర వివరణ మందించెను. అతనికి మధురపై నుఱుకుటలో మత్తగజకుంభస్థలముపై కొదమసింహ ముఱుకునప్పుడు గల్గు ఆనందము జనించెను.

నలనామ సంవత్సరాషాఢ శుద్ధ తృతీయ (క్రీ. శ. 1616 సం॥ జూన్ 25) నాటికి రఘునాథరాయలు కాలిమర్ పాయింటు నుండి తన సైన్యములను హుటాహుటి తంజాపురమునకు నడిపించి, శతఘ్నిసైన్యమును విస్తారముగాఁ బెంచికొని, రాజ్య నిర్వహణభారము తన మంత్రియైన గోవింద దీక్షితుల హస్తములందుంచి తిరుచనాపల్లి వైపునకు నడచి, తంజాపురమునకు సుమా రిరువదియైదు మైళ్ళ దూరమున నున్న ఆవళవానేరి యను నొక సరిహద్దు గ్రామమున బస చేసెను. ఆనాఁటి సాయంకాలమే యాచమనాయఁడు దేశభక్త సైన్యముతో నాతని గలిసెను.

యాచమనాయఁడు వెల్లూరు దుర్గమునుండి యధిక సేనతో బయలుదేఱి, దామెర్ల చెన్నయ్య, సింగప, రాయప, అయ్యప, కట్టిచెన్న, పెఱుకు వెంగళయ్య, కేతిరెడ్డి మొదలగు వీరులందఱు వెంటరాగా సరాసరి సైన్యమును దక్షిణమునకు నడిపించి, కావేరీతీరముఁ జేరెను. యాచమనాయనితోపాటు రామదేవ

రాయలు, ఆతని వెంట రాగమంజరి, ఆమె వెంట కల్యాణియు వచ్చుచుండిరి. వారికిసారి యుద్ధమునకుఁ బోవుచున్నట్లగుపించలేదు. విలాసముగా పెండ్లివారింటికి తరలిపోవుచున్నట్లనిపించెను. యాచమనాయని సేన కావేరి దాటుటకు రఘునాథరాయల నౌకాబల ముపయోగపడినది. వారు సుఖముగా కావేరి దక్షిణపు టొడ్డు చేరి తంజావూరునకు సమీపముగా పయనించి రఘునాథరాయల సైన్యమున గలసిరి. రఘునాథరాయలు యాచమనాయనిఁ గౌగిలించుకొనెను. పవిత్ర సౌమనస్యము, రాజభక్తి మిళితమై యొక రూపము దాల్చినట్లయ్యెను. సేన లొకరోజు విశ్రాంతిగొనెను. సర్వసైన్యమున కధినాథుఁడుగా రఘునాథరాయ లభిషిక్తుడయ్యెను. ఆతని యంగరక్షకుఁడుగా యాచమనాయఁడు నిలిచెను. జగ్గరాయలకు దండయాత్ర విషయమై కబురంపఁబడెను.

ఆషాఢశుద్ధ పంచమినాఁడు సూర్యునితోపాటు రఘునాథ రాయల స్కంథావారమున విజయోత్సాహము కూడ నుదయించెను. రఘునాథుఁ డావళనే గ్రామమునుండి బ్రాహ్మణ శతకమును బిలిపించి వేదపఠనము చేయించెను. శ్రీరామ సహస్రార్చనము, సాలగ్రామ దానము, పురాణ శ్రవణము, తీర్థప్రసాద సేవనము గావించి, మంచి గడియలలో శుభ శకునములను గాంచుచు తిరుచునాపల్లి వైపునకు సేనల నడిపించెను.

రఘునాథుఁడు భద్రగజ మధిరోహించి యుండెను. ఆతని వెంట నాతని పెద్ద కుమారుఁడు రామభద్రుఁ డాసీనుఁడై యుండెను. ఆతని కిరుప్రక్కలను దండనాథులగు పురుషోత్తమ, నరసప్పలను ఇద్ద ఱొక గజముపైని, అన్నప్ప, అళుప్పలను నిద్దఱొక గజముపైని ఆతని ననుగమించు చుండిరి. ఆతని వెనుక గజబలము నడచుచుండెను. దాని వెనుక శతఘ్నుల దండు కదలుచుండెను. ఆ వెనుక నున్నత శ్వేతాశ్వారూఢుఁడై యాచమనాయఁ డాశ్వికబలమును నడపుచుండెను. ఆతని వెనుక పయోధితరంగములవలె బారులుతీరి నడచుచున్న కాల్బలమునకు దామెర్ల చెన్నయ్య నాయకుఁడై వరలుచుండెను. ఆ సైన్యము వెనుక నూర్గురు సాయుధ భటులచే బరిరక్షితుఁడగుచు దానవసేనపై వెడలు కుమారస్వామివలె రామరాయలు రథముపై ఖాసించెను. ఆతని వెనుక రాగమంజరి యొక రథముపైఁ బురుష వేషమున వచ్చుచుండెను. ఆమె చెంతనున్న కళ్యాణి శత్రుసంహార సహాయార్థము వెంటఁగొని వచ్చుచున్న దుర్గాదేవి బంగరు విగ్రహమా యనునట్లు వెలుగందెను. సేనావాహిని సముత్సాహముతో ముందుకు సాగుచుండెను.

క్రమముగా వారు నేమము, అగరప్పేట, సీమమంగళము, పాదరకుడి యను గ్రామములు దాటి మొత్త మేడుమైళ్ళు నడచిరి. తోపూ[1]రను గ్రామము జేరిరి.

జగ్గరాయలు రఘునాథరాయల వర్తమానము గాంచి మండిపడెను. క్షణములో సైన్యము నాయత్తపఱుప నాజ్ఞాపించెను. ముత్తు వీరప్పనాయఁడు సర్వ సైన్యాధ్యక్షుఁడు. ఉప సైన్యాధ్యక్షుఁడు జగ్గరాయలు, మిగిలిన వీరులందఱు కొంత కొంత సైన్యముల కధినాథులుగ నియమింపఁబడిరి. ఇచ్చట యొక విశేషము కలదు. తీర్థయాత్రలకు వెళ్ళిన యతిరాజు అన్నగారి యోటమిని, తన కుమార్తె కల్యాణి శత్రువుల వద్దఁ జిక్కియుండుటయుఁ దెలిసికొని మధురకుఁ జేరి యీ సైన్యములో వచ్చుచుండెను. ఇందు గజ సైన్యము లేదు. శతఘ్నులు చాల తక్కువ. కాల్బల మధికముగా నున్నది. అశ్వబలము సమర్థమైనదే కాని రఘునాథుని సైన్యమునకు దీటురాదు. మధుర సైన్యము మాత్సర్య సముద్రము పొంగి పొఱలినట్లుండెను.

జగ్గరాయలు సేనలతో తోపూరునొద్ద విడిసియుండెను. వారు ప్రత్యేకమైన వ్యూహము పన్ను తలంపులో లేరు. శత్రుసైన్యముల గమనము గాంచి తా ముచిత మార్గ మవలంబింపవలయునని యూహించిరి. సైన్యమున దండనాథులు శత్రువుల ఢీకొను విధానముఁగూర్చి యాతురత వహించి చిందులు త్రొక్కుచుండిరి.

రఘునాథరాయలు మధుర వీరప్ప నాయకత్వము క్రిందనున్న సైన్యమును గాంచెను. అతఁడు పొంగిపోయి శంఖము పూరించెను. పరమేశుని యాజ్ఞ చొప్పున లోకములు కర్మానువర్తులగునట్లు సైన్యము వెంటనే తనంతఁదాను పూర్వ నిశ్చితమైన వ్యూహముగా నేర్పడెను. అయ్యది చక్రబంధ వ్యూహము. సైన్యము వర్తులాకారమై నిలిచినది. దానిచుట్టును శతఘ్నులు రెండు వరుసలలో నిలుపఁబడినవి. చక్రపు బద్దెగా కాల్బలమును, ఆకులుగా నశ్వదళమును, కుండముగా రఘునాథుఁడును, ఇరుసుగా యాచమనాయఁడును నిల్చియుండిరి. గజములు ఆకులలో నెడయెడ నినుప కట్టులవలె నిలుపఁబడియుండెను. ఇట్లు రఘునాథుని సైన్యము దుర్నిరీక్ష్యమై తోఁచెను.

---

1. తోపూరు గ్రామము తోపూరారని పిలువఁబడుచు, తిరుచునాపల్లి సమీపమున నిప్పటికిని గలదు.

మధుర వీరప్పకు రఘునాథుని శంఖధ్వని పాంచజన్యమై వినిపించెను. అతని గుండె లవిసెను. కాని, యతఁడు నిబ్బరముగా సైన్యమును ముందుకు నడుపుచుండెను. అతనికి వ్యూహము పన్నునంత యవకాశము లేదు. యోజించుట కాలోచనలు స్తంభించినవి. యంత్రమువలె నాతఁడు ముందునకు నడువఁగాఁ గొఱ్ఱెలవలె సైన్యము వెంట నడచెను.

రెండు సైన్యములు తోపూరు ప్రాంతమున నున్న సువిశాల మైదానమున, గలసికొనెను. ఆనాఁడు తోపూరు కురుక్షేత్రమయ్యెను. రామదేవరాయలు సమున్నతమైన కొండ ప్రదేశమున అశ్వారూఢుఁడై నిలువఁబడియుండెను. అతని ప్రక్కగా మఱియొక యశ్వముపై రాగమంజరి పురుషవేషమున నుండెను. ఆ ప్రక్కన నొక గుడారములో కల్యాణి కూర్చుండెను. వారిని మూఁడునూర్ల సాయుధ భటులు పరివేష్టించి రక్షించుచుండిరి. రామదేవరాయలకు రణస్థలి చిత్రమువలెఁ గన్పట్టుచుండెను.

పోరు ప్రారంభమయ్యెను. ప్రథమముగా మధురనాథుని యాశ్వికదళము రఘునాథుని సేనపై నుఱికెను. శతఘ్నులు దొంతులు దొంతులుగా బ్రేల్చఁబడెను. వాని నెదుర్కొను సాధనములు మధుర సైన్యమున లేవు. అందువలన రఘునాథరాయల సేనను చేరునంతకే యందు మూఁడవ వంతు సైన్యము కూలిపోయెను. అశ్వములు వడిగా దూసికొని శత్రుసైన్యమునఁ బ్రవేశించెను. శతఘ్నులు దూరముగనున్న వారినేగాని దరికిఁజేరినవారి నేమియుఁ జేయలేవు. వీరప యాధిపత్యమున వచ్చు నాశ్వికదళము సమీపింపగనే కాల్బల మాశ్చర్యముగా ప్రక్కకుఁ దొలఁగి వానికి లోనికి తావిచ్చెను. అవి చక్రవ్యూహమున నాకులమధ్యకుఁజేరెను. ఆకుల స్థానములలోనున్న యాశ్వికదళము గజసైన్యము వానితో పోర నారంభించెను. కాల్బలము మఱల నాత్రోవల బంధించి నిలువఁబడెను వీరప్ప యభిమన్యుఁడు పద్మవ్యూహమున ప్రవేశించిన ఘట్టము తలఁపునకుఁ దెచ్చెను. రఘునాథుని యేనుఁగులు రెచ్చి వీరప్ప సైన్యమును కలయఁద్రొక్కెను. వీరప్ప సైనికు లంద ఱాశ్వికులు. రఘునాథ సైనికులు గజారూఢులు, అశ్వికులు నగుటచే ఈటెలు, బల్లెములు, ఖడ్గములు, తోమరములు, విల్లంబులు ఉపయోగించుటకు వీలైనది. కాని, వీరప్ప సైన్యము కత్తులనే నమ్ముకొనవలసి వచ్చెను. ఫదియాకులమధ్య వీరపసైన్యము చిక్కువడెను. ఎచ్చటిదచ్చట రఘునాథుని సేనచేఁ దఱిమివేయఁ బడుచుండెను. వీరపగుండె

నీరయ్యెను. బయటికిపోవుటకు వీలులేదు. కాల్బలము కోట గోడవలె నున్నది. కుండమునందున్న భద్రగజము లింకను కదలుటలేదు. రఘునాథరాయ లా దృశ్యమును గాంచి పెద్దగా నవ్వుచుండెను. ఆ నవ్వు వీరప్ప గుండెలలో మాఱు మ్రోఁగుచుండెను. అతఁడు నిరుత్సాహుఁడయ్యెను.

జగ్గరాయలు కాల్బలముతో శతఘ్నులను డీకొనెను. గుండెను ముందుకుఁ బెట్టి వీరావేశముతో వచ్చు జగ్గరాయలు కాలాంకునివలె గోచరించెను. అతని కన్నులనుండి నిప్పులు వర్షించు చుండెను. వానిముందు శతఘ్నుల ప్రేలుడు వెలవెలలాడెను. అతని వీరావతారమునుగాంచి రఘునాథుని కాల్బలము వెఱఁగు పడెను. అతఁడు భీమునివలె లంఘించెను. అతనిఁగాంచి మధుర సేనలు ద్విగుణీకృతోత్సాహముతోఁ బోరు సల్పుచుండెను. జగ్గరాయలు ప్రచండ సూర్యునివలె విజృంభించెను. అతని కరవాలము శంపాలతవలె తంజావూరు సైన్యముపై మెఱయుచుండెను. ఒక్కొక్క యేటునకు పదులు పదులుగా సైనికుల తలలు బంతులవలె గగనమున కెగురుచుండెను. అతఁడు సింహము వలె గర్జించెను. గజములు వెఱఁగుపడి సైన్యము కలయఁద్రొక్కుచు పరుగెత్తు చుండెను. ఆ విధముగా రఘునాథుని సైన్యము కొంత హతమగుచుండెను.

రఘునాథరాయలు జగ్గరాయల ప్రచండ విహారము గాంచెను. అతఁడు యాచమనాయని పురిగొల్పి వీరప్ప వైపు పంపెను. తాను స్వయముగా జగ్గ రాయల వైపు నడచెను. రఘునాథ రాయలు జగ్గరాయల సమీపించుటకు జాము సేపు పట్టినది. అతఁడు జగ్గరాయలపై భద్రగజము నుఱికించెను. ఈఁటెలు, బల్లెముల నాఁతనిపై గుప్పించెను. అతఁడు కడు నేర్పుగా డాలుతో వానిని దప్పించుకొనుచుండెను. భద్రగజ మాతనిని సమీపించినది. అతఁడు సింహ గర్జన మొనర్చెను. గజ మొక యడుగు వెనుకకు వేసెను. ఆ యవకాశము గాంచి, జగ్గరాయ లా యేనుగు తొండమును ఖండించెను. అది భూమి కొరుగు చుండెను. రఘునాథ రాయలు క్రుద్ధుఁడై గజము నుండి భూమిపై దుమికెను.

వీరప్పకు కొంత తెఱపి చిక్కినది. అతనికి మాకరాజు,రావిళ్ళ వెంకయ్య కనిపించిరి. వారి ప్రక్కకుఁ జేరి అతడు యుద్ధము సాగించెను. ఈ ముగ్గురు కలిసి యశ్వ సైన్యమును నురుమాడుచుండిరి. దామెర్ల చెన్నయ్య వీరిపై లంఘించెను. అతఁడు మహాదేవరాయల కాలము నుండియు యుద్ధములలో నారి తేఱినవాఁడు. అతనిముందు సైన్యము నిలుచుట కష్టమైనది. వెంకయ్య ప్రాణ

మునకు తెగించి ముందుకుఱికెను. వారిద్దరికి ద్వంద్వ యుద్ధము ప్రారంభ మయ్యెను.

ఇంతలో యాచమనాయని గుఱ్ఱ మా రంగమున దుమికెను. మాకరాజు, వీరప్ప యాతనిఁ జుట్టుముట్టిరి. అతఁడు సవ్యసాచివలె రెండు చేతులతోఁ గత్తి త్రిప్పుచు యుద్ధ మొనర్చుచుండెను. ఆతని గుఱ్ఱ మాతనికన్న చాకచక్యమైనది. తన ప్రభువున కెట్టి యపాయము గలుగకుండ నడచుటయేకాక, శత్రు సంహారమునకు క్రొత్త మెలకువ లాతని కందించుచుండెను. ఆ యశ్వ మున్నన్ని నాళ్ళాతని కపజయము కల్గునను భయములేదు. యాచమనాయని ధాటికి చుట్టును మూఁగిన సైన్యము తునియలై పడుచుండెను. క్షణకాలములో నచ్చటి శత్రు సైనికులు పీనుఁగుపెంటలైరి. ఇంతలో మాకరాజు గుఱ్ఱమును నాయనిపై కుఱికించెను. అది ముందఱికాళ్ళెత్తి యాతనిని తాడింపబోయెను. నాయఁడా గుఱ్ఱపు కాళ్ళ నఱికివేసెను. మాకరాజు క్రిందపడి, తన కత్తితో నాతని గుఱ్ఱమును పొడువఁ బోయెను. యాచముని గుఱ్ఱము తన కాళ్ళతో నాతని త్రొక్కెను. కత్తి తాకుపడి మాకరాజు మరణించెను. మాకరాజు శవమును గాంచి, వీరప్ప యుద్ధరంగమున నిలుచుటకు శక్తి చాలక పిక్కబలము చూపించెను. ఆతనిని యాచముఁడు తఱుముచుఁ బోయెను.

చెన్నయ్య, వెంకయ్యలకు ద్వంద్వ యుద్ధము తీవ్రముగాఁ జరిగినది. వెంకయ్య యాతని ధాటి కోర్వఁజాలక యలసి, నోఁట నెత్తురుగ్రక్కి గుఱ్ఱముపై సొమ్మసిల్లెను. ఆ గుఱ్ఱ మాతనిని యుద్ధరంగము నుండి యెచటికో కొనిపోయెను.

వీరప్ప వఱుగెత్తుట గాంచి చిన్నరౌతు, తిప్పరౌతు, టిట్టిభసెట్టి, ఘట్టి మొదలి, సాకమూరు యోధులు ప్రాణముల దక్కించుకొనుయత్నముల నొక్కరొక్కొక్క విధముగ నవలంబించిరి.

రఘునాథరాయలు కత్తితో జగ్గరాయలపై నుఱికెను. వారిద్దరు ద్వంద్వ యుద్ధము ప్రారంభించిరి. ఆ దృశ్యము రెండు మత్తకిశోరములు పెనఁగులాడినట్లుండెను. ఇద్దఱును బహుముఖ ప్రజ్ఞలను, నైపుణ్యములను ప్రదర్శించుకొనుచు, ఒకరినొకరు మ్రింగివేయవలయు ననెడి చూపులఁ బ్రసరించుకొనుచుండిరి. ఒకసారి జగ్గరాయల ఖడ్గప్రయోగముచే రఘునాథ రాయల హస్తమున చిన్న గాయమాయెను. అతఁడు దానితో రెచ్చిపోయి పదిరెట్ల కోపముతో జగ్గరాయల శిరముపై నొక్క యాఘాతము నిచ్చెను. జగ్గరాయలు గండస్థలమ్ము వ్రయ్యలై పడిన ఘటేభమువలె నేలఁగూలెను. అతఁడు తన చేతితో శిరమును

బట్టుకొనెను. రక్తము లేరులై కారుచున్నది. అనాఁడు జాసు చంద్రగిరి దుర్గమున కొండాంబ యొద్దనుండి వెడలిపోవుచుండ ద్వారము కొట్టుకొని కారిన రక్తబిందువులాతనికి జ్ఞప్తికి వచ్చెను. అతని కన్నులలో కొండాంబ గోచరించి నర్తిల్లినది.

ఎదుట రఘునాథ రాయలు పెద్దగా నట్టహాస మొనర్చి "స్వార్థపరుడ! దానితో నీవు మూటగట్టినదేమి?" అని హేళన చేసెను.

జగ్గరాయలు నూతిలో మాటలాడెను: ''స్వార్థపరత్వము లోకసహజము. కాని, మృతుఁడగు శత్రువును జూచి యొకసారి నవ్వితిని, దాని ఫలిత మీనాఁడు కలిగినది. ఇతర విషయములలో మీకన్న నేనే అదృష్టవంతుఁడను." జగ్గరాయలలో వెలుఁగారిపోయెను. రఘునాథుఁడు రెండు కన్నీటిబొట్లు రాల్చెను.

## పదియవ ప్రకరణము

యతిరాజు దృష్టి యుద్ధముపై లేదు. కల్యాణి యెచ్చట నుంచఁబడినదో తెలిసికొనవలయునని యతఁడు తహతహలాడుచుండెను. ఆతఁడు యుద్ధరంగమున చరించునప్పు డాతని కెత్తుగానున్న ప్రదేశముపై రామదేవరాయలు, రాగమంజరి గానిపించిరి. వారి వెనుకనున్న గుడారములో కల్యాణి తప్పక యుండునని యూహించి యాతఁ డావైపునకు నూర్గురు భటులతో వెడలెను.

రాగమంజరి యతిరాజును గాంచెను. అతఁ డామెను గాంచెను. అతని చూపులో పుత్రికా వాత్సల్యగతమైన భావము ప్రతిబింబించుచుండెను. రామదేవరాయ లాతనిపై గుఱ్ఱము నుఱికించెను. రాగమంజరి యాతనిని వారింపఁబోయెను. కాని, యాతఁ డప్పటికే యాతనితో ద్వంద్వ యుద్ధమునకుఁ గడంగియుండెను. రాగమంజరి హృదయమున పెనుతుఫాను రేగుచుండెను.

యతిరాజు కుమార్తెను తనయొద్ద నుంచిపోయెను. యాచమనాయఁడు రామదేవరాయలను తన రక్షణమున నుంచి యుండెను. ఇద్దరికి బాధ్యురాలీమె యైనది. ఆమె కేమి చేయవలయునో తోఁచినదికాదు.

ఇంతలో యతిరాజు రామదేవుని గుఱ్ఱమునుండి క్రిందకి బడవేసెను. ఆమె గుండెలో రాయిపడెను. యతిరాజా సమయమున గుఱ్ఱము దిగి, కల్యాణి యున్న గుడారమువైపు నడచి, అందాసీనురాలైన కుమార్తెను గౌఁగిలించెను. రాగమంజరి కొక పెద్దయప్పు తీర్చినంత సంతసము కల్గెను. ఇంతలో రామదేవరాయలు తెప్పఱిల్లి యొక చురకత్తినిడీసి యతిరాజువైపు గుఱి చూచుచుండెను. రాగమంజరి యదలిపోయెను. ఆతనిని వారించుటకు మాటలు తోఁచినవికావు.

గుబ్బుమునుండి దూకి పెద్ద పొలికేక వేయుచు యతిరాజువైపునకు పరుగెత్తెను. ఆ కేక రణరంగమున మాఱు మ్రోఁగెను. రామదేవరాయ లంతకుఁ బూర్వమే కత్తి వదలియుండెను. అది రాగమంజరి వీపున గ్రుచ్చుకొనినది. ఆమె నేలపై బోరగిల పడిపోయెను.

రాగమంజరి కేకతో నొక విధముగా యుద్ధమాగి నట్లైనది. శత్రువీరులు రణరంగము వీడిరి. రఘునాథ రాయలు మొదలు సర్వసేనానులు రాగమంజరి వైపు పరుగెత్తిరి.

యతిరాజా కత్తిని పైకిలాగి తన తలపాగను తీసి వ్రణమునకు కట్టు గట్టెను. ఆమె నెత్తురుతో తడిసిపోయెను. రక్తాశోక వృక్షము నేలపై యొరిగి నట్లయ్యెను. ఆమె శిరమును తన తొడపై నుంచుకొని యతిరాజు కూర్చుండెను. రామదేవరాయలు, కల్యాణి యామెపైఁబడి దుఃఖమున పొరలుచుండిరి. రాగమంజరి బాధను మ్రింగుకొనుచు తన చేతులతో నా యిరువురి తలల నిమురుచు, తన దృష్టి యతిరాజుపై నిలపెను, అతఁడు బోరుమనెను. ఆమె వలదని సూచించెను.

యాచమనాయకాదులు వచ్చి యా దృశ్యమును పరికించిరి.

యాచ : రాగమంజరీ! ఇదేమిటమ్మా?

రాగ : నన్ను శ్రీకృష్ణుఁడు రమ్మని యాజ్ఞ పంపినాఁడు.

యాచ చేతులతోనే....కంఠము రుద్ధమై యతఁడు మాటలాడలేక పోయెను.

రాగ : మీరు కంట తడిపెట్టిన శాంతి లేదు.

యాచ ; అంతకన్న నీ నిర్భాగ్యుని కదృష్టమేమున్నది?

రాగ : నాదొక్క మనవి.

యాచ : ఏమిటమ్మా?

రాగ : నా చేతనైనంత రాజును రక్షించితిని, ఇక నా భార మీ యతిరాజుపై నుంచుచున్నాను.

యాచ : నా కర్థము కాలేదు.

రాగ : ఈ రెండు చేతులొక్కటి. (అని కల్యాణీ రామదేవరాయల హస్తములను కలిపి చూపెను) వీని రక్షణకై మీరిద్ద ఱొక్కటై నిల్వవలెను.

యాచమనాయఁడు, యతిరాజు ఒకరినొకరు వీక్షించుకొనిరి. ఇద్దరు కంట తడి పెట్టిరి.

రఘునాథుఁడు తనలో నిట్లనుకొనెను:

"జగ్గరాయలు మానవుఁడు. రాగమంజరి దేవత."

రాగమంజరి కృష్ణుని స్మరించుచు నాతనిలో లీనమైనది. అందఱు దుఃఖ సాగరమున మునిఁగిరి. భానుఁడు పశ్చిమాంబుధిఁ గ్రుంకెను.

రఘునాథరాయలకు విజయము లభించెను. అతఁడు తనకు వేంకటపతి మహారాయలయందుఁ గల యాదరమును బ్రకటించుటకై రామదేవరాయలకు చిదంబరమునందు పట్టాభిషేకము జరిపించెను. విజయ సూచకముగా కావేరీ యొడ్డున విజయ స్తంభము ప్రతిష్ఠించెను,

వెల్లూరులో జరిగిన పట్టాభిషేకముకన్న దీనియం దౌచిత్యము కలదు. ఇప్పుడు రామదేవరాయల వామభాగమున కళ్యాణి భద్రపీఠము నలంకరించెను. గొబ్బూరివంశము మఱల ఆరవీటివంశముతో వియ్య మందినది. మఱల దేశ మున నపూర్వ సమైక్యము స్థాపింపఁబడినది.

యాచమనాయఁడు మఱల శ్రీరంగరాయ లారూపమున రాజ్ఞీసమేతముగా సింహాసన మధిష్ఠించి కర్ణాటక సార్వభౌముఁడైనట్లు తలంచెను.

రఘునాథరాయలు : రామదేవరాయా! ఈ శుభ సమయమందు నీవేమైన దానము సేయవలయునయ్యా!

రామ : యాచమనాయనిచే బంధితుఁడైన వీరప్పనాయనికి రాజ్యదానము, బాయాంబకు నామె పుత్త్రునికి జీవితాంతమువఱకు స్వేచ్ఛాదానము నొసంగుచున్నాను. దీనిని పెద్దలు మన్నింపఁ బ్రార్థన.

ఆతని గుణౌన్నత్యమునకు రఘునాథుని యొడలు పులకించెను.

సభ జయజయ ధ్వానములతో నిండెను. అందఱి హృదయసీమల యందును రాగమంజరీ చరణ మంజీరములు గల్లని మ్రోసెను.

ఓం శాంతిః.

(1958)

# నవమల్లిక

## (సాంఘిక నవల)

"ఈ సువిశాల సరోవరం. ఈ మహోన్నత వృక్షజాలం ఏవో నిగూఢ సత్యాలకు మౌన వ్యాఖ్యానం చేస్తున్నవి కదూ?" నిమీలిత నేత్రాలతో హరి అన్నాడు.

"ఈ అందమైన ప్రకృతిని చూస్తుంటే ఏదో చెప్పలేని ఆవేశం, ఆనందం నాలో ఉరుకులు వేస్తున్నాయి" అన్నది హేమ తన్మయత్వంతో.

"బావ పిచ్చి సగం నీకూ పట్టినట్లుందే చెల్లీ?" అంటూ మధు గట్టిగా నవ్వాడు.

"చూడరా మధూ! వాల్మీకికి సత్పురుషుని నిర్మలహృదయాన్ని జ్ఞాపకం చేసింది సరస్సు! రవీంద్రునికి ఊర్ధ్వబాహువులైన ఋషిగణాన్ని స్ఫురణకు తెచ్చింది వృక్ష సంతానం." హరి కొంచెం ఆవేశాన్ని ప్రకటించాడు.

"మహాకవుల అనుభూతులు నిజంగా ఎంత అగాధాలో అంత ఉన్నతాలు!" హేమ అందుకుంది.

"మీరిద్దరూ కవిత్వం రాయడానికి వచ్చినట్లుంది గాని, హాయిగా కాలక్షేపం చేసేటట్లు కనపడటంలేదు. మీరింత మెచ్చుకుంటున్న ఈ సరస్సు లోతును ఇప్పుడే కొలిచి చూపిస్తా చూడండి" అంటూనే చొక్కావిప్పి, ధోవతి మడిచికట్టి, నడుంబిగించి సరస్సులో దూకి యీదటం మొదలెట్టాడు మధు.

"అన్నయ్య యింతపని యెప్పుడో చేస్తాడని అనుకుంటూనే ఉన్నాను." హేమ నవ్వింది.

"వాడింత సేపూ మర్యాదగా మనవెంట నడిచివచ్చాడు, అదే ఆశ్చర్యం వేసింది నాకూనూ!" హరి శ్రుతి కలిపాడు.

"రారా హరీ! బ్రహ్మాండమైన చెరువు తనివిదీర యీదవచ్చు." మధు సరస్సులోనుండి కేకలు వేస్తున్నాడు.

హరి నిగ్రహించుకోలేకపోయాడు. తానూ పరుగెత్తి సరస్సులో దూకాడు. రెండు పెద్ద చేపలు జలయుద్ధం చేస్తున్నట్లు ఈదటం మొదలెట్టారిద్దరు. హేమ కాదృశ్యం చూస్తూనే తాను వొడ్డున నిలిచి వున్నానన్న స్మృతికూడా లేనంత పరవశత్వం చెందింది.

హరి నీటిలో మునిగాడు. ప్రక్కనున్న మధు కేకవేశాడు. ''చెల్లీ! బావను మొసలిపట్టి లోపలి కీడుస్తోంది. తాటిచెట్టంత లోతు. నాకు భయం వేస్తోంది" అని అరుస్తున్నాడు గడ్డపారయీత యీత్తూ.

సరస్సు ఖంగుమన్నది. హేమ గుండె అదిరిపోయింది. తల తిరిగినంత పనైంది. ''అన్నయ్యా! బావను కాపాడరా! కాపాడరా!'' అంటూ ముందుకు అడుగువేసింది; ఒడ్డుజారి అమాంతం సరస్సులో పడిపోయింది హేమ.

''చెల్లీ! చెల్లీ!'' అని కేకవేస్తూ శరవేగంతో వొడ్డుకు ఈదాడు మధు. అప్పుడే పైకి తేలి అసలు విషయం తెలిసికొన్న హరి ఆత్రంతో అతణ్ణి అనుసరించాడు.

పాఖాల సరస్సు కాకతీయాంధ్ర ప్రభువుల దయా గాంభీర్యాలకు చక్కని నిదర్శనం. ఎందరో యాత్రికులు వినోద విహారార్థం పాఖాల అరణ్యానికి వచ్చి ఆ సరోవర సమీపారణ్య సౌందర్యాన్ని చూచి ముగ్ధులైపోతుంటారు. అఖండమైన లోతుకు, అనంతమైన వైశాల్యానికీ ఆ సరోవరం పెట్టింది పేరు.

సరస్సులో పడటంతోనే రెక్కలు తెగిన హంసిలా హేమ నీటిలో విలవిల తన్నుకొంటోంది. మధు వచ్చి యెడంభుజం పట్టాడు. హరి వచ్చి కుడి భుజం పట్టాడు. ఇరువురూ ఆమెను వొడ్డుకు చేర్చారు. హేమ కొద్దిగా నీరు త్రాగింది కాని, స్మృతి కోల్పోలేదు.

''చెల్లీ! భయంలేదు. మకరపీడ వదిలింది. ఇదుగో గజరాజు మహారాజల్లే నీపక్కన నించున్నాడు.'' హరి యెకసెక్కెంగా అన్నాడు.

''అయితే యిదంతా కావాలని చేసిందన్నమాట?'' తెల్లబోయిన ముఖానికి నవ్వుతో కవచం తొడిగింది హేమ.

''కాదు చెల్లీ! మహాకవి హృదయానికి వ్యాఖ్యానం చేయటం ఎలాగో చూపించడానికి ఈ నాటకమాడాను.'' మధు బుంగమూతి పెట్టి ఒయ్యారం పోయాడు.

''కాదు. నన్ను గంగపాలు చెయ్యటానికి.'' హేమ చిరుకోపం చిలికింది.

"అయితే నాకు తెలియక అడుగుతాను చెల్లీ! బావ యే గంగలో దూకితే నీవూ ఆ గంగలో దూకటానికి సిద్ధమన్నమాట?" మధు కొంటెగా ప్రశ్నించాడు. అందరూ ఒక్కసారి నవ్వారు.

ఉదయభానుని అరుణ కిరణాలు హేమ చెక్కిళ్ళమీద మందారాలు వెద జల్లాయి. నెన్నుదురుమీదినుండి జారుతున్న నీటి బిందువులు సిగ్గుతెరలు దింపుతున్నట్లనిపించాయి. ఆమె చూపు లప్రయత్నంగా స్నిగ్ధములై సరోవర గర్భంలోకి మందమందంగా నడిచిపోయాయి.

చాలానాళ్ళకు మేనత్తగారింటికి వచ్చిన హేమకు సరస్వతమ్మ పిండి వంటలు చేసి పెట్టింది. పట్టుచీరెను కట్టబెట్టింది. కుందనపు బొమ్మలా ఒడ్డూ పొడుగూ పెరిగిన కోడల్ని చూచి లోలోన మురిసిపోయింది.

"అన్నయ్య ఊరి కివ్వాళే వెళ్ళాలంటున్నా డత్తయ్యా!" హేమ అన్నది.

"వాడెప్పుడూ అంతే. చెప్పుల్లో ప్రయాణం పెట్టుకొని వస్తాడు. వాడు వెళ్తే వెళ్తాడు గాని, నీవు నాల్గునాళ్ళుండి పోవచ్చులే" అన్నది సరస్వతమ్మ.

"బావ కూడా అన్నయ్యతో బయలుదేరుతున్నాడు" హేమ.

"బావ లేకపోతే అత్తగారింట్లో నీవుండగూడ దటమ్మా?" అని రఘుపతి అన్నాడు నవ్వుతూ. రఘుపతి హరి తండ్రి.

"ఊఁహూ అమ్మాయి అల్లుణ్ణి ఇల్లరికం తెచ్చేదే కాని అత్తగారింటికి పోయి కాపురం చేసే రకం కాదు మామయ్యా!" మధు కొంటెగా సాగదీశాడు.

అందరూ నవ్వారు. హేమకూ నవ్వాగింది కాదు. కాని, సిగ్గు దానికి అడ్డు తగిలింది.

"చూడండీ! నిన్న సాయంకాలం వచ్చారు. క్షణాలమీద పాఖాలకు ప్రయాణం కట్టారు. రాత్రంతా పులిని చూడటానికి అడివంతా తిరిగారట. మధ్యాహ్నం ఇంటికి చేరారు. కాస్త ఊపిరి పీల్చుకున్నారో లేదో అప్పుడే ప్రయాణం కడుతున్నారు!" సరస్వతమ్మ కథంతా చెప్పింది.

"రాత్రి తొమ్మిదైంది. ఇప్పుడా ప్రయాణం?" రఘుపతి ఆశ్చర్యపోయాడు.

"ఆదివారం పూర్ణిమా కలిసి వచ్చాయీరోజు. వెన్నెట్లో ప్రయాణం చేసి, చాలరోజులైంది. అదీగాక రేపు చాల అవసరమైన పనులున్నాయి. మధుమంజరిలో నేనుండకపోతే వీల్లేదు" మధు.

"అంత కొంపలు మునిగే పనుంటే నీవు వెళ్ళు గాని, అమ్మాయి తర్వాత వస్తుందిలే" రఘుపతి అన్నాడు.

"అదంతా దానిష్టం."

"కాదు మామయ్యా! అమ్మ ఒంటరిగా ఇంటిపనులన్నీ చూచుకోలేదు. మళ్ళా నేనిక్కడ దిగబడితే...." పైటకొంగు చేతికి మెలివేస్తూ నీళ్ళు నమిలింది.

"నీవు మాత్రం ఆ అన్నకు చెల్లెలివి కావా? ఆ నాయనకు కూతురువు కావా?" రఘుపతి మీసాలసందున మెరుపులాంటి నవ్వు విసిరాడు.

"అవునవును. మా అన్నయ్యను అనుకుంచేనే కాని, మీకు అన్నం జీర్ణానికి రాదు." ముసలి ముత్తైదువ మూతి తిప్పింది. హేమ పొంగివచ్చే నవ్వును పైటకొంగుతో పొదివిపట్టింది.

హరి జీపును షెడ్‌లోనుంచి బైటికి తీసి ప్రయాణానికి సిద్ధంచేసి, లోనికి వచ్చాడు.

"వీళ్ళను దిగబెట్టి మళ్ళా వస్తావా నాయనా?" రఘుపతి ప్రశ్న.

"లేదు నాన్నా! పరీక్ష ఫలితాలు తెలిసిందాకా ఉండి వస్తాను" అన్నాడు హరి.

"బావ తప్పకుండా పాసవుతాడు మామయ్యా! అప్పుడు మాకు పెద్ద టీ పార్టీ యిప్పించాలి తెలిసిందా?" హేమ చనువుగా అన్నది.

"బావగారు మన కేమీ యివ్వద్దు గాని, పెళ్ళి వద్దనే భీష్మప్రతిజ్ఞ వదిలితే చాలు." మధు మాటల్లో నవ్వు రంగరించాడు.

"మీలాంటి వాళ్ళకెందరికో పెళ్ళి చేసి కాని నేను పెళ్ళాడను" హరి వీపుమీద చరుస్తూ అన్నాడు.

"అన్నిటికీ ఆ యేడుకొండలవాడే ఉన్నాడు" అని సరస్వతమ్మ తత్త్వం పలికింది.

మధు, హరి, హేమ జీపులో బయలుదేరారు హైదరాబాదుకు. దాదాపు తొంభై మైళ్ళ ప్రయాణం వరంగల్లునుండి హైదరాబాదుకు. దేవదేవుని దయా వాహినిలా పిచ్చి వెన్నెల లోకాన్ని ముంచెత్తుతున్నది, రోడ్డు ప్రక్కన చెట్ల నీడలు నిశాచరుల నీలిగుడారాల్లా బారులు తీరి ఉన్నాయి. నిద్రిస్తున్న రాక్షస సైన్యం మీద ఐరావతం పరుగెత్తుతున్నట్లు జీపు శరవేగంతో ముందుకు దూసుక పోతోంది. మావటీడు మధు.

రెండు గంటల ప్రయాణం ఉత్సాహంగా సాగింది, క్రిందటి రాత్రల్లా నిద్ర లేకపోయినా వెన్నెల చల్లదనం, ప్రశాంత నిశాసౌందర్యం వాళ్ళకు బడలిక ను మరుపుకు తెప్పించాయి. ఏదో ఒక చిన్న పల్లెటూరు ప్రక్కగుండా జీపు రోడ్డు మీద పరుగెత్తుతోంది. ఊరి పొలిమేరలో రోడ్డు ప్రక్కన ఒక పూరిపాక. అందులో నుంచి కెవ్వుమని ఒక కేక వినవచ్చింది. "చచ్చాను బాబోయ్!" అని ఒక స్త్రీ కంఠం. మధు బ్రేకులు వేశాడు. జీపు గాండ్రుమంటూ నిలిచింది. హరి కుప్పించి క్రిందికి దూకి, పాక వద్దకు పరుగెత్తాడు. మధు అతని వెంట చెల్లెల్ని కలుపుకుంటూ పరుగెత్తాడు.

పాక తలుపు దగ్గరగా వేసి వుంది. లోపల మినుకు మినుకుమనే దీపం. ముక్కులు పగిలే కల్లు కంపు. లోపల ఒక పురుష కంఠం సింహగర్జన చేస్తోంది. హరి ఒక క్షణం వాకిలి వద్ద ఆగాడు. పులివాత పడిన ఆడులేడిలాగా ఆక్రందనం చేస్తోంది స్త్రీ కంఠం. "నీ నోరుబడ! వదల్రా నన్ను. ఇన్నేళ్ళొచ్చినా దొంగ ముండకొడకా!....యింకా యీ పాడు బుద్ధి?.... బాబయ్యతో సెప్పి సంపిస్తా.... వదులు."

"దొంగముండ....కొరుకుతుండావంటే....ఇక చూడే ఎవడడ్డం వస్తాడో!" గద్దించింది పురుష కంఠం.

హరి పాక తలుపును ఒక్కతన్ను తన్ని లోనికి దూకాడు. ఒక మూల పెట్టిన కల్లు కుండలు గలగలా కుప్పకూలాయి. కాటుక కొండలా ఒక పురుషుడు "ఓర్డా నువ్వు?.... పానాల మీద ఆసుండే వచ్చావా?" అంటూ హరి యెడం భుజం మీద పిడికిలితో పొడిచాడు. హరి మరొక మూలనున్న కుండల వరుస మీద పడ్డాడు. "చావు గొట్టా!" అని గర్జించాడు నల్లమనిషి. మరోక్షణంలో వాడే డొక్కలో పోటుపడి "అబ్బా!" అని కుప్పకూలాడు. మధు వాడి పీక నొక్కబోతున్నాడు. మధు వాడి ప్రాణాలు తీయకుండా యివతలికి తీసేసరికి, హరికి

బ్రహ్మప్రళయమైంది. ఉక్కులాంటి యభై యేళ్ళ ముసలాడు మూల్గుతూ మూర్ఛలో పడ్డాడు.

పద్దెనిమిదేళ్ళ బీద పిల్ల పాక తలుపు దగ్గర నిలబడ్డ హేమ కాళ్ళకు చుట్టుకొని బావురుమంది. "మా తల్లీ! దేవతలమ్మా మీరు. నా మానం రచ్చించారు. మీ బానిసను....అయ్యో! ఒక్క ఛనం అయితే....నా బతుకు ఏం చెప్పేది తల్లీ?" అని హేమ పాదాలు తడిపేస్తోంది. హేమ చెక్కిళ్ళమీదుగా జారిన రెండు కన్నీటి బిందువుల్ని గుడ్డిదీపం గుర్తించింది.

"ఆ దున్నపోతు మూర్ఛపోయాడు ........ భయపడకు" హరి ఆ పిల్లకు ధైర్యం చెప్పాడు.

"బయంలేదనే పంపాడు దొరా, మా బాబు ........ యీడి బుద్ధి యిలా మండింది."

''మీ బాబు ఎక్కడున్నాడు?''

''ఈ వూళ్ళోనే వుండాడు దొరా!''

"అయితే అక్కడికి పోదాం పద....ఈ సంగతి చెప్పి వీడికి శాస్తి పట్టిద్దాం"

"ఏటి శాస్తి బాబూ? ఆడూ బతికినా సచ్చినాడికిందే లెక్క. నా పానం తీస్తుండాడు. మారిలాంటి పెద్దరోగం. మానలేని పాడు తాగుడు. కనికారం ఉంటే యీ యేళలో ముంతకోసం ఈ ముందకొడుకు కాడికి పంపుతాడా?"

హరీ, మధూ ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారు. హేమ తెల్లబోయి కొయ్యబొమ్మలా నించోంది." త్రాగుడు ఈ దేశంలో తాండవమాడి నన్నాళ్ళూ మానవత కీ అగచాట్లు తప్పవు." హరి నిట్టూర్చాడు.

ముగ్గురూ ఆ పిల్లను చూస్తున్నారు. దీపపుకాంతుల్లో మెరుస్తూ భయంతో అల్లల్లాడుతూన్న విశాలనేత్రాలు కోలముఖాన్ని కొట్టవచ్చినట్లు ప్రదర్శిస్తున్నాయి. వయసుకుతగ్గ యౌవనరేఖలు-పోషణ లేక వాడిపోయిన లతలాంటి మేను-ముసలివాడి రక్తంలో కూడా ఉడుకెత్తించే ఏదో ఒక ఉత్తేజక శక్తి. ఇవన్నీ ఆ పిల్లలోని ఒక విశిష్ట స్త్రీత్వాన్ని బలీయంగా చాటుతున్నాయి. ఒక్క నిముసం వెర్రిగా, నిశ్శబ్దంగా కళ్ళువిప్పి చూచిందా పిల్ల ముగ్గుర్నీ. హరి కాళ్ళకు చుట్టేసుకుంది. ''దొరా నీ మనుసులో కనికారం వుంటే. నీ కాలు మొక్కుతా.... నామీద కాసంత దయ సూపించు...,అయ్యా, అమ్మలేని అనాదను, నా బాబు

నా రక్తం తాగుతుండాడు. పాడు వయసు వచ్చింది....కుర్రకుంకలూ, ముసలి తొత్తులూ నన్ను బతకనిచ్చేట్టులేరు .... దినాం నూరు గండాలు .... లచ్చ అగచాట్లు....మీకో మనవి.... దొరా! నన్నీ నరకం నుండి తప్పించండి....పార్వతీ పరమేశ్వరులల్లే ఉండారు.... మీ యింటిముందు కసువూడ్చి ఋణం తీర్చుకుంటా" అంటూ హరి పాదాల్ని కన్నీటితో తడిపివేసింది. హరి హేమ వైపు చూచాడు. కనురెప్ప లప్పళించి అప్పుడే రెండు కన్నీటి బిందువుల్ని జారుస్తోంది. హరి మధు వైపు చూచాడు. అతను తలవంచి నేలవైపు చూస్తున్నాడు. ఒకసారి అనాథను చూచాడు. ఆమె దీన దృక్కులతో సమాధానం కోసం ఎదురు చూస్తోంది. గట్టిగా నిట్టూరుస్తూ కన్నులు మెల్లగా మూసుకొని మౌన ముద్ర తాల్చాడు హరి. అనంతమైన ఊహావలయం అతని మస్తిష్కంలో సుడులు తిరిగింది.

"బావా! ఈ అనాథను మనతో తీసుకవెళ్తే?" హేమ మందస్వరంతో అన్నది.

"కనికరాన్ని కోరుతున్న పసికందును కాపాడినట్లౌతుంది." హరి గంభీరంగా అన్నాడు.

"మనిషితోపాటు బాధ్యతలూ వెంట వస్తాయి." నిక్కచ్చిగా అన్నాడు మధు.

"బరువెత్తుకున్నాను. ఇక మోయక తప్పదు." హరి గొంతుక జీర పోయింది. ఆ అనాథను తన చేతుల్లో పొదివిపట్టాడు హరి. జీపు వైపుకు దారి తీసింది హేమ. మధు వారిని మౌనంగా అనుసరించాడు.

## 3

హరి నిద్ర లేస్తూండంగానే హేమ నవ్వుతూ హరి గదిలోకి వచ్చింది. "రాత్రి ఒక తమాషా జరిగింది బావా!" అని ఫక్కుమన్నది.

"ఏమైనా కలగన్నావా?"

"నిజంగా కలలాంటిదే. మన మల్లవ్వ* లేదూ.... అది ఎంత తమాషైన పిల్లనుకున్నావ్?"

---

* తెలంగాణా ప్రాంతంలోని జానపద స్త్రీలను 'అవ్వా' అని పిలవడం సహజం.

ఏం జరిగింది?"

"రాత్రి నా ఫ్రెండింటికి డిన్నరుకు వెళ్ళి పొద్దుబోయివచ్చాను. మన మల్లవ్వ వుండే మెట్ల గదిలో యింకా లైటు వెలుగుతూనేవుంది. ఏమిటా అని మెల్లగా కిటికీ వద్దకుపోయి నక్కిచూచా. నాకు ఆశ్చర్యం వేసింది. లోపల మల్లవ్వ లేదు. ఎవరో నాగరక యువతి అద్దం చూచుకుంటూ ఒయ్యారాలు పోతోంది".

"ఎవరా వ్యక్తి?"

"అదే ప్రశ్న నాకూ మొదట కల్గింది. తీరా చూస్తే మల్లవ్వే!"

"ఏమిటీ రజ్జు సర్ప భ్రాంతి?"

"సర్పం కాదది నాగదేవత. అసలుసంగతి చెప్తేగాని నీకు బోధపడదు. నిన్న సాయంత్రం మల్లవ్వ నా పట్టుచీరను, పంజాబీడ్రస్సును ఉతకటానికి తీసికెళ్ళింది. రాత్రి ఆ పట్టుచీరె కట్టుకొని, రెండుజడలు వేసుకొని, పూలు పెట్టుకొని అద్దంలో చూచుకుంటూ మురిసిపోతోంది. చేసిన పాపం చెప్పొద్దూ. కిమ్మనకుండా ఒక అర్ధగంటసేపు అక్కడే నిలబడి చూచాను. ఆ తర్వాత పంజాబీడ్రస్ వేసుకుంది. అద్దంలో చూచుకుంది. దాన్ని కౌగిలించుకొంది. తన పాపను తానే ముద్దుపెట్టుకుంది. మళ్ళా తన మామూలు దుస్తులు వేసుకొని, జుట్టుముడి వేసుకొని, లైటార్పి పడుకుంది. నేనూ వచ్చేశాను. పొద్దున్నే మల్లవ్వ నాకు కాఫీ తెచ్చినప్పుడు నేనొక తమాషా చేశాను. దానితో 'రాత్రి నాకో కలొచ్చిందవ్వా! నీవు పట్టుచీరకట్టుకొని విమానంలో బొంబాయి వెళ్ళావట! అక్కడొక ఏడంతస్తుల మేడ కొని దానిమీద పంజాబీడ్రెస్‌తో పచార్లు చేస్తున్నావట! నేను నిన్ను చూడటానికి వచ్చానట! మల్లవ్వా! అని పిలచానట! ఆ మేడ గేటు దగ్గర బంట్రోతు నన్ను గదమాయించి 'మల్లవ్వ కాదు నాగదేవత' అని అన్నాడు' అని అంటూంటే నాకే నవ్వాగిందికాదు. మల్లవ్వ మరీ తెల్లబోయింది. కాని, వెంటనే తేరుకొని 'మా వూళ్ళో దాసరి రామసామి కూడా 'మల్లీ, నీవు నాగదేవతల్లే ఉంటావే' అంటూండేవాడండి' అని తాపీగా అనేసింది. నాకు పొట్ట చెక్కలైంది. 'నాకూ రెండుజడలు వేసి పూలు పెడతావా? నా పాపను ముద్దెట్టుకుంటాను' అన్నాను కొంటెగా. 'ఒక్కొక్కసారి కలలుగూడా నిజమౌతూంటాయమ్మా!' అంటూ తుర్రుమ పరుగెత్తింది మల్లవ్వ, ముంచుకొచ్చే సిగ్గుతో." హేమ కథ ముగించే సరికి హరి గంభీరుడైనాడు.

"ఏం బావా, వట్టి అమాయకురాలు కదూ మల్లవ్వ?"

''సందేహమేమీ లేదు.''

"అయితే, పెద్ద డిటెక్టివ్‌లాగా అంత సీరియస్‌గా ముఖంపెట్టావేం?"

''ఈ సన్నివేశంలో అంతగా నవ్వదగిం దేమిటా అని ఆలోచిస్తున్నాను."

"ఉరుమురిమి మంగలం మీద పడ్డట్టు కథంతాపోయి నా నవ్వొక సమస్య అయిందా?''

"మల్లవ్వ కథలో నవ్వదగిం దేదీ లేదు. ప్రతివ్యక్తికీ తానందంగా ఉండాలని వుంటుంది. కొత్త ఫాషన్ నగరంలో అడుగు పెడితేచాలు దాన్ని తమ శరీరాల మీద ముద్రించుకోవాలని యెంతమంది యువతీయువకులు అహోరాత్రాలు కృషిచేయడం లేదు? వారి సందర్శి ముందడుగు వేస్తున్నారని అభినందిస్తాం మనం. అనాథ బాల ఒకతె అలంకరించుకుంటే ఆశ్చర్యపడతాం. అవహేళనం చేస్తాం. ఇట్టి వికారభావం మనలో ఉంటే మనకు నవ్వు వస్తుంది. లేకపోతే జాలి వేస్తుంది." హరి నైశిత్యాన్ని మార్దవం చేస్తూ మాట్లాడాడు.

"మల్లవ్వ కిన్ని ఊహాపోహ లున్నాయంటావా?"

"ఉన్నవి. వానితోపాటు వివేకం, ఆత్మవిశ్వాసం కూడా ఉన్నాయి. కాని, బీజప్రాయంగా వున్నాయి. వాటికి పోషణ యిస్తే పెరిగి పెద్దవి కావచ్చు."

"నీవు ఊహాగానం చేస్తున్నావు."

"ఒక్కటి గమనిస్తావా హేమా? మల్లవ్వ తన రహస్యాన్ని నీవు బట్ట బయలు చేసినప్పుడు కంగారెత్తినా నిలువ తొక్కుకుంది. నాగకన్య వంటే, అవును దాసరికూడా ఆ మాటే అనేవాడన్నది. కలలు నిజమౌతాయన్నది. అంటే దాని చేష్టలమీద, దాని అందంమీద దానికంత విశ్వాసముందన్నమాట."

"ఊఁ! అయితే మల్లవ్వ కథలో యింత మహార్థం ఉందన్నమాట!" హేమ గాఢంగా నిట్టూర్చింది.

"ఎవరి ఆత్మ చైతన్యం శరీరావధులను దాటి ముందుకు త్రోసుక పోతుందో వాళ్ళ చేష్టలలో తప్పకుండా ఏదో మహార్థముంటుంది. అట్టి చైతన్యం మల్లవ్వలో వుంది. దానికి ప్రాణంపోస్తే అది ఒక నాగరక స్త్రీ అవుతుంది."

"అంత సంస్కారం ఒక్కసారి ఎలా వస్తుంది బావా?"

"పసరు మొగ్గకు లేని వాసన విరిసిన పుష్పాని కెక్కడ్నించి వస్తుంది?"

"అయితే బావా, మల్లవ్వకు ఇప్పణ్ణుంచి మల్లిక అని పిలుద్దామా?"

"నీకు మంచి సంస్కారం ఉంది హేమా!"

ఇద్దరూ తృప్తిగా మందహాసం చేశారు.

రామచంద్రయ్య భోంచేసి హాల్లోకి వచ్చి ఆఫీసు ఫైళ్ళల్లో మునిగి పోయాడు. "మిన్ను విరిగిపడ్డా మీరు పట్టించుకోరండీ!" మాణిక్యాలు రుసరుసా వచ్చి భర్తముందు కూర్చొని ఆకులకు సున్నం రాయడం మొదలెట్టింది.

"ఇవ్వాళేం వచ్చింది మళ్ళీ?" రామచంద్రయ్య పరాచికలో ప్రశ్న.

"ఇక నాకు చేతకాదు బాబూ యీ సంసార మీదటం. మీకేం మహా రాజులు, మీకేం పట్టదు."

"దేనికీ ఈ ఉపోద్ఘాతమంతా?"

"మీరేమన్నా అనండి....ఈ మల్లవ్వ వచ్చి మన కొంపలో చిచ్చు పెట్టింది."

"ఏం చేస్తున్న దేమిటి?"

"ఏం చెయ్యాలేంటి? అసలా ముష్టిముండను ఇంట్లో చేర్చటమే తప్పైంది. అది మన యింట్లో తిని యింటి వాసాలు లెక్కెస్తుంది."

"అంతపని చేస్తోందా?"

"అది ముంగెండీ! పైకి కనపడదు గాని లోపల ఎన్ని ఊహలు! ఎన్ని కళలు! బీదపిల్ల కదా, చచ్చినట్లు పడుండరాదూ? వచ్చి వారం రోజులైందో లేదో దాని కులుకూ షోకూ పట్టతరం కాకుండా వుంది. దానికి మీ అల్లుడూ, మీ కూతురూ మద్దత్తు."

"అనాథ కదా అని కాస్త ఆదరంగా చూచారు కాబోలు!"

"పాముకు పాలుపోసి పెంచితే యేమౌతుంది?"

హేమ అప్పుడే హాల్లోకి వచ్చింది. "నాన్నారు పాము లెప్పుడు పెంచా రమ్మా?" నవ్వుతూ ఎదురుగా సోఫాలో కూర్చుంది.

"ఇదొక వెర్రి బాగుల్ది. ఆ హరి చేసే తంత్రాలు తెలీక తనగొంతుకే ఉరి తెచ్చుకుంటోంది." మాణిక్యాంబ సాగదీస్తూ పితూరీ చేసింది.

"ఏమిటి తల్లీ యిదంతా?" రామచంద్రయ్య కూతురు నడిగాడు.

"అమ్మకెందుకో మల్లిక అంటే పడటం లేదు నాన్నా!"

"చూచారా, దాని కొక ముద్దు పేరు పెట్టి అందల మెక్కించారు!" మాణిక్యాంబ.

"మల్లిక ఎంతో మంచి పిల్ల....నాన్నా! పైకి తీసుకొస్తే బాగుపడి నాగరకురా లౌతుంది." హేమ.

"నాగరకురాలే ఔతుందో నాయకురాలే ఔతుందో....లేకపోతే నీ చేతనే ముస్తాబు చేయించుకుంటుందా?" మాణిక్యాంబ.

"మల్లవ్వకు నీవు ముస్తాబు చేశావా?" రామచంద్రయ్య గ్రుచ్చి అడిగాడు.

"వాళ్ళ పినతండ్రి యివ్వేళ వస్తాడంటేను తల దువ్వి, పూలు పెట్టి, నా సిల్కు చీరె కట్టబెట్టి పంపాను-అంతే."

"దాని అంతస్తేమిటి? నీ అంతస్తేమిటి?" మాణిక్యాంబ హెచ్చరిక.

"నాన్నా! మల్లిక అందమైన పిల్ల. అలంకరిస్తే అపరంజిబొమ్మ. నాకూ ఒక చెల్లెలుంటే, నా మోజుదీర అలంకరించేదాన్ని."

"అయితే నీ మోజులూ, మురిపాలూ పనిమనిషితోటటే?"

"అమ్మా! మల్లికను పనిమనిషిగా తప్ప మనిషిగా నీవు అర్థంచేసుకో లేవమ్మా!"

"చూడు తల్లీ! మీ అమ్మ మాత్రం మల్లవ్వను మనిషి కాదన్నదా? పనిమనిషన్నది - అంతే." రామచంద్రయ్య తర్కం చేశాడు.

"అవును. నా అభిప్రాయం సూటిగా చెప్పారు మీరు. ఇది దానికి లేని గౌరవం యిద్దామంటుంది. అది రేపు ఏకు మేకౌతుంది. హరిని వల్లో వేసుకుంటుంది."

"అమ్మా! ఏమంటున్నావు?" ఆక్రోశించింది హేమ.

"చిన్నపిల్లవు, నీకు తెలీదు. టక్కులమారి ఆడదాన్ని అలుసిచ్చి ఆదరిస్తే, ప్రాణాలమీదకు తెచ్చిపెడుతుంది."

"మల్లిక అటువంటిది కాదు."

"నల్లనివన్నీ నీళ్ళు, తెల్లనివన్నీ పాలు అని నమ్మే అమాయకురాలివి నీవు....రేపు ఎల్లా కాపురం చేస్తావో యేమో?"

"తల్లీ! హేమ, మల్లమ్మ ఎక్కడికి వెళ్ళారు?" రామచంద్రయ్య అడిగాడు.

"మధుమంజరి కెళ్ళారు. అన్నయ్య కూడా అక్కడే ఉన్నాడు. మల్లికి పినతండ్రి వస్తాడట."

"అయితే మల్లవ్వ నతనితో పంపేస్తారా?"

"అసలే రోగంతో సరంపీక్కుంటున్నాడట.... పంపిస్తే వాడికి కాస్త గంజైనా కాచి పోస్తుంది. మనసూ పీత వదుల్తుంది." మాణిక్యాంబ చిదరించుకున్నది.

"పంపితే నీ వింతవరకూ పడ్డ బాధ వృధా అయిపోతుందేమో?" రామచంద్రయ్య కళ్ళతో నవ్వాడు.

"అది పోతానంటేమాత్రం మీ అల్లుడుగారు పోనిస్తాడా?...అదీ చూస్తాంగా యింకా సేపటికి.... అప్పుడు చేతులు కాలింతర్వాత ఆకులు పట్టుకోండి మీరూ మీ కూతురూ" అంటూ రామచంద్రయ్య నోట్లో తమలపాకు బీడా దురిమి విస విసా వంటయింట్లోకి పోయింది మాణిక్యాంబ.

హేమ తండ్రితో ఏదో చెప్పాలని యత్నించింది. గొంతుకలో వాక్యం ఆగిపోయింది. గతం నిర్మలంగానే ఉన్నా భవిష్యత్తులో ఏవో పొగమబ్బులు క్రమ్మే భయం, దాన్ని నమ్మజాలని ఏదో ఒక సమాధానం ఆమె చూపుల్లో ముసురుకున్నాయి.

"ఏమిటి తల్లీ, ఏమిటో చెప్పవచ్చావు?" తండ్రి పరామర్శించాడు.

"అబ్బే ఏంలేదు నాన్నా! అమ్మ మాటలు అదోలా వున్నాయికదూ?"

"ఒక్కమాట తల్లీ! తనకుమాలిన ధర్మం మొదలుచెడ్డ బేరం. లోకంలో ప్రతి పనికీ లాభనష్టాలు రెండూ ఉంటాయి. తెలివైనవాళ్ళు జీవితంలో తాము నష్టపడకుండా చూచుకుంటారు....చదువుకున్నదానవు.... ఇకమీద నీ యిష్టం!" అంటూనే ఆఫీసు ఫైళ్ళలో మునిగిపోయాడు మళ్ళీ రామచంద్రయ్య.

హేమ అయోమయంగా తన గదిలోనికి వెళ్ళిపోయింది.

## 5

మధుమంజరి సౌండ్ సిండికేట్ ఆబిడ్ రోడ్డులో జనాకర్షణీయంగా కాన వచ్చే ఒక పెద్ద రేడియో వ్యాపార సంస్థ. దానికి ప్రొప్రయిటర్ రామచంద్రయ్య. మేనేజరు మధు. హరి దర్శకత్వంలో షోరూం కళా సుందరంగా తీర్చిదిద్దాడు

మధు. సంస్థ పుట్టి సంవత్సరం కాకపోయినా మూడుపూవు లారుకాయలుగా విస్తరిస్తోంది. ఆ రోజు ఆదివారం. మధుమంజరి బయట మూయబడి వున్నా ప్రక్క వాకిలి తెరువబడివుంది. మధు, హరి, మల్లికా గ్రామంనుండి వచ్చిన మల్లిక పినతండ్రి వీరయ్యతోనూ, ఆ వూరి పటేలుతోను మాట్లాడుతున్నారు.

హేమ మధుమంజరి ముందు రిక్షా దిగే సమయానికి లోపల్నించి ఒక వృద్ధ కంఠం "బుద్దొచ్చింది దొరా! ఈ తాగుడే మా అన్న యిల్లు కూల్చింది. నా వొళ్ళు గుల్ల సేసింది. మా సుల్లవ్వ నాకు మంచి బుద్ధి సెప్పింది. ఇక నా గొంతులో ఊపిరుండగా తాగను బాబూ! నీ పాదాలు సాచ్చి" అని బొంగురు బోయింది.

"మా బాబు ఈ వారం రోజుల్లో ఎంతో మారిపోయాడు" అంటున్నది మల్లిక.

హేమ మధుమంజరిలోనికి వచ్చింది. ఆమె ముఖం వెలవెలపోతోంది. కన్ను లెర్రగా వున్నాయి. తెచ్చిపెట్టుకున్న వికాసంతో అందర్నీ కలయ జూచింది.

"బాబూ! వీరు హేమమ్మగారు. నా పాణం రచ్చించిన మహాతల్లి. నన్ను సెల్లెలికంటే గారాబంగా సూసుకుంటోంది. దేవతలాంటి మడిసి!" మల్లిక ఆప్యాయంగా హేమను వీరయ్యకు పరిచయం చేసింది.

"దణ్ణం పెడతా తల్లీ!" వీరయ్య వంగి సమస్కరించాడు. హేమ అతనికేమీ సమాధానం చెప్పలేదు. హరి హేమను పరామర్శించాడు. కూర్చోమన్నాడు. హేమ మరుమాటాడక తల ప్రక్కకు త్రిప్పి మధు దగ్గరికి వెళ్ళి అతని చెవులో ఏదో చెప్పింది. మరుక్షణంలో అన్నాచెల్లెలూ మధు ఆఫీసు గదిలోకి వెళ్ళారు. హరి ముఖంపై కొన్ని నీలిరేఖలు, కొన్ని ధవళరేఖలు పెనవేసుకొని నెన్నుదురుపై తారట్లాడి అదృశ్యమైనాయి. మల్లిక తెల్లబోయింది.

"ఇక మనం ముందు చేయాలిసిన కర్తవ్య మేమంటారు బాబూ?" పటేలు అసలు సంగతి మొదలెట్టాడు.

"అనుభవజ్ఞులు మీరే చెప్పాలి" హరి ముక్తసరిగా అని ఊరుకున్నాడు.

"ఎంతమ్మాట! మీకంటే నాకేం ఎక్కువ తెలుసు చెప్పండి .... అయినా, నాకు తోచింది చెప్తాను. వీరయ్య చావుబతుకుల్లో ఉన్నాడు. ఇప్పుడు మనిషి

మారాడు. మల్లవ్వ నిలడితో పంపిస్తే కాస్త అంగగా వుంటుంది. మీకూ మరే బాధ్యతా వుండదు."

హరి మూగనవ్వు నవ్వాడు. ''పటేలుగారూ! మీరన్నట్లు పంపుతాను.... ఆ తరువాత?"

''అది వాళ్ళ సంసారపు గొడవ. మన కనవసరం." పటేలు ముగించాడు.

''దొరా! ముసలి ముండకొడుకును. ముంతెడు గంజి కాచిపోసే దిక్కు లేదు. ఈ పిల్లదాన్ని వొదిలి నేను బతకలేను. దయసూపండి .... మీ కాలు మొక్కుతా" దీనంగా మొర పెట్టాడు వీరయ్య.

''వీరయ్యా! నీ మాట నిజమే. నీతో పంపితే మల్లవ్వ నిన్ను కంటికి రెప్పలా చూస్తుంది....కాని, మల్లవ్వ బాధ్యత యెవరిది?" హరి సూటిగా ప్రశ్నించాడు.

''అదేటో నాకు తెలవటంలేదు దొరా!" వీరయ్య తెల్లబోయాడు.

"అది తెలియకపోబట్టే మల్లికను రోడ్లవెంట తిప్పి, తాగుబోతు వెధవలకు బలిపెట్టాలని చూచావు."

"అదేంటి బాబూ! ఇవ్వాళో రేపో దాని పెళ్ళిచేసి దానింటికి పంపెయ్యడా యేంటి?" పటేలు అడ్డం వచ్చాడు.

"మల్లిక అత్తగారింటికి వెళ్ళితే వీరయ్య గతేమౌతుంది?''

"పెళ్లైతే మాత్రం మల్లవ్వ పిన్నయ్యను కాదంటుందా?"

''అప్పుడు బాధ్యత ఆమె కుండదు ఆ చేసుకున్నవాడికుంటుంది."

"అవన్నీ మనం అనుకుంటాంగాని, ఎవరి బతుకు ఎలా తెల్లారాలని వుందో అలాగే అవుతుంది. అట్లని ఎన్నని మన తలమీద కెత్తుకుంటాం?" పటేలు నములుతూ మాట్లాడాడు.

''మనుషుల అసమర్థత ఈ అదృష్టవాదం వెనుక ఆశ్రయం తీసుకొంటోంది".

''అయితే, అసలు మీ అభిప్రాయమేంటి?"పటేలు సూటిగా ప్రశ్నించాడు.

హరి గంభీరుడైనాడు. ''మల్లికను మరలా ఆ బురదగుంటలో పడ వేయటం నా కిష్టంలేదు" తన నిర్ణయం తేల్చిచెప్పాడు హరి.

''హరీ! నీ నిర్ణయాన్ని ఒకసారి పునరాలోచించుకో" మధు ఆఫీసుగది వాకిట్లో నిలువబడి హెచ్చరించాడు. హరి ఒక క్షణం నిర్ఘాంతపోయాడు. అన్న వెనుక చెల్లెలు నిలువబడి బిక్కుబిక్కుమని చూస్తోంది. మధు మళ్ళా మాట్లాడ సాగాడు.

"అమ్మా నాన్నలు కూడా ఇదేమాట నీతో చెప్పమని హేమతో కబు రంపారు."

''అయితే, యీ విషయాన్ని అత్తా మామయ్యలు కూడా ఆలోచిస్తున్నా రన్నమాట!" హరి ఆశ్చర్యంతో అన్నాడు.

"పెద్దవాళ్ళు కాబట్టి.... బాధ్యత, బరువు అంటే తెలిసినవాళ్ళు కాబట్టి మనకీ సలహా ఇచ్చారు."

''మధూ! మీరిద్దరూ అత్తమామలనే బలపరుస్తున్నారా?"

"తల్లిదండ్రుల వెనుకవాళ్ళం మేము." మధు ముఖం ప్రక్కకు తిప్పి అన్నాడు. హరి దెబ్బతిన్నాడు. ఒక్కక్షణం మధు, హేమలను తేరిపార చూచాడు. హేమతో ఇలా అన్నాడు: "హేమా! మీ యిద్దరి ముందే నేనొకసారి ఒక నిర్ణ యానికి వచ్చాను. మధు మొదటినుంచీ కొంత అనుకూలంగా లేడు. నీవు కూడా యిప్పుడు కాదంటున్నావా?"

"నాకూ ఆలోచించినకొద్దీ అమ్మానాన్నల మాటలే ఉచితమనిపిస్తున్నాయి" హేమ భయపడుతూనే చెప్పింది. హరికి కొంచెం కోపం వచ్చింది.

"పెక్కుసార్లాలోచించి పెక్కు నిర్ణయాలకు రావటంకన్న పెక్కు సార్లు యోచించి ఒక నిర్ణయానికి రావటం వివేకమనిపించుకుంటుంది." అన్నాడు హరి తీక్ష్ణంగా. హరి మాటలలోని తీక్ష్ణతకు హేమ తట్టుకోలేకపోయింది. పొంగి వస్తున్న దుఃఖావేశానికి ఆమె అధరం కంపించిపోయింది. ఒక్క క్షణం అల్లాగే నిలువబడి హేమ గబగబా రోడ్డుమీదకు పోయి రిక్షా చేసుకొని వెళ్ళిపోయింది.

మల్లిక భయంతో కంపించిపోయింది. అయోమయంగా కుర్చీలో కూల బడిపోయింది. హరి యీషదంకురితమైన కోపాన్ని దిగమింగాడు. మధు కొయ్యబొమ్మలాగా తలవంచుకొని కుర్చీలో కూర్చున్నాడు.

"బాబూ! ఇంతమంది కిష్టంలేని పని మీరెందుకు చేస్తారు?" వీరయ్య ఆర్ద్రంగా అన్నాడు.

"నాకూ తల్లిదండ్రులు ఉన్నారు. నాకు వారు చదువు చెప్పించి లోకంలో వివేకంతో మెలగమన్నారు. నాకు స్వయం నిర్ణయ శక్తిని ప్రసాదించారు. నేను నమ్మిన యే విషయాన్నైనా వారితో చెప్పి ఒప్పించగలను" హరి అభిమానంతో అన్నాడు.

"మీరనే మాట బాగానే వుంది. కాని మీరే అమ్మాయిని మీవద్ద ఉంచుకోవటంలో ఏదో ఒక ధర్మం, ఒక ప్రయోజనం ఉండాలికదా?" పటేలు పట్టి పట్టి అడిగాడు.

"లోకం ఈ ప్రశ్న వేస్తుందని నాకు తెలుసు. జబ్బుతో బాధపడుతున్న తండ్రి అతని బాధ్యత నిర్వహించలేదు. దానివల్లనే కథ యింతదూరం వచ్చింది. ఇప్పుడీ తండ్రికి కావలిసింది తన బాధ్యతను నిర్వహించే శక్తి. అంటే-ఆరోగ్యం గల శరీరం. అది కూతుర్ని తిరిగి యిచ్చెయ్యడం వల్ల సమకూరదు, దానికి సమాధానం నే నిప్పుడే ఆలోచించాను" అని అంటూ తన తోలుసంచీ నుండి కొన్ని కరెన్సీ నోట్లను తీశాడు. "పటేలుగారూ! అవిగో రెండు వేల రూపాయలు. వీరయ్యను శానిటోరియంలో చేర్పించండి. ఆయనపేర ఈ రూపాయలు బాంకులో వేయండి. అతను అనుభవింపగలిగి నన్నాళ్ళు అనుభవింపవచ్చు. తక్కువపడితే పంపుతాము. ఏమైనా మిగిలితే మల్లికకు చెందేటట్లు విల్లు వ్రాయించండి. మల్లిక తన కాళ్ళ మీద తాను నిలువబడేటట్లు చేసే బాధ్యత నాది. తరువాత ఆమె యిష్టం." హరి ముఖం వింత కాంతితో తొణికిసలాడింది.

పటేలు కూర్చున్నవాడల్లా కుర్చీలో నుండి లేచి వంగి నమస్కరిస్తూ "బాబూ! మీరింత ఉదారులని ఊహించలేకపోయాను మహారాజులకుండే దొడ్డ బుద్ధి దేవుడు మీకు ప్రసాదించాడు." అని ప్రశంసిస్తూ వీరయ్య వద్దకు వెళ్ళి వీపు తట్టుతూ "వీరయ్యా! నీ వేజన్మలోనో మంచి పుణ్యంచేసి పుట్టావు. మల్లివ్వను అయ్యగారి చేతుల్లో పెట్టు. దేవుడు దగ్గర ముడుపు కట్టినట్లే. నీవు వాళ్ళు నయం చేసుకో.... ఋణం తీర్చుకో. ఇంతకన్నా నీ బతుకులో కలిగే మేలు మరొకటి లేదు" అని ప్రోత్సహించాడు.

వీరయ్య వణికిపోతున్నాడు. ఆ యెముకల మూటలో ఆ సంతోషం యిమిడేటట్లు లేదు. సాష్టాంగపడ్డాడు వీరయ్య హరికి. హరి ఆ డబ్బు పటేలు చేతుల్లో పెట్టాడు.

మధు నిర్విణ్ణుడైనాడు. "హరీ! నన్ను క్షమింపవూ?" అంటూ వేగంగా వచ్చి హరిని కౌగిలించుకున్నాడు. హరి పాదాల మీద మల్లిక కన్నీటితో అభిషేకం చేసింది. హరి నిబ్బరంగా ఒక గట్టి నిట్టూర్పు విడిచాడు.

## 6

రామచంద్రయ్య హైదరాబాదులో ఒక స్థానిక బ్యాంకు మేనేజరు. నెలకు ఆరు వందల రూపాయల జీతం. మనిషి కొంచెం పొట్టి, దృఢ శరీరం, బట్టతల. బ్యాంకు కార్యకలాపాల్లో అందె వేసిన చేయి. పైతృకమైన 40 వేల ఆస్తి నిక్షేపంలా కదలకుండా వుంది. పై పెచ్చు మాణిక్యాంబగారి పుట్టింటి ఆస్తి 50 వేలు వచ్చి పడింది. భార్యాభర్తల మధ్య అంకెల్లో తేడాలాగానే గృహాధికారంలో కూడా తేడా తప్పలేదు. లెక్కల ప్రకారం రామచంద్రయ్యగారికి అది న్యాయమనే అనిపించింది. బండి సాగిపోతోంది.

రామచంద్రయ్యకు ఒక్కతే చెల్లెలు-సరస్వతమ్మ, ఆమెను వరంగల్లులోని రఘుపతి కిచ్చాడు. రఘుపతి ఒక సంపన్న గృహస్థుడు. 50 ఎకరాల నిక్షేపం లాంటి భూమి. లంకంత స్థిరాస్తి వారికి హరి యేకైక పుత్రుడు. అతని మీద వారికి పంచప్రాణాలు; అతని ప్రవర్తన మీద అఖండవిశ్వాసం; అతని వ్యక్తిత్వం మీద అమితమైన ఆదరం

రామచంద్రయ్యకు ఒక కొడుకూ ఒక కూతురు. వాళ్ళే మధు, హేమ. మధు రేడియో ఇంజనీరు. హేమ యింటరు పరీక్ష యిచ్చింది. మధు జీవితాన్ని సూటిగా వాస్తవికదృష్టితో చూచి అర్థం చేసుకోగలడు. హేమ ఉద్విగ్నము స్నిగ్ధమునైన హృదయంగల తెలుగుపిల్ల.

హరి వరంగల్లులో ఇంటరు ముగించుకొని పట్టభద్రుడు కావటానికి హైదరాబాదు వచ్చాడు. ముచ్చటైన మేనల్లుణ్ణి చూచి హేమ నిచ్చి యింటి కల్లుణ్ణి చేసుకుందామని రామచంద్రయ్యా మాణిక్యాంబా లోలోన ఉబలాట పడ్డారు. హరిని నాలుగేళ్ళబట్టీ తమ యింట్లోనే ఉంచుకున్నారు. వాళ్ళల్లో అతడు కూడా నీళ్ళలో పాలలాగా కలిసిపోయాడు. బి. ఏ. ముగించాడు; ఇప్పుడు ఎం. ఏ., పరీక్ష యిచ్చాడు; ఫలితాలకొఱకు నిరీక్షిస్తున్నాడు.

రామచంద్రయ్య కష్టమన్నది యెరుగని మహాభోగి. మహామంత్రి వంటి భార్య దొరకటం వల్ల సంసార మహాసామ్రాజ్యాన్ని తామరాకుపై నీటిబిందువు

లాగా పరిపాలిస్తూ తన డబ్బులాగానే తన మెదడును కూడా బ్యాంకులో ఫిక్సెడ్ డిపాజిట్ చేశాడు. హరీ హేమల వివాహం జరపటం మాణిక్యాంబ జీవితంలో మొదటి లక్ష్యం. తన హోదాకూ తన అభిరుచికీ తగిన లక్షాధికారి కూతుర్ని కోడలుగా పొందటం ఆమె జీవితంలో చరమలక్ష్యం. ఈ రెండు భావప్రవాహాలకూ ఏ మాత్రం ఏమి అడ్డువచ్చినా సంసారక్షేత్రంలో కల్లోలమే; సంక్షోభమే. హరీ హేమల మధ్య మల్లిక నిలుపబడుతుందేమో నన్న భయం మాణిక్యాంబకు కలిగిన మరుక్షణం నుండీ గృహంలో కొంత అశాంతి ప్రారంభమైంది. మల్లికను వీరయ్యతో పంపేటట్లు సాయశక్తులా ప్రయత్నించింది. కాని లాభం లేకపోయింది. మేనల్లునితో ముఖాముఖి మాట్లాడే శక్తి ఆమెకు లేదు. పరోక్షంలో ప్రచండ వాతావరణాన్ని సృష్టించకలదు.

తెల్లవారుజాముననే మల్లిక బాయిలర్‌లో బొగ్గువేసి నిప్పు అంటిస్తోంది. మాణిక్యాంబ మండిపడుతూ వచ్చింది. "అంటించినంతవరకు చాలు నిప్పు. ఇది యింతటితో పోతుందా? మహాతల్లి, మా ఆశలన్నీ మసిచెయ్యటానికి వచ్చింది" అని అంటూ, కూర్చున్న మల్లికను మోకాళ్ళతో ఘాటుగా పొడిచింది. మల్లిక గ్రుడ్ల నీళ్ళు గ్రుడ్ల కుక్కుకొని ప్రక్కకు తొలిగిపోయింది.

బండెడు అంట్లూ తొలిచి బోర్లిస్తోంది మల్లిక. "ఎన్ని కొంపలు బోర్లించి వచ్చిందో మహమ్మారి! దీన్ని నమ్ముకున్నవాళ్ళంతా ఇలాగే బోర్లపడతారులే." మాణిక్యాంబ మెటికలు విరుస్తూ మాటలు విసిరింది. బొడ్డుదగ్గరనుండీ పొర్లుకొని వచ్చింది దుఃఖం మల్లికకు.

బట్టలుతికి ఆరవేస్తోంది మల్లిక. "బట్టకు పట్టిన మురికి ఉతికితే పోతుంది. పుట్టుకతో వచ్చిన మురికి పుడకలతోగాని పోదు." తులసెమ్మ వద్ద కూర్చుంది మంగళహారతులు మొదలుపెట్టింది మాణిక్యాంబ. గుండె లంటుకున్నంత బాధ పడింది మల్లిక.

అందరి యెంగిలి కంచాలు కడిగి, మూకుడులో అన్నం పెట్టుకొని కూర్చుంది మల్లిక. "వాకిట్లో కుక్క కింతవేస్తే విశ్వాసంతో పడివుంటుంది. మనుషుల కెంత పెట్టినా తిని యింటివాసాలు లెక్కెస్తారు." తమలపాకు తమ్మ నేలమీద తుపుక్కున ఉమ్మేస్తూ అల్లంత దూరాన విసురుగా పోయింది మాణిక్యాంబ. మల్లిక మూకుడులో చేతులు కడిగి లేచింది.

అందరికీ పక్కలువేసి మల్లిక తన బొంత విదిల్చికొని మెట్ల గదిలో పరుచుకుంది. "ఎంతలో ఉంచదగ్గవార్ని అంతలో ఉంచటమే మంచిది. కనకపు సింహాసనం మీద శునకాన్ని కూచోపెట్టినా వెనకటి గుణం మానద్దూ?" మాణిక్యాంబ పల్లేరు కాయల్లాంటి మాటలు వెదజల్లుతూ పోయింది. మల్లిక తలగడ ముద్దయ్యేటట్లు బోరున ఏడ్చింది.

మల్లిక పడుకున్నదే కాని, చాలా సేపటిదాకా నిద్రపట్టలేదు. తాను నవ్వాలనో ఏడ్వాలనో తెలియలేదు. బుద్ధభగవానుడులాగా తన మీద అపార మైన దయావర్షం కురిపించిన హరి దివ్యమూర్తి తన కండగా ఉన్నదని సంతోషమా? మాణిక్యాంబ క్రూరప్రవర్తన హృదయశల్యంలా తనను వేధిస్తున్న దన్న దుఃఖమా? బ్రతుకు-చావుల సంధియుగంలాగుంది. మల్లిక ఇదివరకూ కష్టాలు అనుభవించిందే. కాని, హరి చూపించే దయమాత్రం పూర్వం ఎన్నడూ అనుభవింపలేదు. ఆయన అభిమానమే మాణిక్యాంబ కోపానికి కారణమని మల్లిక కర్థమైంది. కాని, అట్లాగని హరి కా సంగతి చెపితే అతని మనస్సు నొచ్చు కుంటుందనే భయం. తానే బంధువులమధ్య కలతలు తెచ్చి పెట్టినదవుతుందేమో నన్న అనుమానం - ఈ రెండూ మల్లికను మూగజీవిగా చేసివైచినాయి. రోజూ మాణిక్యాంబ మాటలతో మల్లిక గుండెలను మండించేది. రోజూ మల్లిక తన గుండెను కన్నీటితో తడుపుకొనేది.

హరిహర నాటక కళా పరిషత్తు ప్రారంభోత్సవ సందర్భంగా హరికి నాలుగు రోజులనుండి ఊపిరాడటం లేదు. హైదరాబాదులోని యువ కళాకారు లందర్నీ ఒకచోటికి చేర్చి సుశిక్షితమైన నాటక కళను అభ్యసింపజేసి వారి కళాభిరుచి ప్రకాశించే అవకాశాన్ని కల్పించాలని ఆ పరిషత్తు స్థాపించాడు హరి.

ఆనాడు ముఖ్యమంత్రి కళాపరిషత్తుకు ప్రారంభోత్సవం చేశారు. ఆ సభలో హరి ఉపన్యసిస్తూ. తెలుగుదేశంలోని నాటకరంగ స్థితిగతులు, రూపక రచన, అమెచ్యూర్ నాటక సంఘాల కడగండ్లు, ప్రొఫెషనల్సు సాధక బాధ కాలు, తెలుగు ప్రజలూ ప్రభుత్వమూ నాటక కళాభివృద్ధికి చేయవలసిన కృషి- వీటిని గురించి గంభీరంగా వివరించి చెప్పాడు. ముఖ్యమంత్రి తాను సాయ శక్తులా . ఆ ఉద్యమానికి చేయూత నిస్తానని హామీ యిచ్చారు. ఆ తరువాత షాలతి వీణమీద పాట కచ్చేరీ చేసింది. కర్ణాటక హిందూస్థానీ బాణీలను రెండిం

టినీ వాయించి సవ్యసాచిత్వం ప్రకటించింది. మధు వందన సమర్పణతో సభ విజయవంతంగా ముగిసింది. సభికులు హర్షధ్వానాలు చేశారు. ఆ సభకు యంత్రాంగం నడిపించింది మధు. తంత్రాంగాన్ని నిర్వహించింది హరి.

హేమా, మాలతీ క్లాస్‌మేట్లు, ప్రాణమిత్రులు. ఇద్దరూ మహిళా కళాశాలలో ఇంటరు చదివి పరీక్ష లిచ్చారు. హేమ చక్కగా పాడుతుంది. మాలతికి గాత్రంలోనూ వీణమీదనూ కచ్చేరీలు చేస్తుంది. ఆ రోజు మాలతి పాటకచ్చేరీ సభికులను ముగ్ధులను చేసింది. మధు పరవశ్యం చెందాడు. చెల్లెలిద్వారా ఒక సారీ, తాను స్వయంగా రెండుసార్లు మాలతి నభినందించాడు.

హరి అందరితోపాటు రామచంద్రయ్యనూ, మాణిక్యాంబనూ సభ కాహ్వానించాడు. వాళ్ళు సభకు రాలేదు. మల్లికను తప్పకుండా రమ్మనమని గట్టిగా చెప్పివచ్చాడు. మల్లిక సభను చూచి ఆనందిస్తుందనీ, చదువుకున్న మహిళలను చూచి నాగరకమైన సభ్యత నేర్చుకుంటుందని .... ఎన్నెన్నో ఊహించాడు. కాని, ఎందుకో మల్లిక రాలేదు. హేమ నడిగితే 'నాకు తెలియ'దని తప్పుకున్నది. మల్లికపట్ల కొంత నిరసన భావం హేమ ప్రకటించటం హరికి అది క్రొత్తకాదు. కాని, ఒక మట్టిబొమ్మను బంగారు బొమ్మగా చేద్దామని ఊహించిన హేమ తన లక్ష్యాన్ని అంత త్వరలో విస్మరిస్తుందని హరి ఊహించలేక పోయాడు. "ఆశయాలూ, అంతఃకరణాలూ, ఆచరణలూ, జీవితంలో సమాంతర రేఖలుగా సాగనీయదేమో ఈ అనంత సృష్టి ప్రవాహం" అని హరి నిట్టూర్చాడు తనలో.

హేమ, మధు, హరి సభనుండి యింటికి చేరేసరికి రాత్రి పది గంటలైంది. ముగ్గురూ వాకిట్లో అడుగు పెట్టేసరికి మెట్లగది దగ్గర మాణిక్యాంబ కంఠం గట్టిగా వినపడుతోంది: "ఈ యేడుపు మొహం ఎప్పుడీ యింట్లో అడుగు పెట్టిందో అప్పుడే మాకు అరిష్టం చుట్టుకుంది. రెండు వేలు పోసి ఆయనగారు నిన్ను కొనడం, పచ్చి బోగందిలా సింగారించుకొని నిన్ను సభల్లోకి రమ్మనటం, నీవు బజార్న పడటానికి సిద్ధం కావటం.... ఈ నాటకాలు నా దగ్గర సాగేవికావు. ఎవరైనాసరే నా చెప్పు కింద తేలులాగా పడివుంటారా సరి, లేకపోతే యీ యింట్లో క్షణముండటానికి వీల్లేదు." మెట్లగదిలో మల్లిక వెక్కి వెక్కి ఏడుస్తోంది, మాణిక్యాంబ గది వాకిట్లో నిలుచబడి గర్జిస్తోంది.

ముగ్గురూ స్పష్టంగా విన్నారామె మాటలు; తెల్లబోయి ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారు. హేమ తమాయించుకోలేక గబగబా తలవంచుకొని తన గదిలోకి వెళ్ళిపోయింది. మధు హుటాహుటి ముందుకుపోయి ''అమ్మా!" అని మాణిక్యాంబను పెద్దగా గద్దించాడు. "ఎవరిమీద ఈ అక్కసంతా వెళ్ళగక్కుతున్నావు? కొంచెం వెనకాముందూ - మట్టూమర్యాదా అవసరంలేదా?" అని దబాయించి అడిగాడు.

హరి చిన్నబోయిన ముఖంతో మధుని వారించాడు. మల్లిక బావురుమంటూ హరి కాళ్ళను చుట్టవేసుకుంది. మాణిక్యాంబ రోజుతూ హరి నొక్కసారి ఆపాద మస్తకం చూచి ముఖం ప్రక్కకు త్రిప్పుకొన్నది. హరి పరుషంగానే ప్రారంభించాడు: "ఈ అరిష్టానికంతా మూల కారణాన్ని నేను. నన్ను ముఖాముఖి అనలేక ఈ అమాయకజీవిని ఇలా హింసిస్తున్నావన్న మాట? నేను ఊహించినంతా జరిగింది. నీ అహంకారం, నీ స్వార్థం మానవత్వాన్ని ఔదార్యాన్ని అర్థం చేసుకోలేవు. నీ అధికారంలో మల్లిక ఈ పదిరోజులూ పనిపిల్లగా పశువు కంటె హీనంగా బ్రతికింది చాలు. ఇంతకన్నా వేరే అరిష్టం మరొకటి లేదు. ఈ విశాల విశ్వంలో ఈ ఒక్క ప్రాణం బ్రతికేచోటు దొరక్కపోదు. నీ చెప్పు క్రింద తేలుగా బ్రతకవలసిన గత్యంతరం నాకేమీ లేదు. మరో గంటలో ఈ అరిష్టం మీకు తీరిపోతుంది." హరి ఉద్రిక్తుడైనాడు.

"హరీ! ఏమిటిరా ఆ మాటలు? అమ్మ యేదో ఆవేశంలో అన్నదని అన్నీ తెలిసిన నీవే యిలా అంటే ఎలా?" మధు ఆత్రంగా అడిగాడు.

"మధూ! కలత పుట్టనే పుట్టకూడదు. పుట్టినచోటు నంటిపెట్టుకొని ఉండటం పాము పుట్ట పెట్టినచోట ఉన్నట్టే. ఇప్పటికి నేను దూరంగా ఉండటం మంచిది. కాలం కలిసివస్తే తర్వాత చూచుకుందాం." హరి జీరబోయిన గొంతుకతో అన్నాడు.

మధు వెర్రిచూపులు చూస్తూ మాణిక్యాంబను బుజాలుపట్టి ఊపుతూ "అమ్మా! ఎంతపని చేశావమ్మా? బావ యిల్లు వదిలి పోతాడటమ్మా! ఎందుకొచ్చిన దీ ప్రళయం? మల్లిక ఉంటే నిన్నేం చేసింది?" అని కేకలు పెట్టాడు.

మాణిక్యాంబ తొణకలేదు, బెణకలేదు. మరీ రాటుతేలింది. "ఆ పాపిష్ఠి దాన్ని కట్టుకొని ఊరేగినన్నాళ్ళూ నా యింట్లో ఎవ్వరికీ నలిచి నామైనా పెట్టేది లేదు. మా యింట్లో తినే మమ్మల్ని బెదిరించేవరకు వచ్చిందీ వ్యవహారం?"

మధు రెచ్చిపోయాడు. 'అమ్మా! ఆపింక....పద లోపలికి" అని గద్దిస్తూ మాణిక్యాంబను హాలులోకి బలవంతంగా లాక్కుపోయాడు.

"ఈ రోజు నా మాట నీకు చేదుకావచ్చు. రేపు నీ తలదూడా బొప్పి కట్టితే గాని తెలిసిరాదు. ఈ భాగవతలాలాడే వాళ్ళంపరూ ఏదో ఒక రోజున రంగు కడిగి పోయేవాళ్ళే" రుసరుస లాడుకుంటూ లోనికి పోయింది. విషయమేమిటో తెలుసుకుందామని అప్పుడే తన గదిలోనుండి బైటికి వస్తున్న రామచంద్ర య్యను మాణిక్యాంబ విసురుగా లోనికి తీసుకొనివెళ్ళి తలుపు గడియ పెట్టింది.

మధు బిక్క మొగంతో హరిముందుకు వచ్చాడు. హరి మధు భుజం మీద చేయివేచి "మనం గర్హించవలసింది మనుషుల్ని కాదు మధూ, అధర్మాన్ని మాత్రమే!" అని లాలించాడు. మధు హరి హస్తాలతో తన ముఖాన్ని కప్పుకొని జాలిగా ఏడ్చాడు. హరికి కన్నులు చెమ్మగిల్లాయి.

ఒక అర్ధగంట తరువాత మధు టాక్సీ తెచ్చాడు. మల్లిక, హరి తమ సామాను సర్దుకొని టాక్సీలో మౌనంగా ఎక్కి కూర్చున్నారు.

"ఈ రాత్రికి మన మధు మంజరిలో ఆశ్రయం తీసుకోండి. మీ కిల్లు దొరికేదాకా మీరందులో ఉండవచ్చు. ఈ నా ఒక్క కోర్కె మన్నించవురా హరీ?" మధు ఆర్ద్రంగా అడుగుతూ మధుమంజరి తాళపుచేతు లందించాడు.

హరి ఒక్క క్షణం ఆలోచించి చివరకు తాళపుచేతు లందుకున్నాడు. "నా భవిష్యజ్జీవిత కవాటాలు తెరవటానికి ఈ రోజు మధుమంజరి నాంది నాల పిస్తోంది." అని హరి నిట్టూర్చినట్లన్నాడు.

టాక్సీ చీకట్లోకి దూసుకుపోయింది.

## 8

సాయంకాలం అరుగంటలయ్యేసరికి రామచంద్రయ్యగారి హాల్లో యువతీ మణులు కోలాహలంగా సమావేశమై ఉన్నారు. హేమ తాను ఫస్టుక్లాసులో ప్యాసయినందుకు స్నేహితురాండ్రకు టీపార్టీ యిస్తోంది. ఆ సమావేశం హైదరా బాదు మిశ్రసంస్కృతిని మూర్తికట్టిస్తున్నది. మాణిక్యాంబ స్వయంగా టీపార్టీ సంబరాలన్నీ సక్రమంగా నిర్వహిస్తూ యిల్లంతా కలియతిరుగుతోంది.

''పరీక్ష ప్యాసయితేనే యింత విందయితే ఇక పెళ్ళినా డెంత విందు న్నదో!'' అన్నదొక స్నేహితురాలు.

"ఫస్టుక్లాసు పిల్ల అప్పుడే పెళ్ళాడుతుందా?" అన్నదొక సారసాక్షి.

"అదేమిటమ్మా! అది ఊఁ అంటే చాలు రేపే మూడు ముళ్లు వేయిస్తాను" అన్నది మాణిక్యాంబ సాభిమానంగా.

"ఎందుకు మామ్మగారూ! మీరు ఊఁ అని గద్దిస్తేచాలు - యిప్పుడే హేమ పెళ్లై పోతుంది'' అన్న దొక గడుసుపిల్ల. అందరూ గొల్లుమన్నారు. మాణిక్యాంబ తెల్లమొగం వేసి విసవిసా వంట యింట్లోకి వెళ్ళిపోయింది.

మాలతిని పాట పాడమని అందరూ బలవంతం చేశారు. మాలతి మూడవ తరగతిలో ప్యాసయినందుకు ముందు కొంచెం సిగ్గుపడి మాట్లాడలేదు. కాని, పరీక్ష పోయిన పిల్లలు కూడా నవ్వుతూ పేలుతూ ఉండటం చూచి ధైర్యం తెచ్చుకొని పాట పాడింది. "తెర తీయగరాదా" అన్న త్యాగరాజ కృతి మాలతి పాడినంతసేపూ అందరూ చిత్తరువుల్లా ఉండిపోయారు. హేమకు మాత్రం ఆ పాట వింటూన్నప్పుడు నాభికమలం నుండి సుడిగుండంలా ఒక విషాద భావం తిరిగి పైకి లేచి, హృదయాన్ని తాడించి, విశ్లథమై శూన్యంలో కలిసి పోయింది. అప్రయత్నంగా కన్నీటి బొట్లు రాలాయి. అది గానసుధారసానుభూతి యని సమాధానపడింది మిత్రమండలి.

హేమ కృతజ్ఞతలతో కార్యక్రమం ముగిసింది. ఒక్కొక్కరూ సెలవు తీసికొని వెళ్ళిపోయారు. చివరకు మాలతికి వీడ్కోలు చెప్పడానికి హేమ గేటు దాకా వచ్చింది.

"హేమా! మీ అన్నయ్య విందుకు రాలేదేం?" మాలతి నిబ్బరించుకోలేక అడిగింది.

"ఉండమన్నాను. మీ మహిళామండలి కార్యక్రమంతో నాకేం పని అని వెళ్ళిపోయాడు. కాని, నీవు పాడతావని చెప్పి ఉన్నట్లయితే తప్పక ఉండేవాడు" అన్నది హేమ.

మాలతి ముఖం మీద ఒక వింత కాంతి తొణికిసలాడింది.

"నిజం మాలతీ! కళాపరిషత్తు ప్రారంభోత్సవంనాడు నీవు చేసిన పాట కచ్చేరీని మా అన్నయ్య మెచ్చుకోని రోజు లేదు."

''ఆయన చాలా మంచివారు'' అని, మాలతి సిగ్గుతో తల వంచుకున్నది.

''మంచివాళ్ళ మంచితనం మంచివాళ్ళకే అర్థమౌతుంది.'' హేమ ఛలోక్తి విసిరింది.

మాలతి ఏదో జ్ఞాపకం తెచ్చుకుని ''హేమా! మరిచాను. హరిగారు నీకు కంగ్రాట్యులేషన్సు చెప్పమని మరీ మరీ చెప్పారు'' అని అన్నది. హేమ ముఖం తెల్లబోయింది.

''ఎక్కడున్నా డాయన?''

''మా యింట్లోనే ఒక వాటాలో మొన్న సభ అయిన మర్నాడే చేరారు.''

''ఒంటరిగా ఉన్నాడా?''

''అలా అడుగుతున్నావేం? ఆయనతో మల్లిక గూడా వుంది. ఆమె నీకు చెల్లెలౌతుందిటగా! చాలా అందమైన పిల్ల. చదువుకుంటే చాల తెలివైన పిల్ల కూడా అవుతుంది.''

''సరేగాని.... ఇంకా ఏమన్నా డాయన?''

''నిన్ను గురించి చాలా మెచ్చుకుంటూ కవిత్వం మాట్లాడాడు. ఆయన ఆశయాల కనుగుణంగా తీర్చిదిద్దుకున్న శిల్పాలలో నీవొక దానవట! నీది అమృత హృదయమని చెప్పి, మల్లికతో వెళ్ళిపోయారు.''

''ఎక్కడికి?!''

''ఏమో! నాల్గురోజులబట్టీ ఉదయం 8 గంటలకల్లా ఇద్దరూ టాక్సీలో బయలుదేరి వెళ్లేవారు. మళ్ళీ రాత్రి తొమ్మిదింటికి తిరిగి వచ్చేవారు.''

''మమ్మల్ని గురించి ఏమైనా అన్నాడా?''

''మా యింట్లో అద్దెకు చేరింతర్వాత నాతో మాట్లాడింది ఇవ్వేళే మొదటి సారి. అందులోనూ మొదటిమాట నిన్నుగూర్చి. అదీ నిన్ను ప్రశంసిస్తూ!'' మాలతి నవ్వుతూ చెప్పింది. హేమ మాత్రం తిరిగి నవ్వలేకపోయింది. రిక్షాలో కూర్చుండి సెలవు తీసికొంటున్న మాలతికి యాంత్రికంగా వీడ్కోలు చెప్పింది. వెలుగు నీడలు చేతులు చేతులు కలుపుకున్నాయి ఆమె ముఖం మీద. స్నేహితురాండ్రందరూ ఖాళీచేసి వెళ్ళిన ఆహాలువైపు శూన్యదృక్కులతో చూచింది హేమ.

# 9

హరితో కలిసి మల్లిక నివసించటం మాలతికేగాక, ఆమె తల్లి కామేశ్వ మ్మకుగూడా విచిత్రంగానే తోచింది. హరి అవివాహితుడని వారికి తెలుసు. అతనివెంటనున్న యీ అవివాహిత వారి కపరిచితురాలు. అందులోను పల్లెటూరు పిల్ల. వంటమనిషందామా-ఆమె నాతడాదరించే విధం, ఆమె వైఖరీ అలా లేదు. పనిమనిషిని వేరే కుదిరించుకున్నారు. ఇంట్లో చేరిన నాలుగురోజులబట్టీ రాత్రిళ్ళు తప్ప పగలంతా ఇంట్లో ఉండటం లేదు. ఆ టాక్సీ విహారాలలోని అంతరార్థ మేమిటో?— హరి శంకించదగిన శీలముగలవాడుగా కనపడలేదు. మల్లిక అందాల కాటపట్టైనా ఎట్టి వికారమూ ఆమెలో కనపడదు. మరి వీరిద్ద రిలా యెందుకు జతపడ్డారో తెలియదు.

మాలతి ఈ విషయాన్ని తల్లితో నాలుగైదుసార్లు ప్రస్తావించింది. హరి హేమగారింట్లో ఉంటూ అకస్మాత్తుగా ఇక్కడికి నివాసం మార్చటం, హేమ హరిని గూర్చి కొంత సంశయాత్మకంగా అడగటం - వీటి వెనక ఏదో కీలక ముండి వుంటుంది. కాని, హరిగాని, మల్లికగాని నిండుకుండల్లా తొణకటంలేదు. అసలు విషయం తెలుసుకోవాలని మాలతికి ఉత్కంఠ. కామేశ్వరమ్మ ఈ ప్రస్తా వన వచ్చినప్పుడెల్లా కుమార్తెను వారించేది. కాని, ఆమెకు కూడ మాలతికన్న అధికమైన ఆరాటమే ఉండేది.

ఆ రోజు ఉదయం మల్లికా హరీ ఎక్కడికీ పోలేదు. క్రింపటి రోజున వంట సామాగ్రి తెప్పించారు. వాటిని బాగుచేసి మల్లిక వంటా పెట్టూ పూర్తి చేసింది. పదిగంటలకు హరి భోజనంచేసి బజారుకు వెళ్ళాడు. మల్లిక యిల్లంతా కడిగి ముగ్గులు తీర్చింది తాను కొత్త చీర కట్టుకొని తలదువ్వుకుంటోంది.

"ఏం కోడలూ! ఏం జేస్తున్నావు? నీవు వేసిన ముగ్గులతో మా యింటికి కొత్త కళ వచ్చింది" అంటూ అదను చూచి కామేశ్వరమ్మ ప్రవేశించింది. మల్లిక సాదరంగా "రాండి, కూర్చోండి" అని చాపవేసి మర్యాదచేసింది. కామేశ్వరమ్మ నిండుగా కూర్చున్నది.

"చూడమ్మా! ఏదో పాతకాలపు అలవాటు - ఏదో సంబంధం కలుపుకో పోతే మాట్లాడినట్లే వుండదు. నీవేం అనుకోవు కదూ?"

"అయ్యో! అందులో తప్పేముందండీ? వరస కలిస్తే మనసుకూడా కలుస్తుంది. మీరు నన్ను 'కోడలూ!' అంటున్నారు. నేను మిమ్మల్ని 'అత్తగారూ!' అంటాను." మల్లిక జడ అల్లుకోవటం పూర్తి అయింది.

"హరిగారు నాకు కొడుకులాంటివారు...." అని కామేశ్వరమ్మ అంటూండగానే మల్లిక "అయితే యింకేం, హేమమ్మగారు మీకు కోడలౌతుంది. నేనూ మీకు కోడల్నే అవుతాను" అని కమ్మేసింది. కామేశ్వరమ్మ ఒక నిముషం పాటు నిశ్చేష్టురాలైంది. మల్లిక కుంకం దిద్దుకున్నది.

"అయితే, మీరు హరిగారికి దగ్గర బంధువులేనన్నమాట!" కామేశ్వరమ్మ గాలం వేసింది

"వారు నన్ను బంధువులకన్నా ఎక్కువగానే చూస్తున్నారు." మల్లిక అందలేదు.

"అయితే, హరీహేమల్లాగా స్వయాన మేనత్త మేనమామ బిడ్డలు కారన్నమాట!"

"అబ్బే! అదేం కాదండి. వారు నాకు దేవుళ్లాంటివారు. నేను ఆయన సేవకురాలిని." మల్లిక తన్మయత్వంలో కన్నులు మూసింది. కామేశ్వరమ్మకు మల్లిక ముఖంలో ఏదో ఒక నిష్కళంకమైన తేజోరేఖ కనపడింది. మల్లిక మాటకు ఏమి వ్యాఖ్యానం చేసుకోవాలో ఆమెకు తోచలేదు. ఆమె తెలుసుకుందామనుకున్న అంశానికి మల్లిక సమాధానం చెప్పింది. కాని, ఆమె కందకుండా చెప్పింది.

"నీవేమి చదువుకున్నావో నాకు తెలియదుకాని చక్కగా మాట్లాడతావమ్మాయీ నీవు." కామేశ్వరమ్మ ఉపాధ్యాయిని సంస్కారాన్ని ఒలకపోసింది.

"అత్తయ్యగారూ! ఈ యింట్లో చేరింది మొదలు ఈ నాల్గురోజుల్లో నేర్చుకుంది తప్ప నేనేం చదువుకోలేదండీ" మల్లిక అమాయకంగా ఒప్పుకున్నది.

మాటల్లోనే హరి వచ్చాడు. "మల్లికా! మామ్మగారి శిష్యత్వం అప్పుడే ప్రారంభించిచావన్న మాట? వెరీగుడ్!" అంటూ లోపలికి వచ్చి కామేశ్వరమ్మకు నమస్కరించాడు.

"ఎవరు శిష్యులైనా కాకపోయినా నేనుమాత్రం వంటలమ్మనే!" కామేశ్వరమ్మ నవ్వుతూ అన్నది.

''మీ యింట్లో ఉండే అవకాశం కల్గినందుకు మేమెంతో సంతోషిస్తు న్నాము. మా మల్లిక పల్లెటూరులో పెరిగిన పిల్ల. అక్కడ చదువూసంధ్యా చెప్పించలేదు. మీ వంటి ఉపాధ్యాయ నుల సాహచర్యం కలిగితే కొంత విజ్ఞానం తప్పకుండా లభిస్తుంది."

''విజ్ఞాన మెంత ఉన్నా సభ్యతా సంస్కృతీ లేకపోతే స్త్రీ జీవితం వృధా.... మల్లిక మంచి మర్యాదగల పిల్ల" కామేశ్వరమ్మ మాటలకు మల్లిక సిగ్గుపడింది.

''మీరు మా మల్లికను శిష్యురాలుగా స్వీకరించాలి. మీరిదివరకల్లా చెప్పిన చదువంతా ఒక యెత్తు, మా మల్లికకు చెప్పే చదువు మరో ఎత్తు."

కామేశ్వరమ్మ పెద్దగా నవ్వింది. "మీ యిద్దరిలో ఏదో మంత్రశక్తి ఉంది. మీ మాట లెదుటివాళ్ళు కాదనలేరు. అల్లాగే నేను మళ్ళా గురువునౌతాను" అంటూ తనలోనేతాను నవ్వుకుంటూ కామేశ్వరమ్మ వెళ్ళిపోయింది.

## 10

బాలభానుని అరుణకిరణాలు ముంగిట్లో మసలకపూర్వమే మధు మంద హాసంతో హరి యింటికి వచ్చాడు. హాల్లో ఉన్న హరిని అమాంతం కౌగిలించు కొని ''మైడియర్ హరీ! లిటరేచర్ యం. ఏ., హార్టీకంగ్రాచ్యులేషన్స్!" అని అంటూ అతన్ని చెండులాగా నలిపివేశాడు. మల్లిక ఆ దశ్యాన్ని చూచి ఉప్పొంగి పోయింది.

మధు మల్లికను చూచాడు. అతని కాశ్చర్యం వేసింది. పదిరోజులక్రితం చూచినదానికీ ఇప్పటికీ మల్లికలో చాలా మార్పు కనపడుతోంది తమ యింట్లో ఉన్నప్పుడు మల్లిక చుట్టూ కంచె నాటిన ఒక చిన్న మొక్క. ఇప్పుడు బాలారిష్టాలు దాటి కొమ్మలు రెమ్మలతో చిగురుతొడిగి స్వతంత్ర వాయువులను పిల్చుకుంటున్న నవమల్లిక. బాల్యచాపల్యం వదలి, యౌవన ప్రాగల్భ్యాన్ని పూర్తిగా పొందని సంధి సమయం. రోజు కొక వన్నెగా పొంగారుచున్న జీవిత శుక్లపక్షం మల్లిక స్వరూపం.

''హరిగారు పరీక్షలో గెలిచినందుకు అన్నగారి నోరు తియ్యబడాలి" అంటూ మల్లిక కాఫీ తెచ్చి యిరువురి ముందూ ఉంచింది. మధు, హరి చాపమీద కూర్చున్నారు.

''మన యిళ్ళల్లో మనుషులు బహువచనాలే కాని పిలుపు ఏకవచనమే నమ్మా!'' మధు మంద్రగంబీరంగా ఉన్నాడు. విరగబూచిన మల్లెకొమ్మలు గాలిలో ఊగిసలాడినట్లు విచిత్రమైన తన్మయావస్థను ప్రకటిస్తూ అన్నది మల్లిక: "మీరందరూ నన్ను ఆకాశంలోకి ఎత్తుతున్నారు. కళ్ళు తిరుగుతాయేమోనని భయం వేస్తోంది.''

''ఆడపడచులకు ఏ మాటైనా అన్నలు చెపితేకాని అంతరంగాలకు నచ్చవు''- హరి.

''అన్న మాటే విన్నట్లయితే మన కథ కంచిత్రోవ పట్టి ఉండేది." మధు పెద్దగా నవ్వాడు.

''నీవన్నట్లే హరిగారు తమను గూడా ఏకవచనంతో పిలవమంటారన్నయ్యా!'' మల్లిక ఫిర్యాదుగా చెప్పింది మధుకు.

మధు ఒక క్షణం ఆగాడు. ''అయితే, వీణ్ణి అలా పిలవడం నీకిష్టం లేదన్నమాట?"

''ఎందుకో నామనస్సందుకు ఒప్పుకోవటం లేదు."

''అందుకు నేను చేసిన పాపమేమిటో?'' హరి అందుకున్నాడు.

''మహానుభావా! నీవు మాకందరికీ దేవుళ్ళాంటివాడవు." మధు సాగదీశాడు.

''అలుతే ఏక వచనానికేం కర్మం? తిట్టవచ్చును కూడా!''

''వాచాతీతుడైన దేవుడికి ఈ వచనాల పట్టింపేమిటి?" మధు తేలగొట్టాడు.

''కాఫీ తీసుకోండి చల్లారిపోతుంది." మల్లిక ప్రస్తుతాన్ని జ్ఞాపకం చేసింది.

మధు తన కాఫీ కప్పు హరి చేతులో పెడుతూ "నేను ఇద్దరు చెల్లెళ్ళకు అన్ననైన యీ శుభసమయాన నీ నోరు తియ్యబరుస్తున్నాను. తీసుకో" అన్నాడు. హరి నవ్వుతూ కఫీకప్పు నందుకున్నాడు. ''ఏనాడో కలిగిన ఆ అదృష్టాన్ని ఈనాడు గుర్తించినందుకు నిన్నభినందిస్తున్నాను.'' మల్లిక ముఖం వికసించింది. మధు ముందు తెల్లబోయాడు కాని, వెంటనే తేరుకున్నాడు. ''ఒరేయ్ హరీ! నిన్నిక్కణ్ణుంచి బహువచనంతో పిలవాలని నాకు గూడా అనిపిస్తున్నదిరా!"

"కాని.... నీ మనస్సు అందుకు ఒప్పుకోవటం లేదు.... అంతేకదూ?"

ఇద్దరూ కుండ బ్రద్దలయ్యేటట్లు నవ్వారు. వారితో కలిసి మల్లిక నవ్వకుండా ఉండలేక పోయింది.

"మీ సంతోషంలో నేనూ భాగం పంచుకుంటున్నాను" అంటూ మాలతి హాల్లో అడుగు పెట్టింది.

''అదుగో, నా చెల్లెలు నాకాసటగా వచ్చింది"- హరి.

''పట్నంలో ఉన్న మా అన్నయ్య వచ్చి పదిగడియలైనా ప్రక్కనున్న మీ చెల్లెలు పలకరించటానికి కూడా తీరిక లేకపోయె. ఎవరి శ్రద్ధలు గొప్పవో తెలుస్తూనే ఉంది." మల్లిక పరిహాసంగా అన్నది.

''పుస్తకం పట్టకపోతేనే మల్లిక పుట్టెడర్థంతో మాట్లాడుతోంది. రేపు మా అమ్మ వయోజన విద్యాసారాన్నంతా నూరిపోస్తే ఇక మనం బ్రతకగలమా అన్నయ్యా?" మాలతి నవ్వాపుకుంటూ మాట్లాడింది.

"కామేశ్వరమ్మగారు పాఠాల పంతులమ్మ! నీవు మాటల పంతులమ్మవటగా!"- హరి.

''నన్నుగూడా గురుపీఠ మెక్కించిందీ?"

"అంతటితో వదలను." మల్లిక కొంటెగా అన్నది.

''ఏంచేస్తావేమిటి?''- మాలతి.

''ముందే చెపితే దాని ముచ్చట పోతుంది.''

''పోనీ, ఆ ముత్యాలమూట ముడివీడిననాడే చూస్తాంగాని మా హేమ కూడా వచ్చిందేమో ననుకున్నాను'' విషయం మార్చింది మాలతి.

అందరూ అంతవరకు ఆ విషయాన్ని గమనించనే లేదు. మల్లిక చప్పున నాలుక కొరుకున్నది. ''అడగటం మరిచాను నా తెలివి తెల్లవార! అన్నయ్యా! అక్కయ్య రాలేదేం?" మల్లిక మధును ప్రశ్నించింది.

''నేను బయల్దేరేటప్పుడే నిద్రలేచింది. వస్తావా అని అడిగాను. బావకు కంగ్రాచ్యులేషన్సు చెప్పమన్నది. బహుశః తర్వాత వస్తుందేమో!''

''రాకపోనూ వచ్చు''- హరి.

''మీరూ ఏదైనా టీపార్టీ చేయండి వస్తుంది.'' మాలతి ఛణుకు విసిరింది.

''నేను టీపార్టీ చేయటం జరిగితే మగవాళ్ళను మాత్రమే పిలుస్తాను''- హరి.

ఆ మాట కందరూ గొల్లున నవ్వారు.

"పిలిచే దెవరినైనా మాలతి పాటకచ్చేరీ మాత్రం తప్పకుండా ఉండాలి"-మల్లిక.

"అవును తప్పకుండా! మా యింట్లో టీపార్టీ జరిగినప్పుడు కూడా చక్కగా పాడారట. నేనా రోజు వినే అవకాశం జారవిడుచుకున్నందుకు తరువాత ఎంతో విచారించాను," మధు ఆవేశంతో అన్నాడు.

"వీణ పట్టుకుంటే మాలతి సరస్వతీదేవే!"-మల్లిక.

"ఈ భట్రాజు పదా లెక్కడ నేర్చావు" మాలతి వింత సిగ్గుతో తలవంచుకొన్నది.

"అందులో అబద్ధమేమీ లేదమ్మా!" హరి సమాధాన పరచాడు.

"ఇంకా కావలసి వస్తే మా అన్నయ్య నడుగు." కొంటెగా అన్నది మల్లిక.

సిగ్గు బరువును దించుకుంటూ కనురెప్పలు పైకి లేచినవి. మాలతి దృజ్మాలిక మధుకంఠం దాకా ఎగ్రబాకింది. మధు కాక్షణం అమృతక్షణంగా తోచింది.

"మౌనం అర్ధాంగీకారం!" అన్నది మల్లిక.

"మీరందరూ నాటకంలో పాత్రలుగా మాట్లాడుతున్నారే!" మధు నవ్వాడు.

"అందరూ హరిహర నాటక కళాపరిషత్తు సభ్యులేగా!" హరి వ్యాఖ్య.

"అన్నయ్య మాత్రం కాడా?" మల్లిక అమాయకంగా ప్రశ్నించింది.

"వాడు సభ్యుడే కాడు, ఆ సంస్థకు శబ్దబ్రహ్మ" - హరి.

"అయితే మీరు?" మల్లిక.

"వాడు సూత్రధారుడు." మధు అందుకొని తన్మయత్వంతో సమాధానం చెప్పాడు.

హరి హృదయంలో ఒక ఆనందతరంగం ఉవ్వెత్తుగా లేచి పాలుపొంగినట్లు పొంగి దేహమంతా కమ్ముకుంది. అమాంతం లేచి మధును కౌగిలించుకున్నాడు హరి.

"నాకు వచ్చిన ఎం.ఏ; డిగ్రీకన్నా నీవన్నమాట వేయిరెట్లు విలువైనదిరా మధూ!" అని అన్నాడు.

"సూత్రధారుడు శబ్ద బ్రహ్మను పూజిస్తున్నాడు - నేను గాన సరస్వతిని గౌరవిస్తాను" అని మాలతిని మల్లిక వంట యింట్లోకి తీసుకొని వెళ్ళింది కాఫీ యివ్వటానికి.

## 11

హరి పరీక్షలో ఉత్తీర్ణుడైనాడన్న వార్త హేమకూ ఎంతో సంతోషాన్ని కలిగించింది. కాని, దాన్ని బాహాటంగా అనుభవించే అవకాశం లేక బాధపడింది. ఆనాటి ఉదయం మధుతోనే కలిసి హరిగారింటికి పోదామనుకున్నది. కాని, పది రోజులనుండి మాణిక్యాంబ పాడుతున్న రోకంటి పాట జ్ఞాపకం వచ్చింది. ఆ పాపిష్ఠి కొంప గడప తొక్కావంటే మన పరువు ప్రతిష్ఠలు గంగపాలౌతాయి. బంధుత్వం కాదని పరాయిగా పోయేవాళ్ళకు మర్యాదచేస్తే లోకువగా లెక్క కడతారు. ఆపైన బుజాలెక్కి స్వారీ చేస్తారు. నా మాట వింటావా బాగుపడతావు. లేదంటావా మీ అన్నయ్యలాగానే నీవూ మిడిసిపాట్ల మనిషి వౌతావు. పెళ్ళి కావలిసినదానివి. ఆ మీద నీ యిష్టం-" ఇదే వరస ఇంట్లో తల్లి. రామచంద్రయ్య మనసారా కాకపోయినా మాటవరసకు మాత్రం భార్యతోనే తాళంవేస్తూ కుమార్తెను అదుపులో పెడుతున్నాడు. పంజరంలో చిలుకలా హేమ లోలోన బాధపడుతోంది. అటు తల్లిదండ్రులను కాదనలేదు. అటు హరి మీది మమత మరచిపోనూలేదు. మనసులో మధన మాననూలేదు.

"నేను పరీక్ష పాసయినపుడు మా యింటికి వచ్చి బావ అభినందనలు చెప్పాడా? లేదు. మాలతిద్వారా, అన్నయ్య ద్వారా నన్నభినందించాడు. నిజమే. బావ యే ముఖం పెట్టుకొని వస్తాడు? అమ్మ నిర్దాక్షిణ్యంగా అతణ్ణి వెళ్ళి పొమ్మన్నది.. గంటలో గది ఖాళీచేసి వెళ్ళాడు. ఇంతకాలం పోషించుకున్న బాంధవ్యం క్షణంలో గంగపాలైంది. మా అన్నయ్య వద్దన్నాడు. బావ మాట వినలేదు.... నేను చెప్పితే వినేవాడేమో! ఏమో, అదీ అనుమానమే. అయినా, నేను బ్రతిమిలాడి ఉండాలిసింది. అలా చేయకపోవడం నా లోపమేమో ? నిజమే. అమ్మ నా కళ్ళముందు అంతంత మాటలంటూంటే కిమ్మనకుండా నేను తలవంచుకొని గదిలోకి దూసుకొన్నాను. కనీసం బావపట్ల సానుభూతి నన్నా ప్రకటించలేదు. చాల పొరపాటే చేశాను. అప్పటి నా ప్రవర్తన ఆయనకు బాధ కలిగించి యుండవచ్చు. కాని, నా కది తప్పనిసరి అయింది. లేకపోతే మల్లికను మన్నించి నేను కొరివితో తలగోక్కోవలసి వచ్చేది.... అయినా, యిప్పుడు జరిగిం

దేమిటి?.... ఆనాటినుండీ బావతో కలిసి మాట్లాడలేదు. మాలతి మాటలుబట్టి బావకు నా మీద ఎట్టి కోపమూ రానట్లే తోస్తోంది. ఆ మాట నిజమే కావచ్చు. ఎంతటి అపరాధినైనా క్షమించే ఉదారగుణం ఆయనలో వుంది. లెక్కపెడితే నేనింకా తప్పులు చేశాను. టీపార్టీకి బావను పిలువలేదు. అసలు బావను పిలవాలని వస్తుందనే నా లేడీ ఫ్రెండ్సును మాత్రమే పిలుచుకున్నాను. బావ రావటం అమ్మ కిష్టంలేదు. నాకేం అటువంటిది లేదు.... కాని, నేనూ పిలువలేదు. అలా పిలువలేకపోవటానికి హేతువేమిటి?....దానివల్లనే బావ ముఖం చూడలేకపోతున్నాను. కాని, అతనికి నేనెంత దూరంగా ఉంటున్నానో, నే నంతగా అతణ్ణి గురించి ఆలోచిస్తున్నాను. ఏమైనా సరే, అతణ్ణి చూచి మాట్లాడాలి.... అతణ్ణే....బావ ఒంటరిగా ఉంటే మాట్లాడాలి. ఆయనే నాకు కావలసింది." హేమ హృదయం క్షీరసాగర మథనమైంది.

మాణిక్యాంబ ముస్తాబు చేసుకొని వచ్చి, "అమ్మాయ్ హేమా! ఏదో కొత్త సినిమా వచ్చిందటమ్మా! మీ నాన్నగారు పోదామన్నారు. ఆయనంతట ఆయన అడిగింది ఈ జన్మలో ఇదే మొదటిసారి. అందుకని నేను కాదనలేకపోయాను. వెళ్ళివద్దామా తల్లీ?" అని వాత్సల్యాన్ని ఒలకబోసింది హేమ పడుకున్న పడకవద్దకు వచ్చి.

హేమ మనస్సు బాగాలేదు. "నాకు తలనొప్పిగా ఉందమ్మా! నీవూ, నాన్నా వెళ్ళిరండి" అంటూ ప్రక్కకు తిరిగి పడుకుంది.

"సరే. నీవు రేపు వెళ్ళొద్దువుగానివిలే" అని మాణిక్యాంబ వెంటనే ఒప్పుకుంది. ఆ మాటల్లో, మంచిపనే జరిగింది అనే సంతృప్తి ధ్వనించింది.

మాణిక్యాంబా, రామచంద్రయ్యలు సినిమాకు వెళ్ళారు. హేమకు ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది. ఒక్కక్షణం యింట్లో ఉండబుద్ధి వెయ్యలేదు. ఇంటి కాపలా మనిషికి తాళంచేతు లిచ్చి, రిక్షా ఎక్కి మాలతి యింటికి దారి తీసింది. రిక్షాతోపాటు మనస్సూ పరుగెత్తుతోంది. "హరిని ఎలా పలకరించాలి? మల్లిక కనపడితే ఏం చెయ్యాలి? నీతో మాట్లాడటం యిష్టంలేదని నిక్కచ్చిగా అంటే బావ బాధపడతాడేమో! ఇంతా వెళ్ళితే బావ లేకుండా మల్లిక ఒక్కతే వుంటే? గుండె గుబేలుమున్నది. మాలతితో మాట్లాడి రావచ్చు. తనకు హరి లేని మల్లికతో పని లేదు. మల్లికలేని హరి కావాలి." రిక్షా కామేశ్వరమ్మ గారింటి ముందు ఆగింది.

కొట్టవచ్చినట్లు కనబడుచున్న ముందు వాటాకు పెద్ద తాళం వేసి వుంది హేమ కాళ్ళు వాకిట్లోనే చల్లబడ్డాయి. ఉక్షాను మళ్ళించి యింటికి పోదామను కుంది. కాని, ప్రక్క వాటాలోనుండి మాలతి హేమ నాహ్వానిస్తూ ముందుకు వస్తోంది. మాలతితోపాటు లోపలికి వెళ్ళక తప్పింది కాదు.

''మల్లిక చెప్పిన జోస్యం నిజం.'' మాలతి బుజాలెగరేస్తూ అన్నది. ఏ వ్యక్తిని హేమ గర్హిస్తున్నదో ఆమెను గురించే మాలతి మొదటి మాట.

హేమ ముఖం చిట్లిస్తూ ''ఏమిటది'' అని ముక్తసరిగా ప్రశ్నించింది.

''ఇవ్వేళ నీవు వస్తావని మల్లికా, రాకపోవచ్చునని మా అన్నయ్యా!''

''మీ అన్నయ్య ఎవరు?''

''మీ బావగారు....హరి''

''సంబంధాలు కూడా కలుపుకున్నారన్నమాట?!....అయితే, ఆవిడ నేమని పిలుస్తావు?''

''నాకు మల్లిక....నీకు చెల్లెలు.''

''ఇందులో నా ప్రసక్తి ఎందుకు?''

''కాదంటే పోతుందేమిటి? మీ అన్నయ్యే మల్లిక రెండవ చెల్లెలన్నారు.''

హేమ ముఖం నల్లబడింది. ఒక్కక్షణం అగి ''వాడంత వితరణం చూపిస్తే మీరేనా బంధుత్వం కలపనిది?''

''ముందు నీవు నాకు వదినవైతే.... ఆ తర్వాత మల్లిక కూడా అదే అవుతుంది.''

''మనం కావాలంటే అవుతా మేమిటి? ఏ కాలానికి ఎవ్వ రేమి కావాలో అదే అవుతారు.''

ఇంతలో ''అమ్మాయి హరిగారికి అభినందనలు చెప్పటాని వచ్చినట్లుంది" అంటూ కామేశ్వరమ్మ వచ్చింది.

"అవునండి....వాళ్ళెక్కడికెళ్ళారో?'' - హేమ.

''సినిమా కెళ్ళారు'' - మాలతి.

''వాళ్ళా ఉదయం నుంచి ఎదురుచూచి యిప్పుడే వెళ్ళారు.'' - కామేశ్వరమ్మ.

''నేను వస్తానని అనుకుంటూనే వెళ్ళారా?"

''నీవు వస్తావనీ, చాలా రోజులయిందనీ మల్లిక మాత్రం నాతో గట్టిగా అన్నది" - మాలతి.

''మల్లిక చురుకైన పిల్ల. హేమ కన్నింటా చెల్లెలనిపించుకొంటోంది''- కామేశ్వరమ్మ.

''హరిగారు మల్లికకు చదువూ నాట్యం చెప్పిస్తున్నారు'' - మాలతి.

"అయితే, ఆవిడను రంగం మీద కెక్కిస్తారన్నమాట!'' - హేమ.

''మన హరిహర నాటక కళాపరిషత్తులో అన్నగారు సూత్రధారులు; మననమంతా పాత్రలం.''

''నాకీనాటకాలాడటం చేతకాదు బాబూ!" హేమ వెటకారంగా అన్నది.

"అదీ నిజమే! అందరూ నాటకాలాడితే చూచి ఆనందించేవాళ్ళు కావద్దూ?" కామేశ్వరమ్మ కళ్ళజోడు తుడుచుకుంటూ అన్నది.

"నిన్న అన్నగారు భరతనాట్యశాస్త్రంలోని సహృదయాధికారాన్ని గూర్చి చెప్పారు. మనలాంటివాళ్ళకు తపస్సుచేస్తే కాని అట్టి యోగ్యత రాదు"- మాలతి.

"మాలతీ! నీకు సంగీతంపోయి సాహిత్యం పిచ్చిపడ్డట్టుందే ఇప్పుడు." హేమ ఈసడించింది.

"అది అన్నగారి సామీప్యప్రభావం" - మాలతి.

''నిజంగా వాళ్ళిద్దరూ మా ఇంట్లో అద్దెకుండటం మా అదృష్టం" - కామేశ్వరమ్మ.

హేమకు చురుకుతగిలినట్లయింది. గబుక్కున లేచి నిలువబడింది. తల్లీ, కూతుళ్ల దిగ్భ్రాంతి చెందారు. ఏదో తొందరపని వుందని చెప్పి వెళ్ళిపోతోంది హేమ.

''మరి వాళ్ళొచ్చిం తర్వాత ఏమని చెప్పమంటావు?" మాలతి అడిగింది.

''నేను వచ్చివెళ్ళానని మాత్రం చెప్పు....అంతే!'' హేమ కంఠం రుద్ధమైంది. అధరం చిగురాకులా వణికింది. గాలిలో తేలిపోయినట్లు హేమ నడచిపోయింది. మాలతీ, కామేశ్వరమ్మలు తెల్లబోయి ఒకరినొకరు చూచుకున్నారు.

o o o

హేమ ఇంటికి చేరేసరికి మాణిక్యాంబ రుసరుసలాడుతోంది. రామచంద్రయ్య మేడమీద పడకకుర్చీలో పడుకున్నాడు. తలవని తలంపుగా తల్లి తండ్రులు ఇంటికి తిరిగిరావటం - తాను వాళ్ళొచ్చేసరికి ఇంట్లో లేకపోవటం- ఏదో కొంప మునుగుతుం దనుకున్నది.

''ఏమమ్మా! అప్పుడే తిరిగి వచ్చారు. టిక్కెట్లు దొరుకలేదా?''

"ఆ శని మన యిల్లు వదలిపోయిందనుకున్నాను. ఇప్పుడీ పట్నానికే పట్టింది."

"ఏం జరిగిందమ్మా?"

"మేమిద్దరంపోయి సినిమా హాల్లో కూర్చున్నాము. ఆట మొదలయింది. ఇంకేం-చిలకాగోరంకల్లాగా కులుక్కుంటూ సిగ్గైనా లేకుండా వచ్చారు."

''ఎవరు?''

''ఇంకెవ్వరు? మీ బావా.... ఆ భడవా!''

"ఆఁ!"

''వచ్చేరు సరేకదా, ఆ మాయదారి హాలు అంతా నిండి మా ప్రక్కనే రెండు కుర్చీలు మిగలాలా?.....వచ్చి అందుట్లో నిర్భయంగా కూర్చున్నారు."

"అందుకని మీరు లేచివచ్చారన్నమాట?!"

"వాళ్ళకు సిగ్గులేకపోతే మనకైనా ఉండవద్దూ?"

హేమకు నవ్వాలనో జాలిపడాలనో తోచలేదు. తలవంచుకొని తన గదిలోనికి పోతోంది.

"ఎక్కడికి వెళ్ళి వస్తున్నావమ్మా?"

"తలనొప్పిగావుంటే అలా బజారుకెళ్ళి మందు తెచ్చుకున్నాను."

"అయితే యిదుగో, కాఫీ పెట్టుకొని తీసుకొని వస్తానుండు" అని మాణిక్యాంబ వంట యింట్లోకి వెళ్ళింది. హేమ "బ్రతుకు జీవుడా" అని గదిలో దూరింది.

## 12

హరీ, మల్లికా నిర్భయంగా సినిమాహాలులో తమ ప్రక్కన కూర్చున్న దృశ్యం మాణిక్యాంబకు తలచుకొన్నప్పుడెల్లా అగ్గిలో గుగ్గిలం వేసినట్లవుతుంది. ఆమె అటువంటి సన్నివేశం ఎన్నడూ ఊహించనూలేదు, సహించనూలేదు.

వాళ్ళ నింట్లో నుండి వెళ్ళమన్నప్పుడు వెళ్ళమని ఆమె తాత్పర్యంకాదు. ఆ బెదిరింపుకు హరి హడలిపోవాలనీ, మల్లిక పారిపోవాలనీ ఆమె అంచనా. కథ అడ్డంగా తిరిగింది. తన ఆశ్రయం లేకపోతే వాళ్ళు దిక్కులేని పక్షులౌతారని భావించింది. అభిమానంతో హరి తన యిల్లు వదలివెళ్ళాడు. మాణిక్యాంబ అహానికి దెబ్బ తగిలింది. తనకు ప్రత్యర్థిగా నిలిచిన ప్రాణిని సహించి వదిలే సహనం మాణిక్యాంబకు లేదు. ప్రతీకార వాంఛతో నరిపరివిధాల పరిగెత్తే మనస్సుతో ఆమె యిల్లంతా కలయత్రొక్కుతోంది. గబగబా మేడమీదికు వెళ్ళి, కాఫీత్రాగి ప్రశాంతంగా పత్రిక చదువుకుంటున్న రామచంద్రయ్యను హాలులోకి జరజరా లాక్కొచ్చి సోఫాలో కూలవేసింది. రామచంద్రయ్యకు ఆశ్చర్యంతో నోటిమాట రావటంలేదు. ఊహించని ఆ తుఫానుకు ఉక్కిరిబిక్కిరై పోతున్నాడు.

"మీరేమైనా అనండి దీనికి తగ్గశాస్తి చేసి తీరుతాను!" మాణిక్యాంబ గర్జించింది.

"దేనికి?" రామచంద్రయ్య చప్పరిస్తూ ప్రశ్నించాడు.

"ఈ బోడి బెదిరింపులకు భయపడి తన కాళ్లు పట్టుకుంటారనుకున్నాడేమో! ఆ పప్పు లేమీ ఉడకవు."

''ఓ! హరి సంగతా? మనం సినిమాకు వచ్చామన్న సంగతి వాడికి తెలిసి ఉండదు. తెలిస్తే వచ్చి వుండడు.''

''మీ కస లేమి తెలియదండీ! వాడు మనమీద సవాలు చేస్తున్నాడు, లేకపోతే ఆ టక్కరిదాన్ని వెంటపెట్టుకొని మన ప్రక్కలో బల్లెంలాగా వచ్చి కూర్చుంటాడా?''

"అది నీ అనుమానం. మనం సినిమాకు పోకపోయినా వాళ్ళు వెళ్ళి ఉండేవారు."

''అదే నేనూ అనేది.''

"అయితే, నిన్ను సాధించటానికి వచ్చారన్నావే?''

''ఈ మాత్రం అర్థం చేసుకోలేనివారు ఆ ఉద్యోగం ఎలా వెలగబెడుతున్నారో ఏమో!" మాణిక్యాంబ మూతి త్రిప్పింది.

''ఈ వడ్డింపులకేమి గాని అసలు సంగతి చెప్పు.''

''మన అమ్మాయికి మంచి సంబంధం చూడాలి.... వెంటనే.'' పురమాయించింది మాణిక్యాంబ.

''మనం.... ఇదివరలో....'' నీళ్ళు నమిలాడు.

''మన గతమంతా గంగపాలైంది. అయినవాళ్ళలో అమ్మాయి నిద్దామనుకున్నంత బుద్ధి తక్కువ మరొక్కటిలేదు.''

''ఇప్పుడింత అగత్యమేమొచ్చింది?''

''అదేమిటండీ అలా అంటారు? వయసొచ్చిన పిల్ల. బంగారంలాగా చదువుకున్నది. సంగీతం నేర్చుకున్నది. ఈ క్షణాన ఏ లక్షాధికారైనా అడిగిందే ఆలస్యంగా అందలంలో ఎక్కించుకొని తీసుకపోతాడు. పెళ్ళెంత సేపండీ.... రేపీపాటికి కాదూ.... మనం ఎవ్వరిముందూ వంగి దణ్ణాలు పెట్టాలిసిన అవసరం లేదు. నా గొంతులో ఊపిరుండగా మన అమ్మాయికి ఎట్టి లోపం రానీయను''

''ఎందుకిన్ని మాటలు? నిన్నెవరేమన్నారు?''

''మాటలని చెడ్డదాన్నయ్యేది నేనేనండీ! ఇతరులు లోలోనే కుంభకోణం చేస్తారు - మనం చేతగాని దద్దమ్మలమని కాబోలు...."

''అయితే; పంతంకోసం పిల్ల పెళ్ళి చేద్దామంటావా?''

''అవును. ఇది మన అభిమానానికి పరీక్ష, దీంట్లో మనమే నెగ్గాలి.''

''రేపు బావా అమ్మాయీ స్వయంగా అడిగితే ఏంచేస్తావ్?"

"ఆ ముష్టిదాని ముఖం చూపించి, వారి పుత్ర రత్నానికి ఏ ముఖం పెట్టుకొని పిల్లనివ్వాలో తేల్చుకుంటాను. మాటపట్టింపులు వస్తే నాల్గూ కడిగి పెడతాను."

''మనమే తొందరపడి అలా అనటం బాగుండదేమో!"

"అయితే,తాటిచెట్టు క్రింద కూర్చుండి పాలు త్రాగుతున్నాడనమంటారా?"

"ఈ విషయం ఎన్నడైనా అమ్మాయితో ప్రస్తావించావా?"

''మీరందరూ కలిసి మొదటినుండీ దాన్ని ఆయనగారి కిచ్చి చేస్తామనే ముడుపు కట్టి కూర్చో పెడితిరి."

"అమ్మాయికి కూడ వ్యక్తి వచ్చింది కదా! అదేమంటుంది?"

''పిచ్చిపిల్ల! దానిదేముందండీ? మనమే దాని యోగక్షేమాలు చూడాలి."

''నీవే అర్థంలో అన్నావో కాని, నీవన్న చివరి వాక్యం అక్షరాల నిజం."

"అయితే, యిప్పుడే అమ్మాయిని పిలుచుకొని వస్తాను. మీముందే అడిగి ఒప్పిస్తాను. ఈ జ్యేష్ఠ మాసంలోగా వివాహం జరగాలి. మన మేమీ అంత అసమర్థంగా ఉన్నవాళ్ళం కాదు'' అని అంటూనే విసవిసా మాణిక్యాంబ గదిలోకి పోయి బలవంతాన హేమను తండ్రి వద్దకు తీసుకవచ్చింది.

''ఇక ఆడగండి'' - మాణిక్యాంబ.

''నీవేకదూ తేలుస్తానన్నావు?'' - రామచంద్రయ్య.

''ఏమిటి నాన్నా?'' - హేమ ప్రశ్న.

''ఏం లేదమ్మా! మీ బావ చేసిన ఘనకార్యం చూచావుగా? ఇంక ఎందుకు వాళ్ళ దయాభిక్ష నడగటం? దేవుడు చల్లగా చూస్తే మంచి సంబంధం చూచి ఆ మూడు ముళ్ళూ త్వరగా వేయిద్దామని.' మాణిక్యాంబ అందుకొని మాట్లాడింది.

హేమ మాట్లాడలేదు.

''ఏం తల్లీ! నీ అభిప్రాయమేమిటి?'' రామచంద్రయ్య బుజ్జగింపుగా అడిగాడు.

''నాకసలు వివాహమే వద్దు నాన్నా!'' హేమగొంతు రుద్ధమైంది.

''అదేమిటే, చదవేస్తే ఉన్నమతి పోయినట్లు మాట్లాడుతున్నావు?" మాణిక్యాంబ ముక్కుమీద వేలువేసుకొని దీర్ఘం తీసింది.

''హరి మళ్ళా ఎప్పుడైనా కనపడ్డాడమ్మా?" రామచంద్రయ్య ప్రశ్న.

''లేదు" - హేమ.

''ఎందుకు కనపడతాడండీ? వాడు దీని కళ్ళల్లో కారం చల్లటానికే దాన్ని తీసుకవచ్చాడు. వాడు తలపెట్టినదంతా చేశాడు" - మాణిక్యాంబ.

''అతనిలో అట్టి ఉద్దేశం ఉందని నీవు నమ్ముతున్నావామ్మా?" - రామచంద్రయ్య.

"బావ ప్రవర్తన అలాగే వుంది నాన్నా!" - హేమ.

రామచంద్రయ్య నిరుత్తరుడైనాడు. క్షణకాలం ఆలోచించి ''ఊఁ! కథ అంతదూరం వచ్చిందన్న మాట?"

''నేను చెపితే నమ్మరూ? ఇంకా నాల్గురోజు లాగండి. లోకం కో అని కూస్తుంది. నా నోరైతే మూయగలరు కాని, లోకానికి మూకు దెక్కడ తెస్తారు?" ంబ.

''మల్లికకు చదువు చెప్పిస్తున్నారట! నాట్యం నేర్పిస్తారట! నాటకాలాడ తారట! బావ సూత్రధారుడట! ఆమె నటియట!'' - హేమ.

''నీ కివన్నీ ఎవరు చెప్పారే?'' - మాణిక్యాంబ ఆశ్చర్యంతో ప్రశ్న.

''మాలతి చెప్పింది. వాళ్ళంతా వారిద్దరిని గూర్చి చెక్కభజన చేస్తుంటే నాకు అరికాలిమంట తలకెక్కింది'' హేమ.

''వాళ్ళు కూడా వీళ్ళల్లో చేరారూ? అవునుమరి, ఏ జాతి వారికి ఆ జాతి వారిని కూరుస్తాడు బ్రహ్మ!'' - మాణిక్యాంబ ఈసడింపు.

''మాలతి మంచిదేనమ్మా! కాని ఎందుకో అలా మారిపోయింది."

''మీ బావ మాత్రం మంచివాడు కాదు కనుకనా? కాని ఆ పెనుభూతం పట్టి వీళ్ళందర్నీ బొమ్మల్లాగా ఆడిస్తోంది.''

''ఆ మల్లవ్వ అంత సమర్థురాలా?" రామచంద్రయ్య అనుమానంగా అడిగాడు.

''మల్లిక పనిమనిషిగా ఉన్నప్పుడే ఆమెలో ఏదో ఆకర్షణ ఉన్నదని బావ గుర్తించాడు. దాన్ని నాగరకురాలు చేద్దామన్నాడు. నేనూ ఒప్పుకొన్నాను. కాని, మనమాట వినకుండా దానిని డబ్బు పెట్టికొని, వేరే కాపురం పెడతాడని మాత్రం నేనూహించలేదు'' హేమ గొంతు క్రమంగా గద్గదికమైపోయింది.

''బావ డబ్బుపెట్టి మల్లికను కొనలేదు. ఆమె పినతండ్రికి జబ్బుచేస్తే సహాయం చేశాడు. వాడు తనంతటతాను ఇల్లువదిలి వెళ్ళలేదు. మనం వెళ్ళ గొట్టాం'' మధు అప్పుడే ప్రవేశిస్తూ హేమ మాటలకు అడ్డం వచ్చాడు. మాణిక్యాంబ కొడుకు మాటలకు ముఖం చిట్లించుకుంది.

"లేకపోతే అడ్డం వచ్చిన వారందరికీ యింట్లో వండి, వడ్డించటానికి ఇదేం ధర్మసత్రమా ఏమిటి?" మాణిక్యాంబ విరుపుగా అన్నది.

"బావ మన యింట్లో ఉన్నా, తన ఖర్చులమేరకు ఏదో ఒక రూపంగా మనకు ముట్టచెప్పేవాడే. మల్లిక ఉన్నన్నాళ్ళూ సర్వచాకిరీ చేసి, తన తిండి తాను వెళ్ళబుచ్చుకుంది. మనమెవ్వరినీ ధర్మంగా పోషించలేదు. మన కెవ్వరినీ అనే హక్కు లేదు!" మధు ఖండితంగా మాట్లాడాడు.

"అనండి. ఈ యింట్లో జరిగే అమాయిత్యాల కన్నిటికీ నేనేగా మూలం? నా యిల్లూ, నా పిల్లలూ అని నేనెన్ని చావులు చస్తే ఏముందీ? ఆదరింపా, అధ్వాన్నమా?" మాణిక్యాంబ చిర్రుమని చీదింది.

"బాబూ! మీ అమ్మ మనసు నొప్పింపబోకు." రామచంద్రయ్య సౌమ్యంగా అన్నాడు.

"మన యిల్లు వదలిపోనూరు కదా! ఇంకా వాళ్ళను గురించి మనమెందు కనవసరంగా, దురుసుగా మాట్లాడాలి? వాళ్ళు మనల్ని పల్లెత్తుమాటైనా అన లేదే?" అన్నాడు మధు.

"నీముందంటూరా ఏమిట్రా?.... వాళ్ళ టెక్కులూ, నిక్కులూ సామాన్యంగా ఉన్నాయనుకున్నావేమిటి?" అన్నది మాణిక్యాంబ.

"బావను మన యింట్లో ఉంచుకుండే గౌరవం మనకు దక్కలేదుకాని, బయట ఆయనకేం కొదవ?" అన్నాడు మధు.

"ఎవరి గౌరవాలు వారికుంటాయి" అన్నది మాణిక్యాంబ.

"హేమకు వేరే సంబంధం చూడమంటోంది మీ అమ్మ. అమ్మాయి అసలు పెళ్ళే వద్దంటోంది!" రామచంద్రయ్య మధుతో ప్రస్తావించాడు.

"మీ అభిప్రాయమేమిటి?" మధు తండ్రిని ప్రశ్నించాడు.

"హరి ప్రవర్తనపట్ల అమ్మాయికి విశ్వాసం లేనప్పుడు వేరే సంబంధం చూడటమే న్యాయమౌతుంది." రామచంద్రయ్య తూచి తూచి అన్నాడు.

మధుకు చురుకు తగిలింది. ఒక్క అంగలో హేమ ముందుకు వచ్చాడు. "హేమా! బావను నీవు శంకిస్తున్నావా?" తీక్ష్ణంగా ముఖాముఖి అడిగాడు.

హేమ అన్న ముఖం చూడలేక తల వంచుకుంది. ఒక్కక్షణం అలాగే నిలువబడ్డాడు మధు. హేమనుండి మౌనమే సమాధానం.

"సరే. మీ ఖర్మ మీ రనుభవించండి. నా కీరొంపితో సంబంధం లేదు" అని గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు మధు.

మాణిక్యాంబ గుడ్లప్పగించి చూస్తూ నిలబడింది. మధు బయలుదేరిన తర్వాత హేమ ముఖమెత్తి అన్నవైపు చూచి ఏదో మాట్లాడబోయింది, కాని, మాట గొంతులోనే సుడితిరిగి నిలిచింది. రామచంద్రయ్య నిశ్చేష్టుడై కూర్చున్నాడు. హేమ తన గదిలోకి వెళ్ళబోయింది. మాణిక్యాంబ ఆపింది:

"నీ మొండిపట్టు వదలి ఏదో తేల్చిచెప్పు'' అని బలవంత పెట్టింది.

"అన్నయ్య కిష్టంలేని పెళ్ళి నేను చేసుకోను. మీరు చేయదలచుకుంటున్న పెళ్ళి నా అభిమతానికి విరుద్ధం. అయితే, స్వయంనిర్ణయానికి తగినంత ఆత్మ శక్తి నాలో లేదు. ఈ మూడు సమాంతరరేఖలు ఎన్నడైనా కలిస్తేనే నా జీవితంలో వివాహం. అందాకా నన్ను నేను చదువు కంకితం చేసుకుంటున్నాను. నేనూ స్వతంత్రంగా భూమిమీద జీవిస్తాను" అంటూ ఆవేశంతో ఒక్క బిగువున మాటలను క్రుమ్మరించింది, అనుక్షణం కంపించిపోతూ

మారుమాటాడలేని మాణిక్యాంబను ఆశ్చర్యంతో రామచంద్రయ్య చూచాడు.

## 13

రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో హరి మధుమంజరికి వెళ్ళాడు. మధు ఏదో రేడియోసెట్ ను రిపేరుచేస్తున్నాడు. అతని ముఖం బాగా గాంభీర్యంగా ఉంది. హరిని చూచి కూర్చోమని కుర్చీ చూపించాడు. హరి కూర్చున్నాడు. అయిదు నిమిషాలవరకూ మధు మాట్లాడలేదు. హరి తనలో తాను నవ్వుకున్నాడు.

"ఇవ్వేళ రెండు తమాషాలు జరిగాయిరా మధూ!" హరి ఉపక్రమించాడు.

"మా ఇంట్లో ఒక ప్రళయం వచ్చింది!" మధు మరో వాక్యాన్ని ప్రారంభించాడు.

మధు తన మాటను పట్టించుకునే స్థితిలో లేడని తెలుసుకున్నాడు హరి. "అందుకనే కాబోలు ఈ రౌద్రావతారం" అన్నాడు.

"అసలు నేనే వద్దామనుకున్నాను నీవద్దకు."

"రాక మంచిపని చేశావు. మేము సినిమాకు వెళ్ళివచ్చాం."

"నీవు మహానుభావుడివిరా! నిశ్చింతగా నీపాటికి నీవు కాలక్షేపం చేస్తావు. నిన్ను చూచి లోకం విరగబడి వ్యాఖ్యానించుకుంటోంది."

"లోకాని కంతకన్న వేరే పనేం లేదు కాబోలు!"

''ఉంటే ఇన్ని కథ లెందుకు పుడతాయి?''

"సంతోషమే. కనీసం నేనూ ఒక కథానాయకుణ్ణౌతాను."

మధు చటుక్కున హరి వైపు మళ్ళాడు. ''ఇదేమీ రూపక సాహిత్యం కాదోయ్ బాబూ, చక్కని డైలాగ్సు వప్పచెప్పటానికి! ఇది మెటీరియల్ వరల్డ్-నిష్ఠురమైన లౌకిక ప్రపంచం." హరి వైపు గ్రుచ్చి చూస్తూ అన్నాడు మధు.

''అందుకనే కాబోలు మనం ముక్కుసూటిగా నడుస్తున్నా లోకాన్ని చూచి ఉలిక్కిపడమంటున్నావు!''

''కాకపోతే నీవు చేస్తున్న పని లోకం ఎలా గుర్తించాలి?"

''ఈ లోకం ప్రవాహం లాంటిది. మనం చేస్తున్న ప్రతి పనీ అది గుర్తిస్తుందనుకోవడం పొరపాటు. మంచైనా చెడుగైనా అంతే. కాని, జీవితంలో మనం జాగ్రత్తపడవలసింది ఒక్క విషయంలో. మనం తలపెట్టిన ప్రతి కార్యాన్ని లోకం గుర్తించక పూర్వం మనం మన హృదయాల్లో దాని నెంత వరకు నమ్ముతున్నామో ముందు ఆత్మపరీక్ష చేసుకోవాలి. నీ నిశ్చయం మీద నీకు పరిపూర్ణ విశ్వాసముంటే లోకాభిప్రాయాన్ని నీవు లెక్క చేయవు."

"లోకాన్ని కాలదన్ని ఒంటరిగా పురోగమిస్తే మనకు తోడూ నీడా ఉండొద్దూ?''

"నీవు నడిచేది రాచబాట అని నీకు తెలిసి, నీ లక్ష్యసాధనకు ఉపయోగిస్తున్న సాధనాలు శుద్ధంగా ఉన్నవని పరీక్షించుకొని, ఆత్మవిశ్వాసంతో పురోగమించినన్నాళ్ళూ నీవు ఒంటరిగా లోకానికి కనపడ్డా నీ ధర్మం నిన్ను వెన్నంటి కాపాడుతూనే ఉంటుంది. కావలసింది సహనం, అంతఃకరణ శుద్ధి, అచంచల దీక్ష.''

మధు ముఖంలోని గాంభీర్యపు క్రమంగా మాయమైపోయింది. "నీవు మా అందరికంటే చాలా వేగంగా పరుగెత్తుతున్నావు. నీ కొంగు పట్టుకొని నన్ను రమ్మంటావు. నేను పరుగెత్త లేక బోర్లపడతానేమోనని భయంగా ఉంది.''

"ధైర్యే సాహసే లక్ష్మి!'' హరి మెల్లిగా నవ్వాడు.

మధు కూడా మందహాసం చేశాడు. అతను మామూలు స్థితికి వచ్చాడని హరి గ్రహించాడు.

"నీతో ఎంతో కథ చెప్పాలనుకున్నాను, ఎన్నో ప్రశ్నలు వేయాలనుకున్నాను. నీవన్నిటికి సమాధానం అప్పుడే చెప్పేశావు" - మధు.

"నీ కథకూ నా కథకూ మధ్య నీ కోడం అడ్డ మొచ్చింది."

"అది కోపం కాదురా!"

"కాకపోతే తాపమా?"

"అటువంటిదే."

"అయితే, టాంకుబండ్ మీదికి పోదాంపద, చల్లని గాలి మేయవచ్చు."

"పద" అంటూ మధు తాళపుచేతులు గుమాస్తా కిచ్చి హరితో కలిసి బయలుదేరాడు. హైదరాబాదు నగరవాసులకు హుస్సేనుసాగరమే మహాసాగరము. టాంక్‌బండే ఒక చిన్న బీచి. గ్రీష్మాతప సంతప్త నర నారీ శరీరాలకు శిశిరమంద వాయుకదంబాలతో శైత్యోపచారాలు చేస్తుందాసాగరలక్ష్మి. హరీ, మధూ టాంకుబండ్‌మీద ఏకాంతంగా ఒక బెంచిమీద కూర్చుండి ఉదయం నుండీ జరిగిన సంగతులన్నీ ఒకరికొకరు కలియబోసుకొన్నారు. ఎవరో సరంగు లాంతరు పట్టుకొని తెప్పకొయ్యమీద సాగర మధ్యంలో తిరుగుతున్నాడు. ఆ దీపాన్ని ఇరువురూ కన్నార్పకుండా చూస్తున్నారు. వెనుకరోడ్డుమీది ట్రాఫిక్ చప్పుడు వారి సమాధిని భగ్నం చేయటం లేదు.

"అమ్మాయి పెళ్ళి విషయంలో అమ్మనాన్నలు పట్టుపడితే?" మధు.

"పట్టుపట్టినా హేమ అంగీకరించాలి కదా!" హరి.

"ఇదమిత్థమని తేల్చి చెప్పగల ధైర్యం దాని దగ్గర లేకపోతే?"

"తన జీవిత సమస్యను తాను తేల్చుకోలేకపోతే ఎవరేం చేస్తారు?"

"అని మనం గాలిలో దీపంపెట్టి ఊరుకుంటే ఎలా?"

"నీ వన్నది నా పక్షంలో ఎంతో హేమ పక్షంలోనూ అంతే. నీవు నా పక్షమే పూని వాదిస్తున్నావు. నీవు హేమను సమర్థించాలి."

"అంటే నీ ఉద్దేశం?"

"హేమకు స్వయం నిర్ణయశక్తి నివ్వాలిసిన బాధ్యత నీది. ఆమె నిర్ణయాన్ని అసలు జరుపవలసినవాడవు నీవు. అది ఎట్టిదైనా నాకు సమ్మతమే. హేమ హృదయం నీ వనుకున్నంత దుర్బలమైనది కాదు. ఆమె ఒక సంపూర్ణ వ్యక్తిగా పరిణతి చెందాలని నా అభిమతం....అయినా, లోకంలో శంకాస్పదుని మాటలు విశ్వసనీయాలు కావటం కష్టం" హరి గొంతు చివరివాక్యం అంటున్నప్పుడు బాగా రుద్ధమై పోయింది. మధు తల్లడిల్లాడు.

"నిజం చెప్పాలనే ఆవేశంతో నీ మనస్సును బాధించానురా హరీ! క్షమించు.''

''ముఖప్రీతులు పలికే పదిలక్షలమంది కన్నా నిజంపలికే ఒక నేస్తం దొరికితే చాలు - జీవితం ధన్యం" అని కుడి చేతిక్రింద కూర్చున్న మధును అప్యాయంగా వీపు నిమిరాడు హరి ఆర్ద్రంగా.

## 14

కామేశ్వరమ్మ వయోజన విద్యాభ్యాస సూత్రాలను పాటించి మల్లికకు చదువు చెప్పుతోంది. అక్షర స్వరూప ముద్రితములైన చిత్రాల సాయంతో అక్షరమాలను నేర్పింది. ఇప్పుడు పాఠాలు చదివిస్తోంది, శిష్యహృదయ పరిపక్వ స్థితిని గుర్తించే గురువు, గురువాక్యంపై ప్రమాణబుద్ధిగల శిష్యుడూ జతపడితే సరస్వతి అచిరకాలంలోనే సాక్షాత్కరిస్తుంది. ఈ రెండూ వారిద్దరి మధ్య ఏర్పడినవి. పైపెచ్చు బంగారానికి తావి అబ్బినట్లు మల్లికకు పాదరసంలాంటి తెలివి తేట లున్నాయి. మల్లిక గ్రహణశక్తికి కామేశ్వరమ్మే అప్పుడప్పు డాశ్చర్య పడేది. సారవంతమైన క్షేత్రముంటే బీజ మేవిధంగా నాటినా ఏపుగా అంకురించి, పల్లవించి, కుట్మలించి, ఫలవంతమౌతుంది అని కామేశ్వరమ్మ సంతోషించేది. 'సారంగధరు(' డన్న పాఠం నిన్న ముగిసింది. ఈ రోజు ఆ పాఠం మీద ప్రశ్నలు వేస్తానన్నది కామేశ్వరమ్మ.

''పాఠం చదివావా మల్లికా?'' కామేశ్వరమ్మ ఆప్యాయంగా ప్రశ్నించింది.

''చదివాను అత్తయ్యగారూ! కాదు కాదు టీచరుగారూ!"

కామేశ్వరమ్మ నవ్వుకొని అడిగింది. ''ఆ పాఠంలో ఏమీ అనుమానాలు లేవుకదా?''

''మాటలన్నిటికీ అర్థాలు వచ్చాయి. కాని, కథ పూర్తిగా అర్థంకాలేదు'.

''మాటలన్నిటికీ అర్థాలు తెలిస్తే కథ యెందు కర్థం కావటం లేదు?''

"కథ తెలిసింది. కాని, కొన్ని అనుమానా లున్నాయి.''

''ఏమిటవి?''

''చిత్రాంగి సారంగధరుణ్ణి పెళ్ళిచేసుకోవటం తప్పేనంటారా?''

''ముమ్మాటికి తప్పు. అతడామెకు కుమారుడౌతాడు"

‘‘ఆమెకు మొదటినుండీ సారంగధరుడే మనస్సులో నిలిచాడు కదా! అంతలోనే ముసలిరాజు మీదికి మనస్సునెలా మార్చుకోగలదండీ?”

“అమ్మాయీ! జీవితంలో మనం కలలు కన్నవన్నీ నిజాలు కావు. ఒక్కొక్కసారి మనం తలచిన దొకటి, దైవం తలచిన దొకటీ అవుతుంది. అప్పుడు మనుషులు తదనుగుణంగానే జీవించవలసి వస్తుంది. అది చేతకాలేదు చిత్రాంగికి. అందువలననే సారంగధరుని ప్రాణాలమీదకు తెచ్చిపెట్టింది.”

“చిత్రాంగి కిలా నీతి చెప్పిన వాళ్ళెవరూ దొరకలేదేమో!”

“దొరకక్కేం తల్లీ! ప్రాజ్ఞులైన పండితులు సకల ధర్మసారాన్ని రాజాంతః పురస్త్రీలకు నూరిపోస్తుండేవారు.”

“అయినా, ఆమె మనస్సు మారలేదన్న మాట!”

“ఒక్కసారి హృదయానికి గాఢంగా హత్తిన భావం అంత తేలిగ్గా మారటం కష్టమే! మొత్తానికి సారంగధరునిమీద ఆమె కంత గాఢవాంఛ ఉండే దన్న మాట!”

“అది మనుషులకు సహజమైతే చిత్రాంగి తప్పు చేసిందంటా రేమిటి?”

“ప్రేమించడంలో దోషం లేదమ్మా! ప్రేమను నిస్వార్థంగా త్యాగశీలంతో అనుష్ఠింపక పోవటం దోషం. దైహిక సుఖవాంఛలకు తాపత్రయపడటం కామం. శరీరావధులను లెక్కింపక అంతఃకరణ చైతన్యరూపంగా భాసించేది ప్రేమ. చిత్రాంగి కామదూషితమైన కోర్కెతో సారంగధరుణ్ణి కోరింది. అతడు ధర్మబద్ధ మైన హృదయం కలవాడు కాబట్టి ఆమెను నిరాకరించాడు. స్వార్థము దెబ్బతిన్న చోట త్యాగము అంకురిస్తే ఆ వ్యక్తి ఉత్తమ ప్రకృతి. ఈర్ష్యాపిశాచ మ్ముంకురిస్తే ఆ వ్యక్తి సర్వనాశనకారి. అందుకే ఆ కథలో అంత ప్రళయం. అర్థమైందా మల్లికా?”

“మీ మాట లన్నీ అర్థమయ్యే శక్తి నాలో ఇంకా రాలేదు. కాని, నాకు మీ మాటలు అర్థం కానట్లు మాత్రం లేవు. అనుమానాలు తీరినట్లున్నాయి. కాని, పూర్తిగా సంతృప్తి కలుగలేదు.”

“నేను చెప్పిన మాటల్లోని అర్థాన్ని మననం చేసుకో - అనుమానాలు అంతర్థానమౌతాయి”

"ఒక్కమాటండీ! చిత్రాంగి చేసింది తప్పే ననుకోండి. కాని, ఆమెను చూస్తే నాకు చాలా జాలివేస్తోంది."

కామేశ్వరమ్మ నవ్వింది.

"అదికూడా తప్పంటారా?"

"లేదమ్మా మల్లికా! కథలోని ప్రతిపాత్రా మంచిచెడ్డల తారతమ్యం లేకుండా పఠితహృదయంలో సానుభూతి పొందాలి. సానుభూతి లేనిదే రసానుభూతి లేదు."

"అంటే ఏమిటి?"

"కథాప్రాణంలో నీ ప్రాణాన్ని లీనం చెయ్యటం రసానుభూతి."

"అంటే, కథతో ఏకమైపోవటమా?"

"అనికూడా చెప్పుకోవచ్చు. ఈరోజు నీకింక కొత్తపాఠం అవసరంలేదు."

"అల్లాగేనండి" అంటూ కామేశ్వరమ్మకు, హాలులో ఉన్న నటరాజ స్వామి విగ్రహానికి నమస్కరించింది మల్లిక.

"ఈరోజు అధ్యయనమైపోయినట్లుందే" అంటూ మాలతి ప్రవేశించింది.

"ఇవ్వేళనైనా నోటీసు పెట్టారా?" ఆత్రంగా అడిగింది కామేశ్వరమ్మ.

"పెట్టారమ్మా! నా పేరు సెకండు లిష్టులో ఉంది."

"అమ్మయ్య! దేవదేవుడు చల్లగా చూచాడు."

"మూడురోజుల లోపలనే జీతం చెల్లించాలట."

కామేశ్వరమ్మ ముఖం వాడిపోయింది. మెల్లగా లేచి పెరటిలోనికి వెళ్ళింది. మాలతి బొమ్మలా నిలువబడిపోయింది. మల్లి వాళ్ళిద్దర్నీ చూచి తెల్లబోయింది.

"అత్తయ్యగా రలా అయిపోయారేం మాలతీ?" - మల్లిక.

"ఏం చెప్పను? ఆమెకు నేనొక జీవిత సమస్యను."

"అదేంటి మాలతీ, అలా అంటావు?"

"మా నాన్న నేను పుట్టిన నెల రోజులకే మమ్మల్ని ఒంటరివాళ్ళను చేసి వెళ్ళాడు. మా అమ్మకు తన కాళ్ళమీద తాను నిలబడాల్సిన అవసరమేర్పడింది. ఆమె అసలే అనారోగ్యపు మనిషి. పండిత కుటుంబంలో పుట్టింది కాబట్టి,

పండితుని చేపట్టింది కాబట్టి ఆమెకు చక్కని విద్యాసంస్కారాలు అబ్బినవి. వాటిని సర్టిఫికేట్లుగా మార్చుకొనవలసివచ్చింది జీవిక నడవటానికి. సెకండరీ స్కూలు ట్రెయినింగ్ పాసయింది. మిడిల్ స్కూలులో ఉపాధ్యాయినిగా ఇంత వరకూ జీవితాన్ని ఈడ్చుక వచ్చింది. రిటైరై పోయింది. సత్తువ రోజు రోజుకూ సన్నగిల్లుతున్నది. ఆమె జీవితధ్యేయమంతా నా కాళ్ళమీద నన్ను నిలబెట్టి, నన్నొకరి చేతుల్లో పెట్టటమే. ఆమె రక్తం పిండి సంపాదించిన ప్రతి పైసా నామీద ఖర్చు పెట్టింది. ఇప్పుడామె సంపాదించలేదు. ఆమె లక్ష్యం పూర్తి కాలేదు." మాలతి కన్నులప్రయత్నంగా చెమ్మగిల్లాయి.

''మీరింత ఇబ్బంది పడుతున్నారని మాటమాత్రమైనా ఇదివర కనలేదేం మాలతీ?''

''మనం విషం తింటున్నా ఎదుటివారికి అమృతమే పంచిపెట్టాలి సుమా! అని మా అమ్మ ఆదేశం'' అని కన్నులు తుడుచుకొని నవ్వులు పెదిమలమీద చిలుకరించుకొన్నది మాలతి.

''మీరంతా ఎంత లోతైన మనుషులు!'' మల్లిక ఆశ్చర్యంతో ప్రశంసించింది.

''ఆ కన్నుల్లో చూచుకో, నీలో కూడా ఎంత లోతున్నదో నీకే తెలుస్తుంది'' అని విప్పారిన మల్లిక కన్నుల్లోకి చూస్తూ బుగ్గమీద చిటిక వేసింది మాలతి. మల్లిక గట్టిగా కళ్ళు మూసుకొని మాలతిని గట్టిగా కౌగలించుకొన్నది.

## 15

మధ్యాహ్నం ఒంటిగంటకు యూనివర్సిటీ నుండి హరి యింటికి వచ్చాడు. భోజనానికి కూర్చోబోయే సమయంలో మధు వచ్చాడు. హరి అతణ్ణి కూడా భోజనానికి రమ్మన్నాడు. కాని అతడు భోజనం చేసి ఉండటం కారణంగా ఫలాహారం చేయటానికి అంగీకరించాడు. మల్లిక మధుకు హరిప్రక్కనే పళ్ళెం పెట్టి అరటిపండ్లూ, బత్తాయి పండ్ల ముక్కలూ, ద్రాక్షపండ్ల గుత్తి ఫలాహారం పెట్టింది.

''సెలక్షన్సు ఏమైనవిరా హరీ?" మధు ఉపక్రమించాడు.

"అప్పుడే ఏమి తెలుస్తాయి కాని,ఇంటర్వ్యూ జయప్రదంగానే ముగిసింది. ఎక్స్టర్నల్ స్కాలరుగా కమిటీలో ఉన్న బ్రిటీష్ ప్రొఫెసర్ మాత్రం అభ్యర్థులను బాగా పట్టిచూచాడు. ఆ దెబ్బతో చాలమంది వడపోత అయినారనుకో.''

''అయ్యవారు?''

''ఒక చమత్కారం జరిగింది. నా అభిమాన విషయమేమిటని అడిగాడాయన. రూపక సాహిత్యమని చెప్పాను. ప్రశ్నలన్నీ దానిమీదనే కేంద్రీకరించాడు. వెనకా ముందూ లేకుండా దంచేశాను. ప్రాచ్య ప్రాశ్చాత్య నాటక ప్రయోగ ప్రక్రియల్లో తారతమ్యాలు చెప్పమన్నాడాయన. పది నిమిషాలు లోక చిన్న ఉపన్యాసం దంచాను. అంతటితో ఆగలేదు. ఆ విషయం మీద ఒక థీసిస్ వ్రాయాలని ఉంది. బ్రిటిష్ భారత ప్రభుత్వాలు నాకు అవకాశం కల్పిస్తే నేను బ్రిటన్‌ను యూరపును దర్శించి అచ్చటి రూపక ప్రక్రియల్ని గాఢంగా పరిశీలనం, అధ్యయనం చేయాలని ఉవ్విళ్ళూరుతున్నా నన్నాను.''

''ఆ ప్రొఫెసర్ గుమ్మెపోయి ఉంటాడు.''

''ఆయన అంత తేలిక మనిషి కాదు. నన్ను తీక్ష్ణంగా క్రిందికీ మీదికీ చూచాడు. బ్రిటిష్ స్కాలర్‌షిప్పులు ప్రచురింపబడినప్పుడు తనతో సంప్రతించమన్నాడు. నా ఆశయాన్ని అభినందించాడు.''

''అయితే, ఉద్యోగం ఖాయమన్నమాట?''

''నిజాం కాలేజిలో ఒక ఖాళీ ఉన్నదని వింటున్నాను. అయితే గియితే అక్కడే ఉపన్యాసకుణ్ణి కావాలి.''

''అయితే నా బాటే నీ బాట - నీ బాటే నా బాట'' - మధు.

''అన్నయ్యా! హరిగారు ఆ దేశానికిపోతే అక్కడే ఉండిపోతారా?'' మల్లిక అమాయకంగా అడిగింది.

''ఏ దొరసాన్నికన్నా దయ కలిగితే ఈ దొర అక్కడే మకాం పెట్టవచ్చు.'' మధు నవ్వుతూ అన్నాడు.

''ఈ దేశంలోనే పనికిరానివాణ్ణి ఆ దేశంలో ఏంపనికి వస్తాను?'' హరి గబుక్కున జారాడు.

''అదేమిటట్లాంటారు? ఈ దేశంలోని కాలేజీల్లో ఎందుకూ పనికిరాని వాళ్ళకు ఉద్యోగా లిస్తారేమిటి?'' మల్లిక తన అమాయత్వం మళ్ళా బయట పెట్టింది. హరీ, మధూ పగలబడి నవ్వారు.

''హేమకు నిన్న మెడికల్ కాలేజీలో సీటు వచ్చిందని తెలిసింది'' మధు.

''తానంతట తానే మెడిసిన్ చదువుతా నన్నదా?'' హరి ఉత్కంఠతతో ప్రశ్న

''నేనే ఆ సలహాయిచ్చాను. హేమ అంగీకరించింది."

హరి చిరునవ్వు నవ్వి, ''ఎవరి రోగం కుదుర్చటానికో మీ చెల్లెలు ఈ వైద్యశాస్త్రం అభ్యసించటం?" అన్నాడు. మధు పెద్దగా నవ్వి ఊరుకున్నాడు.

"అందరూ చదువులనీ, ఉద్యోగాలనీ ఎవరి దోవన వారు పోతుంటారు కాబోలు ఇకమీద. మాలతి కూడా కాలేజీలో చేరటానికి ఒప్పుకొన్నారట!" మల్లిక దిక్కుముఖం పెట్టింది.

''ఏ కాలేజీలో?" మధు ఉత్కంఠతతో ప్రశ్న.

"మీ దోవే ఆమె దోవ కూడా" మల్లిక నవ్వింది.

''నిజాంకాలేజీ.... వెరీగుడ్!" మధు పీటమీద ఎగిరి గంతేశాడు.

"ఎందుకంతగా ఉబ్బిపోతున్నావ్?" హరి నవ్వుతూ ప్రశ్న.

మధు మాటలు మానేసి ద్రాక్షపళ్ళగుత్తిని ఎత్తి పట్టుకొని ఒక్కొక్క పండే నోటితో ఆరగిస్తున్నాడు. మల్లిక మాట అందుకున్నది: "మీ కాలేజీలో ఉద్యోగం వచ్చిందానికన్నా మాలతికి సీటు రావటం మా అన్నయ్యకు మరీ సంతోషం."మల్లిక పైటకొంగు నోటికడ్డంపెట్టుకొని ముసిముసినవ్వులు నవ్వింది.

"మధు కూడా మళ్ళా కాలేజీలో చేరతాడేమో!"

"చేరాలనే వుంది. నీ ఉపన్యాసం రోజూ వినవచ్చు."

"పచ్చి అబద్ధం" హరి కొంటెగా ఖండించాడు.

"నిజం మీరన్నది.'' మల్లి నవ్వింది.

"అయితే, ఎందుకనుకుంటున్నారు?'' మధు బుంగమూతి పెట్టాడు.

"ద్రాక్షపండ్లు తింటానికి" హరి. హరీ, మల్లికా పక్కున నవ్వారు.

మధు కొంచెం తెల్లబోయి తేరుకొని, "ద్రాక్షపండ్లు తింటానికి కాలేజీదాకా పోనక్కరలేదు, మీ ఇంటికివస్తేనే చాలు'' అని వంకరగా నవ్వుతూ సమాధానం చెప్పాడు.

''మాలతి కాలేజీలో చేరిందాకా నమ్మకంలేదు.'' మల్లిక బాంబులాంటి మాట వేసింది.

''ఏమి?'' అని హరి మల్లికవైపు సూటిగా తిరిగి ప్రశ్నించాడు.

"అదే ప్రశ్న నేనూ అడిగాను. ఆమె ఒక పెద్ద కథ చెప్పింది" అని మాలతి మాటలన్నీ పూసగ్రుచ్చినట్లు చెప్పింది మల్లిక. హరీ, మధూ ఆలోచనలో పడ్డారు. చేతులు కడుక్కొని హాల్లోకి వచ్చి తమలపాకులు వేసుకున్నారు మౌనంగా. గడియారం రెండు కొట్టింది. ''నిజాం కాలేజికి వస్తావా, పోదాము?'' హరి మధును ప్రశ్నించాడు దీర్ఘ మౌనం తర్వాత.

''అదే నేను కూడా అనుకుంటున్నాను''-మధు.

''అయితే త్వరగా పద'' అని హరి డ్రెస్ వేసుకొనివచ్చాడు.

''ఇంకొక విషయం నీతో చెప్పాలని ఉంది''-ఉత్కంఠతతో మధు.

''అన్నీ మధుమంజరిలో మాట్లాడుకోవచ్చుపద'' అంటూ ఏదో పనిమీద పోతున్నామని మల్లికకు చెప్పి చరచరా వెళ్ళిపోయారు. మధు వెళ్ళుతూ మాలతి వాళ్ళుండే వాటావైపు చూచాడు. వాకిట్లో విరగబూచిన పూలతీగె మందహాసంతో పులకించిపోయింది.

## 16

సాయంకాలం ఆరయ్యేసరికి అరుణాచలనాథ్ మాలతీ మల్లికలకు నాట్యం నేర్పటానికి వచ్చాడు. అతనికి 45 ఏండ్లకు పైబడిన వయస్సు ఉంటుందని అతని శిరోజాలమీద లాస్యం చేస్తున్న తిలతండుల న్యాయం చెప్పక చెపుతోంది. అంత పొడుగరి కాదుకాని, బక్కపలచని అతని శరీరానికి తగినంత ఎత్తు. వయసులో ఉన్నప్పుడు గిరజాలు పెట్టేవాడు. కాని, 5 సం॥ల క్రితం భార్య గతించిన తరువాత వాటిని తీసివేశాడు. గిరజాలతో పాటు నాట్య ప్రదర్శనాలకూ, అధ్యాపనాలకు కూడా స్వస్తి చెప్పి, ఒక ప్రైవేటు సంస్థలో ఉద్యోగిగా బ్రతుకీడుస్తున్నాడు. అతనికి సంతతీ లేదు. పెద్ద బంధుకోటీ లేదు.

అరుణాచలనాథ్ ఉన్నత పాఠశాల జీవితంలో రఘుపతి సహాయం ఎంతో పొందాడు. రఘుపతి అంటే అతని కపారగౌరవం. హరి అంటే అమితమైన స్నేహం. హరి బలవంతం మీద మల్లికామాలతులకు నాట్యాభ్యాసం చేయటానికి ఒప్పుకున్నాడు. బాధ్యతను సర్వశక్తులా వినియోగించి నిర్వహించే విశ్వాసమూర్తి అరుణాచలనాథ్.

ఆ రోజు మాలతికి తలనొప్పిగా ఉంటంచేత మల్లిక ఒక్కతే నాట్యాభ్యాసానికి సిద్ధమైంది. మాలతి లేకుండా మల్లిక ఒంటరిగా పాఠం చెప్పించుకోవటం అరుణాచలనాథు కదే మొదటిసారి.

''ఏమమ్మా! మాలతి ఈరోజు రాలేదేం?" - అరుణాచలనాథ్.

''ఒంట్లో బాగాలేదట. ఈ రోజుకు క్షమించమన్నది" - మల్లిక.

''దేహమన్న తరువాత ఈతిబాధలు తప్పవు....అయితే, క్రొత్త పాఠం చెప్పమంటావా?'

''మీయిష్టం.... కాని, రేపైతే మాలతికూడా వస్తుంది."

''అవును. నేనూ అదే అనుకుంటున్నాను. ఇవ్వేళ నీవు పాతపాఠాలను పునరావృత్తి చేసుకో."

''మీరడిగిన వాటిని నేను నాట్యంచేసి చూపుతాను. పరీక్ష చేయండి.''

అరుణాచలనాథ్ మల్లికచేత మొదట త్రిపతాక, అర్ధచంద్రము, శుకతుండము, సూచీముఖము, భ్రమరము, అంజలి, స్వస్తికము మొదలైన సంయూతానంయుతహస్త ముద్రలను పట్టించాడు. ఆంగికాభినయానికి చెందిన మరికొన్ని భంగిమలను పరీక్షించాడు. రసాభినయానికి గీతగోవింద గీతాన్ని పాడి అభినయింపచేసి నిర్దుష్టంగా ఉన్నదని మెచ్చుకున్నాడు. ఆ రోజు పాఠం ముగిస్తూ "నీతో ఒక మాట చెప్పాలని నేను చాలారోజులబట్టీ అనుకుంటున్నాను"అన్నాడు.

ఒక్కక్షణం నిశ్శబ్దం.

''చెప్పండి'' అన్నది వణుకుతూ పెళ్ళగించుకొన్న మల్లిక కంఠం.

''నీకు నాట్యం నేర్పిస్తూ హరిగారు గొప్ప లోకోపకారం చేస్తున్నారు."

మల్లిక కేమి సమాధానం చెప్పాలో తోచలేదు.

"నీవు శిష్యురాలవైనందుకు నే నెంతో గర్విస్తున్నాను."

మల్లిక కనురెప్పలు వేగంగా అల్లల్లాడుతున్నాయి. క్రింది పెదిమ కంపించిపోతోంది. మారుమాట పెకల్లేదు.

"నీలో నా కొక విలక్షణత కనపడుతోంది మాలతికన్నా. ఆమె రసానుభూతిని అంతర్ముఖం చేసుకొని అభినయాన్ని స్తంభింపజేస్తుంది. నీవు రసానుభూతిని ఆభినయంతో ఉజ్జ్వలంచేసి, సభికుల హృదయాలను ఉత్తేజపరుస్తావు. మాలతి నివృత్తిరసాలను అభినయిస్తే బాగుంటుంది. నీవు ప్రవృత్తిరసాలకు

ప్రాణం పోస్తావు. సిద్ధైన ఏదో స్వతంత్ర వ్యక్తిత్వం నీ నాట్యంలో నీవు ప్రదర్శిస్తావు. నీ పద్ధతి లోకాకర్షమౌతుంది."

''ఇదంతా మీ దయ. ఇందులో నా పాండిత్యమేమీ లేదు."

''పాండిత్యముండికూడా ఆంగికాహార్యసంపద లేక ఎందరో రంగం మీద రసాభినయాన్ని రక్తి కట్టించలేకపోతున్నారు. నీ అదృష్టవశాత్తు నీకు అపూర్వమైన సౌందర్యం దేవుడు ప్రసాదించాడు. బృహన్నల నాట్యం నేర్పిన ఉత్తరవు నీవే అయినట్లయితే, ఆ తర్వాత నిన్నతడు కొడుకుదాకా పోనిచ్చేవాడు కాడు. ఊర్వశిని కాదన్న అతని నిష్ఠ నీపట్ల నిలవటం కష్టమయ్యేది. నీ అందం ఆలంబనంగా అభినయాన్ని సాధించావంటే, కళాకారులంతా నీ పాదాలు పట్టారన్నమాటే!"

"మీకు నామీద ఇంత అభిమాన మున్నదని ఇంతవరకూ నాకు తెలియదు."

''ఈ మాట నీతో చెప్పాలని ఎన్నాళ్ళబట్టో అనుకుంటున్నాను. కాని, నీవు ఏకాంతంగా దొరకలేదు."

''మీ మాటలు నాకు గట్టి ఆత్మవిశ్వాసం కలిగిస్తున్నాయి."

"శిష్యుల్ని గురువులు ప్రశంసించకూడదంటారు. నిన్ను ప్రశంసించకుండా ఉండలేకపోయాను. నా యీ అసమర్థతను బైటికి పొక్కనీయబోకు."

"మీ ఋణం నేను తీర్చుకోలేను" అని మల్లిక తన్మయత్వంలో నిలిచి పోయింది. అరుణాచలనాథ్ బయలుదేరాడు. మల్లిక "మిమ్మల్నొక ప్రశ్న అడగాలని ఉంది" అని పిలిచింది. అతని గొంతుక ఎండింది. ఏమిటన్నట్లు ఆమెవైపు మళ్ళాడు.

"మీ రసలు తెలుగువారేనా?''

"అచ్చమైన తెలుగువాణ్ణి."

"అయితే, మీ పేరు తమాషాగా ఉందే?"

అరుణాచలనాథ్ గట్టిగా నవ్వాడు. "హరి నన్ను సంస్కరించాడు. అసలు నా పేరు ఎట్టిము కొండయ్య. దాన్ని ఆయన సంస్కృతీకరించాడు. అసంస్కృతుడుగా ఉంటే లోకులు నవ్వుతారనుకుంటే - సంస్కృతుడవైన తర్వాత కూడా అది తప్పటం లేదు."

"క్షమించండి. మీ పేరు చూచి ఎప్పుడూ మేము నవ్వలేదు. మీరా పేరుకు తగినవారనే హరిగారు మార్చి మెరుగు పెట్టారు."

"ఆయన ఎప్పుడూ ఇతరులను మెరుగుపెట్టాలనే యత్నిస్తాడు. రాతిని సైతం రాపిడిపెట్టి రత్నం చేస్తాడు. అట్టివాడు నీకాశ్రయ మిచ్చాడు. నీవు ధన్యురాలవు."

''నా జీవితంలో ఇంతకన్న వేరే అదృష్టం కల్గబోదు'' అని నిమీలిత నేత్రాలతో నిలువబడిపోయింది మల్లిక.

అరుణాచలనాథ్ అప్యాయంగా ఆమె నిండు విగ్రహాన్ని కన్నులనిండా చూచి, మెల్లగా నిష్క్రమించాడు.

# 17

మల్లిక వంట చేస్తున్నదే కాని ఆమె మనస్సు దానిమీద లేదు. ఆమె వంటయింటి కిటికీలోగుండా వినీలాకాశం వైపు తదేకదృష్టితో చూస్తూ ఆలోచనలో మునిగిపోయింది. "అరుణాచలనాథ్ గారు ఇన్నాళ్ళబట్టీ నాతో ఏకాంతంగా మాట్లాడి నన్ను మెచ్చుకోవాలని ఉవ్విళ్ళూరుతున్నారట! నేనే ఉత్తరనైతే అర్జునుడు తానే నన్ను పెళ్ళిచేసుకొనేవాడట! మాలతికన్నా నాలో ఏదో ఆకర్షణ శక్తి ఉందట! నా అందానికి అభినయం తోడైతే అందరూ నా పాదాల మీద పడతారట! అబ్బ! ఎన్ని మంచి మాటలన్నారాయన! ఆయనకు హృదయ ముంది. అందాన్ని మెచ్చుకొనే మంచితనముంది. నాలో ఇంత అందమున్నదనీ, ఇంత ఆకర్షణశక్తి ఉందనీ ఆయనే మొదట కనిపెట్టారు.... కాదు, హరిగారే దీన్ని కనిపెట్టి నాకు నాట్యం నేర్పిస్తున్నారని కదూ ఆయన అన్నది?.... కావచ్చు. నా మీద ఆయనకు అలివిమాలిన అభిమానం. కానీ, ఎన్నడూ అరుణాచలనాథ్‌గారిలాగా నన్ను మెచ్చుకోలేదు.... అవును. అందాన్ని చూచి ఆనందించేవారు చాలమంది కనపడతారు కాని, దాన్ని మెచ్చుకొని ఎదుటివారి హృదయాలను ఆనంద పెడదామని ఏ కొద్దిమందికో ఉంటుంది.... హరిగారెందుకు నన్ను మెచ్చుకోలేదు?.... అరుణాచలనాథ్‌గారు నా ఏకాంతం కోసం ఎన్ని రోజులనుండి తపించిపోయారు? హరిగారికి రోజూ నాతో ఏకాంతం దొరుకుతోంది కదా? ఒక్కసారన్నా నాలో ఉన్న ఆ ఆకర్షణను గుర్తించినట్లు చెప్పలేదేం? హరిగారికాశక్తి లేదేమో?''

అన్నం పొంగు వచ్చి మూత క్రిందపడి చప్పుడు చేసింది. ఉలిక్కిపడి అన్నాన్ని కలియబెట్టి మళ్ళా మూత పెట్టింది మల్లిక.

"నా అందానికి అభినయం తోడైతే అందర్నీ ఆకర్షిస్తానన్నారు అరుణాచల నాథ్‌గారు. అయితే, హరిగారి ముందు అభినయం చేయటం లేదు. నాట్యంలో అభినయం ఉంటుంది కాని, జీవితంలో అది యెలా వస్తుంది?....అలా రాగలిగితే అందర్నీ ఆకర్షించగల్గుతానేమో!.... అసలు నాలో సహజంగా అటువంటి శక్తి వుందని దాసరి రామదాసే గుర్తించాడే.... లేకపోతే ఆ వూళ్ళో కుర్రకారంతా ఎందు కలా వెర్రివాళ్ళలా నా వెంట తిరిగేవారు?.... ఆనాడు ఆ ముసలాడు ఎందుకా అమాయిత్యం చేసేవాడు?.... హరిగారు తనతో ఎందుకు తెస్తారు?.... దానికి కారణం ఆయనలోని భూతదయా? లేక, నాలోని ఆ ఆకర్షణ శక్తా?.... దయ ఒక్కటే అయితే, మాణిక్యాంబ గారింట్లో దాసిగా అట్టిపెట్టితే నా పొట్ట నేను నింపుకునేదాన్నేగా?....నా కెందు కీభోగాలన్నీ కల్పించటం? దయకన్నా మించిన దేదో ఒక ప్రయోజనం ఉండాలి. అది నా అందంలోని ఆకర్షణ కావచ్చు. హరిగారు చాలా లోతైన మనిషి. అరుణాచలనాథ్‌గారు బయట పడ్డారు, ఆయన పడలేదు .... కాని, ఈ రోజు ఒక నిజం బయటపడింది నాలోనూ నాది అని చెప్పుకొని గర్వించే ప్రత్యేకత ఒకటున్నది." మల్లిక ముఖం మీద సగర్వమైన భ్రూవిక్షేపం లాస్యమాడిపోయింది.

"మల్లికా! నీవు ఆకాశాన్ని చూచి కలలు కంటున్నావు....అన్నం అడుగు మాడుతోంది!" హరి హాలు వాకిలివద్ద నిలబడి పలుకరించాడు.

మల్లిక ఉలిక్కిపడి గబగబా అన్నం దించబోయింది. గిన్నె ఒరిగి అన్నం కొద్దిగా నేలమీద పడింది. హరి నవ్వుతూ "మరేం ఫరవాలేదు. మాడు చెక్కలమీద మంచినెయ్యి వేసికొని ఆవగాయ నంచుకుంటూ తింటే కుడుముల కన్నా కమ్మగా ఉంటాయి అన్నాడు."

మల్లిక గజగజ వణుకుతూ "నా తెలివిమండ.... తప్పైపోయిందండీ.... మన్నించండి.... మరెప్పుడూ ఇలా చెయ్యను" మాటలు తడబడ పలికింది. ముఖం చెమటలు పట్టాయి. అధరం వణికిపోయింది.

మల్లిక భయాన్ని చూచి హరి ఆశ్చర్యపడ్డాడు. దగ్గరికి వచ్చి వీపు తట్టి "పిచ్చిపిల్లా! ఇందులో కొంపమునిగిం దేముంది? ఈ మాత్రం పొరపాటు ఎవరి కైనా కలుగుతుంది.... దాని కంత భయమా?.... ఏమైనా నీ విప్పుడు భయాన్ని

ఎంత చక్కగా అభినయిస్తున్నావనుకున్నావ్?.... నీ నాట్యాభ్యాసం నీలో వృధా కాలేదు. అందుకనే మా కళాపరిషత్తు నాటకాల్లో నాయికాపాత్ర నీకివ్వటానికి నిశ్చయించాం'' అని హుషారుగా ధైర్యం చెప్పాడు. మల్లిక తెల్లబోయింది. తనవైపు తేటగా చూస్తున్న హరిని ఓరగంట చూస్తూనే తేరుకున్నది.

"మన భోజనాలు త్వరగా కావాలి. మనమూ, మాలతీ, కామేశ్వరమ్మగారూ పెరట్లో వెన్నెల్లో కూర్చుండి కులాసాగా కబుర్లు చెప్పుకుందాం....ఇవ్వేళ నేనొక నాటకమాడబోతున్నాను" అని చిటికవేస్తూ హరి తన గదిలోకి వెళ్ళాడు.

మల్లికకు తల గిర్రున తిరిగినంత పనైంది. ''నీ వెంత చక్కగా అభినయిస్తున్నావనుకున్నావ్?" ''నీవు మా నాటకాల్లో నాయికవు" అన్నమాటలు ఆమె చుట్టూ చప్పట్లు కొట్టుకుంటూ బతకమ్మ ఆట ఆడుతున్నట్లనిపించింది. ''హరిగారు నా మనస్సులోనిమాట ఎప్పుడు విన్నారు? వినకపోతే ఎన్నడూ లేని ఈ మాట లేమిటి?....నాలో వున్న వ్యక్తిత్వం అందరికీ తెలుసు. నాకే ఈ రోజు తెలిసింది" అని విస్తుపోయింది.

భోజనా లయిన తర్వాత అందరూ పెరట్లో కుర్చీలు వేసుకొని కూర్చున్నారు. లోకాభిరామాయణం కొంతసేపు నడిచింది.

"హరిహర నాటక కళా పరిషత్తు తరపున ఏవైనా ప్రదర్శనాలు ఏర్పాటు చేసి సంస్థకు మూలధనం ఏర్పాటు చెయ్యాలని నిశ్చయించాము"-హరి.

"మంచిపని చేశారు. ఆర్థిక స్తోమతలేని సంస్థ మఖలో పుట్టి పుబ్బలో పోతుంది" - కామేశ్వరమ్మ.

"ఆర్థికస్తోమత ఉన్నా యోగ్యులైన యజమానుల చేతుల్లో పడక కొన్ని సంస్థలు పాడైపోతున్నాయి" - మాలతి.

"ఆ రెండు విషమ పరిస్థితులనుండి మన పరిషత్తును దూరంగా ఉంచాలనే ప్రయత్నం" - హరి.

"వజ్రసంకల్పం ఉంటే తప్పక కార్యం ఫలవంత మౌతుంది" - కామేశ్వరమ్మ.

మల్లిక నవ్వు ఆగబట్టుకుంటూ హరితో అన్నది: ''మాలతి కేదో ఉత్తరం వచ్చిందన్నా రిందాక?"

"అవును, మర్చిపోయాను. ఒకటి కాదు రెండు" - హరి.

"ఏవీ....ఎక్కణ్ణుంచి?" మాలతి ఆత్రంతో అడిగింది.

"అమ్మాయి పేర వచ్చాయా?" కామేశ్వరమ్మ తెల్లబోయింది.

"మీ అమ్మాయి సామాన్యురా లనుకున్నారా?" - హరి.

"ఆమె అన్నగారు సామాన్యులైతేగా ఆమె కాకపోవడానికి?'' మల్లిక నవ్వింది.

"అసలు సంగతి చెప్పండి బాబూ!'' కామేశ్వరమ్మ కంగారుపడింది.

హరి ఒక కవరు కామేశ్వరమ్మ గారికీ, మరొకటి మల్లికకూ ఇచ్చాడు. ఇద్దరూ గబగబా చింపి చూచుకున్నారు.

"అమ్మాయి జీతం చెల్లించినట్లు, సీటు ఖాయపడినట్లు వ్రాస్తున్నారేంటి నిజాంకాలేజి ప్రిన్సిపాలుగారు?'' కామేశ్వరమ్మ ఆశ్చర్యపోయింది.

"మధుమంజరికి నేను అప్లై చేయందే నాకీ పార్ట్‌టైము టైపిష్టు ఉద్యోగం ఎలా వచ్చింది?'' అని మాలతి తెల్లబోయింది.

ఎవరో బైట పిలుస్తున్నట్లున్నారని అంటూ హరి గబగబా అక్కడినుండి లేచిపోయాడు.

''ఏమి టత్తయ్యగారూ అది?" మల్లిక అమాయకంగా ప్రశ్నించింది.

''మళ్ళా మాట్లాడకుండా మల్లిక నోటినిండా చక్కెర నింపవే .... ఇదే దీనికంతా కారణం'' అని కామేశ్వరమ్మ గారాబంగా గదమాయించింది.

మల్లిక గలగలా నవ్వుతూ తన గదిలోకి పరుగెత్తిపోయింది. తల్లీ, కూతుళ్ళు ఒకరి నొకరు తెల్లబోయి చూచుకున్నారు.

## 18

ఉదయం కాఫీల వేళకే రామచంద్రయ్య స్నానాదులు ముగించుకొని హాల్లో కూర్చుండి మధుమంజరి వైపు చూడటం ప్రారంభించాడు. పార్టుటైము టైపిష్టుగా మాలతికి ఉద్యోగ మిచ్చిన అపాయింట్‌మెంట్ ఆర్డరు, ఆమె కళ్యాన్సుగా రూ. 100 లు ఇవ్వటానికి అనుమతించిన పత్రం రామచంద్రయ్య చూచాడు. ఆశ్చర్యం, ఆగ్రహం రెండూ పెనవేసుకొని ఆయన్ని ఊపివేశాయి. ఫైలు బల్లమీద గట్టిగా కొట్టుతూ మధును బిగ్గరగా కేక వేశాడు.

ఆ కేకకు వంటయింట్లో ఉన్న మాణిక్యాంబ రివ్వున హాల్లో వాలింది. అప్పుడే గడ్డం చేసుకొని ముఖం కడుక్కొని తుడుచుకుంటున్న మధు మెల్లగా హాల్లోకి వచ్చాడు. స్నానానికి బాత్‌రూముకు పోబోతూ హాల్లో అడుగుపెట్టింది హేమ. రామచంద్రయ్యకు నిజంగా కోపం వచ్చిన సూచనలు కనపడుతున్నాయి. ముఖం కందగడ్డ అయింది. కొడుకువైపు తీక్షంగా చూస్తున్నాడు. ''ఈ అపాయింట్‌మెంటు చేయవలసిన అవసర మేమొచ్చింది?" రామచంద్రయ్య మధువైపు చూస్తూ గద్దించాడు.

"రోజు రోజుకూ బిజినెస్ ఎక్కువౌతోంది. కరస్పాండెన్సు కూడా పెరిగిపోతోంది." మధు తాపీగా సమాధానం యిచ్చాడు

''నీవు స్వయంగా షార్ట్‌హాండ్ టైపిస్టువు. నీ పని నీవు చూచుకోగలవు."

''నేను ఒక్క టైపిస్టునే కాదు, మేనేజరును కూడా. బిజినెస్ ప్రచారం, వర్క్‌షాపు పనులు చూచుకునేసరికే చాలా టైం సరిపోతోంది. అసలు ఫుల్ టైము టైపిస్టునే వేయాలనుకున్నాను. కాని, ఒకటి రెండు సంవత్సరాల తరువాత టైపిస్టుగానూ, కరెస్పాండెంటుగానూ పనికివచ్చే వ్యక్తిని ఇప్పుడు అపాయింట్ చేస్తే సరిపోతుందని యీ పనిచేశాను."

''అంతపని ఉంటున్నమాట నాతో ఎన్నడూ అనలేదేం?''

''మధుమంజరి తాలూకు ప్రతి కాగితం, ప్రతి చర్యా మీ ముందు పెడుతూనే ఉన్నాను. ఆ విషయం మీరు గమనిస్తారనే నేను భావించాను."

రామచంద్రయ్య ఒక్క క్షణం ఏమీ మాట్లాడలేక పోయాడు. కాని, ఫైలు తిరగవేస్తూనే ఉన్నాడు. ''ఈ పోస్టును ముందు ప్రకటించావా?''

''దీని కాఖర్చుకూడా ఎందు కనుకున్నాను."

''అయితే, యీ అభ్యర్థి అప్లికేషను పెట్టిందా?''

''ఆమెకు తెలిసి ఉన్నట్లయితే పెట్టి ఉండేది.''

''స్త్రీకన్నా పురుషుణ్ణి అపాయింట్ చేసినట్లయితే పని సమర్థవంతంగా జరిగేదేమో?'' రామచంద్రయ్య కళ్ళజోడులోనుంచి తీక్షంగా చూచాడు.

''స్త్రీలు పురుషులకన్నా పొందులోనూ తీసిపోరని నేను లోకంలో గమనించిన సత్యం." మధు ముక్తసరిగా ముగించాడు.

రామచంద్రయ్య కుర్చీలో వెనుకకూ ముందుకు రెండు మూడు సార్లూగాడు. "ఈ అపాయింట్‌మెంటు ఎన్నివిధాల చూచినా చాలా విచిత్రంగా ఉంది. కొన్ని ఉద్యోగాలకు అభ్యర్థులనుండే డిపాజిట్లు కట్టించుకోవటం ఉంది కాని, ఉద్యోగంలో చేరకుండానే దాదాపు రెండునెలల జీతం అడ్వాన్సు ఇవ్వటం మరీ విడ్డూరంగా ఉంది."

"మాలతి బీదపిల్ల. చదువుకొంటోంది. ఆమె కాలేజీలో చేరటానికి అత్యవసరంగా కొంత డబ్బు కావాలి. అవసరాన్ని గుర్తెరింగి సహాయంచేస్తే ఆమె మన సంస్థపట్ల కృతజ్ఞురాలై ఉండగలదు" మధు గంభీరంగా అన్నాడు.

మాలతి పేరు వినగానే హేమా మాణిక్యాంబా చకితులైనారు. రామచంద్రయ్య వెటకారంగా మొగం బెట్టి "అసలీ ఉద్యోగం ఆ అమ్మాయి కోసం పుట్టినట్లుంది కాని, మన సంస్థ కవసరముండి ఏర్పడ్డట్లు కనపడటంలేదు" అన్నాడు.

"ఆ పాట పాడే అమ్మాయేగా మాలతి! ఇంకేం?....ఇది కూడా ఆయన గారి ప్రోద్బలమేనేమో!" మాణిక్యాంబ భర్త వీపుమీద వ్రేలితో పొడిచింది.

"మన సంస్థ అవసరాలమీదా, మనవాళ్ళ మనసులమీదా మనకే విశ్వాసం లేకపోతే మన భవిష్యత్తు మీదా, మన అంతరాత్మల మీదా మనకే నమ్మకం లేదన్నమాట?" మధు కొంచెం విసురుగా అన్నాడు. తల్లిదండ్రులకు తగిలిరావాలని.

"చాలించవోయ్ నీ ఉపన్యాసాలు. గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్లు మాకే నీతులు బోధిస్తున్నావు!" రామచంద్రయ్య విసుక్కున్నాడు.

"తండ్రీ కొడుకులూ సఖ్యంగా ఉంటే చూచి ఓర్చుకోవద్దూ లోకం? మిమ్మల్నిద్దర్నీ వేరుచేస్తే తప్ప మధ్య దోచుకతింటానికి వీలుండదు" - మాణిక్యాంబ.

"అమ్మా! ఇది మధుమంజరికి సంబంధించిన విషయం. నీ విందులో అనవసరంగా జోక్యం కల్పించుకోవద్దు" - మధు.

"ఏం, అధిమాత్రం మన సొమ్ము కాదా యేమిటి? ఆయన నానా గడ్డి తిని సంపాదించి యిస్తేనే వచ్చింది దీనాడు, మనందరమూ కలిసి కులకటానికి."

''ఆ మాట నే నెన్నడూ కాదనలేదు. కాని, దాని వ్యవహారాలన్నీ మిగ వాళ్ళం మేము చూచుకుంటున్నాము. నీ వ్యాఖ్యానం వద్దు.''

''నాకు సంబంధం ఎలా లేకుండా పోతుందీ? ఆయన ఆస్తి నా ఆస్తి కాదా? దాని యోగక్షేమాలు చూడటం నా ధర్మం కాదా?....ఏమండీ! మీరు చెప్పరేం?'' అని రామచంద్రయ్య వీపుమీద మళ్ళా పొడిచింది.

రామచంద్రయ్య బింకంతో- ''అవును.... నీవు మాత్రం చెడిపొమ్మని చెపుతున్నావేమిటి?'' అని నసిగాడు.

మధుకు చిరుకోపం వచ్చింది. ''నాన్నగారూ! నాకీ డొంకతిరుగుళ్లు పనికి రావు. నేను చేసిన పనిలో తప్పేమన్నా ఉంటే నా ముఖాన కుండ బ్రద్దలయ్యే టట్లు చెప్పండి". అన్నాడు.

"నీవు చేసిన పని తప్పని నా అభిప్రాయం కాదు. కాని, ఈ పని అంత తప్పనిసరి అయింది కాదని నా భావం. అదీకాక, ఇది యితరుల ప్రోత్సాహంవల్ల జరిగిందని అనుమానం'' రామచంద్రయ్య ఖచ్చితంగా అన్నాడు.

''మీకీ అనుమానం కలగటం కూడా ఇతరుల ప్రోద్బలంవల్లనే అని స్పష్టమౌతోంది. కన్నకొడుకును నమ్మజాలని మీకు నేను ఏమి పని చేసినా అపహాస్యంగానే కనపడుతుంది. నా ముక్కుకు సూటిగా నేను నడచినా, ఇతరు లెవ్వరో నన్ను గోతిలో పడవేస్తున్నారనే అనుమానం బాధిస్తుంది."

''నీవు చేసే స్నేహాలు ఆయనకా అనుమానం కల్పిస్తున్నాయి. అందులో తప్పేముంది?" మాణిక్యాంబ దురుసుగా అన్నది.

''అనుమానం ఆయన కసలు లేనే లేదు. నీవు ఆయన గుండెల్లో పోస్తున్న విషమది. ఒకవేళ నేను లోకంచేత అనుమానింపబడితే, దానికి నా స్నేహితులు కారకులు ఎప్పుడూ కాను; నా యింట్లోవాళ్ళే హేతువు లౌతారు."

''చూడండి, వా డెంతెంత మాట లంటున్నాడో! నేను మీకు విషంలాంటి మాటలు నూరిపోస్తున్నానట!....ఈ కొంపలో నేనే మంచి చేయపోయినా అది నాకే కీడుగా తయారౌతోంది. ఈ గందరగోళం నేను భరించలేను. మీరే ఏదో తేల్చి చెప్పండి'' అని రామచంద్రయ్యమీద కస్సుమని లేచి, ఆయన భుజాలు పట్టుకొని ఊపటం ప్రారంభించింది.

హేమ మాణిక్యాంబను వారించి ''వాళ్ళిద్దరి మధ్య మనం రావటం భావ్యం కాదమ్మా! అన్నయ్య చెపుతున్న మాట అర్థం చేసుకొని, ప్రస్తుతానికి లోపలికి పద. తర్వాత వాడితో మెల్లగా మాట్లాడు'' అని సముదాయించబోయింది.

"మీరూ మీరూ అందరూ ఒకటే....చూడు,ఆయనేమన్నా మాట్లాడాడేమో! ఉద్యోగమిచ్చి అందులో చేరిస్తే, ఆ మహాతల్లి ఏం చేస్తుందో.... వీడికేమి తెలుసు? అమాయకుడు. ఆ హద్ది వీణ్ణి నిండా ముంచంది అప్పుడే వదలి పెట్టాడూ?'' అంటూనే మాణిక్యాంబ వంటయింట్లోకి విసవిసా పోయింది.

తండ్రీ - కొడుకు లిద్దరూ మౌనంతో ఒక్కనిముషం ముఖాముఖి నిలువబడి ఉండిపోయారు. రెండు మూడుసార్లు వంటయింటి వైపు కసిగా చూచాడు మధు.

''ఈ విషయాన్ని పునః ఆలోచించు'' అని రామచంద్రయ్య ఫైలు మూసి పెట్టాడు.

"అంటే - అది తప్పమంటారా?"

"ఆ తర్వాత నీ యిష్టం" అంటూ రామచంద్రయ్య లేచాడు.

"నాన్నగారూ! మిమ్మల్నొక విషయం అడిగి తేల్చుకుందా మను కుంటున్నాను.'' మధు మాటకు వెళ్ళబోతున్న రామచంద్రయ్య ఆగాడు.

"మీరు త్రికరణశుద్ధిగా నన్ను నమ్ముతున్నారా?'' కుమారుడు తండ్రిని సూటిగా అడిగాడు.

"కొడుకు మీదకన్నా కన్నవారి కెవరిమీద నమ్మకముంటుంది?.... అంతే కాదు, తమ మాట కొడుకు వినాలని కూడా ఉంటుంది.'' కళ్లజోడు తుడుచు కుంటూ తన గదిలోకి వెళ్ళాడు మెల్లగా రామచంద్రయ్య.

## 19

కామేశ్వరమ్మ స్వయంగా మధుమంజరికి వచ్చి మాలతిని ఉద్యోగంలో చేర్చి వెళ్ళింది. మధు ఆమెపట్ల చూపించిన గౌరవాదరాలు అతనియం దామెకు విశ్వాసాన్ని ఇనుమడింపచేశాయి. మధు మాలతికి ఉద్యోగ విధులను నిరూపించి చెప్పాడు.

మర్నాడు మధ్యాహ్నం మబ్బులువేసి వాతావరణం చల్లబడింది. నాలుగు గంటలకల్లా కారుమేఘాలు క్రమ్ముకొని కుంభవృష్టికి సిద్ధమైనాయి. వానజల్లు

తోనే మాలతి మధుమంజరిలో అడుగుపెట్టింది. మేనేజరు గదిలోని తన సీటులో తాను కూర్చుంది. టైపు చేయాల్సిన కాగితాలన్నీ టైపు చేయబడి డిస్పాచ్‌కి సిద్ధంగా ఉన్నాయి. మధు వర్క్‌షాపులో రేడియోసెట్టులను పరిశీలిస్తున్నాడు. మాలతి వచ్చిన పదిహేను నిమిషాలకుగాని మధు తన సీటులోకి రాలేదు. మధు రాగానే సీటులోనుంచి లేచి మాలతి నమస్కారం చేసింది. మధు ముసి ముసి నవ్వులు నవ్వుతూ కుర్చీలో కూర్చున్నాడు. ఇద్దరూ ఒక్క క్షణం మౌనం. ఏమి మాట్లాడాలో తెలియని అయోమయం. ఇద్దరూ జేబురుమాలలు తీసి నెన్నుదురు మీద అంకురించిన స్వేదాన్ని తుడుచుకున్నారు. చివరకు మధు ఉపక్రమించాడు:

"నిన్న మీ అమ్మగారు చాల శ్రమ తీసుకున్నారు?."

"మీరు తీసుకున్న శ్రమకన్నానా?" అన్నది మాలతి జంకుతూ.

మధు సీటిబుగ్గ పగిలినట్లు నవ్వాడు. మాలతి తెల్లబోయింది.

"అమెగారు కూడా వచ్చేసరికి.... ఏమంటారో అని నాకు భయంవేసింది"

"ఆమె అనటాని కేమున్నది?"

"ఉద్యోగంలో మీరు చేరటానికి అంగీకరించరేమో నని."

"బాగుంది మీరనేమాట! అయితే, నేనీ ఉద్యోగాని కంగీరించనేమోనని అనుమానం మీకు రాలేదా?" మాలతి పెదిమలమీద చిరునవ్వు లాస్యం చేసింది.

"నిజంగా నాకా అనుమానం ఎప్పుడూ రాలేదు."

నౌకరు రెండు కప్పుల నిండా వేడికాఫీ తెచ్చి ఇద్దరి ముందూ ఉంచాడు. బైట పెద్దజల్లు వచ్చి కుండపోతగా కురుస్తోంది.

"నిన్న మూడుగంటలకు కాఫీవేళ ని కాఫీ తెప్పించారు. ఇవ్వేళ యిప్పుడు కాఫీ తెప్పించారు." ఆశ్చర్యంగా అడిగింది మాలతి.

మధు నవ్వుతూ "నిన్న మీ అమ్మగారి కోసం తెప్పించాను. ఇవ్వేళ మనకోసం తెప్పించాను" అని యింకా ఏదో అనబోయి ఆగిపోయాడు.

"రోజూ కాఫీ తాగటం కూడా నా ఉద్యోగ ధర్మమేనంటారా?" మాలతి చమత్కరించింది.

మధు మళ్ళా నవ్వాడు. "మీ సహకారముంటే ఒక కాఫీయే కాదు...."

"విందులు కూడానా?" మాలతి కూడా శ్రుతి కలిపింది.

''ఏమో, విందుల మాట ఎట్లా ఉన్నా, మా మధుమంజరి ఇకముందు ప్రతిరోజూ కనువిందు చేస్తుంది'' - మధు. ఇద్దరూ మూగనవ్వు నవ్వారు. కాఫీలు చప్పరిస్తున్నారు.

''మీవంటి కళాప్రియులు మాతో కలిసి పనిచేయటానికి ఒప్పుకున్నందుకు వ్యక్తిగతంగా నాకెంతో సంతోషంగా ఉంది'' - మధు.

''మీరు నాకు లేని గొప్పతనాన్ని అంటకట్టుతున్నారు" అన్నది మాలతి సిగ్గుతో.

"అలా అనబోకండి. మీ గానకళాకౌశల్యం అభినందనీయం. మీకు నాట్యం కూడా వచ్చు. అటు గ్రాడ్యుయేషన్ చదువు. మీ సామర్థ్యాన్ని లోకానికి తెలియజేయాలనే అభిప్రాయంకూడా నా హృదయంలో ఉంది."

"అందులో నా యోగ్యతకన్న నా అదృష్టం బలీయంగా ఉన్నట్లుంది"

"ఎందరో అనర్హులనూ, అయోగ్యులనూ అదృష్టం వరిస్తుంది. వారు దానితోనే పైకి వస్తారు. దానితోనే కూలిపోతారు. కాని స్వయంశక్తితో, స్వయం కృషితో పైకివచ్చి అదృష్టాన్ని చేపట్టినవారు తాము శాశ్వతులౌతారు; అదృష్టాన్ని శాశ్వతం చేసుకుంటారు.''

"మీలో హరి గారి లక్షణాలు చాల కనపడుతున్నాయి."

మధు పెద్దగా నవ్వాడు. "నేను వాడు తయారుచేసిన బొమ్మను.ఈ మదు మంజరి వాడి చేతుల మీదుగా నిర్మింపబడిన బొమ్మరిల్లు

"మెరుపుల్లాంటి కన్నులతో గదినంతా కలయచూస్తూ అన్నాడు మధు.

''నన్నూ మీరొక బొమ్మలాగా ఇందులో కూర్చోపెట్టారు. నేను చేయాలిసిన పని చూపించండి" కాఫీ ముగించింది మాలతి.

మధు కాఫీ ముగించి మోచేతులమీద టేబులుమీదకు వంగబడి మాలతికిలా సమాధానం చెప్పాడు: ''మీకు పనిచెప్పేముందు మీ కొక విషయం చెప్పాలి." మధు మాటలకు మాలతి సావధానురాలైంది.

''నేనే విషయాన్నైనా సూటిగా మాట్లాడతాను. మీరు నాతో అల్లాగే మాట్లాడాలని కోరతాను. నా మాటలు మీకెప్పుడైనా కష్టమైతే దాచుకోకుండా నాతో చెప్పితే సంతోషిస్తాను. నేను అధికారినని మీరు గుమాస్తా అనీ బేధభావం ఉండగూడదు. నాకు కావలసింది శాంతమైన వాతావరణం; కల్మషం లేని స్నేహం.'' మధు సౌమ్యంగా మాట్లాడాడు.

"నా సాయశక్తులా మీ ఆశయాలను పాటిస్తాను'' - మాలతి.

''మీరలా అంటారని తెలుసు. అందుకనే ముందు చెప్పేశాను'' మధు.

"అసలు నేను చేయాలిసిన పని యింకా చెప్పలేదు.''

''అదే చెపుతున్నా. వ్యావహారికంగా అడిగితే మిమ్మల్ని టైపిస్టుగా అపాయింట్ చేశాము కాబట్టి టైప్‌వర్క్ ఇవ్వాలి. కాని, అది నా చేతికి మించి పోలేదు.''

''అయితే, ఈ ఉద్యోగం ఎందుకు కల్పించారు?''

''అదే నేను మీకు స్పష్టం చేయాలని ఇంతవరకూ ప్రయత్నం చేశాను. మీ పరిచయంతో మధుమంజరికి వన్నె తెద్దామని మీతో పరిచయమైననాడే భావించాను. హరితో ఈ విషయం మొన్న చెప్పి ఒప్పించాను. మీరు పేరుకు టైపిస్టులు.... అసలు మధుమంజరి కార్యకర్తలలో ఒకరు.''

"ఈ సంస్థకు కార్యకర్తగా ఉండటానికి నేను సంతోషంతో అంగీకరించే దానిని....దాని కిన్ని హంగులెందుకూ?"

మబ్బుపట్టి తేలిపోయినంతగా తేటపడ్డ మధు అమాంతం సీటులోనుండి లేచి, "సూత్రధారుడు ఆడించిన నాటకం ఇది. వాడి మాటకు ఎదురాడటం ఎలా?" అని నవ్వులో మాటల్ని రంగరించాడు.

"హరిహర నాటక కళాపరిషత్తుకు పూర్వ రంగం మధుమంజరిలో సిద్ధమైనదన్నమాట!" మాలతి నిర్మలమైన చూపులను మధువైపు ప్రసరించింది.

బైట వర్షం వెలిసింది.

## 20

హరిహర నాటక కళాపరిషత్తు కార్యాచరణ సమితి సభ్యులు నలుగురూ మధుమంజరిలో సమావేశమయ్యారు.

"మనం ఇదివరలో నిర్ణయించుకొన్నట్లు హరిహర నాటక కళాపరిషత్తుకు స్వయంపోషణ జరగాలంటే, దానికి ముందు ఆర్థిక స్తోమత ఏర్పడాలి. అందు కొక గొప్ప నాటకం చేపట్టి మనం ప్రదర్శించాలి. ఆ నాటకమే పరిషత్తుకు పునాది వేయాలి ' అన్నాడు హరి.

''దేశాన్ని ఉద్రూతలూగించేదిగా ఉండాలి మనం చేపట్టే నాటకం'' అన్నాడు మధు.

''అదే నేనూ యోచిస్తున్నాను. అఖిల భారతీయ సంస్కృతిని ప్రతిబింబించే నాటకం చేపట్టాలని ఒక అభిప్రాయం. తెలుగువారి సాంఘిక జీవితాన్ని ప్రతిబింబించే స్వతంత్ర నాటకం చేపట్టాలని మరియొక అభిప్రాయం.''

''ఈ రెండిట్లో ఏది మొదట? ఏది తరువాత?'' - మధు.

''భారతీయ దృష్టి ముందు'' - హరి.

''అయితే, భారత కథ ఇతివృత్తంగా గల నాటకం తీసుకుంటే?''

"భారతానికి సంబంధించిన గాథలను కథగా తీసుకొన్న నాటకాల్లో 'అభిజ్ఞాన శాకుంత'లానికి మించిన నాటకం లేదు. అది అఖండ భారత సంస్కృతికి మణిదర్పణంలాంటిది. కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులు గారి ఆంధ్రానువాదం చాలా బాగుంటుంది. దానిని చేబట్టి నిర్వహింపగల్గితిమా-పరిషత్తుకు మంచి పేరు ప్రతిష్ఠలు రాగలవు." హరి భవిష్యత్తును గూర్చి కలలు కంటున్నట్లు మాట్లాడా డావేశంతో.

"కాళిదాసు నాటకాన్ని నిర్వహించే నటులున్నారా మనలో?'' మధు సందేహాన్ని వెళ్ళబెట్టాడు.

"పుట్టుకతోనే ఎవ్వరూ మహా నటులు కాలేరు. అభినయ తృష్ణ కలిగిన ప్రతి వ్యక్తి సాధనమీద ఎట్టి పాత్రనైనా వశం చేసుకోవచ్చు. సాధనకు తగిన అవకాశం, సుశిక్షణ కావాలి. నటుని తపస్సే అతనికి అత్యున్నత స్థానాన్ని సాధించి యిస్తుంది. మన దేశంలో నటకులకు అభినయాన్ని క్రమబద్ధంగా నేర్పే సంస్థలేవీ? అభినయాన్ని వృత్తిగా తీసుకుంటే పొట్టగడిచే మార్గమేదీ?" - హరి.

"ఆ లెక్కకువస్తే అభిజ్ఞాన శాకుంతలం లాంటి నాటకమాడితే చూచి మెచ్చుకొనే ప్రేక్షక లోకం యిప్పుడుందంటావా?'' - మధు.

"లోకాన్ని మనం శంకించటం తప్పు. మనం ఉత్తమ కళాఖండాలను సృజించి వానిని ఉదాత్త వాతావరణంలో ప్రదర్శించటం మన వంతు. మన కర్తవ్యాన్ని మనం చిత్తశుద్ధితో నిర్వర్తింపగలిగితే ప్రేక్షక లోకం మనల్ని తప్పక మెచ్చుకుంటుంది. ఉత్తమ ప్రేక్షకులు దేశంలో తయారు కావాలంటే ఉత్తమ రూపక ప్రదర్శనలు జరగాలి. మనం బ్రతికే బ్రతుకు మన పరిసరాల్లో ప్రతిబింబిస్తుంది. మన కృషిపట్ల శ్రద్ధ వహించకుండా ప్రేక్షకులను 'ఆడిపోసు కోవటంలో అర్థం లేదనుకుంటాను.''

"శాకుంతల నాటకాన్ని చేపట్టాలంటే పెద్ద యెత్తున సంభారం సిద్ధం చేయాలిసి ఉంటుంది'' - మధు.

"అయ్యా! అంబారి కావాలనుకుంటే ఏనుగును మేపాలిసివస్తుంది.''

"ముందు తెలుగు నాటకాన్ని చేపట్టితే?'' మధు ప్రశ్న.

''తెలుగు నాటకాలను ఆడే సంస్థలు తెలుగునాట చాలా వున్నాయి''- హరి.

''మనం మంచి నాటకం చేపట్టి గొప్పగా ప్రదర్శిద్దాం'' - మధు.

''ఏమి నాటకం తీసుకుందాం? నీవు చెప్పు చూద్దాం!'' హరి నవ్వుతూ ప్రశ్నించాడు.

''విషాద సారంగధరం, ప్రతాపరుద్రీయం, కన్యాశుల్కం - ఈ మూడింటిలో ఏదైనా ఒకటి తీసుకుంటే?"

"ఆ మూడు నాటకాలూ తెలుగు రూపకసాహిత్యంలో మూడు రత్నాలే. కానీ, మనం ఇదివరలో అనుకున్నట్లు తెలుగువారి జీవితాన్ని ముమ్మూర్తులా ప్రదర్శించే నాటకం కావాలంటే .... ఈ మూడింట్లో కన్యాశుల్క మొక్కటే మిగిలేది."

"అదేమిటి? మొదటి రెండు నాటకాలూ ఇద్దరు తెలుగురాజుల చరిత్రలకు సంబంధించినవే కదా?"

"నాటక రచనా శిల్ప విషయంలో ఆ రెండు నాటకాలూ రూపక సాహిత్య పురోగమనానికి రెండు మైలు రాళ్ళలాగా ఉన్నవనీ, ఉత్తమ కళాఖండాలనీ ఒప్పుకొని తీరాలిసిందే. కానీ, ఇతివృత్తానికి సంబంధించినంతవరకు అవి వాస్తవి మైన తెలుగుకథలు కావు. ఒకటి తెలుగురాజుకు మచ్చ తెచ్చే కథ. మరొకటి చరిత్ర కందని కల్పిత కథ."

"అయితే సారంగధరుడు మనవాడు కాడా? యుగంధర మంత్రి మనవాడు కాడా?" మధు ఆవేశంతో ప్రశ్న.

"చారిత్రకంగా కారు. సాహిత్య పాత్రలు మాత్రమే మనకు వారు".

"అయితే గిరీశం మనవాడా?"

"తెలుగుకవి మేధలో నుండి, సమకాలీన సాంఘిక జీవితంలో నుండి తెలుగుగడ్డ మీద పుట్టినవాడు గిరీశం. అతడు చారిత్రక పురుషుడు కాడు.పురాణ వ్యక్తి కాడు. తెలుపు నలుపుల తెలుగుజాతి చరిత్ర కడుపార కన్న గడుసరి బిడ్డ గిరీశం. అంతేకాదు, మూగమనసులతో మోయలేని విషాద జీవిత భారాన్ని మోసి మోసి అలసిపోయిన బాల వితంతువుల దుర్భరగాథకు ప్రతీక బుచ్చమ్మ పాత్ర. జారుతున్న తన కాలును చూచి నవ్వబోతున్న సంఘానికి ఎదురుగా తనను తాను నిలువ త్రొక్కుకుని నిల్చి, ఆ పతనానికి కారణ మెవరని ప్రశ్నింప గలిగిన గంభీరమైన పాత్ర మధురవాణి....ఇలాగే అందులోని ప్రతి పాత్రా మన తెలుగుజాతిలో నుండి తలయెత్తినదే".

"అంత విశిష్టమైన నాటకాన్ని ఎందుకు ముందు చేపట్టకూడదు?"

"కాళిదాసు నాటకాని కున్న విశ్వజనీనత కన్యాశుల్కానికి లేదు. అదీకాక, కన్యాశుల్క సమస్య సంఘంలో ఈరోజు లేదు. అటువంటప్పుడు ఒక్క నటనా కౌశల్యంమీదనే కథను రక్తి కట్టించాలి. రచనలో శక్తి ఉంది కాబట్టి మన కెంతో సహాయపడుతుంది. కాని, రసాభాస శిల్పంమీద ఆధారపడి వుందా నాటకం. రస శిల్పాన్ని రక్తి కట్టించడంకన్నా రసాభాస శిల్పాన్ని మెప్పించటం కష్ట తరమైన విషయం. రసాస్వాదన స్వరూపం తెలియందే రసాభాసాస్వాదనం తెలియటం నటకునికీ, ప్రేక్షకునికీకూడా అసాధ్యం. మన నాటక పరిషత్తు ముందు రస శిల్పాన్ని, తరువాత రసాభాస శిల్పాన్ని ప్రదర్శిస్తే క్రమ పరిణామంగా అభినయ సామర్థ్యం ఏర్పడటానికి అవకాశం కల్గుతుంది."- హతి.

"మొత్తానికి మధుమంజరిని క్లాస్‌రూమ్‌గా మార్చావు." మధు నవ్వాడు. అందరూ శ్రుతి కలిపారు.

"అయితే, శాకుంతలంలో పాత్రధారు లెవ్వరు?"

"ఇంకా నేను గట్టిగా ఆ విషయం ఆలోచించలేదు. కాని, నాకు కొన్ని ఊహలు లేకపోలేదు."

"ఆ బంగారం బయట పెట్టుదూ!....నాకు నీవు చెప్పేంతవరకూ నిద్ర పట్టదు" - మధు.

"చెప్పమంటారా?" అందర్నీ కలియచూసి అడిగాడు. అందరూ తల లూపారు అంగీకారసూచకంగా.

"శకుంతల - మల్లిక, ప్రియంవద - మాలతి, అనసూయ - హేమ, కణ్వమహర్షి - అరుణాచలనాథ్, శారఙ్గరవుడు - మధు. ఇంకా తరువాతి పాత్రలు పరిషత్తు సభ్యులలో ఎన్నిక చేస్తున్నాను-" హరి.

"అసలు కథానాయకు డేడీ ఈ నాటకంలో?"

"సమర్థుని కొఱకు ఆన్వేషిస్తున్నాను....ఎవ్వరూ దొరక్కపోతే...."

"సూత్రధారునికి తప్పదన్నమాట!" మధు పూరించాడు. హరి నవ్వాడు.

"నాకు విదూషకుని పాత్ర యిస్తావేమో కొంపతీసి అనుకున్నాను"-మధు.

"మోదకాలు తినే రంగం నాటకంలో ఉన్నట్లయితే నీకే ఇచ్చేవాణ్ణి."

"అయితే, నన్ను కోపిష్ఠికింద లెక్కగట్టి శారఙ్గరవ పాత్ర యిచ్చావన్న మాట! ' మధు.

"నీకు తగిన పాత్రే నీకు వచ్చింది కాని, నీ చెల్లెలిని అనసూయగా ఒప్పించు, నీ సామర్థ్యం తెలిసి వస్తుంది" - హరి మందహాసం చేశాడు.

గడియారం తొమ్మిది కొట్టింది. వర్కుషాపు మూసి గుమాస్తా తాళం చేతులు తెచ్చి మధుచేతి కిచ్చాడు.

"అయితే ఈ రోజు తొలి నాటకానికి సూత్రధారుడు నాంది నాలపించాడన్న మాట!" మధు.

"అవును. ఇక రంగం ఆరంభింపక తప్పదు." హరి అన్నాడు, కుర్చీలో నుంచి లేస్తూ.

## 21

ఆ రోజు ఆదివారం. మధ్యాహ్నం భోజనా లయిన తర్వాత హేమను తన గదిలోకి రమ్మని పిలిచాడు మధు. హేమ వెళ్ళింది. అన్నా చెల్లెళ్ళిద్దరూ లోకాభిరామాయణం కొంత సేపు మాట్లాడుకున్నారు. ఆ తరువాత-

"మన కళా పరిషత్తు శాకుంతల నాటకం వేయాలని నిర్ణయించింది" అన్నాడు మధు.

"అంతకన్నా ప్రాచీన నాటకం ఏమీ దొరకలేదు కాబోలు!" హేమ నవ్వింది.

"వీరేశలింగం పంతులుగారి అనువాదం తీసుకున్నాము."

"వారి అనువాదం బాగుంటుంది."

"అందులో పాత్రధారులను గూర్చి గూడా తుది నిర్ణయాలు తీసుకున్నాం."

"నాయికా నాయక పాత్రధారు లెవరు?"

"మన మల్లిక శకుంతల. హరి దుష్యంతుడు." మధు సంతోషంగా అన్నాడు.

హేమ ముఖం నల్లబడింది. "నేను శారఙ్గరవుణ్ణి.... నీవు అనసూయవు" మధు.

"ఎవరి వీనిర్ణయాలు?"

"సూత్రధారుడివి."

"మీరందరూ సూత్రధారుని నిర్ణయాలకు కట్టుబడి ఒప్పుకోవలసిందే నన్నమాట!"

"అభ్యంతరం చెప్పే అవసరం వాడెన్నడూ కల్పించలేదు."

"అభ్యంతరం చెప్పితే ఏమౌతుంది?"

"వ్యక్తి స్వాతంత్ర్యాన్ని వా డెన్నడూ కాదనడు. సంఘ సమష్టి శ్రేయస్సుకు తోడ్పడే ఎట్టి సూచననైనా హృదయపూర్వకంగా అంగీకరిస్తాడు."

"పరిషత్తు శ్రేయస్సునూ వ్యక్తి శ్రేయస్సునూ ఎలా సంధిస్తాడో?"

"మొదటిదానికి రెండవది ఉపాంగంగా."

"అంతటి నిష్కామకర్మ ఈ లౌకిక విషయాల్లో ఉంటుందంటే నేను నమ్మలేకపోతున్నాను."

"ఉంటుంది. కాని, నీవు సంశయంతోనే ఆలోచిస్తే సత్యం తేటపడదు. సత్యం తేల్చుకోటానికి రంగంలో నీవు కూడా దూకు. ప్రతివ్యక్తినీ పరీక్షించు. తాము చెప్పే ఆదర్శాలను అనుసరించలేని అసమర్థులుంటే వేలుపెట్టి చూపించు. వారిని సంస్కరించటంలో నీవూ నీ శక్తిని ఉపయోగించు. ప్రతివ్యక్తీ విమర్శకే దిగితే విమర్శకు మూలమైన వస్తువు నెవడు తీర్చి దిద్దాలి?" మధు ఆవేశంతో అన్నాడు.

''మనం సంస్కరిస్తేనే సంఘం బాగుపడుతుందని అహంకరించటం కూడా ఒక విధంగా తప్పేనని నా అభిప్రాయం'' - హేమ.

"సంస్కరణోత్సాహాన్నే అహంకారంగా శంకించి దానికి దూరమై దాన్ని నిందించడం మహాదోషమని నా నమ్మకం.'' మధు ఖండితంగా చెప్పాడు.

''లోకోభిన్నరుచిః అని ఊరుకోవటం మంచిదనుకుంటాను ఇట్టిపట్ల.''

''సరిపెట్టుకొని స్తబ్దులు కావటంకన్న సత్యాన్వేషణతో ముందుకు సాగటానికి సాహసించటమే చైతన్య లక్షణమౌతుంది.''

''నిండు జీవితాలు ప్రయోగాలుగా మార్చి అస్పష్టమైన ఫలం కొరకు అర్రులు సాచి అంతరించిందానికన్నా స్పష్టమై చేతికందిన ఫలాన్ని అనుభవించి తృప్తిపడటం మేలనుకుంటాను.''

''నీ వన్నది లోకసామాన్యం మాట. ప్రగతిశీలి అంతటితో ఆగడు. ముందడుగు వేస్తాడు. నీవూ అలాగా ముందుకు వచ్చి మాతో సహకరిస్తా వనుకుంటాను.''

''నీ మాట నేను కాదనలేను కాని, మన ఇద్దరికన్నా పెద్దలున్నారు మన అమ్మా నాన్నా. వారి అనుమతిలేనిదే నేనేమాటా చెప్పటం బాగుండదు."

''ముందు నీ అభిమతం నీకు స్పష్టంకావాలి. దాని కనుగుణంగా ఇతరులను నీవైపు మార్చుకోవాలి.''

''మగవాడివి కాబట్టి నీవలా అనటం చెల్లుతుంది. స్త్రీకి పురుషునికిలాగా స్వయంపోషణశక్తి వస్తేగాని తన మతాన్ని గట్టిగా చెప్పి నెగ్గించుకోలేదు.''

''నీ విప్పు డంతగా బాధపడవలసిన అవసరమేముందమ్మా! నీ యభిప్రాయాన్ని మనింట్లో ఎవరు కాదంటారు?''

"నా అభిప్రాయాన్ని గౌరవించి అడిగేది నీ వొక్కడవే ఈ యింట్లో. ఇతరులకు తమ అభిప్రాయాలను ఎంతవరకు నేను పాటిస్తానా అన్నదే ప్రశ్న." హేమ కంఠం రుద్ధమైంది.

''నాకు తెలుసు నీ బాధ. అందుకనే నాతో కలిసి ముందుకు రమ్మన్నాను ఎన్నోసార్లు.''

''నీకూ అమ్మకూ మధ్య నేను లేకపోతే యీ యిల్లు రెండు చెక్కలౌతుంది. ఇలా ఎక్కువరోజులు సాగటం మంచిది కాదు. నీవు లోకాన్ని మరమ్మత్తు చేయటానికి పూర్వం నీ యింటిని నీవు బాగుచేసుకో."

''నా హృదయం అర్థంచేసుకొనే నాథుడు లేనిచోట నేనెలా ఒకటిగా బ్రతుకగలను?''

''అట్లని యిల్లువదలి లోకంమీద పడితే అదిమాత్రం ని న్నర్థం చేసు కుంటుందా?"

''లోకంలో మనకు నచ్చిన వారితో స్నేహం చేయవచ్చు. నచ్చనివారికి నమస్కారం చేయవచ్చు. ఇంట్లో అది కుదురదు."

''అందుకే ఇంట గెలిచి రచ్చ గెలువ మన్నారు పెద్దలు"-హేమ.

''ఏమిటే అన్నా చెల్లెళ్ళు ఆలోచన చేస్తున్నారు?'' అంటూ మణిక్యాంబ గదిలోకి ప్రవేశించింది. అన్నా చెల్లెళ్ళిద్దరూ కొంచెం కలవరపడి వెంటనే తేరుకున్నారు.

"నీ దగ్గరికే రావాలని అనుకుంటున్నామమ్మా! అంతలో నీవే వచ్చావు.'' మధు సౌమ్యంగా నవ్వుతూ ప్రారంభించాడు.

"మీ కేం కావాలనో అడగండి నాయనా!...మీ సంతోషమే మా ఆనందం-" మాణిక్యాంబ.

''పిల్లలం....సరదాపడి ఏదో అడుగుతాం.... తల్లిదండ్రులు దానిని మన్నిస్తే మా హృదయాలూ ఎంతో తృప్తిపడతాయి"-మధు.

''మీ కందులో ఏమీ అనుమానం వద్దు. నాతో చెప్పండి....ఇదంతా మీకు కాకపోతే మరెవ్వరికి?''

''ఏంలేదమ్మా! ఒక చిన్న కోరిక.'' మధు ముద్దులుపోయాడు.

''చెప్పు నాయనా!''

''మేమందరం సరదాగా ఒక నాటకం వేయాలనుకుంటున్నాము.''

''ఎవరెవరు వేస్తున్నారు?''

''హరిహర నాటక కళాపరిషత్తు సభ్యులు.''

ఆ మాట వినగానే మాణిక్యాంబకు చుర్రుమన్నది. ''అంటే, ఆయనగారి సంఘమేనా?....నాటకం పేరేమిటో?''

''అభిజ్ఞాన శాకుంతలం.''

''ఓహో! అందులో ఆయనా, ఆమే వేషం వేస్తున్నారా?''

''వేస్తున్నారు.''

''అయితే, హేమను అందుట్లో దింపకు-'' మాణిక్యాంబ గట్టిగా చెప్పింది.

మధుకు ఉడుకెక్కింది. కాని, తమాయించుకున్నాడు. ''వాళ్ళంటే నాటకం చేసిన దోషమేమిటి?''

''అసలు ఇలాంటివాళ్ళు చేరబట్టే, నాటకా లాడేవాళ్ళంటే దేశంలో గౌరవం లేకుండా పోయింది.''

''వాళ్ళు చేసిన నేర మేమిటి?''

''వాళ్ళ తప్పుడు బుద్ధి.''

మధు ఊగిపోయాడు కోపంతో. పళ్ళు బిగబట్టి నిగ్రహించుకున్నాడు. ''వాళ్ళు తప్పుడు మనుషులని మన మెలా నిరూపించగలమమ్మా?''

''వాళ్ళ ముఖాలే చెపుతున్నాయి. మన మింతమాటన్నామో లేదో, అదే సందని సొంత కాపురం పెట్టినవాళ్ళు సామాన్యులంటావా మధూ?''

''పొమ్మనంటే పోవటం తప్పా?....తమపాటికి తాము బ్రతకటం తప్పా?''

''అబ్బాయీ! నీవు చిన్నవాడవు. నీ కింకా లోకజ్ఞానం చాలా కావాలి. వారు ఎవరికి వారుగా బ్రతకటం లేదు. జంటగా బ్రతుకుతున్నారు. ఆ రొంపితో మనకు సంబంధం వద్దు.''

''అమ్మా! నే నొక్కటి అడుగుతాను.... ఒక పురుషుడు ఒక స్త్రీ జంటగా ఉంటూ స్వచ్ఛంగా బ్రతుకలేరనేగా మీ అనుమానం?''

మాణిక్యాంబకు కొంచెం కోపం వచ్చింది. "ఏమో నాయనా! మీ ఆలోచనలు మీకు బాగుంటాయి కాని, మా మాటలు నచ్చేకాలమా యిది? అబ్బాయీ, ఒకేమాట! వాళ్ళిద్దరితో ప్రసక్తి ఉన్న ఏవిషయంలోనూ మీరు జోక్యం పుచ్చుకోవటం మా కిష్టం లేదు. మన మింకా వంశ గౌరవం, కీర్తిప్రతిష్ఠలూ కాపాడుకోవలసినవాళ్ళం. మీరిద్దరూ పెళ్ళి కావలసిన పిల్లలు."

''వాళ్ళ నర్థం చేసుకున్న నన్నుకూడా మీలాగా అనుమానించమంటే నా అంతరాత్మకే మహాపరాధం చేస్తున్నా ననిపిస్తోంది'' - మధు.

"ఎవరి ఆత్మలు చెప్పింది వారికి సోకితే ఇక తల్లెందుకు, తండ్రెందుకు? ఎలాగైనా ఊరేగండి'' అంటూ విసురుగా మాణిక్యాంబ వెళ్ళిపోయింది.

అన్నా చెల్లెళ్ళు ఒక క్షణం మౌనంగా కూర్చున్నారు.

''అమ్మడూ! నీవేమంటావు?''-మధు.

''అన్నయ్యా! నీవు ఈ యింటి స్థితిగతులను అసలే లెక్కచెయ్యటం లేదు. అడుగడుక్కూ నీవు మానుండి దూరమౌతున్నావు.'' హేమ కన్నులలో నీరు నిలిచింది. కంఠం బాగా జీరవోయింది.

మధును దుఃఖతరంగ మొకటి గట్టిగా ఊపివేసింది. ''అమ్మడూ! నాకూ ఈయింటికీ మధ్య వంతెనలాగా ఉండాలని నీవు సంకల్పించావు. నీకూ బావకూ నేను వంతెనలాగా ఉందామని నేను సంకల్పించాను. మన యిద్దరి సంకల్పాలూ ప్రస్తుత స్థితిలో అవసరమే. ఇక నీ యిష్టంమీదనే వదలిపెట్టా నీ విషయం'' —ఆర్ద్రంగా హేమతో అన్నాడు.

''ఇద్దరమూ దైవసంకల్పంకొరకు ఎదురుచూద్దాం. ఇంతకన్నా యిప్పుడు నేను చెప్పేదేమీ లేదు" - హేమ భారంగా లేచివెళ్ళింది.

''హేమను అనసూయగా ఒప్పించటం నా తరం కాదేమో!" అని చేతులలో ముఖంకప్పుకొని కన్నీటిజల్లును వర్షిస్తున్న మధును పశ్చిమాద్రి మీద కాలుజారి పడిపోతున్న భానుడు పరామర్శించాడు.

## 22

శాకుంతల నాటకం రంగంమీది కెక్కటానికి మూడు నెలల గడువేర్పాటు చేయబడింది. హరివాళ్ల యింట్లో రిహార్సళ్ళు. అనసూయపాత్రకు హేమ అంగీకరించలేదన్న విషయం అందరికీ కొంత నిరాశాజనకమైనప్పటికీ హరిమాత్రం ధైర్యంతో "ఒక్కపాత్రకోసం ఇంత నాటక మాగుతుందా? ఈ సంగతి నేను ముందే ఊహించి మా కళాశాల విద్యార్థిని మాధురిని ఆ పాత్రకు నిర్దేశించి ఉంచాను" అని చెప్పి, ఆమెకు వర్తమానం పంపి ప్రోత్సహించి రిహార్సలుకు రమ్మన్నాడు.

శకుంతల, అనసూయ, ప్రియంవద పాత్రధారులకు ప్రత్యేక శిక్షణను అరుణాచలనాథ్ చేత హరి ఇప్పించటం ప్రారంభించాడు. మూడు పాత్రలలో ప్రియంవదానసూయ లొక యెత్తు, శకుంతల ఒకతె యొక యెత్తు, దానిలోను మొదటి నాల్గంకాలలోని అభినయం ఒక యెత్తు. పంచమ సప్తమాంకాలలోని అభినయం మరో యెత్తు.

మల్లిక కప్పుడప్పుడు కలిగే ధర్మసందేహాలు తీర్చేసరికి అరుణాచలనాథ్ తల ప్రాణం తోకకు వస్తోంది. ఒకసారి రిహార్సలు జరుగుతోంది. ప్రథమాంకంలో శకుంతలపాత్ర "(ఆలోచించి మనసులో) ఇది యేమో కాని యీాయనం జూచి తపోవన విరుద్ధంబైన యొక వికారంబునకు లోనయినదానను" అన్న మాటను అభినయించవలసివచ్చింది.

"తపోవన విరుద్ధమైన వికారమంటే ఏమిటండీ అరుణాచలనాథ్‌గారూ?" మల్లిక ప్రశ్న.

"దుష్యంత దర్శనంచేత శకుంతల హృదయంలో రతి అనే భావం పుట్టింది. భావం వికార రూపం. భావాలు సంచారి భావాలనీ, స్థాయి భావాలనీ రెండు విధాలు. సముద్రంలోని జలంలాగా సర్వవ్యాప్తమై మూలభూతంగా ఉండేది స్థాయి భావము. అలల్లాగ లేస్తూపడుతూ సముద్ర చైతన్యానికి పుష్టి కలిగించినట్టే స్థాయిభావాన్ని పోషించేవి సంచారి బావాలు. ఈ నాటకంలోని ప్రధాన రసం శృంగారం. దానికి స్థాయి భావం రతి. నాయకుని యందు రతి భావం ఉదయించి ప్రదీప్తమై వెలుగుతోంది. నాయికయందు ఇప్పుడు రతి జనించింది. నాయిక ఆ భావానికి వశురాలై పోయింది. అనగా, ఆ భావం ఆమె నిగ్రహించుకొనే స్థితిని మించిపోయిందని భావము. స్థాయిభావోదయాన్ని కాళిదాసు ఇచ్చట రమణీయంగా చిత్రించాడు. తపోవనవాసులందరూ ఇంద్రియ నిగ్రహులు. తపోవనంలో పెరిగిన శకుంతల తన అంతరింద్రియం తన వశం తప్పినదన్న విషయాన్ని గుర్తించి ఈమాట లంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే, తపోవన సహజ వికారము శమము. తపోవన విరుద్ధ వికారము రతి" అని అరుణాచలనాథ్ వ్యాఖ్యానించాడు.

"మీరు చెప్పే ఆ భావాలన్నీ లోకంలో అందరికీ కలిగేవేనాండీ?"

"లోక వృత్తానుకరణరూపమైనదే నాట్యం. లోకంలో లేని భావం రూపకంలో లేదు."

"అయితే ఒక్కమాటలో సముద్రమంత పెద్దభావం పుట్టినట్లు అభినయించాలంటారు - అంతేకదూ?" - మల్లిక.

"అవును. నీవు అసలు తత్త్వం పట్టుకున్నావు." అరుణాచలనాథ్.

"నాటకంలోని భావాలన్నీ అభినయిరేచాలంటే వాటిని ముందు అనుభవించి ఉండాలికదండీ!" మల్లిక అమాయకంగా అన్నది.

"పాత్రల భావాలన్నీ పాత్రధారులు జీవితంలో అనుభవించి ఉండి ఉండకపోవచ్చు. అప్పుడు అట్టిభావాల్ని ఏకాగ్రబుద్ధితో భావించాలి. దానినే సత్త్వం అంటారు.''

"ఏకాగ్రతకు ఏదైనా లక్ష్యం కావాలికదా?" - మల్లిక.

"పాత్రయే నటునికి లక్ష్యం. దానిమీద కుదరకపోతే ఏదైనా లౌకికమైన మరో లక్ష్యం పెట్టుకొని దానిని క్రమంగా పాత్రమీదకు మళ్ళించవచ్చునని కొందరంటారు."

"మీరు సూచించినట్లు ప్రయత్నిస్తాను." మల్లిక కన్నులు అర్ధనిమీలితాలయ్యాయి.

ఇలాగే మరొకరోజు చతుర్థాంకంలో కణ్వమహర్షి కూతుర్ని ఆశీర్వదించి తన వియోగాన్ని త్వరలో మర్చిపోగలవని ధైర్యం చెపుతూ 'పట్టపురాణివై, రాజాంతఃపుర కార్యభారాన్ని మోస్తూ - పూర్వదిశాంగన భాస్కరుని గాంచినట్లు పుత్రునిగాంచి సర్వదుఃఖాలను మర్చిపోతా"వని ఆశ్వాసిస్తాడు. ఆ పద్యం చదువుతూ అరుణాచలనాథ్ శకుంతలపాత్రలో కాళిదాసు నిక్షిప్తం చేసిన భారత కులసతీ జీవితతత్త్వాన్ని వ్యాఖ్యానించి చెప్పాడు. "ఏడాకుల అరటిచెట్టు - ఏడంకాల నాటకం. అది శాకుంతలం. ఆ చెట్టుకు కాసేది ఒకటే గెల. అదే భరతోత్పత్తి. అంతటితో నాయిక జీవితం సాఫల్యం చెందుతుంది. మాతృపదం కన్న స్త్రీకి ఉన్నత పదం లేదు. పుత్రగాత్ర-పరిష్వంగ సుఖం కన్న తండ్రికి వేరే స్వర్గం లేదు. ఎంతో పుణ్యం ఉంటే తప్ప మనిషికి అంత అదృష్టం కల్గదు"- ఆ మాట లంటూన్న అరుణాచలనాథ్ కన్నుల వెంట అప్రయత్నంగా అశ్రుధారలు కురిశాయి.

మల్లిక అతణ్ణి చూచి బోరున ఏడ్చింది. మాలతి మొదలైన నటీనటులందరూ దిగ్భ్రాంతి చెందారు.

నటీనటులకు రిహార్సలులు ఒక అధ్యయనంగా తోచింది. తాము పాత్రలకు ప్రతిరూపాలుగా నిలుచున్నప్పుడు ఏదో తపస్సుకు అంకితా రోపణ చేస్తున్నట్లు తలపోసేవారు. ఆ మూణ్ణెళ్లూ నాటకమే బ్రతుకుగా జీవించారు.

## 23

ఎగ్జిబిషన్ థియేటర్‌లో అభిజ్ఞాన శాకుంతల నాటకం సర్వ సన్నాహాలతో ప్రదర్శించటానికి సిద్ధమైంది. ముఖయవనికపై హరిహర నాటక కళాపరిషత్తు అన్న జలతారు అక్షరాలు సంస్థ కీర్తిపతాకలాగా మెరిసిపోతున్నాయి. మధు మంజరి సిండికేట్ రంగాలంకరణం, శబ్ద యంత్ర విద్యుద్దీపాలంకరణం నిర్వ హించింది. ప్రేక్షక జనంతో హాలు కిటకిట లాడుతోంది. మధు తన యింట్లో అందరికీ మరీ మరీ చెప్పి వచ్చాడు. కాని, హేమ ఒక్కతె మాత్రమే వచ్చి ముందువరుస సోఫాలో కూర్చుంది.

దుష్యంతుడుగా హరి జగన్మోహనంగాఉన్నాడు.రథారూఢుడై ఉన్నప్పుడు తపోవనంలో ప్రవేశించినప్పుడు ప్రకరణోచితంగా అతడు ప్రదర్శించిన ఠీవి, వినయము పౌరవ వంశ రాజతిలకాన్ని ముమ్మూర్తులా ప్రత్యక్షీకరించాయి. శకుంతలగా మల్లిక ప్రవేశించి దుష్యంతుని పాత్రకన్న తానే ప్రేక్షకుల దృష్టి నాకర్షించింది. ప్రియంవదగా మాలతి ముద్దులమూట కట్టించింది. అనసూయగా మాధురి గంభీరంగా అభినయించింది. శకుంతల కంచెల బిగించేటప్పుడు, భ్రమరభయం అభినయించేటప్పుడు మల్లిక అభినయం - అభినయాన్ని మించిన ఆమె శరీరాంచలాల విలాసపు హొయలు-ఆ హొయల వెనుక తొంగిచూస్తున్న ఒక విశిష్ట స్త్రీ చైతన్యశక్తి ప్రేక్షకులను ముగ్ధులను చేసివైచాయి. హేమ తన కన్నులను తానే నమ్మజాలకపోయింది. మల్లిక అందానికి ఆమె అసూయపడింది.

హరి దుష్యంతుడుగా సప్తపర్ణి క్రింద కూర్చున్నాడు. ప్రథమ రతిభావో దయాన్ని మల్లిక అనుభవిస్తూ అభినయించిన ట్లనిపించింది. రసాధిదేవతవలె గోచరించిన ఆమె ముగ్ధమోహనమూర్తి హరి హృదయంలో తపోవన విరుద్ధ వికారాన్ని రేపింది. శకుంతలా సౌందర్యప్రశంసాపరవశుడైన దుష్యంతుడు నాటకంలో రక్తి కట్టటానికి మల్లిక హరిలో రేపిన ఆ వికారవిశేషాంకురమే కార ణమై శోభించింది. దుష్యంతుని వీడలేక వీడలేక నిష్క్రమించిన శకుంతల అభినయాన్ని చూచి హరి నిశ్చేష్టుడైపోయాడు.

ద్వితీయాంకంలో శకుంతలను విదూషకుని ముందు వర్ణన చేస్తున్నప్పుడు దుష్యంతపాత్రధారికి మల్లికయే మనసులో వర్తించింది. రంగముమీద ఆమెలేని వియోగాన్ని అనుభవింపచేసింది. తృతీయాంకంలో శకుంతలా, దుష్యంతులు లతామండప సమావేశ ఘట్టాన పల్లవశయ్యపై పవ్వళించిన మల్లిక నిజంగా

శాపగ్రస్తురాలై భువి కవతరించిన అప్సరోంగనలా తోచింది. ఆమె తనకై సర్వస్వము అర్పించటానికి తన అంగీకృతికై ఎదురుచూస్తున్నట్లు తోచింది.

"లలన యపరిక్షతముఁ గోమలంబునైన
క్రొత్త పూఁదేనె భృంగంబు గ్రోలినట్లు
నీ యనుగ్రహంబునఁజేసి నే నాకింత
తవిలి నీ యధరసుధను ద్రావు పిదప"

అని శకుంతలను తన కౌగిటపొదివి, ఆమె ముఖము పైకెత్తి అధరముచుంబించి యత్నించినాడు దుష్యంతుడు. మల్లిక శకుంతలగా ముగ్ధాభినయం చేసింది. మాటిమాటికి మునివేళ్ళతో అధరాన్ని మాటికొన్నది. వలదు వలదు అన్న మాటలతో ముఖ మడ్డం త్రిప్పింది. శరీరస్పర్శాప్రేరితమైన ఒక అననుభూత చైతన్యశక్తి సుప్తమైయున్న యౌవనాగ్నిని ప్రజ్వలింపచేసి, శకుంతలా దుష్యంత పాత్రధారులకు పాత్రల అవధులకుపైనున్న వారి స్త్రీపుంసభావాలను మేల్కొల్పింది. గౌతమీ ప్రవేశంతో దుష్యంతుడు లతా మండపం చాటున దాక్కున్నాడు. "మరలి వచ్చి నిన్ననుభవించుటకు సెలవు వేడెద'' నని వెడలి పోతున్న శకుంతల వియోగ దుఃఖాభినయం ప్రేక్షకులను ఊపివేసింది. హేమ జలజలా ఏడ్చింది. తరువాత శూన్యలతా మండపాన్ని చూచి విచారిస్తున్న దుష్యంతుడు కావ్యరసంలో లౌకిక రసాన్ని జోడించినట్లు స్పష్టంగా ప్రేక్షకులు గమనించారు.

హేమ తనలో అనుకున్నది: "హరి బావ ఊహా సుందరిని ఈ రోజు సజీవంగా పొందకల్గాడు. అతని జీవచైతన్యం మల్లిక సౌందర్యరేఖల్లో ఊపిరి పోసుకుంటూంది. ఈ జంట కళాజగత్తుకు ఒక అమృతభిక్ష. నాకన్నా మల్లిక బావకు ఎన్నోవిధాల నాణెమైన జంట!.... అతడు కోరుకున్న ఫలం దొరికింది. నా కన్యాయమైనందుకు చింతలేదు." ఆమెకు దుఃఖం పొరలివచ్చింది. హాలు వదలి యింటికి వెళ్ళిపోయింది.

దుష్యంతుడుగా హరి తృతీయాకాంతంలో నిష్క్రమించి సరాసరి తన డ్రెస్‌రూమ్‌లోకి వెళ్ళాడు. కడుపులో ఏదో కలియ పెడుతూన్నట్లు బాధపడుతూ కుండపోతగా కన్నీ రుకార్తుస్తూ కడుపుబ్బ ఏడ్చాడు కొన్ని క్షణాలు. అయిదవ రంగంలో దుష్యంతుడు విషణ్ణమూర్తి. శాపవిస్మృతి, అంతస్స్మృతి - ఈ రెంటి మధ్య అల్లల్లాడుతున్న అంతరాత్మ అతని కన్నుల్లో అమితసహజంగా ప్రకాశించింది.

హరిహర నాటక కళాపరిషత్తు పేరు ఆ నాటకంతో ఆంధ్రదేశమంతా మారుమ్రోగింది. అయిదువేల మూలధనంతో పరిషత్తు తన కాలు నిలువత్రొక్కుకుంది. నటిగా మల్లిక పెక్కురు ప్రముఖుల దృష్టిపథాల్లో నిలిచింది.

## 24

ప్రొద్దుపొడుపువేళ పూర్ణచంద్రరావు హరి యింటితలుపు తట్టాడు. "హరీ, హరీ'' అంటూ తలుపు నైదారుసార్లు బాదాడు. గాఢ సుషుప్తిలో నున్న హరి కలవరపడి లేచి హడావుడిగా తలుపు తీశాడు.

ఎదురుగ్గా పూర్వస్నేహితుడు పూర్ణచంద్రరావు! సన్నని పొడుగైన విగ్రహం, ఉంగరాలు తిరిగిన బిరుసైనజుట్టు; ఎడమప్రక్కగా తీసిన కుదురైన పాపిడి, చదునైన నుదురు, విశాలమైన కళ్ళు, పొడుగ్గా పెదిమల మీదకు చూస్తున్న ముక్కు; తుమ్మెద రెక్కల్లాంటి ఫ్రెంచికట్ మీసం; చిన్న నోరు, గణువు తేలిన మిట్టగడ్డం - కుదురుగా అమరి అతని కోల ముఖానికి రేఖా సౌష్ఠవాన్ని కొట్టవచ్చినట్లు ప్రదర్శిస్తున్నాయి. పొడుగైన లాల్చీ, చుంగులు వదలిన ధోవతి, బుజం మీద మఫ్లరు. ఇనుపకడ్డీలాంటి శరీరదార్ఢ్యం, దబ్బపండులాంటి మేనిచాయతో సీమమని షనిపిస్తాడు.ముందుకు దూసుకుపోయే మనః ప్రవృత్తిగల పూర్ణచంద్రరావు పొంగుతూ ఉబ్బెత్తుగా మీదకు లేచి విరుచుకుపడుతున్న సముద్ర తరంగంలా ప్రత్యక్షమయ్యాడు. హరి కళ్ళు పెకలించుకుంటూ రావును ఆహ్వానించాడు. వస్తూనే హరి బుజంమీద చరుస్తూ - ''ఎంత గొప్పవాడివయ్యావురా బ్రదర్? నీ అభినయం నిన్న వండర్‌ఫుల్! మీ డ్రామాలో వ్హాట్ ఎ టీమ్ వర్క్ ఇట్ ఈస్?.... అబ్బా! అటువంటి నాటకం నా జన్మలో నేను చూడలేదురా! నిన్న రాత్రల్లా మమ్మల్ని స్వప్నంలో ముంచేశారనుకో మీరంతా. నేనే మహారాజునైతే మీకు బ్రహ్మరథం పట్టించేవాణ్ణి.... నేను అభినందించకుండా ఉండలేకపోతున్నాను'' అని ఉప్పెనలాగా మాటల్ని పొంగిస్తున్నాడు పూర్ణ చంద్రరావు.

''అసలెప్పుడొచ్చావురా వరంగల్లు నుండి నీవు?'' - హరి.

''నిన్న రాత్రి తొమ్మిదింటికి రైలు దిగాను. సరాసరి హాలుకు పరుగెత్తాను. పదిహేను రూపాయల టిక్కెట్లే ఉన్నాయి. ఒకటి కొనేశాను. మెత్తని సీటు మీద కూర్చున్నాను. సుతిమెత్తని మీ అభినయాన్ని చూచాను. నీవు నీవే! ఆ శకుంతల శకుంతలే! .... అబ్బా! ఆమె అందం సూపర్బ్! అభినయం

బ్రహ్మాండం. నా డిక్షనరీలో ఇంతకన్నా గొప్పపదం లేదనుకో మెచ్చుకోవడానికి. గాలించి గాలించి కోహినూరు రత్నాన్ని పట్టావోయ్ హీరోయిన్‌గా. ఆమెను రంగం మీదకు తెచ్చిన నిన్ను ముం దభినందించాలి. అసలు నాటకమంతా కారెక్టర్ సెలెక్షనులోనే ఉందోయ్! నేను ఏ సినిమా ప్రొడ్యూసర్నో అయి ఉన్నట్లయితే కళ్ళు మూసుకొని ఆమెను పది పిక్చర్లకు వరుసగా బుక్ చేసి కంట్రాక్టు రాయించుకొనేవాణ్ణి. తెలుగుదేశంలో మరో తార వెలిసింది. ప్రకృతి శాస్త్రంలో కొత్త సత్యాన్ని కనిపెట్టటంకన్నా రసికలోకానికి ఒక క్రొత్త తారను అందించటం చాల గొప్ప పని అని నా అభిప్రాయం."

"నీ మాటలు విని చాల రోజు లయిందిరా పూర్ణం!"

"ఒరేయ్! ఇప్పుడా పేరుతో నన్ను పిలువబోకురా....గతంలో పూర్ణం అని పిలువబడ్డాను. ఇప్పుడు చంద్రం అని పిలువబడుతున్నాను. పరిణామశీలి గతాన్ని అంటిపెట్టుకొని ఉండకూడదు కదూ?"

"నీవప్పటికీ యిప్పటికీ ఏమీ మారలేదురా!. కాని, పరిణామశీలినంటావు."

"పరిణామం ఒక పరుగులాంటిది బ్రదర్! స్థలాలు మారతాయి, పరిసరాలు మారతాయి, క్రొత్త వ్యక్తులు పరిచయమౌతారు, క్రొత్త క్రొత్త సంఘటన లెదురౌతాయి. వాటి కనుగుణంగా మన బహిస్స్వరూపం మార్చుకోవాలి. అదే నా దృష్టిలో పరిణామం. శరీరావధులకు పరిణామం కాని, ఆత్మకు పరిణామం లేదు."

"చాలా రోజులకు కలిశావు.... నీవు ఇంటర్ కంప్లీట్ చేశావా?"

"అసలు నేను కొలబద్దల్లో ఇమిడే ఘటాన్ని కాదు. నా స్టాండర్డ్సు ఆ పరీక్షకన్నా అధికంగా ఉన్నట్లు నా అంతరాత్మ చెపుతోంటే నన్నెలా దానికి తలవంచ మంటావు చెప్పు? తాటిచెట్టును భూమి మీద గరికపరక లెన్నున్నవో లెక్కపెట్టగలవా అన్నట్లుంటుంది నాకీ యింటర్ పరీక్ష. అందుకని నేనసలు దాన్ని గురించి ఆలోచించటమే మానేశాను. మనిషి బ్రతకటానికి సోల్‌ఫోర్సు ఉండాలికాని, ఈ సర్టిఫికేట్లెందుకు?"

"మర్చిపోయాను. ఉండు ఒక్క క్షణంలో వస్తాను" అని లేచాడు హరి.

"ఒరేయ్ బ్రదర్! నీవు హడావుడి పడకు."

"అది నా ధర్మం." అని హరి మల్లిక పండుకొని ఉన్న గది తలుపు తీశాడు. మల్లిక ఏకాంతంగా ఉన్నప్పుడు గది తలుపు తీయటం అదే మొదటి

సారి. మల్లిక మంచంమీద అమాయకంగా నిద్రపోతోంది. నిద్రాముద్రితమైన ఆమె ముఖం చామనచాయలో చకచ్చకితమైన లావణ్య రేఖలతో మెరిసి పోతోంది. అరతొలగిన పైటసౌరు, తలగడగా ఉంచుకొన్న ముంజేతి సొబగు, పృథుల శ్రోణీమండలంమీద విశ్రాంతి తీసుకుంటున్న వామహస్తం, నడుం వరకూ కప్పుకున్న దుప్పటిమాటున తలదాల్చుకున్న శరీరాంచల వక్రరేఖా విన్యాసం - ఒక్కసారిగా హరి కన్నుగవ దోసిళ్ళతో జుర్రుకున్నవి. ఆమె నిద్రా సౌందర్యంలో స్తబ్ధమై నిలిచిన చైతన్యశక్తి కార్తీక ఘటదీపంలా ద్యోతమాన మైంది. ఆమె నిద్రను భంగం చేయటానికి హరి మనస్సంగీకరింపలేదు. ఆమె మీదనుండి చూపు మళ్ళించటానికి తా నశక్తుడైనాడు హరి. కాని, యీ వైపు హాల్లో పూర్ణచంద్రరావు అతిథిగా వచ్చి కూర్చున్నాడు. తన ధర్మం తాను నిర్వహించాలి. ''మల్లికా! మల్లికా!" అని సౌమ్యంగా పిలిచాడు. మల్లిక ఉలిక్కిపడి లేచింది. ఎదుట హరి! విరిసిన మల్లెపూల పొట్లం విప్పినట్లు ఒక చల్లని నవ్వు నవ్వింది మల్లిక. మరుక్షణంలో సిగ్గుతో నిలువబడి, చెదరిన ముంగురులను సరిదిద్దుకొంటోంది.

"నా బాల్య స్నేహితు డొకడు వచ్చాడు. వాడికి కాఫీ అంటే ప్రాణం. ప్రొద్దున్నే వచ్చాడు. పరగడుపున ఉంచటం పాపమని నిన్ను నిద్రలేపాను" హరి నవ్వుతూ అన్నాడు.

మల్లిక ముఖంమీద నవ్వు మాయమైపోయి, తెల్లదనం క్రమ్ముకుంది.'' అల్లాగే....ఇప్పుడే కాఫీ తెస్తాను'' అని వంటయింట్లోకి వెళ్ళింది.

ఇద్దరు మిత్రులూ వాకిట్లో మంచినీటిపంపుదగ్గర ముఖాలు కడిగి హాల్లోకి వచ్చి కూర్చున్నారు. మల్లిక తెల్లవారు జామున థియేటరు నుండి తిరిగివస్తూ పెద్ద ఫ్లాస్కునిండా పోయించుకొని వచ్చిన కాఫీని మూడు కప్పుల్లో నింపి హాల్లోకి తెచ్చింది. పూర్ణచంద్రరావు కన్నార్పకుండా మల్లికను చూచాడు ఒక్క క్షణం. ఆతడు చూస్తున్న చూపుకు తట్టుకోలేకపోయింది మల్లిక. కాఫీ కప్పులు రెండు సోఫాల ముందున్న టేబిలుమీద పెట్టి, తానొక కప్పు తీసుకొని మరో సోఫాలో కూర్చుంది.

"చిలకాగోరింకల్లాగే మీ యిద్దర్నీ చూస్తుంటే నాకు కనూయ కల్గుతోందిరా! మీ యిద్దరి కాంబినేషను కూర్చినందుకు మెచ్చుకుంటున్నాను ఆ బ్రహ్మను. వాడు చేసిన సెన్సిబుల్ పనుల్లో ఇది ఒకటి. నాకు గనక బ్రహ్మపదవిస్తే

....హిందూ మహాసముద్రంలో సుందరమైన సువిశాలమైన ఒక దీవిని మీకోసం ప్రత్యేకంగా సృష్టించి అందులో సర్వసౌఖ్యాలతో, సర్వసౌభాగ్యాలతో మిమ్మల్ని తులతూగమని పంపేవాణ్ణి."

"బ్రతికించావురా బాబూ! బంగాళాఖాతంలో అండమాన్ దీవులకు పంపుతాననలేదు" - హరి నవ్వుతూ అన్నాడు.

మల్లిక పగలబడినవ్వింది. పొరబోయి త్రిప్పుకునేసరికి రెండు నిమిషాలు పట్టింది. హరి ఆత్రుతను ప్రకటించాడు. పూర్ణచంద్రరావు తెల్లబోయాడు.

"నవ్వంటే నాకు చాలా యిష్టం. నవ్వుతూ పూలజల్లులు వర్షించినట్లుగా పూలతెప్పల్లో పయనించునట్లుగా జీవించే యువతీయువకులు కనపడితే వాళ్ళకు నా సర్వస్వం ధారపోస్తాను. ఈ నేలమీద కాఫీ త్రాగుతూ బ్రతికిన నాలుగునాళ్లూ నవ్వుతూ గడిపెయ్యాలి. మల్లికగారు మనోజ్ఞంగా ఈ విషయాన్ని వ్యాఖ్యానించారు. నా కొకర్ని నవ్వించాలన్నా, ఒకరితో కలిసి నవ్వాలన్నా ఎంతో సరదా!" అన్నాడు పూర్ణచంద్రరావు.

"మల్లికా! వీణ్ణింకా నీకు పరిచయం చేయలేదు. వీడి పేరిదివరలో పూర్ణం. ఇప్పుడు చంద్రం. చివరకు మిగిలేది రావు. త్రికాలాలను మేళవించినట్లు వీడి పేరును జోడిస్తే పూర్ణచంద్రరావు. వీడి భాషలో సోల్‌పోర్స్ అంటే కాఫీ. కప్పు కాఫీ యిస్తే కాశీదాకా నడవగల్గుతాడు వీడు. వరంగల్ కాలేజీలో మేమంతా కలిసి యింటరు చదివేటప్పుడు వీడితో రోజులు ఘడియల్లా గడిచిపోయేవి. వీడు మెదడు నాలుకచివర ఉన్నట్లు మాట్లాడుతాడు. వీడికి కీ యిచ్చి వదలిపెట్టేవాళ్ళం; అలారంలా వాగేవాడు. మాకు కడుపుబ్బ నవ్వు వచ్చేది; బుర్రలో ఉన్న మత్తంతా పోయేది"-హరి ముసి ముసి నవ్వులతో ముగించాడు.

"అవును. వీరు మాట్లాడుతుంటే కొండవాగు గుట్టలు మిట్టల మీదనుండి గలగలా దూకినట్లనిపిస్తోంది." మల్లిక చమత్కరించింది.

చంద్రం మల్లిక వైపు చూస్తూ ఉపక్రమించాడు: "మీరు వట్టి నటీమణులే అనుకున్నాను. కవయిత్రులు కూడా! మీరు పొయెట్రీ మాట్లాడ కలరు. సహజ భావావేశమే కవిత్వమన్నారు మహాకవులు.... అబ్బ! మీరు చెప్పదలుచుకున్న భావాన్ని ఎంత అలంకారంగా చెప్పారు? ఆ ఉపమానంలో మీ ప్రకృతి సౌందర్య పిపాస, మృదు మధుర భావావిష్కార నైపుణ్యం అపారం, అద్భుతం. నాపై మీరు చూపిన అభిమానానికి నేనేమి కానుకగా ఇచ్చేది? ఆఫ్టాల్ అయాం యే పూర్ క్రీచర్."

మల్లిక చంద్రం మాటలకు కొంచెం కలవరపడింది. హరి పెద్దగా నవ్వాడు. "మల్లికా! నీవన్నట్లు వీడు సెలయేటిధార కాడు. ఒక పెద్ద సముద్ర తరంగం. సముద్రపుటల మన వద్ద కుబ్బెత్తుగా వస్తే దానితోపాటు మనం కూడా కొంచెం ఎగిరామా మనల్ని ఊయలలాగా ఊపించి మరల నేలమీద దించి పోతుంది, వితర్కిస్తూ నిలబడిపోయామా-తనతోపాటు ఒడ్డుదాకా త్రోసుకుంటూ పోతుంది."

"ఒరేయ్ బ్రదర్! మనిషిని అర్థం చేసుకోవటానికి మనం ఎదుటివారికి ఛాన్సివ్వాలి. మధ్య మనం వాళ్ళ కళ్ళకు రంగద్దాలు తగిలించక కూడదు."

"నేనద్దాలు తగిలించటం లేదు. వాటిని శుభ్రం చేస్తున్నాను" - హరి.

ముగ్గురూ కాఫీ త్రాగటం ముగించారు. కప్పులు తీసుకొని మల్లిక యింట్లోకి వెళ్ళింది. పోతున్న మల్లికను ఓరగంట చూస్తూనే ఉన్నాడు చంద్రం. సోఫాలో మనిషి ముందు వెనుకలకు ఊగిపోయాడు. "నీ పెళ్ళైనట్లు నాకు తెలియపరచ లేదేంట్రా హరీ?" అన్నాడు.

"నాకైందని ఎవరు చెప్పారు?" - హరి.

చంద్రం తెల్లబోయాడు. "ఓ.... అయామ్ సారీ!"

"ఎందుకు?"

"నీ పరసనల్ విషయా లడిగి శ్రమ కలిగించినందుకు."

"ఇందులో ఏమీ రహస్యం లేదు."

"అది కనపడుతూనే ఉంది."

"ఏమిటి?"

"మీరిరువురూ.... ఇరువురే అని."

"ఏడిశావ్. చెప్తా విను. మల్లిక ఒక అనాథ. నా ప్రాపు చేరింది. ఆమెకు జీవితంలో కాలూని నించుండే శక్తిని సంపాదించి పెట్టటమే నా వంతు. అదే నా ప్రయత్నం."

"ఎక్స్‌లెంట్. నీకిటువంటి ఆదర్శాలూ, ఆశ్రిత పోషణ దీక్షలూ కొత్తవి కావని నాకు తెలుసు. అది మీ వంశపారంపర్యంగా వస్తున్న ట్రాడిషన్. నే నప్పుడే అనుకున్నాను - మీ యిద్దరి వైఖరి చూచి - ఇది అటువంటి కేసేనని.... ఏమైనా యింత అందమైన పిల్ల నీవు చేసిన ఉపకారాన్ని మన్నించి నిన్నే ఆశ్ర

యించుకొని ఉందంటే నిజంగా మెచ్చుకోతగ్గ విషయం. ఈ రోజుల్లో ఇటు వంటి మనిషి అరుదు."

''సరేగాని, ఏమైనా ఉద్యోగమేదుస్తున్నావా? ఇంకా మీ అమ్మగారిని తిప్పలు పెడుతూనే ఉన్నావా?"

"నాకుగా నాకు ఉద్యోగం చేయాలని యింతవరకూ లేదు. మా నాన్నగారు పేరు మోసిన మహా నటుడు. ఆయన కడుపున పుట్టినందుకు ఆయన ఆత్మకు శాంతి కలిగేటట్లు రంగం మీద బ్రతుకుదామని కోర్కె. రంగాన్ని నమ్ముకుంటే కడుపులో రంగనికి నైవేద్యం కరువైంది. కాఫీనీళ్ళతోనే కాలక్షేపం. 'తండ్రి నాటకాల మీద యిల్లు గుల్లచేసింది చాలక, కొడుకువు నీవు కూడా మొదలెట్టితే ఎల్లాగురా? ఏదో ఉద్యోగం చేయరాదా?' అని అమ్మ ఒకటే గొడవ. నా సర్టిఫికెట్లు చూచి నాకు ఉద్యోగం ఇచ్చే నాథుడు దొరకలే దీవిశాల విశ్వంలో."

"మీ అమ్మగారికి అప్పుడు క్షయ అనుకున్నారు - తగ్గిందా?"

"ఏదో మందులు తింటోంది. పథ్యానికి పచ్చనోట్ల కట్టలు కావాలి. ఈ బీదపీనుగు ఎక్కణ్ణుంచి తేగలడు? ఉన్నపాటికి అమ్మకోవటం, ఉన్నపూట తినటం, లేనిపూట గాలి మేయటం." చంద్రం మాటల వైఖరిలో ఏమీ మార్పు లేదు. ఏ వికారమూ లేదు.అతని మాటలు వింటున్న హరికి కన్నులు చెమ్మగిల్లాయి. "నీకు ఉద్యోగ మిప్పిస్తే చేయటానికి సిద్ధమేనా?" హరి అడిగాడు.

"ఈసారి తప్పేటట్లులేదు."

"అయితే, నేను ప్రయత్నం చేసి, నీకొక నెలరోజుల్లో ఉత్తరం వ్రాస్తాను."

"ఆ మాత్రం గడువుంది కదా! కొంపతీసి యిప్పుడే ఎక్కడన్నా ఖాళీ వుందని చూపిస్తావేమో ననుకున్నాను. కానీ, మిమ్మల్నీ, మీ పరిషత్తునూ చూచిం తర్వాత నేనూ ఇక్కడే ఉండిపోవాలని అనిపిస్తోంది. మీ పరిషత్తులో నేను చేర వచ్చునా?"

"ఓ - తప్పకుండా. దేశంలో ఉన్న యువ కళాకారులందరూ మా పరిషత్తుకు గుర్తింపబడని సభ్యులే."

"అనామకులు అరువందలమందికన్న, మల్లికవంటి 'మణిపూస' ఒక్కటి చాలు - పరిషత్తు పేరు నిలపటానికి."

"ఒక్కరితో సంస్థ ఎప్పటికీ తెల్లవారదు. ప్రజాశక్తి ప్రతి ఉద్యమానికి ప్రాతిపదిక."

చంద్రం ఆ మాట వినిపించుకోలేదు. "ఒరేయ్ బ్రదర్! ఒక చిన్న రిక్వెస్ట్!" అన్నాడు.

"ఏమిటి?" హరి ప్రశ్నించాడు.

"నేను తెచ్చుకున్న నాల్గు రాళ్ళూ మీ నాటకాని కంకితం చేశాను. మీ నాటకంకోసమే వచ్చా నిక్కడికి. ఇంటికి ఇవ్వేళే అర్జంటుగా పోవాలి."

హరి వెంటనే లేచి కోటు జేబులోనుండి పదిహేను రూపాయలు తెచ్చి ఇచ్చాడు. చంద్రం నిర్వికారంగా ఆ డబ్బు లాల్చీజేబులో తురుముకున్నాడు.

"ఎనిమిది గంటలకు రైలుంది. ఏమనుకోకు బ్రదర్, వెళ్ళొస్తాను. నీవన్న మాటలు మర్చిపోకు. ఉత్తరం రాయాలిసిన బాధ్యత నీది, ఉద్యోగంచేసే పూచీ నాది" అంటూనే వాకిలి గడపలు దిగాడు చంద్రం. చటుక్కున ఆగి, వెనక్కు తిరిగి అన్నాడు: "ఒరేయ్ హరీ! మల్లికకు నా కృతజ్ఞతలు చెప్పు. నీవన్నట్లు నాకు సోల్‌ఫోర్సును ప్రసాదించింది ఈ శుభోదయాన."

హరి నవ్వుతూ వాకిట్లో నిలవబడ్డాడు. చంద్రం అంగలు వేసుకుంటూ అంతర్ధానమయ్యాడు. వెనుకనుండి మల్లిక వచ్చి అడిగింది: "అప్పుడే వెళ్ళిపోయారా ఆయన?"

"వచ్చిన పని అయింది" - హరి.

"ఎందుకు వచ్చారు?"

"సోల్‌ఫోర్సు నెట్టుకవచ్చింది."

"ఆయన వట్టి భోలామనిషిలాగా ఉన్నాడండీ!"

"అవును పాపం! అందుకనే రాత్రి తాను కొన్న 15 రూ. టిక్కెట్టు ఖరీదు ఇప్పుడు నా దగ్గర వసూలు చేశాడు."

"మొన్నటికే అయిపోయాయన్నారుగా పై తరగతి టిక్కెట్లు?"

హరి నవ్వాడు. "చంద్రం మాట నమ్మావా? .... వాడు కొన్నది అసలు 5 రూ. టిక్కెట్టు. పైన్న వాడికి రానూ పోనూ ఖర్చుల్లు 10 రూపాయలు."

"ఆయన సామాన్యుడు కాదట్టుందే."

"నాటకమాడింది మనంకాదు, వాడు. డబుల్‌డిక్కెట్ కొన్నది మనం."

"అయితే తెలిసి తెలిసి మీ రెండు కిచ్చా రాయనకు డబ్బు?"

"ఎరను వేసి చేపను పట్టటానికి."

"అంటే?"

"కన్యాశుల్కం నాటకం రంగ మెక్కే కాలం సమీపిస్తోంటి."

"దానికి దీనికి సంబంధ మేంటి?....మీరేమైనా కల కంటున్నారా?"

"లేదు. ఇవ్వేళ ఉదయం గిరీశం తలుపుతట్టి నన్ను లేపాడు."

"మళ్లా మీరు సూత్రధారు లౌతున్నారా?"

"అంతకన్న నేనేం కాగలను?"

## 25

మల్లిక మధుమంజరికి బయలుదేరుతోంది. గులాబీరంగు సిల్కుచీర కట్టుకుంది. తెల్లని నైలాను రెవిక తొడిగి, మెడలో సన్నని రాళ్ల నెక్లెస్, కుడి చేతికి రిస్ట్‌వాచ్ పెట్టుకొని, వాలుజడమీద మల్లెలూ మరువమూ కూర్చిన దండ-నీలాంబుదంమీది చంద్రవంకలాగా అలంకరించుకొని హాండ్‌బాగ్ తీసుకొని సిద్ధమైంది మల్లిక. ఇంతలో హేమ గుమ్మంలో కనబడటం మల్లికకు ఆశ్చర్యం వేసింది, ఆత్రంతో తడబడుతూ చేతిసంచీ టేబిల్ మీద పడేసింది.

"రా అక్కయ్యా! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు...." అని సోఫా చూపించింది కూర్చోమన్నట్లు. హేమ సోఫాలో కూర్చుంది, చేతిలో ఉన్న పుస్తకాలు టేబిలు మీద పెడుతూ.

"కాలేజి నుండి సరాసరి వస్తున్నట్లున్నది" - మల్లిక.

"అవును. ఇక యింటికిపోయి పడితే మళ్లా బయటకు రావటానికి ఓపిక ఉండదు.... చదవాలిసింది కూడా ఎంతో ఉంటుంది రోజూ!"

"కాదు మరీ? డాక్టరీ చదువాయె. ఈరోజు మీరు పడుతున్న శ్రమ రేపు ప్రతి రోగికీ ప్రాణదానం చేస్తుంది. అప్పుడు మీరు మీ శ్రమనంతా మర్చిపోతారు. ఒకర్ని సంతోష పెడతారు."

"అలా నిస్వార్థంగా సంతోషంగా లోకానికి సేవ చేయకల్గటం అందరికీ కుదురదు. అది వారివారి అదృష్టాలమీదా అవకాశాలమీదా ఆధారపడి ఉంటుంది"

"మా అక్కయ్య లేడీ డాక్టరని సగర్వంగా చెప్పుకొనే రోజుకోసం ఎదురుచూస్తున్నాను" అని కూల్‌డ్రింకు కలిపి హేమ చేతి కందించింది. హేమ నిర్వికారంగా తీసుకొని తాగుతూ మాటలు సాగించింది.

"బావ ఎప్పుడు వస్తాడు కాలేజీ నుంచి?" - హేమ.

"వారే నన్ను సాయంకాలం మధుమంజరికి రమ్మన్నారు. వారు లెక్చరర్ అయింతర్వాత నీవు చూడలేదు కదూ?"

"మొన్న దుష్యంతుడుగా చూచాను."

"మీరు నాటకానికి వచ్చారా?"

"నే నొక్కతెనే వచ్చాను. కాని, చివరిదాకా ఉండలేకపోయాను. మూడో అంకం కాగానే వెళ్ళిపోయాను."

"వారు ఆరవ అంకంనుండి అద్భుతంగా నటించారు."

"బావ ఒంటరిగాకన్న జంటగానే బాగా రాణించాడు. రెండో అంకం లోనూ, మూడో అంకంలోనూ ఆ భేదం నాకు బాగా తెలిసింది నీవు నటివి. నీవు బావతో కలిసి నటించినప్పుడు ఆయనను నటుడిగా చూడలేకపోయి ఉంటావు."

"అక్కా! వారితో కలిసి అభినయించటం నా జన్మలో ఒక గొప్ప అవ కాశం. అది మళ్ళా వస్తుందో రాదో కాని నీ వన్నట్లు నేను వారిని నటునిగా గాని, నన్ను నటిగా గాని గుర్తించలేకపోయాను కొన్ని క్షణాలు."

"అందువల్లనే మీ పాత్రలు రక్తికట్టాయి. మీరిద్దరూ రంగంమీద ఉన్నట్లు జంటగా కలకాలం ఉండాలని నేను ఆశిస్తున్నాను. బావతో కలిసి అభినయించే భాగ్యం నీకు దొరికినందుకు నిన్నభినందిస్తున్నాను." హేమ ముఖం ఎర్ర పడింది.

మల్లిక మొగమంతా చెమటలు పట్టాయి. "అక్కా! నీవేదో విచిత్రంగా మాట్లాడుతున్నావు. నీ వెందు కిలా మాట్లాడుతున్నావో తెలియటంలేదు. నీ మాటల వెనుక ఏదో ఆవేదన వినిపిస్తోంది. నన్ను పరీక్ష చేస్తున్నావా అక్కా?" అని భిక్క ముఖంతో అడిగింది.

"ఈ మాటలు నేనొక్కదాన్నే అంటున్నవి కావు. లోకమంతా కలిసి అంటున్నది. ఆ మాట నీతో చెప్పి, నిన్నభినందించి పోదా మని వచ్చాను.

లోకం మిమ్మల్ని చూచి ఏదో అనుకుంటుందని భయపడే రోజులుకూడా దాటా యనుకుంటాను."

"లోకం అంటున్నదని నాతో చెప్పటానికి వచ్చావా అక్కా?"

"అవును."

"నీవూ అదే అంటున్నావా?"

"నేను లోకాతీతురాలను కాను."

"కాని, అక్కా! నీవు నీ మాటలు లోకం మీద పెట్టి అంటున్నావు."

"నీవు ఈ తర్కంతో సాధించే దేమిటి?"

"నీవు ఈ లోక సందేశాన్ని నా కందించి సాధించే దేమిటి?" ఎదురు ప్రశ్నించింది మల్లిక.

హేమకు చుర్రు మన్నది. "నీలో ఉన్న ఇంద్రజాల శక్తిని మెచ్చుకోవ డమే నేను సాధించింది. లోకాన్ని మోహపరచి నీవైపు ఆకర్షింపగల్గే శక్తి నీలో ఉందని మొదట కనిపెట్టగలిగింది బావ. నీకాశక్తి ఉందని నిరూపించు కొనగలిగింది నీవు. మీరిద్దరూ రంగ మెక్కారు. ఆ రంగాన్ని జీవితరంగంగా చిత్రింపగల్గారు."

మల్లికకు రోషం, దుఃఖం పొంగివచ్చాయి. "అక్కా! నేనూ నీలాంటి ఆడదాన్నే. నాలో ఏదో స్త్రీశక్తి ఉండటం లోకానికి కష్టంగా ఉంది కాబోలు. దానినే పదే పదే ఆడిపోసుకుంటూ నే నేదో అపరాధం చేసినట్లు చూస్తోంది. పల్లెటూరిపిల్ల పట్నాని కెక్కటం తప్పు. చీకటి బ్రతుకులో ఒక దీపం వెలిగించు కోవటం తప్పు. చిత్తశుద్ధితో రంగమెక్కటం తప్పు, ఆదరించి అభిమానించిన ఒక పురుషుని ఇంట్లో ఉండటం తప్పు.... అంతేకాదు.... ఒక ఆడది నలుగురిలో పేరు తెచ్చుకోవటం తప్పు.... దేవు డిచ్చిన అందంతో బ్రతకటమే ఒక తప్పు. అంతేనా అక్కా, ఈ లోకం అనుకుంటోంది?" ఆవేశంతో ఊగిపోతూ హేమ ముఖంలోకి సూటిగా చూచి అడిగింది మల్లిక.

"అవన్నీ నీ వ్యాఖ్యానాలు. వాటి కన్నిటికీ లోకానికి సంబంధం లేదు. పైపెచ్చు అవన్నీ ఒక వ్యక్తిని ఆశ్రయించుకొని ఉండే లోకం అభినంధిస్తుంది."

''నీవలె రెండర్థాల మాటలు మాట్లాడటం నాకు చేతకాదు, కాని....లోకం ఆ వ్యక్తిని అభినందిస్తుందన్నావు. దాని అర్థం అవమానిస్తుందనికదూ?"

"ద్వంద్వ ప్రవృత్తులకు లోకం రెండుగా కనపడుతుందంటారు. నిజా నిజాలు నీకే తెలియాలి.''

"ఈ మాటలన్నీ హరిగారి యెదుట అనగలవా?"

"అసలు మీరిద్దరూ ఉంటారనే వచ్చాను. కాని, దురదృష్టవశాత్తూ బావ లేడు. అయితేయేం, నీవుంటే ఇద్దరున్నట్లే" - హేమ లేచి వెళ్ళబోతోంది. మల్లిక నిగ్రహించుకొంటోంది. హేమ సాగిపోతోంది.

"అక్కా! నీవింత శ్రమపడి యీ యింటికి వచ్చి నాకు కనువిప్పుచేసిన నీ ఋణ మెలా తీర్చుకోగలనో తెలియదు....ఈ రోజుతో ఈ లోకానికి ప్రళయం రాదుగా?.... ఎప్పుడో ఒకప్పుడు నేనూ నీ యింటికి వస్తాను.... నా మనసులో మాట ఏమన్నా ఉంటే నీతో చెప్పుకుంటాను.... నాకు లోకంతో పనిలేదు. కాని, ఆ పూరిగుడిసెలో నీవు నా పట్ల చూపిన కనికరం మాత్రం నే నెన్నడూ మరువ లేను.... నీవూ మరిచిపోవద్దు.... ఇదే నా ప్రార్థన!"

వెనుకనుండి వినపడుతున్న మల్లిక మాటలు వెనుదిరగకుండానే విన్నది హేమ ఒక్క క్షణం ఆగి. మరుక్షణంలో శరవేగంతో నిష్క్రమించింది.

## 26

సాయంకాలం అయిదు గంటలకల్లా వస్తానన్న హరి రాలేదు, మల్లిక రాలేదు. మధుమంజరిలో మాలతీమధులు వారిద్దరి కోసం ఎదురుచూస్తున్నారు. శాకుంతల నాటకం కారణంగా పేరుకొనిపోయిన పని పూర్తి చేయాలిసిన భారం మరొకవైపు వారిద్దరికీ విశ్రాంతి నివ్వటంలేదు. మధు డిక్టేట్ చేస్తున్నాడు. మాలతి టైపు చేస్తున్నది. పని చురుకుగా సాగుతోంది. ఒక స్టేట్‌మెంటు టైపయింది. ఒక బిజినెస్ లెటరు మెషిన్‌మీద కెక్కిస్తోంది మాలతి.

"లేడీ టైపిస్టు ఆఫీసులో ఉంటే పని చురుకుగా సాగుతుంది" - మధు ఛలోక్తి విసిరాడు.

"ఒక్కొక్కసారి దానికి విపరీతం కూడా కావచ్చు" - మాలతి నవ్వుతూ అన్నది.

"అందులో నీవేం పాత్ర తీసుకుంటావు?-మరి నీ యాత్రకూ, నాటకానికీ తూగటం ఎలా?'' - మధు.

"నే నీనాటకంలో పాత్రధారిగా ఉండలేనేమో!" - హరి.

"ఈ పిచ్చివేషాలు కుదరవు. నీవు లేకపోతే నేను లేను. నేను లేకపోతే మాలతి కూడా లేదు."

"మాలతిమీద నీకెక్కడిది అంత అధికారం?"

"అధికారం కాదది విశ్వాసం....నీ వడుగు మాలతిని."

"ఎందుకు? నాకు నీమీద విశ్వాసం లేకపోతేగా?"

"ఇంతకూ నీ మాట ఏమిటి?"

"నన్ను చెప్పమంటారా?" మాలతి ఉత్సాహంగా మాట అందుకున్నది.

"ఊఁ!" అని నవ్వాడు.

"సౌజన్యారావు.... చివరి అంకంలో వస్తాడు. అంతదాకా ముందు అంకాలు రిహార్సలౌతుంటాయి. ఇంతలో అన్నయ్య రానే వస్తాడు."

"మంచి సలహా! బాగుంది.... నీవేమంటావు?" మధు హరి నడిగాడు.

"పాత్రధారుల నిర్ణయాధికారం మీయిద్దరి కిస్తున్నాను."

"బాబోయ్! ఇదొకటా? బాబూ, నీ ముక్కుకు చీమిడి ఉందంటే - ఆ బంగారు చేత్తోనే తీసిపొమ్మన్నట్లుంది."

"నా పరోక్షంలో నీవు సూత్రధారుడి వౌతావు- అంతే!" అని హరి లేచి వెళ్ళబోతూ ''మాలతి డ్యూటీ అయిపోతే నాతో పంపించు, ఇంటికి పోతున్నాను" అని అడిగాడు.

"ఇంకా కొన్ని పేపర్లున్నాయి ఇవ్వేళ టైపు చేయటానికి."

"మొత్తానికి యజమాని జులుమ్ చూపిస్తున్నావు" అని నవ్వుకుంటూ హరి వెళ్ళిపోయాడు. మధు, మాలతి ఒక్కక్షణం నిశ్శబ్దంగానే ఉండిపోయారు.

"అన్నయ్య లేకపోతే నాటకం నిర్వహించటం కొంచెం కష్టమే. మీమీద పెద్ద భారం పెట్టారు."

"నా చేతికి వచ్చిన మర్నాడు నీ మీదికి తోసేస్తాను, నా బరువు తీరుతుంది."

"అయితే, నాకిక్కడ ఉద్యోగం ఊడుతుందన్నమాట!"

"నీతో నాకేర్పడిన ఈ పరిచయం అంత తేలిగ్గా ఊడిపోయేది కాదు." కళ్ళల్లో వింతకాంతులు వెదజల్లుతూ మధు అన్నాడు.

మాలతి కొంచెం కలవరపడి "ఏమన్నారు?" అని ప్రశ్నించింది.

"నా మాట నీకు కష్టం కలిగిస్తే క్షమించు.... ఇది నీకెన్నాళ్ళబట్టో చెప్పాలని అనుకుంటున్న మాట. నీవు పరిషత్తు సభలో పాట కచ్చేరి చేసిననాటి నుండి నా గుండెల్లో దాచుకున్న మాట!. ఎన్నో ఊహలతో, ఎన్నో ఆశలతో నీ ముందు ఉంచిన మాట! ఎలా చెప్పాలా అని ఎన్నోసార్లు సతమతపడ్డాను. కాని ఇవ్వేళ ఎందుకో నా మనస్సు బైటపడింది." మధు తలవంచుకొని టేబులు మీద పేపరు వైట్‌ను గుండ్రంగా తిప్పుతూ గతస్మృతులను నెమరువేసుకుంటు న్నట్లు గుటకలు మింగుతూ అన్నాడు.

మాలతిగుండె గబగబా కొట్టుకోసాగింది. అత డన్నమాట ఆమెకు నిజంగా బాధ కల్గించలేదు. కాగా లోలోన గుప్తంగా పైకిలేవకుండా అణపబడిన ఏదో ఆశారేఖను ఆర్ద్రంగా తాకుతోంది ఆ మాట! తన సమాధానం కొరకు ఉత్కంఠతో ప్రతీక్షిస్తున్న మధును మనసారా చూచింది. ఏవో మాటలు అహ మికతో ముందుకు వస్తాయి, కంఠంలో ఆగిపోతాయి. అరికాళ్ళు, అరిచేతులు చెమర్చాయి. కపోలాలు గగుర్పాటు చెందాయి. చివరి కెలాగో మాటలు పెళ్ల గించింది.

"యజమాని యిచ్చిన ఉద్యోగంలో తమను ఖాయం చేయాలని ఆశ పడుతూ ఉంటారు ఉద్యోగులు. అనుకూలుడైన యజమానికన్న ఉద్యోగి జీవితా నికి మరేంకావాలి?" మాలతి ముఖంమీద వేయి సిగ్గుమొగ్గలు పొటమరించాయి.

మధు చెంగున సీటులో ఒక కుదుపు తీసుకున్నాడు. అతని రక్తనాళాలు అనంత చైతన్యంతో ఉక్కిరిబిక్కిరైపోయాయి. అతని వక్షం ఉబ్బెత్తుగా లేచింది. కన్నులు చెమ్మగిల్లాయి.... టేబిల్‌మీద టైపు చేయాలిసిన కాగితా లన్నిటినీ ఫైళ్లలోకి నెట్టి వాటిని అల్మేరాలో పారేశాడు.

"తరువాతి ఫైలివ్వండి, టైపు చేస్తాను." కన్నులార్పుతూ బిడియంగా అన్నది మాలతి. "రేపటి నుండి కొత్త ఫైలు తెరుస్తున్నాను. ఇక పాతవి టైపు చెయ్యాలిసిన పనిలేదు." మధు ముసిముసి నవ్వులుపోతూ సమాధానం చెప్పాడు,

వర్క్‌షాపు మూయటానికి ఎలెక్ట్రిక్ బెల్ ప్రోగింది. ఇద్దరూ అప్రయత్నంగా ఒకరి నొకరు చూచుకొన్నారు. కన్నులు మాట్లాడుకున్నవి. మరు క్షణంలో ఇద్దరూ సంతృప్తిగా నవ్వుకున్నారు.

## 27

హైదరాబాదులో వాతావరణం చాల విచిత్రంగా వేషాలు మారుస్తూ ఉంటుంది. ఫిబ్రవరి మాసాంతానికే ఎండలు మండిపోతుంటాయి పగటివేళ. సాయంసమయానికి చలిగాలులు వీచి దుప్పట్లు కప్పిస్తాయి. ఒక్కొక రోజు హేమంతం చండవిహారం చేస్తోందా అన్న భ్రాంతి కల్పిస్తుంది. కొన్నిరోజులు మంద శీతలపవనాలు సమస్త నగర ప్రజానీకానికీ మలయాద్రి నికటాన్ని జ్ఞప్తికి తెస్తుంటాయి. చంచలసుందరమైన నగర వాతావరణంలో అనుక్షణ పరిణామ పరిశీలన కౌశల్యంతో నగరప్రజ అనవరతం తన అంతరాత్మను జాగృత పరచుకొంటూ ఉంటుంది. ఆ రోజు హరి మధుమంజరి నుండి బయలుదేరేసరికే రాత్రి 8 గం॥లు దాటింది. చలిగాలి చర్మాన్ని చీల్చేటట్లు కసరుగా వీస్తోంది. వినీల విశాలాకాశం కాలాంబరాన్ని లోకంమీద కప్పి, దాని నీడలో దారి వెదుక్కొంటూ నడిచే బ్రతుకు బాటసారులను వేయికళ్ళతో వెదకిచూచి వెక్కిరిస్తోంది.

హరికి శాకుంతల నాటకం ముగిసినప్పటినుండి మనస్సుకు శాంతి లేదు. శారీరకంగా అతని ఆరోగ్యాని కేమీ లోపం లేదు. నిత్యవ్యవహారానికి ఎట్టి అవరోధం లేదు. అంతవరకు అతడు లక్షించని ఏదో వికారం అతని హృదయాన్ని సుడిగుండంలో పడవేసి తిప్పుతోంది. ఏదో అననుభూత అవ్యక్తజీవితానుభూతి కొరకు శరీరం తప్తమౌతోంది. గాఢమైన స్వీయ భావసమాధి బంధాలను ఇంద్రియసంఘాతం విఘాతం చేయాలని బుసకొట్టుతోంది చలిగాలిలా. అతని గుండెల్లో వెచ్చని మంట; నెత్తురులో ఏదో విద్యుచ్ఛక్తి; భావనలో ఏదో కాంతి; బ్రతుకులో ఏదో అసంతృప్తి; ఊహలలో ఏదో అన్వేషణ; భవిష్యత్తులో ఏదో ఆశ; ఆ ఆశాస్వరూపం దర్శించాలని ఆవేదన; ఆ ఆవేదన కర్థం తెలియక మనోవేదన. హరి మధుమంజరి నుండి సరాసరి ఇంటికి నడిచి వచ్చాడు.

ఇంటి తలుపు దగ్గరవేసి ఉంది. తీయటానికి బిడియం వేసింది. తనలో తాను మూగనవ్వు నవ్వుకున్నాడు. మామూలుగా తలుపు తీశాడు. హాలంతా ఖాళీగా ఉంది. ఒక నిమిషం అక్కడే నిలువబడ్డాడు. తరువాత తన గదిలోకి పోయి బూట్లు విప్పాడు. కోటు విప్పి స్టాండుకు వేశాడు. నెక్‌టై సడలించి

వంకెకు వేశాడు. స్లిప్పర్సు వేసికొని బాత్‌రూంలోకి వెళ్ళి ముఖం కడుక్కున్నాడు. తన గదిలోకి వెళ్ళి టాయిలెట్ చేసికొన్నాడు.

ఇల్లంతా నిశ్శబ్దం. మల్లిక ఏది? తలుపు దగ్గరకు వేసి ఎక్కడికీ పోదు. ఇంట్లో అలికిడి లేదు. ఆమె గది తలుపు దగ్గరవేసి ఉంది. నిన్న ఉదయం వేసి ఉన్నట్లే....కాదు... రోజూ వేసి ఉన్నట్లే. మల్లిక ఏకాంతానికి అది చిహ్నం కాబోలు? గుండె గతుక్కు మన్నది. పది నిమిషాలు తన శ్వాస నిశ్వాసలు తానే వింటూ కూర్చున్నాడు.

''ఎంత సేపీ ప్రళయ నిశ్శబ్దం? మల్లికను కేక వేస్తాను" అనుకుంటూ లేచి హాల్లోకి వచ్చాడు. తలుపు తెరవటానికి చేతులు రాలేదు. ''మల్లికా!" అని పిలిచాడు. హాలు నాల్గుగోడలూ నిశ్వసించినట్లైంది. అతని హృదయం స్తంభించినంత సమాహితం చెందింది. ఆ గదిలో అలికిడి....దీర్ఘ నిశ్వాసలు.... కావు....ఉసురుసులు కావు....వెక్కి వెక్కి ఏడ్పులు....ఎవరు? మల్లిక! ఇంకెవరుంటారు? హరిలో ఉద్వేగం ఉరుకులెత్తింది. తలుపు తెరిచాడు. ఉలిక్కిపడి, తేరుకున్నాడు. నిండు ముసుగులో ప్రక్క లదిరేటట్లు వెక్కి వెక్కి యేడుస్తున్న మల్లిక! హరికి కాళ్ళక్రింది భూమి గిర్రున తిరిగింది.

మల్లిక తలగడవైపు పోయి కూర్చున్నాడు హరి. వణుకుతున్న తన హస్తాన్ని ఆమె భుజంమీద ఉంచి ''ఏం జరిగింది మల్లికా, ఇలా కుమిల పోతున్నావు?" ఆర్ద్రంగా హరి ప్రశ్నించాడు.

మల్లిక పొంగివస్తున్న దుఃఖాన్ని వెల్రగక్కింది సమాధానంగా. హరికి భయం వేసింది.

''కంటతడి పెట్టకుండా నిన్ను కాపాడా లనుకున్నాను. నా యత్నాలన్నీ భగ్నమైనాయి యీనాడు. అగ్ని గోళాలను దాచగలిగిన నీ హృదయం ఈ రోజిలా వికలమైం దంటే ఏదో ప్రళయమే జరిగి ఉండాలి .... చెప్పు.... నా కోసం చెప్పు మల్లికా!" ముఖంమీద ముసుగు తొలగిస్తూ ఆవేదన కొలిమిలా కంఠం నుండి ఊదినట్లు అడిగాడు. ముచ్చెమటలు ముఖాన్ని ముద్ద చేస్తున్నవి హరికి.

సెలయేరుల్లాగా స్రవిస్తున్న కన్నీటిధారలు ముద్రించుకొన్న ఆమె కన్నుగవ సంధ్యా సమయంలోని అరుణ పద్మాలు లాగా వాడిపోయి ఉన్నాయి. పొగ

మబ్బులు చుట్టవేసిన చంద్రబింబంలాగా మోము కళాహీనంగా ఉంది. ఆమె భారంగా కనురెప్పలెత్తి అతని కన్నుల్లోకి చూచింది. కదలుతున్న అతని చూపులు ఆమె ముఖాన్ని ముప్పిరికొంటున్నాయి. దీపపు కాంతిలో తళతళ మెరిసే అతని ముఖంమీది స్వేదకణాలు తనమీద జాలిగా వేయి ప్రశ్నలు వేస్తున్నవి. అతని చూపుకు ఆమె ఉక్కిరిబిక్కిరి అయింది. ఒక్కసారిగా లేచి నడిమంచంమీద పెడకాళ్ళువేసికొని ఒక చేతిమీద ఓరగా కూర్చుండి దీర్ఘ నిశ్వాసలు విడుస్తోంది - ఉబ్బెత్తుగా లేచిపడే సముద్ర తరంగంలా.

"ఇన్నాళ్ళు ప్రశాంతంగా బ్రతుకగల్గిన నీకు ఈ అశాంతేమిటి మల్లికా?" ఉత్కంఠతో హరి ప్రశ్న.

మల్లిక గాలిలోని దీపంలా కదలిపోయింది. "మల్లవ్వగా సమసిపోయే నన్ను మల్లికగా పెంచి పోషించి పొరపాటు చేశారు."

"ఆదరణమే అపరాధమైందా?"

''ఒక స్త్రీని ఒక పురుషుడు ఆదరించటం ఈ లోకం దృష్టిలో అపరాధమే."

''లోకవాక్యమా నీవంటున్నది?"

''నేనే కాదు- అందరూ లోకమనే కవచాన్ని తొడుక్కొని యితరులమీద వాడిసి రాళ్ళు విసిరేస్తున్నారు."

''అని తెలిసి నీకి విచారం దేనికి?"

''అది అంతటితో ఆగిపోలేదు. ఆ స్త్రీని చూచి లోకం ఓర్వలేకపోతోంది."

''ఇందులో నీవు చేసిన అపచారమేముంది?"

''ఆడదానైన్ని పుట్టటమే."

''నీ వేదో మనసులో బాధపడుతున్నావు. ఎవ రెలా పోయినా లోకం పట్టించుకోదు. రథచక్రంలా తాను కదలిపోతుంది."

''మీరు నా కళ్ళు కప్పటాని కలా అంటున్నారు. నాకు లోకమే ఎదురుపడి నా లోపం నా ముఖాన కొట్టి వెళ్ళింది."

''ఏమి టది?"

''స్త్రీని నేను - పురుషుని ముం దెలా చెప్పేది?"

''నీవీ రోజున క్రొత్తగా మాట్లాడుతున్నావు.''

''ఒక క్రొత్తసత్యం లోకం బోధించింది నా కీనాడు.''

''అదే ఏమి టని అడుగుతున్నాను.''

''సిగ్గుపడుతున్నా.... మీరడుగుతున్నారు కాబట్టి చెపుతున్నాను.''

"నాతో కూడా చెప్పగూడని విషయమైతే నేను బలవంతం పెట్టను. నీ మనసు కష్టపెట్టటం నా కిష్టంలేదు." హరి చివాలున లేచి నించున్నాడు.

మల్లికలో మరో దుఃఖతరంగం పొంగి పొరలిపోయింది. హరి చకితుడై నిలువబడిపోయాడు.

''హేమక్క వచ్చిపోయింది'' - మల్లిక.

''హేమ వచ్చిందా?.... మన యింటికి!.... ఇన్నాళ్ళ తర్వాత కనపడి చెల్లెల్ని ఏమని పల్కరించిందో?"

''నిద్రపోతున్న నన్ను లేపింది."

ఆ మాటకు హరి ఉలిక్కిపడ్డాడు. కాని, తమాయించుకున్నాడు. ''నాటక ప్రదర్శనంవల్ల బడలి ఉన్నావని తెలుసుకోలేకపోయింది కాబోలు!"

''నే నాడిన నాటకమే ఆమె నింతదూరం తెచ్చింది."

''నిన్నభినందించడానికి వచ్చిందా?"

''నా పాత్రలో నాకు తెలియని రహస్యాలు చెప్పిపోవటానికి వచ్చింది."

''నీవు లోకం ముందు అభినయించావు. లోకం భిన్న దృక్పథాలతో విమర్శిస్తుంది. దానిని నీవు సహనంతో స్వీకరించాలి.''

"నేను స్త్రీగా అభినయించటం తప్పైంది.''

"నీవొక్కదానివేనా స్త్రీవి? నీతోపా టెంతమంది స్త్రీ పాత్రధారులు లేరు?"

''వారందరి ముఖాల్లో పొడవని పొద్దు నా మొగాన పొడిచిం దొకటి."

అరనిముసం నిశ్శబ్దం.

''మీరిద్దరూ తగాదా లాడుకొన్నారా?" - హరి.

''తగాదాలాడి మరలా మీ ముఖం చూడగలనా?" - మల్లిక.

"త్వరగా చెప్పు మల్లికా! హేమ యేమి అఘాయిత్యం చేసింది?"

అరనిముసం నిశ్శబ్దం. తర్వాత "నేనూ హేమక్కా స్త్రీలమే. మా యిద్దరిలో భేదమేం కనపడుతోంది మీకు?" అని మల్లిక హరిముఖంలోకి చూస్తూ ప్రశ్నించింది. హరి ఉక్కిరి బిక్కిరయ్యాడు కాని తేరుకొని, "మీరిద్దరూ సమానమే" అని ఊరుకున్నాడు.

"మీ యిద్దరిలో ఒకరు నన్ను మోసం చేస్తున్నారన్న మాట!" అని బావురుమన్నది మల్లిక. హరి తల్లడిల్లిపోయాడు. కుదించుకొని కుప్పగా పడుతున్న మల్లికను సమీపించి, తాను మంచం పట్టెమీద కూర్చుని ఆమెను పొదివి పట్టుకొన్నాడు.

"నీ వెందు కిలా అయిపోతున్నావో నాకు తెలియటంలేదు. నీ మనసులోని మాట తెలియంది నేను మాత్రం ఏం చెయ్యగలను చెప్పు? నీకొరకు కిన్నాళ్ళుగా సాగించిన నా ప్రయత్నమంతా ఒక్క క్షణంలో బూడిదలో పోసిన పన్నీరై పోయింది. నీవు విషయాన్ని మోసందాకా తెచ్చావంటే అదేదో విషబీజంలా నాకు కనపడుతోంది. దానికి లేతలోనే విరుగుడు వేయాలి. నీ మనసులో మాట నాతో చెప్పకపోతే నీ మనసుకు నీవే ద్రోహం చేసుకుంటున్నట్లు."

మల్లిక తన మోమాతని భుజంమీద వాల్చింది. అతని ముఖం క్రింద తన ముఖం. వెచ్చని అతని కన్నీరు తన చెక్కిళ్ళను స్పృశిస్తున్నాయి. అతడు కనురెప్ప లప్పళిస్తున్నాడు. ఆమె అరమోడ్పు కన్నులతని ముఖాన్ని పరామర్శిస్తున్నాయి. ఇద్దరి మధ్యా ఒక్క క్షణం అశ్రుకణంలా జాలువారి రాలిపోయింది.

"నన్ను చూస్తే హేమక్క కెందుకంత అసూయ?" నిట్టూర్చినట్లుగా అన్నది మల్లిక.

"ఆమె అనసూయ పాత్రను ఆమోదించలేదుగా?" హరి.

మల్లిక వాడిన మోముమీద ముత్తెపునవ్వు మెరిసింది. హరి నిట్టూర్చాడు.

"మిమ్మల్నొక టడుగుతాను....నిజం చెప్తారా?"

"నీతో ఎప్పుడైనా అబద్ధమాడానా?"

"నేను మిమ్మల్ని ఆకర్షిస్తున్నానన్నది హేమక్క....నిజమేనా?"

హరి కాంతిలేని నవ్వు నవ్వుతూ "మొన్న వేలాది ప్రేక్షకులను ఆకర్షించకల్గావుగా?" చమత్కరించి తేలగొట్టాడు.

"దానికి నా అభినయమేనా కారణం?"

"కాదని ఎవరన్నారు?"

"మీరు నిజంచెపుతానని మాట యిచ్చారు."

"నిజం చెప్పటంలేదా!"

"ఏదో దాస్తున్నారు."

"హేమ హృదయం నాకర్థమయిం దిప్పుడు."

"నేనడిగినదానికి సమాధానం?"

"నీ వొకసారి నవ్వగలిగితే చెప్తాను."

"మీకన్నా మా అక్క నయం. తనంతట తానే వచ్చి, తన హృదయాన్ని చెప్పిపోయింది. మీరు పలుకే బంగారం చేస్తున్నారు."

"ఆమె స్త్రీ. అందువలన ఆమె నీతో ముఖాముఖి చెప్పగలిగింది. నేను పురుషుణ్ణి."

"పురుషుడు స్త్రీని ముఖాముఖి ప్రశ్నించవచ్చునుగాని, స్త్రీ పురుషుణ్ణి అలా అడగరాదన్న మాట?"

"నీలో ఉన్న శక్తి మేల్కొన్నది నిజంగా."

"మీరు కూడా గుర్తించారా?" మల్లిక చెంగునలేచి నేలమీద నిలబడింది.

"ఈ మాటకొరకింత నాటకమా?" హరి నవ్వాడు.

"ఇది మీరు నేర్పిన విద్యే....సరేకాని, ఇక భోజనానికి లేవండి. చాల ప్రొద్దుపోయింది." మల్లిక కన్నులు తుడుచుకుంటూ వంటయింటిలోకి వెళ్ళిపోయింది. ముద్దయైన తన చెక్కిళ్ళను తుడుచుకొని హరి తెల్లబోయాడు.

## 28

మర్నాడు మాలతి కళాశాల గర్ల్స్ రూంలో అడుగుపెట్టేసరికే విద్యార్థినీ బృందంలో కలకలం ప్రారంభమైంది. బింకంగా తానొక కుర్చీలో కూర్చుంది పుస్తకాలు తిరగవేసుకుంటూ. ఇంకా క్లాసులు మొదలుకావటానికి పదినిమిషాల టైముంది. స్నేహితురాండ్రందరూ మాలతి చుట్టూ మూగారు. ముసిముసి నవ్వులతో పరాచకాలు మొదలుపెట్టారు. మాలతి కదంతా విడ్డూరంగా తోచింది. విసుగుదల చూపింది. కానీ, వాళ్ళు మాట్లాడటం ఆపలేదు.

"అనసూయాప్రియంవదల వృత్తాంతాన్ని నాలుగో అంకంలోనే ఆపివేసి, ఆ పాత్రలకు కాళిదా సన్యాయం చేశాడని రవీంద్రనాథ ఠాగూరు ఛాలా బాధపడ్డాడు."

"అవును. కణ్వమహర్షి వాళ్ళనుగూడా ఎవరిచేతుల్లోనో పెట్టాలని వాపో యాడుగా?"

"అసలు వాళ్ళిద్దరికీ పెళ్ళైందంటావా?"

"ఆ సంగతి వాళ్ళనే అడిగి తెలుసుకోవాలి."

"నేనే కాళిదాసునైతే, వారిద్దరూ ఒకే వరుణ్ణి పెళ్ళాడాలని తలచినట్లు వ్రాసేదాన్ని."

"అతణ్ణి ప్రియంవద ముందు ప్రేమిస్తుందా? లేక అనసూయా?"

"ఒకతె ప్రత్యక్షంగా ప్రేమించాలి. మరొకతె పరోక్షంగా ప్రేమించాలి. అప్పుడుకాని కథ రక్తి కట్టదు?"

"ఇంతకెవరే ఆ అదృష్టవంతుడు?"

"కణ్వ శిష్యుల్లో ఒకడైతే బాగుంటుందే."

"తపస్వికే వచ్చాయా తంటాలు?"

"తంటాలెందుకే? అతడూ ఒకర్ని ప్రత్యక్షంగా ప్రేమిస్తాడు. ఒకర్ని పరోక్షంగా ప్రేమిస్తాడు." ఈ ధోరణిలో మాట్లాడుతూ అందరూ గొల్లున నవ్వారు. గణగణా గంట మ్రోగటంతో అందరూ గల్లంతుగా క్లాసులకు పరు గెత్తారు హరిణీకదంబలా. గుమ్మంలో ఎదురుపడ్డ మాధురిని బుగ్గలు పొడిచి కొందరూ, పీపు తట్టి కొందరూ, గిలిగింతలుపెట్టి కొందరూ, "ఎంత నంగనాచో చూడవే!" అని నవ్వుతూ కొందరూ పలకరించిపోయారు.. మాధురి అ ఉప్పెనలో నుండి బైటపడింది. ఎదురుగా రూంలో దిగాలుపడి కూర్చొని ఉంది మాలతి. దగ్గరికి వచ్చి కూర్చుంది.

"అలాగున్నావేం మాలతీ?"

"ఇవ్వేళెందుకో అందరూ నన్నూ నిన్నూ వేళాకోళం చేస్తున్నారు."

"అదేనా ఈ గోలంతా?.... ఏమంటారు?"

"అనసూయా ప్రియంవదలకు పెళ్ళికాలేదని వీళ్లందరికీ విచారం."

"ఇదేంటో ఈ పెళ్ళి పిశాచం ప్రపంచాన్నంతా పట్టి పీడిస్తున్నట్లుంది."

"మాధురీ! ఏమంటున్నావు?"

"అవును. ఇది పెద్దవాళ్ళకే అనుకున్నాను. ఈ కుర్రకారుకుగూడా ఇదే గోలా?"

"పెద్దవాళ్ళెవరు?"

"మా అమ్మ నాకేదో వయసుమించిపోతున్నదని పెళ్ళిచేసి ఆదర్శభారత నారీమణిగా తయారు చేస్తానంటుంది. నిన్న రామచంద్రయ్యగారింటికి పోయి వాళ్లను పెళ్ళి చూపులకు పిలిచివచ్చారట మా అమ్మానాన్నా. వాళ్ళివాళ సాయం కాలం వస్తారట! నన్ను సింగారించి కూర్చోపెడతానంది ఉదయంనుంచే. ఎందు కమ్మా నాకప్పుడే యీ పెళ్ళి - ఈ జంజాటకం? అని ఎన్నిసార్లు చెప్పినా వినదే మా అమ్మ! పట్టుపట్టి కూచుంది పెండ్లి చేయాలని. ఇద్దరం ఘర్షణపడ్డాము. ఇంట్లో ఉండబుద్ధివేయక కాలేజీకి వచ్చేశాను. నే నివ్వాళ కాలేజికి రానని మా అమ్మ యీ సంగతి మోహినికి చెప్పింది. అది యిప్పటికి కాలేజీలో టాంటాం వేసి ఉంటుంది. అందువల్లనే వీళ్ళంతా విరగబడుతున్నా రివ్వేళ."

మాధురి మాటలకు మాలతి కుప్పకూలిపోయింది. రెండు చేతుల్లో ముఖాన్ని దాచుకొని బావురుమని దుఃఖించింది. మాధురి మాలతి హృదయాన్ని గమనించింది. మధుమంజరి ఉద్యోగంలో ఉన్న పరమార్థం కొంత ఊహించింది. ఆ రోజు తన తల్లి తొందరపాటుతనంవల్ల మాలతి భవిష్యత్తుకు తాను అడ్డు పడుతున్నానేమోనని శంకించింది. లేకపోతే మాలతి కన్నీటికి అర్థంలేదు. అయినా, నిజం తేల్చుకుందామని తలచింది. మాలతిని చేతితో తలనిమురుతూ ధైర్యం చెప్పింది. ముఖం కడిగించి హేండ్‌బ్యాగ్‌లోని తిలకం నుదుట దిద్దింది. రిక్షా మాట్లాడి పబ్లిక్‌గార్డెన్‌కు దారితీసింది మాధురి. మాలతి మూగపిల్లలా వెంటపోయింది.

"నీ హృదయం దాచక చెప్తానని మాటయిస్తావా మాలతీ?"

"నేనిప్పు డసహాయ స్థితిలో ఉన్నాను మాధురీ!"

"స్నేహితుల మున్నది ఒకరినొకరు ఆదుకోటానికి కదూ?"

"నిజమే. ఎవరి అదృష్టానికి ఎవరేం చేస్తారు?"

"అదృష్టమని గాలిలో దీపం పెట్టి ఊరుకుంటామా?"

"దైవము కూడా చిన్నచూపు చూస్తూంటే ఏం చేయమంటావు?"

"నీ మాటలు పట్టి చూసే నీ జీవితమార్గంలో నేనడ్డ మొస్తున్నాననో అర్థ మౌతోంది. నిజమేనా?" మాధురి మాలతిని సౌమ్యంగానే అడిగింది. మాలతి అలలు అలలుగా పొంగివచ్చే దుఃఖాన్ని దిగమ్రింగుకొంటోంది.

"నీవు మధును ప్రేమిస్తున్నావా మాలతీ?"

''మధుగారే నన్ను అభిమానించారు. పిలిచి ఉద్యోగమిచ్చారు. వారే నన్నింత దూరం తెచ్చారు."

''మధు తన మనసు నీకు స్పష్టం చేశాడా ఎన్నడైనా?"

''ఎన్నోసార్లు సూచించారు. నిన్న రాత్రి నన్ను వివాహమాడతానని మాట కూడా యిచ్చారు."

''తమాషాగా ఉందే!"

''అదే అర్థం కావటం లేదు."

"అతడు నీకు మాట యిచ్చిన సంగతి యింట్లో చెప్పి ఉండడు."

''దానికి అవకాశం లేకపోలేదు. వారు రాత్రే ఆ నిర్ణయం తీసుకున్నారు."

''రామచంద్రయ్య ఈ పెళ్ళి చూపుల సంగతి కొడుక్కు చెప్పకుండా ఉంటాడా?''

''నా కోసం తనవాళ్ళకు విరోధి అవుతారా?''

''విరోధ మెందుకు? నచ్చచెప్పవచ్చుగా?''

''అది శ్రమతో కూడిన పని.''

''ప్రేమించటానికి ఇంత శ్రమ తీసుకున్న పెద్దమనిషి పెళ్ళికి ఈమాత్రం శ్రమ తీసుకోలేడా?''

''ఏటి కెదురీత ఈదాలి.''

''ఏట్లో దిగి ఈదనంటే మునుగుతాడు.''

''మునిగేది ఆయన కాదు - నేను.''

''అంతగా వస్తే మునిగే అంత పని ఏం జరగలేదు కదా! నీవు ఒడ్డు కెక్కి వెక్కిరించవచ్చు.''

''నీవు చివరకు నాకిచ్చే సలహా ఇదేనా మాధురీ?''

''నీవనుకున్నంత పనైతే అంతకన్న వేరే యేం చేస్తావు?''

''నను నీటిముంచినా పాలముంచినా అంతా నీ చేతుల్లోనే ఉందని నీ

మాలతి గొంతుక కంపించింది.

ఇంతవరకూ నీ వింత తేలికని నేనూహించలేదు

''కొండకొమ్ము మీదనుండి తల క్రిందుగా పడుతున్నాను నేను. నీవు నాతో ఆటలాడుతున్నావు.''

''నేను కాదు, నీ ప్రియుడు మధు - నీ జీవితంతో చెరలాటమాడుతున్నాడు''.

''ఈ ఆటలో నాకు ఓటమి లభిస్తే....'' సగంలోనే ఆగిపోయింది మాలతి.

''నాకు వదలిపెట్టు మధును. పెళ్లాడైనా సరే, ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీరు తాగిస్తాను.''

''అతడు నిన్ను వివాహమాడటం నీ కంగీకారమేనా?'' మాలతి అమాయకంగా అడిగింది.

''నీ కిష్టుడైనవాడు నాకు మాత్రం కాగూడదా?''

''నీవు కూడా మధుగారిని ప్రేమిస్తున్నావన్న మాట?!''

మాధురి పెద్దగా నవ్వింది."నాకు నీలాగా ప్రేమలూ,వాగ్దానాలూ,అనుక్షణం ఏమౌతుందో అనే భయాలూ,ఎవరికోసమో బ్రతుకులు కుదువబెట్టినట్లు పడిగాపులు పడుతూ ఉండటం - ఇవన్నీ చేతకావు. జీవితమంతా టెన్నిస్ ఆట లాంటిది- సెట్ కోసం ప్రయత్నం చేస్తాం. వస్తే ఎంతో పోతే కూడా అంతే. అలా బ్రతకక్కపోతే ఈ ప్రపంచంలో సుఖం లేదు.... కానయితే నేనూ మనసున్న మనుషులతో బ్రతకాలని అనుకుంటాను. అటువంటి అవకాశం మొన్న పరిషత్తులో దొరికింది నాకు. అపు డొక వ్యక్తిని ప్రేమించాను. ప్రేమించానని గర్వంగా చెప్పుకుంటాను కూడా."

''ఎవరా వ్యక్తి?'' మాలతి ఉత్కంఠతో అడిగింది.

''ఇప్పుడు నాతో ఏకాంతాన్ని అనుభవిస్తున్న నా ప్రియురాలు. దాని కోసం నా సర్వస్వం త్యాగం చేయటానికి సిద్ధం."

మాలతి మాధురిని గట్టిగా కౌగిలించుకుంది.

''మాటలకే మురిసిపోయే మనసు నీది. వట్టి మాటలు నమ్మి విలువైన నీ మనసును ఎవ్వరికీ తొందరపడి అమ్ముకోబోకు."

''నీవు నిజమైన సిపాయికూతురువు మాధురీ!''

ఇద్దరూ చెట్టపట్టాలు పట్టుకొని చెట్లనీడల్లో నడిచిపోయారు.

## 29

తెల్లవారిం తర్వాత మధు కింట్లో కాలు నిలువలేదు. కాఫీలవేళకే ఇల్లు వదలి వెళ్ళిపోయాడు. ఆరోజు ప్రభాతం ఆకర్షణీయంగా ఉంది. ప్రాచీదిశాంగనా స్నిగ్ధకపోలాలమీద భానుడు రాగరేఖలను తీర్చిదిద్దుతున్నాడు. పుడమి చేడియ పద్మరాగ మంజరులను సూర్యునికి కానుకగా సమర్పిస్తోంది. కల్యాణ మండపంలా వెలుగుతోంది నభోమండలం. ఎంత విచిత్రం! రోజూ చూచే ప్రకృతికి ఆ రోజు మధు వింత వ్యాఖ్యానాలు చేసుకుంటున్నాడు.

హోటల్‌లో గట్టి ఫలాహారం చేసి ఉదయమే మధుమంజరిని తెరిచి ఒంటిగా అందులో కూర్చున్నాడు. తన గదిలో సర్దిన వస్తువునే మరల సర్దుతూ అనుక్షణం క్రొత్త అందాన్ని కల్పించాలని ఆరాటపడుతున్నాడు. మాలతి వచ్చేసరికి తన హృదయంలోని అవ్యక్తానందాన్ని వ్యక్తంచేసే అలంకార మేదైనా చేయాలి. రాగానే దాన్ని చూచి ఆమె మురిసిపోవాలి. అంతులేని ఆరాటం గుండెలో .... అయోమయమైన ఆచరణం చేతుల్లో .... గమ్యంలేని సంచలనం పాదాల్లో....ఏదో స్పష్టంగా తెలియని క్షణంకొఱకు అన్వేషణ చూపుల్లో.

సాయంకాల మైదుగంటలు దాటింది. మాలతి రాలేదు. మధు మనస్సు నిగ్రహించుకోలేకపోయాడు. రిక్షామీద కళాశాలకు పోయి చూచాడు. దినమెల్లా పనిచేసి విశ్రాంతి తీసుకొంటోంది కళాశాల. మరలా మధుమంజరికి వచ్చాడు. ఆరు గంటలు దాటింది. ఇంకా ఆమె రాలేదు. ఇక మధు అక్కడ ఉండలేక పోయాడు. హరియింటికి వెళ్ళాడు.

హరి వాటా తాళంవేసి ఉన్నది. అతని గుండె గతుక్కుమన్నది. కామేశ్వరమ్మగారి వాటాలో లైటు వేసివుంది. హుటాహుటి వెళ్ళి తలుపు తెరుస్తూనే "మాలతీ!" అని పిలిచాడు. ఎదురుగ్గా నటరాజస్వామి విగ్రహాన్ని తదేక దృష్టితో చూస్తూ ప్రతిమలా కూర్చుండి ఉన్నది మాలతి. అరనిముసం కన్నార్పకుండా చూచాడు మధు. నెమ్మదిగా దగ్గరకు వెళ్ళి ప్రక్కన కూర్చుండి చెవులో మెల్లగా "ఓ నా ప్రియా మాలతీ!" అని సరాగంగా పిలిచాడు.

మాలతి ఉలిక్కిపడి మధును చూచి "మీరా?" అన్నది.

"ఎందుకంత భయం? నేను దొంగను కాను." నవ్వుతూ మధు అన్నాడు.

మాలతి నివ్వెరపోయింది. ఒక అరనిముసపు నిశ్శబ్దం తర్వాత కనురెప్పలార్పకుండా అతని ముఖాన్ని చూచింది.

''మీ అమ్మగారు లేరా?''

''లేదు. మల్లికా, ఆమే కలిసి గుడికి వెళ్ళారు.''

''నీ వొంటిగా ఉన్నావన్నమాట!'' మధు చమత్కరించాడు.

''మీ రిక్కడికి వచ్చారేం ఇవ్వేళ?''

''నీ వాఫీసుకు రాకపోతివి. నీకోసం ప్రొద్దుటినుండి మధుమంజరిలో తపస్సు చేస్తున్నాను. కాని దేవి దర్శనం కాలేదు. భక్తుడే పయనమై వచ్చాడు."

''మీరుదయం నుండి నాకోసం మధుమంజరిలో కాచుకొని ఉన్నారా?'' మాలతిలో ఆశ్చర్యం.

''అవును. క్షణ మొక యుగంగా గడిపాను."

''మీకివ్వేళ ఎక్కడా ఎంగేజ్‌మెంటు లేదా?''

''నా మధుర జీవితంలో అడుగుపెట్టినట్లు నీ వీనాడు మధుమంజరిలో అడుగుపెట్టితే చూడాలని నా కన్నులలో వత్తులు వేసుకున్నాను.... ఇంతకన్నా గొప్ప ఎంగేజ్‌మెంటు ఏముంటుంది నా జీవితంలో?''

మాలతి చరితురాలై పోయింది. స్నిగ్ధమైన నిర్మలమైన అతని ముఖం మీద అమాయకత్వం విరియబారివుంది.

''మీరు రాత్రి యింటికి వెళ్లారా?''

''వెళ్ళాను. కాని, రాత్రంతా మధుమంజరిలోనే ఉన్నాను.''

''అంటే?''

''ఏం చెప్పమంటావు మాలతీ? నీవు నన్నూ నా భావలహరినీ ఒంటిగా ఉండనిచ్చావా? ఇంట్లో పడుకున్నా నీ స్వర్గ సన్నిధానమే." అతడు తన్మయుడై అన్నాడు.

''మీ తల్లిదండ్రులతో మన విషయం చెప్పారా?''

అతడు మేలుకున్నట్లు కన్నులు విప్పాడు. ''నా హృదయ సామ్రాజ్యానికి నేనే ప్రభువును. నే నొకరి అనుమతి నడగవలసిన అవసరంలేదు."

"వారేమైనా వేరేచోట మనువు నిశ్చయం చేస్తే?" మాలతి కంఠం కంపించింది.

''మాలతీ! ఏమంటున్నావు?" అతడు ఉలిక్కిపడ్డట్టు ప్రశ్నించాడు.

''మీరు మీ నిర్ణయాలు మీ యింట్లో చెప్పకపోతే వారు వారి నిర్ణయాలు మీతో చెప్పవద్దూ?"

''వారి నిర్ణయాలతో నాకు పనిలేదు."

''మీకు వారి నిర్ణయాలుకూడా తెలుసునా?"

''ఏమిటి మాలతీ, ఈ ప్రశ్నలు? మన విషయంలో నాదే మొదటి నిర్ణయం- తిరుగులేని నిర్ణయం. నాకింకెవరి నిర్ణయాలూ తెలియవు."

మాలతి పొంగివచ్చే సంతోషంతో ''క్షమించండి! మీ హృదయంలో నాకింత స్థానమిచ్చారని ఊహింపలేకపోయాను" అని అతని పాదాలమీదకు వాలింది. మధు కిదంతా అయోమయంగా తోచింది. మాలతిని బుజాలుపట్టి లేపి తన ప్రక్కకు లాక్కున్నాడు. "నీవేదో బాధపడుతున్నట్లున్నావు మాలతీ! నా హృదయం నీముందు పెట్టాను. దాన్ని శోధించు. నిర్మలంగా ఉంటేనే స్వీకరించు."

"మీరు దేవతలండీ! నేనే మూడురాలిని."

''అంత ఆత్మనింద కవసర మేమి వచ్చింది?"

''అదొక పీడకల.... పోనివ్వండి.''

''కాదు. అంత్య నిష్ఠురంకన్నా ఆదినిష్ఠురం మంచిది. నీవు చెప్పకపోతే నేను నిన్ను వదిలేదు లేదు'' అని ఆమెను తన బాహువులతో బంధింపబోయాడు. ఆమె సిగ్గుతో ప్రక్కకు తప్పకుంది.

''ఇవ్వేళ మీ తల్లిదండ్రులు మీ కొక వధువును చూడటానికి వెళ్ళారు."

''ఎవరా వధువు?''

''మాధురి!"

''మాలతీ! నిజంగానా?.... ఎవరు చెప్పారు?" మధు ముఖం కందగడ్డ అయింది.

''మాధురే!''

''నాకు తెలియనే తెలియదే?"

''అందువల్లనే పెద్దల అనుమతి ముందుంటే మంచిది.''

మధు గంభీరుడైనాడు. నిలువబడి తలవంచుకున్నాడు. ''నేనొక విచిత్ర వ్యక్తిని మాలతీ! నా యిల్లంతా ఒకమాట! నేనొక్కడ నొకమాట! ఇది నా జాతకఫలం. నే నేముందడుగు వేసినా నా యిల్లు దాన్ని కాదంటుంది. నా మాటపై సానుభూతి చూపగల వ్యక్తికోసమే నా అన్వేషణ!.... నీవు నాకు వరంలా లభించావు. నీ మీదే నా భవిష్యత్తంతా నిలువబడి ఉంది.... ముళ్ళ మీద పూలమేడ కట్టుతున్నానని నాకు తెలుసు. కాని, నీ సహాయముంటే అది నిష్కంటక మౌతుందని నా దృఢ విశ్వాసం."

''మీరు నాకోసం కష్టాలు కొనితెచ్చుకుంటున్నారు.''

''కాదు. నా సుఖాలతోపాటు కష్టాలను కూడా నీకు సగం పంచుదామని స్వార్థంతో ఆలోచిస్తున్నాను.''

ఇద్దరికీ అప్రయత్నంగా కన్నులు చెమ్మగిల్లాయి.

"మీ సంకల్పానికి రూపుకట్టిన అర్ధనారీశ్వరు డడుగో!" మాలతి సిగ్గుతో స్వామిని చూపించింది.

''అతడే సాక్షి మన హృదయాలకు."

ఇరువురూ నటరాజస్వామికి కైమోడ్పు లర్పించారు.

## 30

మధు రాత్రి యింటికి చేరేసరికి తొమ్మిది దాటింది. తల్లిదండ్రులు భోజనాలు ముగించుకొని హాల్లో కూర్చున్నారు. మాణిక్యాంబ తమలపాకు బీడా లందిస్తూంటే రామచంద్రయ్య నములుతున్నాడు. మధు చెల్లెలిచేత అన్నం పెట్టించుకొని తిని, తన గదిలోకి వెళ్ళబోతున్నాడు.

"మధూ! ఇలారా నాయనా!" ఆప్యాయంగా తండ్రి గొంతుక.

మధు మౌనంగా వచ్చి, ఎదురుగా సోఫాలో కూర్చున్నాడు.

"ఉదయమే ఎక్కడికెళ్ళావు?"

''మధుమంజరికి.''

''అంత పెందలకడ?...."

''ఇవ్వేళ పని చాలా ఉండింది.''

''ఆ టైపిస్టు సక్రమంగా పని చేస్తోందా?''

''ఆ. అనుకూలంగానే ఉంది.''

''మీ అమ్మా, నేనూ ఇవ్వేళ కెప్టెన్ నరసింహంగారింటికి పోయి వచ్చాము.''

''ఆయన చాలా మంచివాడు.''

''అవును. చాల మర్యాదస్తుడు కూడా. మన హోదాకు తగినవాడు. కాబట్టే; ఆయన పిలవగానే వెళ్ళివచ్చాము.''

"ఆయన కూతురు మాధురి మా నాటకంలో అనసూయ పాత్ర వేసింది.''

"అవునట!....ఆ అమ్మాయినిచూస్తే మీ అమ్మకు ఎంతో ముచ్చటవేసింది."

"నాటక ప్రేక్షకులలో చాలమందికి ఆ అమ్మాయి ముచ్చటవేసిందట!"

''ఎక్కడ గుణముంటే అక్కడ మెచ్చుకుంటుంది లోకం."

''అదీ ఎంతో అదృష్టం చేసుకొనివుంటే.''

''ఆ అమ్మాయి నిజంగా అదృష్టవంతురాలు కూడాను.''

''కావచ్చు.''

''అదేంటండీ, అసలు విషయం చెప్పకుండా ఎంతసేపు ఈ ఉపోద్ఘాతం?" మాణిక్యాంబ భర్తను వేగిరపెట్టింది.

"ఏమిటమ్మా, అది నీవే చెప్పరాదూ!'' మధు సౌమ్యంగా అన్నాడు

"అది ఆయన నోటిమీదగుండా చెప్పిద్దామని కాని, లేకపోతే ఎవరు చెపితే ఏముంది? నేనే చెప్తాను. నిన్న ఆ నరసింహంగారు వచ్చారు. వాళ్ళమ్మాయిని నీకొరకు పెళ్ళిచూపులకు రండని పిలిచారు. మేము వెళ్ళివచ్చాం. మీరిద్దరూ ఇది వరకెన్నోసార్లు చూచుకున్నవారేనాయె. ఇక నా యిష్టమంటావా.... నాకైతే పిల్ల బంగారపు బొమ్మలా ఉంది. 50 వేల ఆస్తి, 20 ఎకరాల నిక్షేపంతో లక్ష్మిలా నా నట్టింటికి వస్తుంది. ఎవరైనా విన్నా, చూచినా నాకు తగ్గ కోడలని పించుకుంటుంది. నీవేమంటావు నాయనా?" మాణిక్యాంబ ఆశతో అడిగింది.

"ముహూర్తాలు పెట్టించలా?"

"నా బంగారు నాయనే! నీవలా అంటావన్ని తెలుసు. నే నప్పుడే అన్నాను మీ నాయనగారితోటి, ముహూర్తాల్నుకూడా పెట్టించండీ అని! ఈయనగా రాయన గారితో ఎలా చెప్పారో యేమో ఆ పిల్లా తండ్రీ ఇద్దరూ మాట్లాడుకొన్నారు. ఆ తర్వాత 'మీ అబ్బాయి అభిప్రాయం తెలపండి. తర్వాత అన్ని విష

యాలూ మాట్లాడుకుందాం' అని అన్నా డాయన" అని మాణిక్యాంబ చేతులు త్రిప్పుతూ దీర్ఘాలుతీస్తూ మాట్లాడింది.

"అవును. తల్లిదండ్రులు మరచిపోయిన కొడుకును వారు జ్ఞాపకంచేశారు. తమ పిల్ల నిచ్చేది మీకు కాదు. మీ కుమారునికన్న పరిజ్ఞానం వారి కున్నట్లుంది." మధు లేచి నిలువబడ్డాడు.

''అదుగో చూచారా, అందుకే నేను మాట్లాడనంది. నా మాటంటే ఏదో విరుపు రావాలిసిందేగా....ఇక నేను మాట్లాడను....మీ యిష్టం.... మీ కొడుకిష్టం" అని రామచంద్రయ్యమీద విరుచుకపడింది మాణిక్యాంబ. ఆయన యిరకాటంలో పడ్డాడు.

"కొడుకు అవసరాలు తల్లిదండ్రులు తీర్చటానికి యత్నించటం తప్పా నాయనా?" రామచంద్రయ్య మెల్లగా అందుకున్నాడు

"అవసరాలను గుర్తించినవారు అభిరుచులను గుర్తించవద్దా?"

"అందుకనే కదా నీ యభిప్రాయ మడుగుతోంది?"

"కాదు. వారడగమన్నారు కాబట్టి మీరడుగుతున్నారు."

"ఎలాగైతే నేమోయ్?"

''దానికీ దీనికీ హస్తిమశకాంతరం ఉంది."

''శుష్కవాదనకు దిగవద్దు మధూ!'' రామచంద్రయ్య విసుగ్గాఅన్నాడు.

''నేనన్న మాటంటే వాదనక్రింద కొట్టివేస్తారు మీరు. నా అభిరుచి మీద నిజంగా మీకు దృష్టి ఉన్నట్లయితే మీ కన్నకొడుకును ఈ రోజు శుష్కమైన ఆఫీసు పనికి స్వస్తి చెప్పించి గారాబంగా మీతో తీసుకొని వెళ్ళేవారు. తన సహధర్మచారిణి నెన్నుకోవటంలో నైనా తల్లిదండ్రులు తనకు స్వాతంత్ర్యం ఇస్తారేమోనని ప్రతి కన్నకొడుకూ అనుకుంటాడు. అదే శుష్కమైనదంటే ఇక రసవత్తరమైన వాదా లెలా వుంటాయో నాకు తెలియదు.''

''ఇంతకూ మాచేత పొరపాటు ఒప్పించటమేనా నీ పంతం?''

"పంతం నాది కాదు మీది. మీరు కుదుర్చుకొని వచ్చిన సంబంధాన్ని నాచేత ఒప్పించాలని మీరు చూపుతున్నారు పంతం."

''అయితే నీవనేదేంటి?''

''నేనూ ఒక సంబంధం చూచివచ్చా నివ్వేళ.''

''ఎవరు పిలిచారు నిన్ను?''

''వధువు!''

''ఇదేమిటి లోకవిరుద్ధం?''

''పెళ్ళాడేది వధూవరులు. వారిరువురి అంగీకారం ముందు ముఖ్యం. అందులో విరుద్ధమేముంది?''

''వధువే వచ్చి పిలిస్తే ఇక నీవెవర్నిరా చూచేది?''

''ఆమె అభిరుచుల్ని, ఆమె సంస్కృతిని, ఆమె పుట్టి పెరిగిన వాతావరణాన్ని.''

''నీవు ప్రతి విషయంలోనూ వియ్యమంటే కయ్యమనటం నేర్చేవురా మధూ!'' కొంచెం ఖచ్చితంగా అన్నాడు రామచంద్రయ్య.

''మానవుణ్ణి పరిసరాలు తీర్చిదిద్దుతవి.''

''ఈ సిద్ధాంతాలు కట్టిపెట్టి.... ఆ అమ్మాయి ఎవరో చెప్పు.''

''ఒక బీద పిల్ల. ఒక రిటైర్డు ఉపాధ్యాయిని కూతురు. కట్నాలేమీ ఇవ్వలేని వధువు. అపారమైన సంస్కృతికి కాణాచి.''

''మనువు లెన్నో చూస్తాం.... కాని-''

''కాని.... ఒకదానినే నిశ్చయిస్తాం.''

''ఈ రెండిట్లో మేము చూచి వచ్చిన మనువు అన్ని విధాలా బాగుంది.''

''అది మీ దృష్టికి. నా దృష్టికి నేను చూచిన సంబంధమే బాగుంది.''

''నీ వితండవాదం వదలవా మధూ?''

''మాట యిచ్చాను నేను.... మీ రింకా ఇవ్వలేదు.''

''ఆ అమ్మాయి పేరు?''

''మాలతి!'' నిబ్బరంతో అన్నాడు మధు.

''ఇంకేముందండీ? అదే కొంపముంచిందండీ! ఉద్యోగమని చేరి పసివాణ్ణి ఉచ్చులో వేసుకొంది. మాయచేసి మనమీదకే ఉసికొల్పుతూంది. నేను మొదట్లోనే చెప్పాను-అయనగారి గాలిసోకిన ఆడదాన్ని ఆఫీసులో చేరుస్తున్నారు, ఏదో కాక తప్పదని. ఇప్పుడేమయింది? ఎరనువేసి చేపను పట్టారు.'' మాణిక్యాంబ గొల్లు మన్నది. రామచంద్రయ్య ఉద్రేకంతో ఊగిపోయాడు.

"మధూ! ఎన్నాళ్ళబట్టి ఈ నాటకం?" రామచంద్రయ్య నిలదీసి అడిగాడు.

"మీరు నన్నర్థం చేసుకోకుండా మాట్లాడుతున్నారు."

"మన మిద్దరమూ తెలుగే మాట్లాడుకుంటున్నది."

"తెలుగంటే తేలికని చాలామంది భ్రమపడతారు. అందులో ఉన్న జీవం తెలుసుకోవటం అంత తేలిక కాదు."

"తాతకు దగ్గు నేర్పుతున్నావే!"

"అదికాదు నా తాత్పర్యం."

"తాత్పర్యం.... కన్నవారి మాటలు కాలరాయటమా నీ తాత్పర్యం? నీ వంశగౌరవం మంట కలిపి గంజి తాగే పిల్లను తెచ్చి బంగారు పళ్ళెం వెయ్యటమా నీ తాత్పర్యం? విశృంఖలంగా వయసు చెప్పినట్లెల్లా నడుచుకుంటూ నీతి నియమాలను కోల్పోవటమేనా నీ తాత్పర్యం? .... ఏమిటి నీ తాత్పర్యం?"

"కన్నకొడుకు మనసు కన్నవారు మన్నించమని."

"చిన్నవాళ్ళు దారి తప్పితే వారిని మందలించే బాధ్యత తల్లిదండ్రుల కున్నది."

''సక్రమమైన దానిని వక్రంగా భావించి పసివాళ్ళను వేధించే పెద్దలకు కనువిప్పుచేసే బాధ్యత కన్నకొడుకులకు కూడా ఉంది."

"నీవు శ్రుతిమించుతున్నావు."

''మీరే పిలిచి నన్ను మాట్లాడమన్నారు".

"అవును. మాట్లాడమన్నాను కాని పోట్లాడమనలేదు."

"మనసులు కలిస్తే పోట్లాటలుకూడా మాట్లాటలే అవుతాయి. లేకపోతే అంతా విరుద్ధమే అవుతుంది.''

''నన్ను వ్యతిరేకించి నీవు సాధింపగలిగేది శూన్యం." రామచంద్రయ్య గర్జించాడు.

''నన్ను బలవంతపెట్టి మీరు లాభపడేదీ అంతే!"

''నీ కిన్ని కాళ్ళివ్వడమే తప్పైంది."

''ఇరవై అయిదు సంవత్సరాల అలస్యంగా గుర్తించారా సత్యాన్ని మీరు" అంటూ మధు విసురుగా తన గదిలోకి వెళ్ళిపోయాడు.

## 31

"ఏమి టైపు చేస్తున్నావు మాలతీ?" అప్పుడే వర్కుషాపులోనుండి వచ్చి సీటులో కూర్చుంటున్న మధు ప్రశ్నించాడు.

''మీరిచ్చిన లెటరు టైపు చేశాను. ఇంతలో నిన్నటి నా లీవ్ లెటర్ టైపు చేస్తున్నాను."

"నీవు సెంపుమీద ఉన్నావని ఎవరన్నారు?"

''బాగుంది....ఎవరనాలి?.... నేను ఆఫీసుకు రాలేదు."

"రాకపోతే యేం?.... నేను చేయమన్న పనంతా తూచా తప్పకుండా చేశావుకదా!"

"అదీ ఆఫీసు డ్యూటీయే నన్నమాట?"

"నీవు వట్టి అమాయకురాలవు. ఆఫీసుపనికన్నా ఆఫీసరుగారి సొంతపని ముఖ్యమనీ లాభదాయకమనీ ఉద్యోగం చేసే ప్రతి వ్యక్తి నేర్చుకోవలసిన ప్రథమ సూత్రం." మధు రమత్కారంగా అన్నాడు.

"మీ మాటలు వింటూంటే వడ్డించేవాడు మనవాడైతే కడపంక్తిలో కూర్చున్నా పరవాలేదన్న సామెత గుర్తుకొస్తోంది"

"ఇంతకూ వడ్డించేవాడు నీవాడే నంటావు?" ముసిముసినవ్వులు విసిరాడు మధు.

"ఆ మాట నటరాజస్వామి నడగండి." మాలతి సిగ్గుతో తలవంచి కార్బన్ పేపర్లను సరిచేస్తున్నట్లు ఆవలకు మళ్ళింది.

మధు వెలిగేకళ్ళతో ఆమె అవనతశరీరాంచల వక్రరేఖా సౌందర్యానికి నీరాజనం పట్టాడు. "ఈ ప్రేమమూర్తిని అర్థం చేసుకోలేదు మా అమ్మ. అర్థ లాభాన్ని చూపించే కోడలు కావాలని అత్యాశపడటమేకాని, యీమె ప్రేమించిన వారికి ప్రాణధనాలైనా యిస్తుందని గుర్తించలేదు. విలువలు తెలియని వ్యక్తులతో ఎన్ని తరాలనుండి సతమతపడుతున్నదో మానవునిలోని మమత?" అని లోలోన అనుకున్నాడు మధు.

మాలతి మధుమంజరికి సంబంధించిన కొటేషను నొకదానిని మిషన్ మీద ఎక్కించి టైపు చేస్తోంది.

"మాలతీ! మా పెద్దల అనుమతిని గూర్చి అంతగా అడిగావు నిన్న; నీవు మీ అమ్మగారి అనుమతి తీసుకున్నావా?"

"ఆమెతో చెప్పాలని ఎన్నోసార్లు ప్రయత్నించాను. కాని, ధైర్యం చాలటంలేదు."

"నీవు నీ ధర్మం తప్పక నిర్వహించాలి."

"నా పుట్టినరోజు కొద్దిరోజుల్లో వస్తోంది. ఆ రోజున నాకు నచ్చిన ఏ పని చేయటానికైనా మా అమ్మ సంతోషంతో అనుమతిస్తుంది. ఆ రోజున చెప్పాలని అనుకుంటున్నాను."

"ఇటువంటి విషయాల్లో ఆలస్యం పనికిరాదు. నేను మా తల్లిదండ్రులతో నా నిర్ణయాన్ని చెప్పాను.

"వారంగీకరించారా?"

"వారి అంగీకారాన్నిగూర్చి నే నడగలేదు."

"ఎందుకని?"

"మా పెద్దల అంగీకారమనేసరికి....మీ పెద్దల ప్రయత్నంకూడా కొంత అవసరం కావచ్చు లాంఛనాల కొరకు."

"మీరన్నది నా కర్థమైంది....నా ధర్మం నేను నిర్వహిస్తాను."

"ఇంత ధర్మమూర్తివి కాబట్టే, సహధర్మచారిణివి కావాలని కోరుకుంటున్నది."

"అది నా అదృష్టం."

రేడియో సెట్ ఒకటి బేరానికి వచ్చిందని నౌకరు వచ్చి చెప్పాడు.

"బేరమేమిటోయ్? అన్నీ ఫిక్సెడ్ రేట్సే" అని మాలతి వైపు చూచి నవ్వాడు. ఆమె నవ్వుతోనే సమాధానం చెప్పింది. మధు షోరూంలోకి వెళ్ళాడు. అత డటు వెళ్ళాడు, హరి యిటు వచ్చాడు.

''మాలతీ! నీ ఉద్యోగ మెలా సాగుతోందమ్మా?" - హరి.

''పేరు నాది కాని అంతా ఆయనే నిర్వహిస్తున్నారు."

''వాడు నాకెంత సన్నిహితుడో-మీకూ అంతే సన్నిహితు డౌతున్నాడు."

"అంతా మీ చలువ అన్నయ్యా!''

''కాదమ్మా! నేను నిమిత్త మాత్రుడనే. మీకు వాడు స్వబుద్ధితోనే సహాయం చేస్తున్నాడు.''

''అందుకు వారికి జీవితాంతం కృతజ్ఞురాలనై ఉంటాను.''

"గుడ్. విశ్వాసం మానవుల విజ్ఞతకు చిహ్నం. అదే నీకు శ్రీరామరక్ష''.

"అన్నగారు చెల్లెల్ని ఏదో ఆశీర్వదిస్తున్నారే?'' మధు ప్రవేశిస్తూ అన్నాడు.

"పార్ట్ టైము ఉద్యోగం ఫుల్ టైము ఉద్యోగం కావాలని'' హరి నవ్వాడు.

''జగన్నాటక సూత్రధారి - ఆ హరి కటాక్షం మీద ఆధారపడి వుంది అంతా."

''భగవంతుని నమ్మి చెడిన వారు లేరు''-హరి.

"తథాస్తు....సరేగాని, కాలేజి నుంచేనా రావటం?''

"అవును."

"ఇంత ఆలస్యమైందేం?"

"ఇవ్వేళ రెండు విశేషా లున్నాయి."

"ఏం టన్నయ్యా అవి" మాలతి ఉత్సాహంగా ప్రశ్నించింది.

"ఒకటి- మన గిరీశానికి ఉద్యోగం కుదిరింది, ఒక హయ్యర్ ఎలమెంటరీ స్కూల్‌లో టెంపరరీ టీచరుగా"-హరి.

"అమ్మయ్య! కథానాయకుడు దొరికాడు-" మధు.

"కాని, కథ అడ్డం తిరక్కుండా ఉండాలి.'' మాలతి నవ్వింది.

"ఇక రెండవది. నేనిదివరలో అప్లై చేసిన బ్రిటీష్ స్కాలర్ షిప్పు కొరకై ఢిల్లీలో ఇంటర్వ్యూ లున్నాయని ఇంటిమేషను వచ్చింది''-హరి.

"అయితే, మీరు ఇంగ్లాండు పోతారన్నమాట?''మాలతి నిర్ఘాంతపోయింది.

"ఇంగ్లాండు మాట అలా వుంచు. ముందు ఢిల్లీ వెళ్ళాలి''-హరి.

"విష్ యు బెస్ట్ ఆఫ్ లక్. మనమధ్య ఫారిన్ వెళ్ళివచ్చినవాళ్ళెవరూ లేరు. తిరిగి వచ్చింతర్వాత చూడాలి నీ డిమాండు.''

''ఇవ్వేళ నిజంగా మంచిరోజు. అన్నీ మంచి విషయాలు వింటున్నాము"-మాలతి.

''అవును. ఇవ్వేళ శుభదినం.... టైము అయిదున్నర దాటింది. అందరం కలిసి పిక్చరుకు పోదాం పదండి.''

''అబ్బో... ఇవ్వా ళెందుకురా?''-హరి.

"నీ వింగ్లాండు పోతే మళ్ళా ఎన్నాళ్ళకో కలిసి తిరిగేది!''

''అప్పుడే అయిందీ. సెలక్టయితే పడవెక్కేసరికి ఇంకా నాల్గైదు నెలలు పడుతుంది.''

''ఈ మధ్య నీ భారతయాత్రా కార్యక్రమం ఉంది కాబోలు?''

''ఈ అవకాశమూ సమయానికే వచ్చింది. నా దేశాన్ని నేను దర్శింపగల్గితేకాని ఇతరదేశాలను చూచే అర్హత నాకు రాదు.''

''నీ కన్ని అవకాశాలు దొరుకుతుంటే - నీతో సినిమా చూచే అవకాశం మాకింత కలిగించకూడదూ?''- మధు.

'''సరే పద''- హరి లేచాడు.

హరి, మధు, మాలతి - ముగ్గురూ సినిమాకు వెళ్ళారు.

సాయంకాలం ఏడుగంటల ప్రాంతంలో రామచంద్రయ్యా, మాణిక్యాంబా జీపులో మధుమంజరికి వచ్చారు. నౌకర్లంతా సగౌరవంగా వారిని లోపలికి తీసుకొనివచ్చారు.

''మధు ఏడీ?'' రామచంద్రయ్య నౌకరును ప్రశ్నించాడు.

''ఒక గంటకింద యేడకో యెళ్ళారుండి.''

''ఈ మైపిస్టేదీ?''

''అయ్యగారి యెంట ఆమెగోరుగూడా యెల్లింద్రండి.''

''ఎక్కడి కెళ్ళా రిద్దరూ?''

''ఏమోనండి. అయ్యగోరు రాత్రి తొమ్మిదింటికి వస్తానని సెప్పెళ్లింద్రు.''

''సినిమా కెళ్ళారేమో!.... వాళ్ళవెంట ఇంకెవ్వరైనా ఉన్నారా?''

''హరిగారు ఉన్నారండి.''

రామచంద్రయ్యా, మాణిక్యాంబా ఒకరిముఖం ఒకరు చూచుకున్నారు.

''ఎన్నడూ అయ్యగోరు పని వదలిపెట్టి యెల్లేవోరు కారుండి. ఇయ్యాలనే అందరూ కలిసిపోయారు.''

''కలిసిపోతారు. పోరూమరి? ఎవడికి పట్టిందిరా వెక్కి వెక్కి యేడుస్తున్నావన్నట్లుంది ఈ షాపు''.... కాష్ బాక్స తాళం చేతులు ఎవరికిచ్చాడు?'' గుమాస్తాను ప్రశ్నించాడు రామచంద్రయ్య.

"వాటి నెవ్వరి చేతికీ యివ్వరండి బాబుగారు.''

"మధు రాంగానే మేము వచ్చి వెళ్ళామని చెప్పండి."

''మీరు వేరే చెప్పాలనా?"

గంభీరంగా ముఖం పెట్టి రామచంద్రయ్య ముందు నడిచాడు. మాణిక్యాంబ వర్క్‌షాపు, షోరూము నాల్గుమూలలా చూచి జీపువైపు నడిచింది. నౌకర్ల నమస్కారాలు సీకరిస్తూ రామచంద్రయ్య జీపును ముందుకు నడిపాడు.

## 32

మధును మధుమంజరికి పంపి హరీ మాలతీ ఇంటికి చేరేసరికి రాత్రి పది గంటలు దాటింది. మల్లిక హరికోసం వేచివేచి సోఫాలో నడుం వాల్చింది. చిన్న కూర్కు పట్టింది. హరీ మాలతీ ముంగిట్లో మాట్లాడిన సవ్వడికి మల్లికకు మెళకువ వచ్చింది. కాని, కళ్ళు తెరవకుండా నిద్ర నభినయించింది. హరిచేత లాలింపబడిన తన పూర్వానుభూతిని స్మరిస్తూ అతని సాన్నిహిత్యాన్ని మరలా కోరుతోంది ఆమె శరీరం. మల్లిక సోఫాలో అలాగే శయనించి వుంది.

హరి తలుపు తెరుచుకొని హాల్లోకి వచ్చాడు. తన గది వాకిలి గోడ కానించి వేసియున్న పొడుగాటి క్రొత్త సోఫాలో మల్లెపూల కుప్పలా మల్లిక! ధవళ విద్యుద్దీప కాంతులు ఆమెమీద వెండిపూత పూస్తున్నాయి. అతని కళ్ళు తీగేలు మన్నాయి. ఆమె నిద్రిస్తోంది. అలికిడి లేకుండా లోగడియ పెట్టాడు హరి. కన్నార్పకుండా ఆమెనే చూస్తూ అడుగులో అడుగువేస్తూ తన గదిలోకి పోతూ.... తెల్లని పేటుచీరె మల్లెపూలద్దిన తెల్లని పట్టు రెవిక, తళతళా మెరిసి పోతున్న మల్లెమొగ్గల రాళ్ళ నెక్లేసు, ఒంటిరాయి ముక్కుపుడక, వజ్రాల్లా మెరుస్తున్న కమ్మలు, ముఖానికందం తెచ్చే తిలకరేఖ తదేకదృష్టితో ఒక్క క్షణం చూచాడు. నిశ్శబ్దం ఆవరించిన ఆ ఇంట్లో ఆమె నొంటిగా, మౌనంగా, నిశ్చలంగా చూస్తుంటే అతని గుండె వేగంగా కొట్టుకొనసాగింది. అతనిలోని చైతన్యం శిలను తాడిస్తున్న నదీతరంగంలా సంక్షోభాన్ని చెందుతోంది. ''నా మనోనిగ్రహంమీద నాకెంతో విశ్వాసముండేది ఇంతవరకూ. దానికే పరీక్ష పెట్టుతోంది మల్లిక!" అని నిట్టూరుస్తూ తన గదిలోకి వెళ్ళాడు. సూటు విప్పి, ధోవతి, అరచొక్కా వేసుకున్నాడు. వాష్‌బేసిన్‌లో ముఖం కడిగాడు. టాయిలెట్

చేసుకున్నాడు. కంఠాన్ని కావాలని నాలుగైదుసార్లు సరిచేసుకొన్నట్లు శబ్దం చేశాడు. మల్లిక మేల్కొనలేదు. హరి హాల్లోకి వచ్చాడు.

మల్లిక జడలోని మల్లెపూల వాసన హాలంతా గుబాళించి మనస్సుకు మత్తు కలిగిస్తున్నాయి. తమకంతో మల్లికను సమీపించాడు హరి. ఆమె తలవైపు నిలువబడి ఆమె ముఖంలో ముఖముంచ యత్నించాడు. వెన్నెముక క్రింది భాగంనుండి చలి-వణుకు ప్రారంభమైంది. వెచ్చని నిట్టూర్పులతో, తనివితీరని చూపులతో ఆమె కపోలంమీద అతనిముఖం వాలింది. అతని పెదిమలు ఆమెను చుంబించబోయాయి- అతని నిట్టూర్పుల స్పర్శచే ఆమె కపోలం గగుర్పాటు చెందింది. ఆమె కనురెప్పలు కదలులాడాయి. అతని గుండె జల్లుమన్నది. వీపున పుట్టిన చలివణుకు శరీరాన్నంతా కుదిపివైచింది.. గబగబా గదిలోకి వెళ్ళాడు. చేయి తగిలి తలుపు చప్పుడైంది. సరాసరి పోయి హరి మంచంమీద పడుకొని ఉన్నిరగ్గు నిండా కప్పుకున్నాడు. వణుకును అణచుకోటానికి సతమత మౌతున్నాడు.

మల్లిక మనస్సుతో హరిని గమనిస్తూనే వుంది. ఆమె కతని చిత్తవృత్తి లోని సంక్షోభం అర్థమైంది. కాని, అతడు తనను నిజంగా ఆశిస్తున్నాడా? అన్న ప్రశ్నకు సమాధానం చెప్పుకోవటం కష్టమౌతోంది. ఆమెలోని రెండు భిన్న వృత్తులు వివాదానికి దిగినవి.

"స్త్రీలో ఒక శక్తి ఉన్నదని అత డంగీకరించాడుగా.''

"ఆయన ఆ సంగతి మా పూరి పూరిపాకలోనే గమనించాడు.''

"ఆనాడు గమనించాడు - ఈనాడు ఆశిస్తున్నాడు.''

''అతని కాదృష్టే ఉంటే.... ఇంతకాలం ఎందుకు ఈ మౌనం?"

''అతనిది నాగరక హృదయం .... నీ విప్పుడు నాగరికురాలవైనావు."

''హేమకన్నా నా?"

''హేమ యిప్పుడు సన్నిహితురాలు కాదు.''

''నాకన్న ఆమే సన్నిహితురాలు- మేనమామ కూతురు."

''బంధుత్వానికీ, సాన్నిహిత్యానికీ చాలా తేడా వుంది.''

"నీ వన్నది నాకర్థంకాలా.''

''బంధుత్వం మనోగతమైంది. సాన్నిహిత్యం శరీరగతమైంది.''

''అతని మనస్సులో బంధుత్వమే ఉన్నట్లుంది.''

''అయితేయేం, నీవు సన్నిహితురాలవు.''

''శరీర సాన్నిహిత్యం మనస్సుమీద పనిచేస్తుందా?'

''చేస్తుంది. అదే నీ దగ్గర ఉన్న శక్తి.''

''కాదు. నేను అశక్తురాలను.''

''అదుగో, నీ శక్తిని నీవు అడుగడుగునా విస్మరిస్తున్నావు. అందుకే ఈ తంటాలు.''

"అందువల్ల వచ్చే నష్టమేమిటి?''

"నీ వే శక్తితో గుర్తింపబడ్డావో దానినే నీవు మరచిపోతే నీవే మరపున పడ్డట్టు.''

''ఇంతకూ నీవనే దేంటి?''

"ప్రకృతి శక్తులను వృథా చెయ్యటం ఆత్మకే మోసం.''

"నన్నేం చెయ్యమంటావు?''

''నీవు స్త్రీవి. నీవొక ఆలంబనం లేంది బ్రతకలేవు. అదే నీలో రేగిన అశాంతి. నీ లక్ష్యాన్ని చాకచక్యంతో సాధించుకో."

మల్లిక మగతగా లేచి వొళ్ళు విరుచుకొంది. మెల్లగా లేచి హరి గదిలోనికి వెళ్ళింది. అతడు దుప్పటిలో వణికిపోతున్నాడు. మల్లికకు భయం వేసింది. ఆత్రంతో అతని ప్రక్కన మంచపు పట్టెమీద కూర్చుంది. అతని నుదుటి మీద చేయివేసి చూచింది. టెంపరేచరు వచ్చినట్లుంది.

''ఏమిటండీ! చలిజ్వరం వచ్చిందా?"

"లేదు.... ఏమీ లేదు." గజగజ వణుకుతూ సమాధానం.

"అయ్యో! ఇదేమిటి ఇలా వణికిపోతున్నారు?" అని మల్లిక దుప్పటిమీద హరి వెన్నును నిమిరింది. కొన్ని క్షణాల్లో హరికి చలి తగ్గింది. ముఖంలో తేట కనపడింది.

"చాల కృతజ్ఞుణ్ణి మల్లికా!"

"ఏంజరిగింది?"

"చలిగాలిలో వచ్చాను. చల్లని నీరుతో కాళ్ళు, చేతులు కడుక్కున్నాను. అమాంతంగా చలి పుట్టుకొనివచ్చింది." తడబడుతూ అన్నాడు హరి.

"నన్ను లేపకపోయారా?"

"నీ కెందుకు శ్రమ కలిగించాలని...."

''మీరు నాకోసం యింత శ్రమ పడుతుండగా, నే నీమాత్రం శ్రమ పడటం తప్పా?

ఒక క్షణం నిశ్శబ్దం.

''నీ వీరోజు నిజంగా విరియపూసిన మల్లెతీవియలా ఉన్నావు మల్లికా! నీ పేరు సార్థకమైంది.''

''ఎంత మంచిమాట అన్నారు! ఈ మాటా, ఈ రోజూ నా జన్మలో మరచిపోలేను."

''నీవు అల్పసంతోషివి.''

''మీరీ రోజు నన్ను ముద్దుగా మన్నించారు.... మీ కెలా కృతజ్ఞతలు తెల్పేది?" అంటూనే హరి ముంజేతిని తన చేతుల్లోకి తీసికొని, ఆమె పెదవుల కానించుకొని, కోమలంగా ముద్దు పెట్టుకున్నది.

''ఏమిటిది మల్లికా?" హరి ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు.

''ఏమున్నది? నేనేం తప్పు చేశాను?" మల్లిక అయోమయంగా ప్రశ్నించింది

హరి ఆలోచిస్తూ ''అవును. నీవేం తప్పు చేయలేదు" అని లేచి నిలువ బడ్డాడు. మల్లిక కూడా నిలువబడింది.

''మల్లికా! భోంచేశావా?"

''అయ్యో! ఆకలి సంగతే మరచాను....రండి....భోజనానికి" అంటూ వంటగదిలోకి వెళ్ళిపోయింది మల్లిక.

అయోమయంగా నిలువుటద్దంలో తన ప్రతిబింబాన్ని తాను చూచు కున్నాడు హరి.

## 33

వాకిట్లో రిక్షా దిగిన కామేశ్వరమ్మను చూచేసరికి ఎదురుగా హాలులో కూర్చొని వున్న మాణిక్యాంబా, హేమా ఆశ్చర్యపడి ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారు. కామేశ్వరమ్మ ఆ యింటి గడప త్రొక్కటం అదే మొదటిసారి కావటంతో బెరుకు బెరుకుగానే లోపలి కడుగు పెట్టింది. హేమ ఎదురువచ్చి

పలకరించి లోనికి తీసుకపోయి మాణిక్యాంబకు పరిచయంచేసి సోఫాలో కూర్చో పెట్టింది.

"ఇవ్వేళ చాలాదూరం వచ్చారే మీరు!" మాణిక్యాంబ పలుకరింపు. మొదటిమాటే కామేశ్వరమ్మకు కష్టమనిపించింది. కార్యార్థియై వచ్చింది కాబట్టి నిగ్రహంతో సమాధానం చెప్పింది - "ఈ దూరం దగ్గర చేసుకుందామనే వచ్చాను."

"మాలతి కాలేజీలో చేరింతర్వాత యిటు రానేదాలేదు" హేమ.

"ఎక్కడమ్మా! ఉదయం ఇంటిపని, తర్వాత కాలేజీ - సాయంకాలం ఉద్యోగం. అలాగే రోజులు దొర్లిపోతున్నాయి."

"ఎదిగినపిల్ల.... అటు ఇంటికీ - ఇటు ఆఫీసుకూ అక్కరకు వచ్చింది" మాణిక్యాంబ గుడ్లు తిప్పుతూ అన్నది.

"సమయాని కాదుకొని దాన్ని మీరే ఒక కంట కనిపెట్టి ఉన్నారు'' కామేశ్వరమ్మ.

"అందులో మా ప్రమేయం ఏమీలేదండోయ్.... అంతా మావాడిదే."

"మీరొకటీ మీ అబ్బాయి ఒకటీనా?''

"అలా వుంటున్నా మనేగా లోకానికి కడుపుమంట.వాడి క్షేదో తంపులు పెట్టి మాకు దూరంచేస్తే కాని వాళ్ళ కళ్లూ చల్లబడవు" - మాణిక్యాంబ మాటల్లోని అన్యాపదేశం అర్థమైనా కామేశ్వరమ్మ తమాయించుకొన్నది.

''అయినవాళ్ల మధ్య ఏవో అభిప్రాయ భేదాలు రావచ్చు. కాని, మబ్బుల్లాగా గాలికి వచ్చి గాలికి కొట్టుకొని పోతాయి. కలకాలముండవు లెండి."

''మా యిల్లు ఛిన్నాభిన్నమైపోతే చూచి నవ్వాలని వాళ్ళ ఉద్దేశం.''

''అయ్యో! అంతమాట లెందుకులెండి! మీ సహనమే మీకు తోడుగా ఉంటుంది.'' కామేశ్వరమ్మ సౌమ్యంగా మాట్లాడటం మాణిక్యాంబకు మరీ చిరాకనిపించింది.

''మాలతి బి.యస్సీ. పూర్తయిన తర్వాత ఏంచెయ్యాలని అనుకుం

''ఏదో ఉద్యోగం చూచుకొని తన దారి తాను చూచుకుంటుంది''- మాణిక్యాంబ.

తల్లీ కూతుళ్ళిద్దరూ తన రాకలోని ఆంతర్యాన్ని గమనించి వక్ర మార్గంతో అవహేళన చేస్తున్నట్లనిపించింది. లోలోన క్రుంగిపోతున్నా కామేశ్వ రమ్మ గంభీరంగా సంభాషణ కొనసాగించింది.

''దాని విషయమే ఒంటరిదాన్నైన నాకొక సమస్యగా తయారైంది.''

మీరు ఒంటరివారేం కర్మ? మీకూ ఆప్తులు చాలామంది ఉన్నారుగా?'' మాణిక్యాంబ దొరికిన అవకాశాన్ని జారవిడువకుండా దాడి చేస్తోంది.

''మన జీవితాల్లో ఎందరో స్నేహితులు తటస్థపడుతూ ఉంటారు. కొందరు స్నేహితులౌతారు. కొందరు దూరంగానే ఉండిపోతారు." కామేశ్వరమ్మ.

''అమ్మా! కామేశ్వరమ్మగారెందుకో వచ్చారు. నీవు లోకాభిరామాయణం ప్రారంభించావు'' హేమ అసలు విషయం కదిలించింది.

''అవునమ్మా! నేను మిమ్మల్ని ఒకటి అభ్యర్థించటానికి వచ్చాను'' -ఇద్ద రితో అన్నది కామేశ్వరమ్మ.

''అవును. ప్రయోజనం లేకుండా ఎవరైనా ఎందుకు వస్తారు?'' మాణి క్యాంబ.

"అది లోకధర్మం. నేను కొండంత ఆశతో వచ్చాను, మీరు మాపట్ల చూపుతున్న ఆదరాన్ని గణించుకొంటూ.''

''చల్లకు వచ్చి ముంత దాచట మెందుకు?.... ఆ మాటేదో బైట పెట్టండి"

మాణిక్యాంబ వైఖరి కామేశ్వరమ్మ సభ్యతా సంస్కారాన్ని గాయ పరచిండి. బాధపడుతూనే సంభాషణ సాగించింది; ''హేమా మాలతీ ప్రాణ మిత్రులు. వాళ్ళిద్దరి స్నేహం బాంధవ్యంగా మార్చుకుందామని మాలతి అభిల షిస్తోంది. అందుకని మా అమ్మాయిని మీ కోడలుగా స్వీకరించి నన్ను కృతార్థు రాలిని చేయమని ప్రార్థించటానికి వచ్చాను." కామేశ్వరమ్మ సవినయంగా అడిగింది.

మాణిక్యాంబకు చిరాకు హెచ్చింది. హేమ ఏమీ మాట్లాడలేకపోయింది.

"మీరు స్వయంబుద్ధితోనే వచ్చారా మా యింటికి?''

మాణిక్యాంబ మాటకు హేమా కామేశ్వరమ్మా అదిరిపోయారు.

''ఎవరి క్రియలకు వారే బాధ్యులౌతారు" - కామేశ్వరమ్మ.

''అది సరేలెండి. ఈ మధ్య నాటకాలాడించటానికి కొందరు సూత్రధారులు బయలుదేరారటగా?'" - మాణిక్యాంబ.

''ఇది నాటకం కాదు. చిత్తశుద్ధితో చేసిన విన్నపం'' - కామేశ్వరమ్మ.

''మీది నాటకం కాదు కాని.... నాటక ఫలం."

''మీ మాట లర్థం కావటం లేదు" - కామేశ్వరమ్మకు ఓర్పు క్రమంగా సడలుతోంది.

"ఎంత అమాయకులండీ మీరు! మీరీరోజు మా యింటికి రావటానికి కొన్ని వారాలనుండి ఎత్తులువేశారు. వయసు వచ్చిన పిల్లను ఉద్యోగమనే నెపంతో మా మధుమంజరిలో ప్రవేశపెట్టారు. మావాడిని మచ్చుచల్లి మీ వైపు ఆకర్షించగల్గారు. వాళ్ళిద్దరూ రహస్యంగా జరిపే ప్రణయ కలాపాలకు ఆమోద ముద్రతో మౌనం దాల్చి పరోక్షంగా ప్రోత్సాహమిచ్చారు. అది యిప్పుడు శ్రుతిమించి రాగాన పడుతోంది. మీ పిల్ల ప్రవర్తనమీద అధికార ముద్ర వేయించటానికి యిప్పుడు పెళ్ళి ముహూర్తం కావలసివచ్చింది." మాణిక్యాంబ వడగండ్ల వానగా మాట్లాడింది.

''మీరసలు విషయాన్ని అపార్థం చేసుకున్నారు" - కామేశ్వరమ్మ బాధపడింది.

''గుడ్డివాడికి కూడా కనపడే సత్యం. అపార్థాలకు ఆస్కారమే లేదు." మాణిక్యాంబ విసురుగా అన్నది. ఇంతలో హేమ కల్పించుకొన్నది :

''అయితే కామేశ్వరమ్మగారూ! మా అమ్మ చెప్పిందంతా అపోహయే అనుకుందాం అనుకోండి. మాలతి ఫస్టియర్‌లో ఉంది కదా! గ్యాడ్యుయేట్ అయిం తర్వాత వివాహం చేయకూడదండీ? ఇప్పుడీ తొందరెందుకు?" హేమ.

''నేనో జబ్బులమారి మనిషిని. ఏ రోజెలా ఉంటుందో! దాన్ని ఒక యింటి దాన్ని చేసి కన్నుమూద్దామని" - కామేశ్వరమ్మ.

''ఇన్ని రోజులు గడిచాయి. ఇంకొక సంవత్సరంలో మునిగిపోయిందేముంది?"

''హేమా! నీకు తెలియందేముంది చెప్పు? మీ అన్నయ్యా మాలతిని మొదటినుండీ అభిమానించటం తెలుసు నీకు. దానికి నీవు కూడా సంతోషించిన దానివి."

''అభిమానించటంలో తప్పేముందండీ?''

''తప్పేమీ లేదు కాబట్టే.... అట్టి అభిమానమే మీ వద్దనుండి కూడా అభ్యర్థిస్తున్నాను.''

''ఇన్ని విషయాలు మీరే మాట్లాడుతున్నారు. మరి నే నపార్థాలు తీశానని ఇందాక సాధించారు!'' మాణిక్యాంబ ఎత్తిపొడిచింది.

''నిజమైనదాన్ని ఒప్పుకోవటంలో అభ్యంతరం లేదు....కాని....''

''అవును. మీరు చెప్పినవన్నీ నిజాలు. మే మాడేవన్నీ అబద్ధాలు. అంత సత్యసంధులు మాతో వియ్యమందటానికి ఎలా వచ్చారో ఏమో?''

"మీరు నా ప్రార్థనలోని యథార్థాన్ని గుర్తించమని ప్రాధేయపడుతున్నాను"

"యథార్థమంటున్నారు కదా! నే నొక ప్రశ్న అడుగుతాను, యథార్థమైన సమాధానం చెపుతారా?'' మాణిక్యాంబ నిలదీసింది.

''అబద్ధం చెప్పవలసిన అవసరం లేదండీ నాకు.''

''మా వాడికి సంబంధా లొస్తున్నాయని తెలిసి మీరు వచ్చారుకదూ?''

''అవును. నా అభిప్రాయం మీ ముందు పెట్టవలసిన ధర్మం ఒకవైపూ, యోగ్యుడైన వరుని చేతుల్లో కన్నకూతుర్ని ఉంచవలసిన బాధ్యత మరొకవైపూ త్రోసికొని మీ వద్దకు తీసుకొని వచ్చాయి.''

''మీరు సంబంధం కొరకు యత్నించటం న్యాయంకాని, ఇతర సంబంధాల్ని చిట్లకొట్టటం న్యాయమేనా?'' మాణిక్యాంబ నిష్ఠురంగా అడిగింది.

కామేశ్వరమ్మకు పిడుగుపడినట్లయింది. ''మీరు నా మీద లేనిపోని నేరం వేస్తున్నారు.''

"కాదు. ఉన్నమాట అంటున్నాను."

"మీ అబ్బాయి కేయే సంబంధా లొచ్చాయో నా కసలే తెలియదు.... వాటిని చిట్లకొట్టే దుర్బుద్ధి నాలో పుట్టినా, నా శక్తి ఎంత? నే నెంత?"

"మీరు ఊఁ అంటే చాలు - ఊళ్ళు కాల్చివచ్చేవాళ్ళున్నారు మీ చేతుల్లో."

"మీ రంటున్నది నా కర్థం కావటంలేదు."

"అవసరమైనవి మీ కర్థంకావు. అయినా మీ మాట మీకే తెలియటానికి చెప్తాను. మాధురిని మా అబ్బాయికి చేసుకుందామని పెళ్ళిచూపులకు వెళ్ళి వచ్చాం. వాళ్ళు సుముఖంగానే ఉన్నారు మొన్న - నిన్న మాత్రొ ఆఫీ మాధురి ఫోను చేసిందట."

"ఏమని?"

''మీ అమ్మాయి తనని మా మధు పెళ్ళిచేసుకుంటానని వాగ్దానం చేశాడని మాధురితో చెప్పిందట! ఆ అమ్మాయి అది నమ్మి, 'మీ కొడుకును ఆడపిల్లల జీవితాలతో ఆటలాడవద్దని మందలించండి' అని ఫోను చేసిందట! ఆయనగారు ఉగ్రులై నిన్న మధుమంజరికి వెళ్ళారు. అక్కడ వాళ్ళిద్దరూ చిలకా గోరింక ల్లాగా ఎక్కడికో తిరగటానికి పోయారట! ఇవన్నీ అబద్ధాలు, అభూత కల్పనలూ అంటారా కామేశ్వరమ్మగారూ?"

"నాకీ విషయం తెలియదు."

''మీకు కొన్ని విషయాలు తెలుసు. కొన్ని తెలియవు. అందుకనే ముందే అడిగింది - మీరంతట మీరే వచ్చారా, ఎవరైనా చెప్పి పంపారా? అని.''

"మా అమ్మాయి తన అభిప్రాయం చెప్పి, మీ దగ్గరికి వెళ్ళిరమ్మంది.... నేను వచ్చాను."

''ఇక్కడ కూడా మీరు నిజం దాచుతున్నారు. మీ జట్టు కందరికీ నాయకుడు హరి. అత డాడిస్తున్నా డీ తోలుబొమ్మలాట! ఆయన చేసిన నిర్వాకం చాలు. అందర్నీ ఇంట్లో తెచ్చిపెట్టుకొని పోషించటానికి ఇది ధర్మసత్రం కాదు. మాకు సాటైనవారు వియ్యానికి వస్తారు. సమాన హోదాలో అడుగుతారు. సర్వ లాంఛనాల్తో చెల్లిస్తారు. సవ్యంగా వివాహం జరుగుతుంది. ఈ నక్క వినయాలూ, ఈ అబద్ధాల్తూ, ఈ నాటకాలూ మా ముందు సాగవు. ఇంతకన్నా మీకీ విషయంలో చెప్పేదేం లేదు. మాణిక్యాంబ ముఖం ప్రక్కకు తిప్పింది.

కామేశ్వరమ్మ గుడ్లనీళ్ళు గుడ్ల కుక్కుకుంటూ నెమ్మదిగా బయలుదేరి బయటికి వచ్చేసింది." తన వెనుకనే తలుపు వేసిన చప్పుడు గట్టిగా వినపడింది. గుండెమీద గొడ్డలిపెట్టు తగిలినంత బాధపడింది.

## 34

కామేశ్వరమ్మ యింటికి చేరేసరికే ఆమె నరాలన్నీ ఉద్వేగస్థితి నందుకున్నాయి. ఎలా రిక్షా దిగిందో, ఎలా యింట్లోకి చేరిందో ఆమెకు స్మృతే లేదు. ఆమె తూలుతూ రావటం మల్లిక చూచింది. ఆత్రంతో కామేశ్వరమ్మగారి వాటాలోకి వచ్చింది. కామేశ్వరమ్మ మంచంమీద పడి బోరుబోరున ఏడుస్తోంది. దుఃఖ తీవ్రతకు తట్టుకోలేక ఆమె వృద్ధ శరీరం కంపించిపోతోంది. మల్లిక

ఆమెను ఓదార్చటానికి యత్నిస్తోంది కాని, లాభంలేకపోతోంది. క్రమంగా కామేశ్వరమ్మ వణుకు తగ్గింది, కన్నీళ్లు తగ్గాయి. మత్తువచ్చిన మనిషిలా కన్నులు మూతలుపడి మంచంమీద చేష్టారహితంగా పడిపోయింది. మల్లికకు భయం వేసింది. ఎవరినైనా పిలుద్దామని బయటకు వచ్చింది. హరి అప్పుడే రిక్షా దిగి వస్తున్నాడు. మల్లిక అతనివైపు పరుగెత్తి రుద్ధకంఠంతో తడబడుతూ జరిగిన విషయం చెప్పింది.. హరి పరుగున కామేశ్వరమ్మ మంచం దగ్గరకు వచ్చి నుదురుపట్టి చూచాడు. పేలిపోతోంది. ఇంటి ఎదురుగ్గా ఉన్న సోడా కొట్లో ఐసు ముక్కలు తెచ్చి, నీటిలో వేసి, అందులో తడిపిన గుడ్డను నుదుటిమీద ఉంచమని మల్లికకు చెప్పి, పది నిమిషాల్లో డాక్టరును పిలుచుకొనివచ్చాడు. డాక్టరు ఆమెను పరీక్షించి రక్తపుపోటు అధికంగా ఉందనీ, మానసిక సంక్షోభం వల్ల మెదడునరాలు బలహీనమై సొమ్మసిల్లిందనీ, రోగి మనస్సుకు గట్టివిశ్రాంతి అవసరమనీ చెప్పి, ఇంజక్షనూ, మందూ ఇచ్చి వెళ్ళాడు.

అర్థగంటకుగాని కామేశ్వరమ్మకు దేహంమీద స్మృతి రాలేదు. మూలుగుతూ కన్నులు తెరిచింది. హరీ, మల్లికా తనకు రెండు వైపులా సపర్యలు చేస్తున్నారు. వాళ్ళను చూచి గొల్లుమన్నది కామేశ్వరమ్మ.

"మామ్మగారూ! ఏమిటిది ఎన్నడూలేని ప్రళయం?" హరి ఆత్రంతో అడిగాడు.

"మా కర్మ" అని మళ్ళా బావురుమన్నది,

"భూదేవి వంటి క్షమా మూర్తులు....మీలో ఏమిటి ఈ కల్లోలం?" -హరి.

"చేసిన తప్పుకు అనుభవిస్తున్న శిక్ష."

"మీరేదో బాధపడుతున్నారు. నేను వినగూడనివాడనా?"

"ఇంతదూరం వచ్చాక దాచితే దాగుతుందా?"

"మీరేదో గూఢంగా మాట్లాడుతున్నారు."

"కడుపు చించుకుంటే కాళ్ళమీదపడుతుంది "

"మావలన మీకేమైన ఇబ్బంది కలిగిందా?"

"ఎవరికర్మ కెవరు బాధ్యులు?"

"ఇప్పటికీ యీ కర్మపదం రెండుసార్లు ఉపయోగించారు. దైవసంకల్పం వల్ల మనం సన్నిహితులమై ఉన్నాము. మీరు మాతల్లిని స్మరపించ్చారు. మీకుటుంబ

క్షేమాన్ని కోరేవాళ్ళలో మేమొకళ్ళం. మీరు మీ వ్యక్తిగత కారణాలవల్ల బాధ పడుతున్నా మీకు సాయశక్తులా సహాయపడదామన్న ఉద్దేశంతోనే అడుగుతున్నాను."

కామేశ్వరమ్మ అతని మాటలకు కొంత మెత్తబడింది. "మాలతికి సంబంధం చూడటానికి వెళ్ళాను."

"మాలతి వివాహమా?"

"రాత్రి అదే నన్ను వెళ్ళి రమ్మన్నది."

"వరు డెవరు?"

"మధుమంజరి మేనేజరు మధు."

మల్లిక పాలుకాచుకొని వచ్చింది. హరి కామేశ్వరమ్మను త్రాగమన్నాడు. ఆమె మొదట వద్దన్నా వాళ్ళిద్దరి బలవంతం మీద తాగింది.

"మీరు చెప్పిన విషయం సంతోషింపదగిందే.... మరి యిదేంటి?" హరి.

"కొరవితో తలగోక్కున్నందుకు ఫలం."

"వాళ్ళంగీకరింపలేదా?"

"అపోహలు కలిగేటట్లు ప్రవర్తించింది మనం. వాళ్ళనని ప్రయోజనమేంటి?" హరి మనస్సు చివుక్కుమన్నది. ఒక్క క్షణం నిరుత్తరుడైనాడు.

"అక్కడేదో పెద్ద నాటకమే జరిగినట్లుందే."

"నాటకాలాడే కీర్తి కూడా మనకే దక్కింది."

"ఆ లెక్కకు వస్తే యిరుపక్షాలవారు ఎన్నుకోవలసిన పనిలే దిచ్చట."

"వయసు వచ్చిన పిల్లను విచ్చలవిడిగా వదలినందుకు భగవంతుడు నాకు గుణపాఠం చెప్పాడు." కామేశ్వరమ్మ కంఠం జీరపోయింది.

హరి చకితుడైనాడు. మల్లిక చేతిలోని పాలగ్లాసు నేలమీద పడింది.

"మాలతిని శంకిస్తున్నారా?" హరి ఆశ్చర్యంతో ప్రశ్న.

"అవునయ్యా! శంకించేది ఎప్పుడూ ఆడదాన్నే. నమ్మించి ఊబిలో దింపి నవ్వుతూ తప్పుకొనే మగవాళ్ళందరికీ బలి అయ్యేది ఆడదే."

"మధు మీరన్నంత ద్రోహి కాడు."

"నే నెవ్వరినీ ఏమీ అనే స్థితిలో లేను. మీకు శ్రమ కాకపోతే, మాలతిని ఆ పాడు ఉద్యోగానికి రాజీనామా ఇవ్వమనండి .... ఆనాడే అనుకున్నాను ఈ అయాచితమైన అదరానికి అంతరార్థమేదో ఉండి ఉంటుందని."

"మామ్మగారూ! మీ భావం నా కర్థమైంది. ఈ అనర్థానికంతా మూల కారణం నేను. కాని, మీరనుకున్నట్లు మాలతీమధులు నిందార్హమైన ప్రవర్తనకు గురి అయినారనుకోవటం పొరపాటనుకుంటాను. అసలు మీరీ విధంగా సంబంధం మాట్లాడాలని వెళ్ళనున్నట్లు ఒక్కమాట నాతో అన్నట్లైతే...."

"నీవు వెళ్ళివచ్చేవాడివా?"

"ఎవరు వెళ్ళినా సమాధానం ఒకటిగానే ఉండేది. కాని, మీకీ బాధ లేకుండాపోయేది."

"వాళ్ళతో మాట్లాడటంవల్ల కొన్ని క్రొత్త విషయాలు కనుగొనగల్గాను."

"ఇక్కడ మీ కొకమాట చెప్పాలి. మాణిక్యాంబ సామాన్యమైన మనిషి కాదు. ఆమెకు విమర్శించటానికీ, ఆడిపోసుకోవటానికీ ఎదుట ఎవరైనా ఒకవ్యక్తి కావాలి. ఆమెకు బంధుత్వం లేదు, ఆత్మీయత లేదు, సభ్యత లేదు. మల్లిక అక్కడ ఉన్నన్నినాళ్ళు ఆమె నాడిపోసుకుంది. ఆమె దూరమైంది. మధు దొరి కాడు; హేమనుకూడా మన్నించదు అవసరమొస్తే. ఇక మామగారు ఆమె చేతిలో కీలుబొమ్మ. ఎదుటి మనిషిలో వ్యక్తిత్వం కనబడితే ఆమె సహింపలేదు. బానిసల సామ్రాజ్యానికి సామ్రాజ్ఞి కావలసిం దామె. ఆమె మీ సభ్యత నాసటగా తీసు కొని, మిమ్మల్ని అనరాని మాట లనివుంటుంది."

"ఇన్ని విషయాలు తెలిసిన మీరందరూ కలిసి మాలతిని కత్తులబోనులో పడవేయాలని ప్రయత్నించారన్న మాట!"

"మామ్మగారూ! మీ రన్నీ తెలిసినవారు. ఆవేశంతో గతాన్నంతా విస్మ రించి, యిప్పుడు మమ్మల్ని వేరుగా భావించడం అంత భావ్యంకాదు."

"ఇక గతాన్ని స్మరిస్తే నాకు మిగిలేది విచారమే."

"మీలో తీవ్రమైన మార్పు కనపడుతోంది. కారణం చెప్పకుండా మమ్మ ల్నందరినీ కలిపి అపరాధులుగా శంకిస్తున్నారు."

"నే నెవ్వరినీ అనటంలేదు బాబూ! నా పిల్లను నే ననుకుంటున్నాను."

"మీ కూతురు నా చెల్లెలు. నా చెల్లెలిమీద ఈగ వాలటంకూడా నా కిష్టం లేదు" అన్నాడు హరి.

కామేశ్వరమ్మ కన్నులు చెమ్మగిల్లాయి. మల్లిక అతనివైపు కన్నార్ప కుండా చూస్తోంది,

"మీరు చెప్పకపోతే సరాసరి నేనే మాలతిని అడుగుతాను.'' హరి నిష్ఠురంగా అన్నాడు.

"నీ చెల్లెలు మధును వివాహ మాడుతుందట!''

''మధు దాని కంగీకరించాడా?"

"ఆయనగారే అసలింతకూ ప్రేరకుడు."

"అయితే మీరు భయపడ వలసిన అవసరంలేదు."

"అంటే.''

''వాడు ఆడితప్పడు."

''అతనికి తల్లిదండ్రుల అంగీకారం లేదు."

''వాడు దానిని లక్ష్యం చెయ్యడు.''

''అంత బలవంత మాఘస్నాన మెందుకు?''

''వధూవరుల మధ్య తీయని అనురాగముంటే - ప్రళయం కూడా వారిని వేరు చేయలేదు."

''అయినా వారి అంతస్తు వేరు - మా అంతస్తు వేరు.''

''ఈ యెత్తుపల్లాలే మానవధర్మ రథ చక్రాల సుఖగమనానికి అవరోధాలై అమాయక జీవుల ప్రాణాలను బలికొంటున్నవి.''

''మాకా రథాలు లాగే శక్తి లేదు..... ఆ మీద బాధలు భరించే ఓపికా లేదు.''

''జాతికి సందేశాన్నివ్వవలసిన ఉపాధ్యాయినులు మీరే యింత దిగాలు పడితే దేశ మింకేం కావాలి? ఈ విషయాన్ని నాకు వదలండి. మా ప్రవర్తన మీద తెచ్చిన ఈ అభియోగాన్ని క్షాళన చేసుకోవలసిన బాధ్యత మామీద వుంది. నే నింకొక గంటలో ఢిల్లీకి బయలుదేరాలి. తిరిగి వచ్చేసరికి వారం రోజులు పడుతుంది. అందాకా కాస్త ఓపికపట్టండి. ఆవేశపడి మాలతి మనసు నొప్పించకండి. నా మాట నమ్మండి. నటరాజస్వామి మన పక్షంలో ఉంటే ఎట్టి అన్యాయమూ జరుగదు" అని హరి లేచి నించున్నాడు.

''మల్లికా! మాలతి ఉన్నా లేకపోయినా మామ్మగారిని కంటికి రెప్పలా కాపాడే బాధ్యత నీది. మనది విదిలించుకుంటే పోయే అనుబంధం కాదని ఆమె కర్థం కావాలి" అంటూ హరి వెళ్ళిపోతూంటే కామేశ్వరమ్మ కనులొప్పగించి చూస్తూ కూర్చుండిపోయింది.

## 35

రైలు బయలుదేరటానికి ఇంకా పది నిమిషాలుండగా హరి నాంపల్లి స్టేషనుకు చేరుకోగలిగాడు. మధు ప్లాట్‌ఫారంమీద ఇరవై నిమిషాలనుండి హరికోసం కాచుకొని ఉన్నాడు. హరి రాగానే హోల్డాలు, సూట్‌కేస్ రైలు పెట్టెలో పెట్టించి హరి లోనకూర్చుండగా తాను బయట నిలువబడి కిటికీగుండా సుఖప్రయాణం, పోతున్న పనిలో జయం కలగాలని విష్ చేశాడు మధు.

"మధూ! నీతో ఎంతో మాట్లాడాలిసివుంది ఈవేళ.... కాని, వ్యవధానం లేదు."

"ఏమిట్రా అంత తీవ్రమైన విషయం?"

"నీవు మాలతిని వివాహమాడతానని మాట ఇచ్చావా?"

మధు ఒక క్షణం ఆగి "అవును" అన్నాడు.

"కామేశ్వరమ్మగారిచేత మీ తల్లిదండ్రుల నడిగించావా?"

"మాలతి వాళ్ళమ్మ నివ్వేళపోయి రమ్మన్నదట!"

"మీ అమ్మ అంగీకరిస్తుందని నీవనుకున్నావా?"

"అంగీకరించదని నాకు తెలుసు. కాని, వారివైపు బాధ్యత నిర్వహింప బడినట్లవుతుంది."

"మీ అమ్మవాళ్ళు నిరాకరిస్తే?"

"నా సత్యాగ్రహం ఉండనే ఉందిగా!"

"నీ సత్యాగ్రహం చల్లంగుండా. మీ అమ్మ అన్నమాటలకు కామేశ్వరమ్మ హిస్టీరియా వచ్చి పడిపోయింది. ఆమెను నార్మల్ కండిషన్‌లోకి తెచ్చేసరికి ఎంతో శ్రమ అయింది.'"

"అంతపని జరిగిందా?"

"మీరిద్ద రిదివరకే ప్రేమకలాపాలు జరుపుతున్నారనీ, మాలతిని ప్రయోగించి నిన్ను వలలో వేసుకోవటానికి మేమంతా యత్నిస్తున్నామనీ అన్నదట మీ అమ్మ."

"దీనికంతా నేను కారణమైనందుకు సిగ్గుపడుతున్నాను."

"నీవు మాలతికి ఉద్యోగమిచ్చేటప్పుడు ఈ వివాహోద్దేశం నీలో వుందా?"

ఒక అరనిమిష మాగి మధు "ఉన్నది" అన్నాడు.

"అరి పిడుగా! ఇంత పనిచేస్తూ ఒక మాటన్నా నాతో అనలేందేం?"

"నీ వూహించగలవనుకున్నాను.''

''నీవు తొందరపడటంవల్ల కామేశ్వరమ్మకు అవమానం జరిగింది. ఆమె చాలా బాధపడుతోంది."

"ఆమె బాధ తొలిగే మార్గం నేనాలోచిస్తానులే.... నీవు భయపడకు.''

''మరలా తొందరపడి ఏ ఘనకార్యం తలపెట్టకు.''

''అంత అవసరం రాదనుకుంటాను. వస్తే హరిలో రంగ హరి.... మా పాపాల కన్నిటికీ పైన దేవుడున్నాడు.''

అప్పటికే బండి సాగి క్రమంగా వేగాన్నందుకుంటోంది. హరికి ఆప్యాయంగా మధు వీడ్కోలు చెప్పాడు.

మధు వాడిపోయిన ముఖంతో వేగంగా మధుమంజరికి వచ్చాడు. మాలతి దైవు చేస్తోంది.

''నేను మీ అమ్మగారిపట్ల అపరాధం చేశాను మాలతీ!'' - మధు.

''అదేమిటండీ అలా అంటారు?'' మాలతి.

''మీ వైపునుండి మా తల్లిదండ్రుల నడగమని అనడం పొరబాటు''

''ఇప్పుడేం జరిగింది?''

''మన మనుకున్నంత జరిగింది. మీ అమ్మగారిని మా వాళ్ళు అవమానించారట! ఆమె దానికి తట్టుకోలేక హిస్టీరియా వచ్చి పడిపోయారట. ఇప్పుడు కొంచెం తేరుకున్నారట.''

మాలతి నిరుత్తరయై తలవంచుకొని కంటతడి పెట్టింది.

''మాలతీ! నాదొక్కమాట. నీనింతవరకూ ప్రతి అడుగునా మా యింటి వాళ్ళతో యుద్ధం చేశాను. నాకిది అలవాటైంది కాబట్టి నాకేమీ ఆశ్చర్యం లేదు, విచారం లేదు. ఈ ఉడత ఊపులకు బెదిరి నా వజ్రసంకల్పాన్ని మార్చుకొనేది మాత్రం లేదు. ఇది ప్రళయం వచ్చినా మారని సత్యం."

''మా అమ్మ చాల అభిమానం గల మనిషి. దీని ప్రభావం ఎంత దూరం వెళ్తుందోనని నాకు చాలా భయంగా ఉంది''

మధు ఒక్క క్షణం నిశ్శబ్దంగా ఉన్నాడు. మాలతి బల్లవద్దకు వెళ్ళి రెండు చేతులానించి నిల్చువబడి మాట్లాడాడు: ''కథ యింత దూరం వచ్చిం

తర్వాత మనం మనల్ని దాచుకొని లాభం లేదు. నేను బాహాటంగా నిన్ను వివాహమాడతాను. నీవు దాని కంగీకరిస్తావా?'' అతడు సూటిగా ఆమె కన్ను ల్లోకి చూస్తూ అడిగాడు. అతని చూపుల్లో ఆమెమీద ఉన్న అనురాగం, విశ్వాసం, తన నిర్ణయాన్ని సాధించుకోవాలనే ఉత్సాహం కొట్టవచ్చినట్లు కనపడుతున్నాయి. అతని ముఖంలో మాలతి సంపూర్ణ విశ్వాసాన్ని భావించింది.

"నేనిక మీతోడిదాననే!" ఆమె ముఖంలో సాహసరేఖ తళుక్కుమన్నది.

"చాలు మాలతీ, చాలు! నీ మాట నాకు వేయి యేనుగుల బలమిచ్చింది. సంఘమంతా ఏకమై మన వివాహాన్ని గర్హించనీ, యమకింకరుల్లాగా మన బంధువులు మనల్ని హింసించనీ, నా బాటలో నా అదృష్టమే ముళ్ళకంచెలు నాటి దావాగ్నులు మండించనీ.... నీవు నా ప్రక్కనే వుంటే చాలు.... చాలు మాలతీ, నా జీవితం అమృతభాండంలా తొణికిసలాడుతుంది. పున్నమివెన్నెలలా విరిసిపోతుంది." తన్మయత్వంతోకూడిన ఆవేశంతో చేతులు విసురుతూ అన్నాడు మధు.

అత డామె కంటికి ఆనంద తాండవం చేస్తున్న నటరాజస్వామిలా గోచరించాడు.

మాలతిని వెంటనే యింటికి పంపివేశాడు మధు. కామేశ్వరమ్మకు తన వలన మనస్తాపం కలిగినందుకు "క్షమించమ"ని మరీ మరీ మాలతికి చెప్పి పంపాడు. షో రూంలోకి వచ్చాడు మధు. చిత్రవిచిత్రాకృతులతో తయారుచేయ బడిన రేడియో సెట్లు నన్నిటినీ ఉత్సాహంతో చూచి అయిదారు రేడియో సెట్లకు ఒకేసారి ట్యూన్ చేశాడు. అన్నీ కలిసి జంత్రవాద్య సమ్మేళన సుస్వరాన్ని మ్రోసాయి. ఉత్సాహంతో ఆ శబ్ద తరంగాల మధ్య నాద బ్రహ్మలా అవ్యక్తా నందంతో కాసేపు తిరిగాడు. వర్క్‌షాపులో పనిచేస్తున్న వాళ్ళందరికీ స్వీట్లు, టీలూ తెప్పించాడు అందర్ని ఉత్సాహంగా పలుకరించాడు; ఏవేవో కబుర్లు చెప్పాడు. మధుమంజరి నంతా కలయతిరిగాడు.

మధుమంజరి కార్మికవర్గమంతా యజమానివింతప్రవృత్తికి ఆశ్చర్యపడింది; అదేదో ఆనంద పారవశ్యమని అందరూ అనుకున్నారు. ఆ అకాల వర్షానికి కారణం మాలతీ స్వయంవరమేమోనని ఊహాగానం చేశారు. తమలో తాము నవ్వుకున్నారు. యజమానిని హృదయాల్లో అభినందించారు.

సాయంకాలం ఏడున్నరకు రామచంద్రయ్య నౌకరుతో ఒక లేఖ మధుకు పంపాడు. అతడు విసుగ్గా దాన్ని తీసి చదివాడు. ప్రతి పంక్తి చదివే కొద్దీ అతనిలో క్రోధాగ్ని ప్రకోపించి ప్రజ్వలించటం ప్రారంభించింది. ఉత్తరం ముగించి దాన్ని బల్లమీద గట్టిగా విసిరికొట్టి నౌకరును గట్టిగా పిలిచి "మధు మంజరిని మూసివెయ్" అని పెద్దగా అరిచాడు.

గజగజా వణుకుతున్న నౌకరు ఏం చెయ్యాలో తోచక గుడ్లప్పగించి నిలువబడ్డాడు.

"నీకేరా చెప్పేది. కార్మికులనందర్నీ వెళ్ళిపొమ్మను. గుమాస్తాను కాష్ బుక్ తెమ్మను. ఈ రోజు పని చాలు."

"అలాగేనండి" అంటూ నౌకరు మధు ఆజ్ఞను నిర్వహించాడు. గుమాస్తా షాపు మూసి తాళంచేతులు టేబిల్‌మీద పెట్టి వెళ్ళిపోయాడు.

"మూశావా మధుమంజరిని?" నౌకరు నడిగాడు మధు.

"మీరే చెప్పారు కదండీ!"

"తలుపులన్నీ వేశేయ్ ఇంకే కాగితం లోపలికి రాకుండా."

"ఏంటి బాబూ .... ఎన్నడూ లేంది .... ఇయ్యాల అదో రకంగా వుండారు?"

"నన్నొంటరిగా ఉండనీ కాసేపు."

"మీ బాదేదో సెప్పండి బాబూ! మీ గంజి తాగుతున్నాను. మీకు నా పాణం అడ్డేస్తాను."

"నీ అమాయక ప్రేమ నాకు తెలుసు. అందుకే నా బాధలు చెప్పి నిన్నూ బాధించదలుచుకోలేదు. నీవు వెళ్ళి నీ పెళ్ళాం బిడ్డలతో హాయిగా కాలం గడుపుకో.... వెళ్ళేటప్పుడు ఓ లెటర్ మా నాన్న కిచ్చి వెళ్ళు" అని రామచంద్రయ్య పంపిన లేఖ మీదనే కలంతో గబగబా నాలుగు వాక్యాలు వ్రాసి కవరులో పెట్టి నౌకరు కిచ్చి పంపివేశాడు.

నిశ్శబ్దంగా ఉన్న మధుమంజరిని నాల్గుమూలలా కలియ జూచాడు. మాలతి టైపుచేసే మిషనుముందు కూర్చున్నాడు. గాఢమైన ఆలోచనా సమాధిలో మునిగి ఉన్నాడు మధు. అతని చేతివ్రేళ్ళు అప్రయత్నంగా టైపురైటరుమీద లాస్యం చేశాయి. ఒక పెద్ద తెల్ల కాగితం నిండా ఇంగ్లీషులో టైపక్షరాలు

ముద్రితమౌతున్నాయి. "మాలతీ! నీ కన్యాయం జరుగకూడదు.... మాలతీ! నీ కన్యాయం జరగకూడదు" ఇవే మాటలు పునరావృత్తి చెందుతూ మాలలు మాలలుగా రామకోటిలాగా సాగిపోతున్నాయి.

## 36

మాలతి యింటికి వస్తూనే తల్లిని కౌగిలించుకొని ఏడ్చింది. కామేశ్వరమ్మకూ కన్నులు చెమ్మగిల్లాయి. ఆప్యాయంగా తల నిమురుతూ మాలతిని ప్రక్కన కూర్చుండబెట్టుకుంది. మల్లిక ఆ సన్నివేశం మొగం వాచినట్లు చూచింది.

మల్లిక మాలతికి మధ్యాహ్నం జరిగిన కథంతా చెప్పింది. హరివలన మధు స్టేషనులో ఈ విషయం తెలిసికొని తనను త్వరగా పంపాడని మాలతి చెప్పింది. కొన్ని క్షణాలు నిశ్శబ్దం రాజ్యం చేసింది. నీరసంగా కామేశ్వరమ్మ మాట్లాడటం మొదలెట్టింది.

"నీవు చేయమన్న ప్రయత్నం చేశాను, భంగపడ్డాను."

"నీ చేత లాంఛనంగా మాత్రమే అడిగించటం జరిగింది. మనపట్ల దోషం లేకుండా."

"ఇప్పుడు దోషమంతా మనదే అంటున్నారు."

"ఇందులో దోష మేమున్నదట?"

"ఆస్తిపాస్తులులేని ఒక పంతులమ్మ పిల్ల లక్షాధికారి కొడుకును పెళ్ళాడతాననటం దోషం."

"ఇది యిరువురి అంగీకారం మీద జరుగుతున్న వివాహం!"

"మాలతీ!" అని గద్దించి ప్రారంభించింది కామేశ్వరమ్మ: "జరుగుతున్న వివాహం అనటానికి ఎక్కడా అవకాశం లేదిప్పుడు. వారి పెద్దల అంగీకారం అతనికి లేదు. కాని, అతడు లక్ష్యం చేయడనే అనుకుందాం. ఆపైన వారివలన లెక్కలేనన్ని బాధలకు గురికావలసివస్తుంది మనం."

"నా అదృష్టవశాత్తు వ్యక్తులు మారవచ్చు. ఈ రోజు శత్రువులైనవారు రేపు ఆప్తులు కావచ్చు."

"వాళ్ళల్లో పాతుకొని ఉన్న తారతమ్యదృష్టిని ఎవరి అదృష్టాలూ మార్చలేవు తల్లీ!"

"అనుకూలురు కాని బంధువులున్నారని అనుకూలుడైన వరుణ్ణి కోల్పోమంటావా అమ్మా?"

''పాములు చుట్ట వేసికొని ఉన్న చందనపు వృక్షాన్ని దూరాన్నుంచి చూడవచ్చునుగాని దరిచేరటం శ్రేయస్కరం కాదమ్మా!''

"వారు నాకోసం ప్రాణాలివ్వటానికైనా సిద్ధంగా ఉన్నారు.''

"అది పాల పొంగువంటి ప్రథమోత్సాహం. కలకాలం నిలుస్తుందని నమ్మలేము."

"వారిలో కపటమేమీ కనపడదు."

"ఉద్యోగ మివ్వటంలో కొంత కపటం లేదంటావా?"

"అది కపటనాటకమైతే.... మనకోసమేగా ఆడింది.''

"మనకు ధానివల్ల లాభంకన్నా నష్టం ఎక్కువ కల్గుతోంది."

''ఎలా నష్టమమ్మా? యోగ్యుడైన యువకుడు అల్లుడుగా దొరుకుతున్నాడు. అతడు లక్షాధికారి కొడుకు. నిన్ను చిల్లిగవ్వ కట్నమడగటంలేదు. ఆయన మన ఐశ్వర్యాన్ని చూచి నన్ను కోరటం లేదు. మన యోగ్యతను మన్నిస్తున్నాడు. ఇంతకన్నా లాభదాయకంగా నాకు నీవు వివాహం చేయగలవా?''

కామేశ్వరమ్మ క్షణకాలం మారుమాటాడ లేకపోయింది. ''ఇందులో నాకు లాభం కల్గుతుందనే ఆశకన్నా నీకు తర్వాత సాంసారిక జీవితంలో మానసికంగా శాంతి ఉండదేమోనని నా భయం. మనిషికి శాంతిలేని సంపద బీడుపడ్డ చేనులాంటిది."

''నీవనేదేమిటమ్మా అయితే?"

''గతాన్ని విస్మరించి మన త్రోవ మనం చూచుకోవటం ఉత్తమం. మన మెంత ఘనంగా ఆ యింటికి వెళ్ళినా మన యోగ్యతకు గణింపు లేదు. మన అభిమానానికి ఆదరింపు లేదు. అభిమానాన్ని అమ్ముకున్నదానికన్నా ఆత్మత్యాగం ఘనం."

మాలతి తల్లిమాటకు మారాడక తన గదిలోకి మెల్లగా వెళ్ళిపోయింది.

మల్లిక కామేశ్వరమ్మకు పండ్లరసం ఇచ్చింది.

"అత్తయ్యగారూ! మనందరం కలిసిమెలసి ఉంటున్నా మనలో కూడా ఇన్ని తేడాలున్నాయన్నమాట!" మల్లిక.

''అజ్ఞానుల దృష్టికి అన్నీ అంతరాలే.... జ్ఞానదృష్టికి అంతా సమానమే" కామేశ్వరమ్మ.

''మరి మీరు టీచరమ్మలు కదా!.... మీకు జ్ఞానదృష్టి ఉంటుంది కదండీ?"

''ఏమిటే నీవనేది?"

"మీకు కూడా ఈ తేడాలు ఉన్నాయా?"

"ఉంటే నీ చేతి నీళ్ళు త్రాగి ఉండేదాన్నికాను."

''అయితే ,జ్ఞానదృష్టిలో వీళ్ళిద్దరి పెళ్ళి న్యాయమేనంటారా?"

''ఈ మధ్య నీ కతి తెలివి పుట్టిందే మల్లికా!"

''చేస్తోంది గురుసేవకదా,'' మల్లిక నవ్వింది.

''హరిగారు రానీ నీ ఆగమంతా ఆయనకు చెప్తాను.''

''ఆగము - ఆగము అంటే ఆయన మాత్రం పట్టుకుంటారా?'' అంటూ మల్లిక లోపలికి పరుగెత్తింది.

## 37

రామచంద్రయ్య గారింట్లో రాత్రి భోజనాలయ్యాయి- కాని మధు భోజనం చేయలేదు. అతడు తన గదిలో లోగడియ వేసుకొని పడుకొన్నాడు. హేమ పోయి తలుపు తెరవమని బ్రతిమిలాడింది. అతడు ''నన్ను పలకరించకండి. నా పాటికి నన్నుండ నివ్వండి" అని గట్టిగా లోపలినుండే సమాధానం చెప్పాడు. హేమ తన గదిలోకి వెళ్ళి కూర్చుంది బిక్కమొగంతో.

రామచంద్రయ్య విషయాన్ని గమనించి మాణిక్యాంబను పంపాడు. ఆమె తలుపు వద్దకుపోయి తట్టి పలుకరించింది. ''నాన్నగారు రమ్మంటున్నారు బాబూ!" అని పిలిచింది బ్రతిమిలాడినట్లు. ''ఎవరు నూరి పోస్తున్నార్రా యీ బుద్ధులు? మెత్తని నీ మనసును ఎవర్రా మొండిగా తయారు చేస్తున్నారు?'' అని తలుపు దగ్గరే వాపోయింది.

''మీ నాన్నగారు నీతో ముఖ్యమైన మాటలేవో మాట్లాడాలట్రా'' అని కొంచెం గద్దించినట్లు మాట్లాడింది. "కాగితం మీద రాసి పంపమను. సమాధానం రాసి పంపుతాను'' అని లోపలి నుండి సమాధానం. "ఏమో నాయనా మీమాటలు మీకే అర్థం కావాలి'' అని అనుకుంటూ రామచంద్రయ్యకు మధు అన్నమాటలు చెప్పింది. ఆయన ముఖం నల్లకప్పు వేసిపోయింది.

రామచంద్రయ్యే మధు తలుపు తట్టి పిలిచాడు. ఒక క్షణం తర్వాత మధు తలుపు తెరిచాడు. మధు రోషభీషణంగా బుసలుకొడుతున్నాడు. రామచంద్రయ్య మొదట గదిలోకి వెళ్ళటానికే జంకాడు. కాని, వెళ్ళి కూర్చున్నాడు. మధు తలవంచుకొని పళ్లు కొరుకుతున్న గుర్తుగా దవడలుబ్బిస్తూ తన్ను తాను నిబ్బరించుకుంటూ తండ్రి యెదుట సుంచంమీద కూర్చున్నాడు.

''నా మాటను నిరాకరించేంత వరకు వచ్చిందన్నమాట!'' - రామచంద్రయ్య.

''అనుచితమైన ఆజ్ఞను అనుసరించే దానికన్నా నిరాకరించటమే ధర్మం'' మధు.

''మేనేజరుగా నా ఆజ్ఞను అనుసరించటం నీ ధర్మం.''

''యజమాని వక్రమార్గాన నడిస్తే సవ్యమైన మార్గం చూపటం కూడా నా ధర్మమే.''

''నీ నడవడిక వలన మన పరువెంత నష్టమౌతోందో నీవు గుర్తించటం లేదు.''

''పరువు నష్టపు పనులు నేనేమీ చేయలేదు.''

''మాధురి సంబంధం నీ ప్రవర్తనవల్ల చిట్లిపోయింది. నన్ను ముఖంమీద నానా మాట లన్నది.

''మీరు మీ ఇష్టంమీద ఆ సంబంధం చూచారు. దానివలన వచ్చిన ఫలితానికి నేను బాధ్యుడనుగాను.''

"దీని కంతటికీ నీవే బాధ్యుడవు."

"దేని కంతటికి?"

"మాలతివలన మనకు వచ్చిన అప్రతిష్ఠకు."

"మీరు దేనిని అప్రతిష్ఠగా భావిస్తున్నారో....అది నాకు ప్రతిష్ఠ."

"నీవీ మొండివాదం మాని నా మాట వింటావా లేదా?" రామచంద్రయ్య గద్దించాడు.

"తండ్రిగా మిమ్మల్ని పూజిస్తాను. మధుమంజరి ప్రొప్రయిటరుగా మిమ్ము గౌరవిస్తాను. ధర్మబద్ధమైన నా విధిని నిర్వహిస్తాను. కాని, మీరు నా వ్యక్తిత్వాన్ని ఖాతరు చేయకుండా మీరు బిగించిన చట్రంతో కీలుబొమ్మలా ఇరకమంటే మాత్రం నాకు చేతకాదు."

"అయితే, నీవు స్వతంత్రుడవు కావాలనుకుంటున్నావా?"

''నే నెప్పుడూ స్వతంత్రుడనే.''

''అంటే?''

''స్వతంత్ర ప్రవృత్తితో బ్రతికినవారికి అర్థమౌతుంది స్వాతంత్ర్యపు విలువ. ధనానికీ, అధికారానికీ భయపడి వ్యక్తిత్వాన్ని కోల్పోయేవారికి స్వతంత్రుడు అర్థంకాడు" సూటిగా రామచంద్రయ్యకు తగలాలనే అన్నాడు.

''నాకీ ధర్మపన్నాలతో పనిలేదు. మాలతి సహాయం నీ కవసరంలేదని నేను భావిస్తున్నాను. ఆ టైపిస్టు ఉద్యోగం మధుమంజరికి భారం. దాన్ని తొలగించాలని నా ఆదేశం.''

"నేను మధుమంజరి మేనేజరునే కావచ్చు మీ ఆదేశాన్ని పాటించటానికి. కాని నేను మీకు కన్నకొడుకును కూడా. నా హృదయాన్ని అర్థం చేసుకునే అవసరం మీకు లేదు. ఈ విషయం ఇప్పుడు స్పష్టమయింది. ఇక మధుమంజరికి సంబంధించినంతవరకు జమాఖర్చులే మన యిద్దరి సంబంధం.''

''వ్యాపార విషయాల్లో అలా ఉండటం వ్యవహార ధర్మం.''

మధు మాటాడలేదు. కాలి బొటనవ్రేలితో నేలను రాపిడి చేస్తున్నాడు. భుజంమీద ఉన్న టవలు దారాలు పీకి క్రింద పారేస్తున్నాడు.

''నీ వివాహ విషయంలో నీకు కొన్ని సలహాల నివ్వదలచుకొన్నాను." రామచంద్రయ్య విషయాంతరాన్ని ఉపక్రమించాడు.

''నా నిశ్చయం నే నిదివరకే చెప్పాను. నన్ను కన్నకొడుకుగా భావిస్తూంటే, నా కోరిక మన్నించండి" మధు ఖండితంగా అన్నాడు.

''ఏమిటిరా యీ బెదిరింపు?"

''బెదిరిస్తోంది మీరు!"

''నీవు రోజురోజుకూ కొరకరాని కొయ్యవౌతున్నావు" అని రామచంద్రయ్య లేచాడు.

మధు మాట్లాడలేదు.

''నీ వంశ గౌరవం మీద్న, నీ తల్లిదండ్రుల అభిప్రాయాలమీద గౌరవం ఉంటే, నీవు మాలతిని గూర్చిన అభిప్రాయం మార్చుకో....లేకపోతే....'' అని

యేదో అనబోయి సగంలో ఆగి, గబగబా గదిలోనుండి వెళ్ళిపోయాడు రామ చంద్రయ్య.

## 38

"హే భగవాన్! ఎక్కడి కీడుస్తున్నావు నన్ను? లోకంలో నా మనస్సు నర్థం చేసుకొని సానుభూతి చూపేవా రింకెవ్వరూ లేరు. తల్లిదండ్రులు పట్టు దల మనుషులు. చెల్లెలు తల్లిదండ్రులను కాదనలేదు. కామేశ్వరమ్మ అభిమాన ధనురాలు. హరి శాంతికాముడు. నాలో రగులుతున్న ఈ అగ్నిజ్వాల లెవ్వరికీ అర్థం కావు. నే నేం కోరుకుంటున్నాను? నా జీవితంలో నా సహధర్మచారిణిగా నాకు నచ్చిన వ్యక్తిని ఎన్నుకుంటానంటున్నాను. దానికోసం కొంత ప్రయత్నం చేశాను. ఆమెకూ తగిన వ్యవధానాన్నిచ్చాను నన్నర్థం చేసుకోవటానికి. ఆమె నన్ను మనసారా కోరుతోంది. నాతో ఏ గంగలోనైనా దూకటానికి సిద్ధంగా ఉంది. ఇది లోకం దృష్టిలో దోషం, ద్రోహం, నాటకం - అందుకని నా మీద క్రోధం, పగ, ధిక్కారం. ఈ సంధిలో....సంఘర్షణలో నేను నేనుగా నిల వాలి! నే నిప్పుడు దాసోహమంటే, నా జీవితమంతా అంధకారమే అవుతుంది. నా కోర్కె అధర్మం కానప్పుడు, నా ప్రవర్తన నిష్కల్మషమైనప్పుడు, నాతో సహకరించటానికి మాలతి సర్వదా సిద్ధమైనప్పుడు ఇక నా ప్రస్థానానికి తిరుగు లేదు! నా సంకల్పానికి వికల్పం లేదు. నా బాటలో నేను వెనుకాడకుండా తల యెత్తుకొని నడిచే సామర్థ్యం నాకు ప్రసాదించు కారుణ్యమూర్తీ!" అని మధు హృదయంలో భగవంతునికి కైమోడ్పు లర్పించాడు.

"మాలతీ! మిన్ని పార్ట్ టైము ఉద్యోగం నుండి తప్పించమని నాకు ఉత్తరువు వచ్చింది." అప్పుడే ఆఫీసుకు వచ్చి తన సీటులో కూర్చుంటున్న మాలతితో మధు అన్నాడు.

మాలతి నిశ్చేష్టురాలైంది. బెదరు చూపులతో అలాగే నిలువబడి పోయింది. మధు నవ్వుతూ "నీకు ఖాయమైన ఉద్యోగం వచ్చిందని తెలిసి ఈ ఉద్యోగం వద్దన్నారు. అంతే" అని అన్నాడు.

"అంతే?" తెల్లబోయింది మాలతి.

"నీవు గృహిణివిగా ఒక యువకుని క్షేమ సామ్రాజ్యాన్ని పరిపాలింప వలసిన గురుతరమైన బాధ్యత నీమీద పడబోతోంది కదూ! అప్పుడీ ఉద్యోగం చేయటానికి తీరుబడి యెక్కడ ఉంటుంది?"

''మీరు వేళాకోళ మాడుతున్నారా?''

''వేళాకోళా లాడే స్థితి దాటింది. వేగంగా నిర్ణయాలు తీసుకొనే గడియలు వచ్చాయి."

"మన నిర్ణయాలు కార్యరూపం తాల్చటానికి పెద్దల అనుమతి దొరికే సరికి మరికొంత కాలం పట్టవచ్చు."

"ఇప్పటికే కాలహరణమైంది. ఈ పెద్దలకు గుణపాఠం చెప్పాలి. వారు ముందడుగు వెయ్యలేరు. వెనుకఅడుసులో దిగబడిన కాలును పీక్కోలేరు. ఈ అసమర్థులను నమ్ముకుంటే మన భవిష్యత్తు మనకు చేజిక్కదు. దీనికోసం మనం కార్యశీలులం కావాలి. రా! నా వెంట నడు."

"ఎక్కడికి?"

"మన వివాహ రణభేరి మ్రోగించటానికి!"

మాలతి పగలబడి నవ్వింది "వివాహం....రణభేరి" అని అంటూ.

మధు ఆమెతో శ్రుతి కలిపాడు. ఇరువురూ టాక్సీలో వెళ్ళిపోయారు.

## 39

ఆ రోజు మాలతి పుట్టినరోజు పండుగ.

తొలికోడి కూతకే లేచారు మాలతీ, మల్లికలు. మల్లిక మాలతికి తలంటి నీళ్ళు పోసింది. కురులారబెట్టి, వాలుజడ అల్లింది. కనకాంబరాలు, మల్లెపూలు, మరువము, దవనము కలిపి కట్టిన దండ జడనిండా తురిమింది. తన నగలు కూడా ఆమెకే పెట్టింది. కంటికి కాటుకరేఖ తీర్చింది. మొగమున కల్యాణ తిలకం దిద్దింది. కాలికి పారాణి పెట్టింది. గజ్జెలందియలు కట్టింది.

కామేశ్వరమ్మ స్నానం చేసి, నటరాజ స్వామికి పూజ చేస్తోంది. మల్లె పూల దండల మధ్య బిల్వపత్రాలు వజ్రాల మధ్య మరకతాల్లాగా మెరసిపోతు న్నాయి. అర్ధనారీశ్వరుని మోము లోక కల్యాణప్రదమైన మందహాసంతో ముద్దులమూట కడుతోంది.

మల్లిక ఆ క్రిందటి రాత్రే ఇల్లంతా కడిగి, రంగవల్లులు తీర్చింది. మామిడాకు తోరణం కట్టింది. గడపకు పసుపు, కుంకుమ పెట్టింది. "ఏమిటే, పెళ్ళిల్లులాగా అలంకరిస్తున్నావు?" అని కామేశ్వరమ్మ తనను మెచ్చుకుంటూంటే లోలోన ఉబ్బిపోయింది.

నటరాజస్వామికి మంగళ నీరాజనమెత్తింది కామేశ్వరమ్మ. ధవళకాంతుల నీనుతున్న స్వామి విగ్రహ నైగనిగ్యంమీద నీరాజన దీపకాంతులు కనకాభిషేక భ్రాంతిని కల్పిస్తూ, స్వామి ఈశ్వరత్వాన్ని స్థాపిస్తున్నవి.

నీరాజనానంతరం మాలతీ, మల్లికలు నాట్యసేవను సమర్పించారు. మల్లిక శివుడుగా, మాలతి పార్వతిగా భావించుకొని, ఆదిదంపతుల అమలప్రేమకు నాట్యవ్యాఖ్యానం చేశారు.

ఆ రోజు వంటా పెట్టూ అంతా మల్లిక. పంచభక్ష్య పరమాన్నాలు చేసింది. ముగ్గుపై వేసిన పసుపుపీటమీద ''మా యింటి యిలవేల్పువమ్మా!'' అని సంబోధిస్తూ మాలతిని కూర్చోపెట్టింది. క్రొత్త చీర కట్టబెట్టింది. మంగళారతి పాడింది. వెండికంచంలో వేడిబువ్వ తినిపించింది. అనురాగ చిహ్నంగా తాంబూలం కట్టి యిచ్చింది. కామేశ్వరమ్మకు పెందలకడ భోజనం కావాలి కాబట్టి, పదింటికల్లా వంటయింటి పని పూర్తయింది.

''అత్తయ్యగారూ! మాలతి పెళ్ళికూతురులా లేదూ?'' - మల్లిక.

''కన్నతల్లిని నేనెన్నడూ దాని కింత వైభవంగా చేయలేదు పుట్టినరోజు పండుగ''-కామేశ్వరమ్మ.

"మాలతి పెళ్ళి రోజున ముస్తాబు పనంతా నేనే చేస్తాను.''

"ఒక్క- ముస్తాబేమిటి? అన్నీ నీచేతిమీదగుండానే జరగాలి."

"పెళ్ళంటే నాకు చిన్నప్పటి నుండీ బలే సరదా!'' మల్లిక అమాయకంగా అన్నది.

"జీవితంలో ఏదో ఒకరోజు ఆ శుభ ముహూర్తం కూడా వస్తుంది.''

"మన మాలతి కా ఘడియ ఎప్పుడు వస్తుందా అని చూస్తున్నాను."

''అది మన ప్రయత్నాలవల్ల వచ్చేది కాదు; దైవం తోసుకరావాలి."

"మాలతీ! మే మిన్ని మాటలు మాట్లాడుతుంటే నీవు ఒక్క మాటా మాట్లాడవేం?'' గడ్డం పట్టుకొని మల్లిక ప్రశ్నించింది.

"మీరే అన్నీ మాట్లాడుతున్నారు....అన్నీ నన్ను గూర్చే....ఇక నేనేం మాట్లాడేది?" అని మొగం తప్పించుకొంది మాలతి. అలాగే కాసేపు కబుర్లు చెప్పుకున్నారు.

''ఇవ్వేళ మధ్యాహ్ననికి హరిగారు వస్తానని చెప్పివెళ్ళారు .... ఇల్లు సర్దాలి, వెళ్తా'' అని మల్లిక లేచింది.

"అన్నయ్య వస్తే భోజన మిక్కడే చేయమనాలి మల్లికా!''-మాలతి.

"చెల్లెలి మాట కాదంటారా?'' అంటూ మల్లిక వెళ్ళిపోయింది.

కామేశ్వరమ్మ మంచం మీద నడుం వాల్చింది. మాలతి తన గదిలో ఒక అరగంటసేపు ఏకాంతంగా పడక కుర్చీలో పడుకుంది. పదకొండు కొట్టటంతోనే మాలతి తన గదిలోనుండి వచ్చి కామేశ్వరమ్మను లేపింది. నటరాజస్వామికి మ్రొక్కివచ్చి తల్లి పాదాలకు నమస్కరించి ఆశీర్వదించమన్నది. "ఏమిటమ్మా యిదంతా?" అంటూనే నటరాజస్వామి పాదాలమీది ఒక పూవును తీసికొనివచ్చి కూతురు సిగలో తురిమింది. మాలతి "ఇదంతా నీ ఆశీర్వాద మమ్మా?'' అని నవ్వింది. తల్లి కన్నులు ఆనందబాష్పాలు నింపుకున్నవి.

"ఈరోజు నా పుట్టిన రోజు .... నీ వాగ్దానం మరచావామ్మా?"

''నీవు సంతోషంగా ఉండటమే నాకు కావాలిసింది."

"అయితే నేను వెళ్ళి వస్తానమ్మా!"

"ఎక్కడికి?"

"నా యిష్ట మొచ్చిన చోటుకు. ఈ రోజల్లా నా యిష్టమే కదమ్మా?"

''పిచ్చిపిల్లవు! ఏది వచ్చినా పట్టదు. ఒంటరిగా వెళ్తున్నావు జాగ్రత్తగా మరల త్వరగా తిరిగి రావాలిసుమా!"

''అలాగేనమ్మా!" అని అంటూ గంభీరంగా నడచిపోయింది మాలతి.

మాలతి రిక్షాలో మధుమంజరి ముందు దిగేసరికి మందహాసంతో ఎదురు వచ్చిన మధు ఆమెను లోనికి తీసుకొని వెళ్ళాడు. మధు పసుపువన్నె సిల్కులాల్చీ తొడిగాడు. పట్టు దోవతి, పట్టుత్తరీయం ధరించాడు. ఇద్దరూ సరాసరి ఆఫీసు గదిలోకి వెళ్ళారు. ఆఫీసుగది వివాహ మండపంలా అలంకరింపబడి ఉంది. వివాహ పరికరాలతో బ్రాహ్మణుడు సర్వసిద్ధంగా ఉన్నాడు. మధు మంజరి కార్మికులు పెళ్ళిపెద్దలు. మధు పెళ్ళి కుమారుడు. అగ్నిదేవుడు సాక్షి. క్రిందటిరోజు వరకూ కార్మికులకు తెలియదీ విషయం. ఆఫీసులో అడుగు పెట్టేసరికి వారి కన్నీ అర్థమైనాయి. అందరూ ఆ విషయం గుండెల్లో దాచుకొని

గుప్తంగా నిరాడంబరంగా యజమాని వివాహాన్ని నిర్వహిస్తున్నారు. మధు మంజరి రేడియోగ్రాములో సన్నాయి వాద్యపు రికార్డులు వినపడుతున్నాయి. పురోహితుని కంఠంలో వివాహ మంగళమంత్రాలు ధ్వనిస్తున్నాయి. మధు మాలతి మెళ్ళో బంగారు మంగళసూత్రం కట్టాడు. మల్లెపూలదండ నుంచాడు. మాలతి కెంపువారిన స్నిగ్ధకపోలాలతో, ముంచుకువచ్చే సిగ్గుతో, మొలచుకొని వచ్చే సాహసంతో మధు మెళ్ళో దండ వేసింది. కార్మికులందరూ స్నేహపుష్పాలతో దీవించారు. మధుమంజరి మౌన ముద్రతో వారిరువురిని తన యొడిలో పెట్టుకొని ముద్దాడింది.

సగౌరవంగా ఆహ్వానింపబడ్డ మారేజి రిజిష్ట్రారు ఆ దృశ్యాన్ని తిలకించాడు. వివాహమైన మరుక్షణమే పసుపుగుడ్డలతో రిజిష్ట్రారు ఆఫీసుకు టాక్సీలో వెళ్ళారు- మాలతీ మధులు, కార్మిక వర్గంలో వయోవృద్ధులు. అక్కడ వారి వివాహం అక్షరబద్ధం అయింది. టాక్సీలు అక్కణ్ణుంచి సరాసరి కామేశ్వరమ్మ యింటికి నడిచాయి. ఒక్కసారి యింటిముందు కార్లాగటం చూచి కామేశ్వరమ్మ హడావుడిగా ముంగిట్లోకి వచ్చింది. అంతకు అర్ధగంటకు పూర్వమే ఢిల్లీనుండి తిరిగివచ్చి స్నానాదులు ముగించుకొని ఉన్న హరి ముంగిట్లోకి వచ్చాడు. మల్లిక ఈ హడావుడి చూచి హరి ప్రక్కకు వచ్చి నిలువబడింది.

టాక్సీలో నుండి నూతన వధూవరులు దిగివచ్చి కామేశ్వరమ్మ పాదాలకు నమస్కరించారు. ఆమెకు కలగంటున్నట్లయింది. నిర్విణ్ణురాలై నిలువబడిపోయింది. మల్లిక గబగబావచ్చి ఆమెను పొదివిపట్టి లోనికి తీసుకపోయి మంచంమీద కూర్చుండబెట్టింది. మాలతీ మధులు నటరాజస్వామికి నమస్కరించారు. కార్మికులు వివాహ సామగ్రిని కామేశ్వరమ్మగారి నట్టింట ఉంచి మధు మంజరికి వెళ్ళిపోయారు. హరికి కాళ్ళక్రింద భూమి గిర్రున తిరిగినంత వనైంది. ఒక్కక్షణం గంభీర మౌనముద్ర దాల్చి నిలువబడిపోయాడు. మధు గబగబా వచ్చి హరిని కౌగిలించుకున్నాడు. అతని చేయిపట్టుకొని కామేశ్వరమ్మగారి యెదుటకు తీసికొని వెళ్ళాడు.

హరి మాట్లాడలేదు. కామేశ్వరమ్మ బొమ్మలా స్తంభించిపోయింది. మల్లిక భ్రమానుపడి నిలిచివుంది.

మధు ఆవేశంతో కామేశ్వరమ్మనూ, హరినీ చూస్తూ అన్నాడు: "నేను మాలతిని తమ్మె అంగీకారం మీదే వివాహం చేసుకున్నాను. మాలతి నా సహ

ధర్మగారిణి గానికి ఈ వివాహపత్రం సాక్షి. రిజిష్ట్రారుముద్ర సాక్షి. ఇది దేవతలు చేసిన పెళ్ళి. దేవుడు మెచ్చిన పెళ్ళి. నేను కపటిని కానని ఈ రోజు గుర్తిస్తే చాలు. ఈ మా అనుబంధం అమరమైపోతుంది."

"చివరకు పెళ్ళికూడా నా కళ్ళకు గంతలు కట్టే జరగాలా?" కామేశ్వరమ్మ కంఠం రుద్ధమై జీరవోయింది. ఆమె కన్నులనుండి రెండు అశ్రుబిందువులు రాలాయి.

హరి పరిస్థితి గమనించాడు. "మామ్మగారూ! ఇక గతాన్ని స్మరించి లాభం లేదు. మీ ఏకైక పుత్రిక పసుపుగుడ్డలతో మీ నట్టింటికి వచ్చింది. వొడికట్టు బియ్యం పెట్టి ఆమెను సంతోషంగా అత్తవారింటి కంపటం మీ వంతు."

"ఈ నాటకానికి కూడా నీవే సూత్రధారుడవా?"-కామేశ్వరమ్మ.

"వాడు కాదు, నేను." మధు ముఖాముఖి అన్నాడు. "కాని, ఇది నాటకం కాదు. మేమిద్దరం అగ్నిసాక్షిగా పెండ్లాడాము."

మధు ముఖవర్చస్సు చూచి కామేశ్వరమ్మ తలవంచుకుంది. హరి ముందుకు వచ్చి "మధూ! మీ దంపతు లలా కూర్చోండి" అని రెండు పీటలు వేయించాడు మల్లికతో. వాటిమీద వారిరువురూ కూర్చున్న తరువాత ఎర్రనీరు తీయించి, మంగళారతి పట్టించాడు. మాలతి నుదుట కుంకుమబొట్టు పెట్టించాడు. నడుముకు వొడికట్టు బియ్యం కట్టించాడు. వెండిపళ్ళెంలో పాలు పోయించి, కామేశ్వరమ్మ చేతులందులో ముంచి మధు చేతుల్లో పెట్టించి మాలతినతని కప్పగింపజేశాడు.

మధు కోరికమీద హరి టాక్సీ పిలిపించి నూతన వధూవరుల నిద్దర్నీ రామచంద్రయ్యగారింటికి పంపాడు. కామేశ్వరమ్మ మాటామంతీ లేకుండా మంచం మీద సొమ్మసిల్లి పడుకొనివుంది. మల్లిక ఒకవైపు ఆశ్చర్యం, ఒకవైపు భయం, ఒకవైపు సంతోషం పెనవేసుకొనిపోతూ ఉంటే భూమిమీద కాలు నిలువక తిరుగుతోంది. హరి యే మాటా మాట్లాడలేని అవ్యక్తస్థితిలో సతమతపడుతున్నాడు.

ఒక అరగంటసేపట్లో భార్యాభర్తలు తిరిగి కామేశ్వరమ్మ యింటికి వచ్చారు. హరి అంతపనీ జరుగుతుం దనుకున్నాడు. మధుముఖం గాంభీరించి వుంది. మాలతి కన్నులెర్రబడివున్నాయి. అత్తవారింట బొట్టుపెట్టిన చిహ్నం

లేదు. ఇద్దరూ మొగాలు వంచుకొని ఖిన్నులై యింట్లో అడుగు పెట్టారు. హరి మల్లికను కనుసన్న చేసి మాలతి సంగతి విచారించమని పంపాడు. తాను మధును ఒక చేత్తో కౌగిలించుకొని తన గదిలోకి తీసికొనిపోయాడు. మధు హరిని కౌగిలించుకొని పసివాడులా ఏడ్చాడు. హరికి కూడా కన్నీరాగలేదు.

"ఎంత సాహసం చేశావురా మధూ?"

"దేవతలు మెచ్చేరని చేశాను."

"నీవు చేసిన దానిలో తప్పు లేదు."

"నీవు నన్ను క్షమిస్తున్నావా?"

"అపరాధమైతేగా క్షమించేది?.... కాని, కొద్దిలో తొందరపడ్డావు. నేను వచ్చేంతవరకున్నట్లయితే సవ్యమైన మార్గంలో పనులు జరిగేవి."

"లేదురా హరీ! అన్ని మార్గాలూ మూసుకున్నాయి.... ఏమైతేనేం, నేను నడచిన మార్గం న్యాయమని నీవన్నావు-అంతేచాలు."

"మీ తల్లిదండ్రులు లేమన్నారు?"

"నన్నింటినుంచి వెళ్ళిపొమ్మన్నారు."

"అసలు జరిగింది చెప్పు."

''మేమిద్దరమూ వెళ్ళి వాళ్ళకు దణ్ణాలు పెట్టాము. మీలాగానే వాళ్ళూ ఆశ్చర్యపడి, నిశ్చేష్టులైనారు. వాళ్ళ నలాగే నిలవబెట్టి మాలతిని తీసికొని నా గదిలోకి అడుగు పెట్టబోయాను. మా నాన్న బెబ్బులిలా అరిచాడు! 'తల్లి తండ్రులను కాదన్న కొడుకుకు ఈ యింట్లో క్షణకాలముండే అర్హత కూడా లేదు. నీవు నిజంగా అభిమానమున్నవాడివైతే మళ్ళా నా ఇంట్లో అడుగు పెట్టకు. ఈ పసుపుగుడ్డలు ఎక్కడ కట్టావో అదే నీ నివాసం. నీవాళ్ళను కాలదన్నిన నిర్భాగ్యుడవు....నీ వెటుపోతే మాకేం?....నీ ఏడుపు నీవే యేడు....నీకూ యీ యింటికీ ఋణం తీరింది పో!' అని గద్దించాడు. నేను బయటికి వచ్చేశాను.... శాశ్వతంగా వచ్చేశాను." మధు చాలా భారంగా చెప్పాడు.

''హేమ మీ నాన్నగారిని వారించలేకపోయిందా?"

''అది అప్పు డింట్లో లేదు. అది ఉన్నా దానిమాట సాగదు.''

"నీవు నాకన్న గొప్పవాడివిరా మధూ!"

"నీవు నన్ను ఓదార్చటానికి ప్రయత్నిస్తున్నావు."

## 40

కామేశ్వరమ్మ సాక్షీభూతంలా తన కళ్ళ యెదుట జరుగుతున్న సన్నివేశాలు కనులొప్పగించి చూస్తోంది. కాని ఆమెలో సంతోషంగాని, మరి యే ఇతర భావంగాని లేదు. నిశ్చలమైన నిర్లిప్తత ఆమెలో నిండిపోయింది. మల్లికకు చేతి నిండా పని దొరికింది. నూత్నదంపతులకు ఎక్కడా లోపం జరుగకుండా ఇంటి పనులను చాకచక్యంతో నిర్వహిస్తోంది.

మాలతి గదిని తనలో ఉన్న కళాప్రజ్ఞనంతా ప్రోగుచేసి, నిరాడంబరంగా అలంకరించింది.భార్యాభర్తలకు హంసతూలికాతల్పంగా శయ్యను సిద్ధం చేసింది. పూలదండలూ, గులాబీరేకులూ, అగరుధూపాలూ అలముకొన్న ఆ చిన్నగది స్వర్గంనుండి విరిగిపడ్డ రమ్యఖండంగా భాసించింది.

రాత్రి అందరూ కామేశ్వరమ్మగారింట్లో భోజనాలు చేశారు. మధు ఉల్లాసంగా మాట్లాడుతున్నాడు. హరి సమయాన్ని గంభీరంగా పోషిస్తున్నాడు.మల్లిక ఒడలు తెలియని ఆనందావేశంతో సందర్భోచిత కార్యకలాపాన్ని స్వయంగా ఏ లోపం రాకుండా నిర్వహిస్తోంది. మాలతి మూర్తీభవించిన మౌనం. ఆమె ఇంటి పనుల్లో కల్పించుకోవటానికి ఎన్నోసార్లు యత్నించింది. కాని, మల్లిక ఆమెను వారించి, "నీవు మా ఇంటి గౌరీదేవివి. నటరాజస్వామి నిన్ను చూచి నిలువునా పులకిస్తున్నాడు. ఆయన సేవలు చేసుకో. ఇల్లెక్కడికి పోతుంది?.... నేనున్నానుగా? ఈ మధుర క్షణాలు మళ్ళీరావు" అని ఆమె నింటిపనులు తాకనిచ్చేది కాదు.

మల్లిక యాజమాన్యం క్రింద నూత్నదంపతులు శయ్యమీద ఉపవిష్టులైనారు. కామేశ్వరమ్మను మెల్లగా మల్లిక గదిలోకి తీసికొనిపోయింది. నటరాజస్వామిని పూజించిన పుష్పమాల్యం తీసికొనివచ్చి ఆమె చేతిలో పెట్టింది. ఆమె చేత మాలతి దోసిలిలో పెట్టించింది. కామేశ్వరమ్మ కూతుర్నీ అల్లుణ్ణీ కనురెప్పలప్పళిస్తూ అర్ధ9ంగా చూచింది. మల్లిక వధూవరులను వింతవింతగా చూస్తోంది. అభిజ్ఞాన శాకుంతల తృతీయాంకము చివర శకుంతలా దుష్యంతుల సమాగమ సన్నివేశాన్ని నెమరువేసుకొంటూ వింత వింత రుచులను నెమరువేసుకొంటోంది.

హరి ముసిముసి నవ్వులతో లోపలికి వచ్చి "దంపతి తాంబూలా లెవ్వరు తీసుకోవాలి?.... ఇక్కడెవ్వరూ దంపతులు లేరు'' అని అన్నాడు.

మాలతి మల్లిక ముఖంలోకి చూచి నవ్వింది. మధు తలవంచుకున్నాడు. "మీ తాంబూలాలు మీరే పుచ్చుకోండి చూస్తాము.' అని రెండు కప్పురపు తాంబూలాలు దంపతులచేతుల్లో పెట్టాడు హరి. మాలతి కొరికిన విడియం మధు నోటి కందించమన్నాడు.

"ముందు మగవాళ్ళండీ!" మల్లిక చెంగున గంతేసి చెప్పింది.

''అలాకాదు మల్లికా! ఆడవాళ్ళ అనుమతి లేంది మగవా డొక అడుగు కూడ ముందుకు వేయలేడు'" హరి చమత్కరించాడు.

"మీ చెల్లెల్ని బాగా వెనుకవేసుకొని వస్తున్నారే మీరు!"-మల్లిక.

"పోనీలే చెల్లీ! వారి మాటప్రకారమే నడవాలంటున్నారుగా? ఇంతవరకూ అలాగే నడిచింది. ఈ కాస్తలో ఏమయిందిలే!"-మధు.

"మనం బెట్టుగానే ఉండా లన్నయ్యా!"-మల్లిక.

"వాడామాట అన్నది బెట్టు సడలటానికి కాదు, దీనికంతకూ బాధ్యురాలు మా చెల్లె లని నిరూపించటానికి''-హరి.

"అయినా ఏం మొక్క మొలవ లేదు లెద్దురూ! మీ మాటలబట్టే తెలుస్తోంది, ఇదంతా ఈమె పన్నిన పన్నాగమే నని''-మల్లిక.

''లోకమాత పార్వతీ దేవే తన భర్తను తాను వలచి వరించింది. మా చెల్లి తప్పేం చెయ్యలేదు''-హరి.

"మీ నాలుకకు రెండువైపులా పదనుంది" అని మల్లిక అనటంతో అందరు గొల్లున నవ్వారు. సగం కొరికి విడెం నునుసిగ్గులతో భర్త నోటికందించింది మాలతి.

"నా కర్ధ ఫలమే దక్కింది,మీ చెల్లెలికి పూర్ణఫలం దక్కిస్తాను"అని తన విడేన్నంతా వద్దన్నకొద్దీ మాలతి నోట్లో తురిమాడు.

"మీ చెల్లికన్నా మా అన్నయ్యే త్యాగి"-మల్లిక.

"అవును. ఈ మహానుభావుడు ఎంత త్యాగియో అంత భోగికూడా!" ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ గదిలోనుండి వెళ్ళిపోయాడు హరి.

దంపతులు కామేశ్వరమ్మకు నమస్కరించారు. ఆమె ఆనందపారవశ్యంలో ఒక్క క్షణం తూగిపోయింది. వాళ్ళిద్దరి శిరస్సులనూ మెల్లగా స్పృశిస్తూ ఆశీర్వదించింది. "అత్తగారి ఆశీస్సు లభించింది. మీకింక భయం లేదు" అని కొంటెగా నవ్వింది మల్లిక. కామేశ్వరమ్మను మెల్లగా గదిలోనుండి తీసుకొని పోతోంది మల్లిక. మాలతి ఆమెతోపాటు వచ్చేస్తోంది. తలుపు దగ్గర ఆమెను ఆపి, "కోరి కొంగుముడి వేసిన వలపుకాణ్ణి ఒంటరిగా వదలి వస్తున్నావే.... నీకు తగ్గ శిక్ష వెయ్యాలి" అని లోనికి మెల్లగా నెట్టి, తలుపు బైట గొళ్ళెం పెట్టింది.

## 41

రామచంద్రయ్యకు అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది. తన కొడుకు తన మీద పంతంగట్టి నెగ్గించుకున్నందుకు, ఆ రహస్య వివాహం మధుమంజరిలోనే జరిగినందుకు అవమానంతో తారాపథంవరకూ మండిపోతున్నాడు. తన ఆధిపత్యం క్రింద ఉన్న సంస్థ తనకు వ్యతిరేకంగా నడచింది. అందులో ఉన్న ప్రతి వ్యక్తీ తనకు వ్యతిరేకిగా అతనికి తోచింది. "విషకీటకాలపుట్ట మధుమంజరి. దాన్ని పెరగనిస్తే అసలుకే మోసం" అని క్రుద్ధుడై లేచాడు రామచంద్రయ్య.

నిప్పులుగ్రక్కుతూ మధుమంజరిలో అడుగుపెట్టిన రామచంద్రయ్యను చూచి కార్మికులు గడగడలాడిపోయారు. మేనేజరు గదిలో వివాహ సన్నాహాలకు సంబంధించిన చిహ్నాలు అతన్ని చూచి నవ్వాయి. రామచంద్రయ్య వర్కుషాపులోకి వెళ్ళాడు. కార్మికు లందరూ ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకొని, పిట్టల్లాగా గుమికూడి నిలిచారు.

"మేనేజరు పెళ్ళెక్కడ జరిగింది?" రామచంద్రయ్య గర్జించాడు.

"..........." అందరూ నిశ్శబ్దం.

"అడుగుతున్నది మిమ్మల్నే"

"అగ్నిదేవుని యెదుట"-ఒక వృద్ధ కార్మికుని సమాధానం.

"నోర్ముయ్!.... ఇక్కడే కదూ జరిగింది?"

"..........." నిశ్శబ్దం.

"దొంగలముఠా అంతా ఒకచోట చేరి నా ఆస్తిని దోచుకతింటున్నారు."

"దొంగ లెవరో దొర లెవరో ఆ భగవంతుడి కెరుక.... ఊరక నోరు పారేసుకోబోకండి"-వృద్ధ కార్మికుడు సమాధానం చెప్పాడు.

"పొగరుపట్టింది వెధవలకు. తగిన శాస్తి చేస్తాను.... మధుమంజరిని మూసివేయండి" అని పెద్దగా కేకపెట్టాడు రామచంద్రయ్య. మరుక్షణంలో మధుమంజరి తాళపుచేతులను కోటుజేబులో తురుముకుంటూ జీపులో రివ్వున పోయాడు.

మర్నాడు పేపర్లలో ''మధుమంజరి మూసివేత" అని ప్రకటింపబడింది. కార్మికులకు సేవాసూత్రాల ననుసరించి జీతబత్యాలు ఇస్తామని హామీ యివ్వబడింది. మధుమంజరి మేనేజరు మధు ఏమైనా ఋణాలు చేసినట్లయితే వాటికి రామచంద్రయ్య బాధ్యుడు కాడని స్పష్టపరుపబడింది.

ఆ వార్త చూచిన మధు పేపరు ముఖాని కడ్డంగా పెట్టుకొని గుండె పగిలేటట్లు ఏడ్చాడు. హరి అతణ్ణి ఓదార్చటం అతి కష్టమైంది.

''నీవు నీ మార్గంలో ప్రళయం ఎదురైనా ఎదుర్కొంటానన్నావు.... ఏదీ ఈనాడా ధైర్యం?"-హరి.

''ఇది ప్రళయంకన్న ఘోరమైందిరా హరీ!"

''ఇప్పుడే నీవు నిగ్రహంతో నిలువబడాలి."

''నా చేతులలో అల్లారుముద్దుగా పెరిగి, ఆటపాటలు నేర్చి, అఖండ కీర్తిని గడించిన నా మధుమంజరి అకస్మాత్తుగా అస్తమించింది."

"నిజంగా మధూ! కన్నకడుపు కోత వంటిదే నీ దుఃఖం. కాదనలేను. కాలం మనల్ని పరీక్షిస్తోంది. కాలూని నిలవాలి. కాలచక్రం ఆగిపోలేదుగా?"

"నేను నా కన్నబిడ్డనూ కోల్పోయాను, నా కన్నవారినీ కోల్పోయాను."

"కాని, యింత త్యాగం ఏ ధర్మంకోసం చేశావో అదే మరలా నిన్ను ఉద్ధరిస్తుంది. కన్నబిడ్డ బ్రతుకుతుంది. కన్నవారు నిన్ను మన్నిస్తారు."

"అది యీ ప్రాణముండగా జరగని పని!" మధు క్రమంగా దుఃఖాన్ని దిగమింగుకున్నాడు. అతని ముఖంమీద విచారం క్రమంగా విరిసిపోయి రోషభావం దీపించింది.

"హరీ! నా భావికర్తవ్య మేమిటి?"

"నీకు ప్రస్తుతానికి మౌనమే శరణ్యం."

"నాకు మౌనంగా కూర్చుండి తపస్సు చేయటం చేతకాదు."

"ఇప్పుడు మీ నాన్నను ఢీకొనటం నిప్పుతో చెరలాడటం వంటిది."

"ఆయన్ను ఊరకవదుల్తానన్నమాట కల్ల- పగ సాధించి తీరతాను, చివ రకు చచ్చైనాసరే....!"

"పగను పగతో సాధించటంకన్న నేర్పుగా నివారించటం మంచిది."

"ధర్మరాజులా సలహా చెపుతున్నావు. ఆయనకే యుద్ధం తప్పలేదు."

"అది ఉద్యోగానంతరం జరిగిన పని."

"అయితే, నన్ను ఉద్యోగిని కమ్మంటావా?"

"ప్రస్తుత కర్తవ్య మంతే!"

## 42

తన వివాహంతోనే మధుమంజరి మూతపడినందుకు మాలతి లోలోన కుమిలిపోయింది. భర్తను కౌగిలించుకొని కన్నీరు మున్నీరయింది.

"మన పెళ్ళిరోజే మధుమంజరి మూయబడటం మన దురదృష్టమండీ! మీరు చేపట్టింది నిర్భాగ్యురాలిని.... కొరనోములు నోచినదాన్ని."

"పిచ్చిదానా! మనం అదృష్టవంతులమే. లక్ష్మివంటి నీవు గడపలో అడుగుపెడితే చీదరించుకొన్నది వాళ్ళు. మధుమంజరి మూతపడటం వాళ్ళకు తీరని నష్టం." ఆమెను ఓదారుస్తూ ధైర్యం చెప్పాడు మధు.

"మగవారు కాబట్టి మీరు సరిపెట్టుకొనగల్గుతున్నారు. నాకు గుండెల్లో బండపెట్టినట్లున్నదండీ!"

"చదువుకున్నదానివి. వివేకవతివి. నీవే బేలవై, శోకమూర్తివైతే నాకింక లోకమంతా శోకమయమే అయిపోతుంది."

"లేదండి....మీరు ధైర్యం చెప్పారుగా....ఇంక కంట తడిపెట్టను."

"అయితే ఏదీ ఒక చిరునవ్వు."

ఆమె మొలకనవ్వు నవ్వింది.

"నీవు నిజంగా సజీవమాలతీలతవు!" మధు ఆమె చుబుకం మీద చిటిక వేశాడు. ఆమె అతని శరీరానికి లతలాగా అల్లుకుపోయింది.

మాలతీ, మధుల మూడు నిద్రలైన తరువాత ఆదివారంనాడు హరి నూతన దంపతులను, క్రొత్తగా ఉద్యోగంలో చేరిన పూర్ణచంద్రరావును తన యింటికి భోజనానికి పిలిచాడు. మంచి మంచి కబుర్లతో భోజనాలయినతర్వాత హాల్లో అందరూ కూర్చున్నారు.

''నేనొక వారంరోజుల్లో విద్యార్థులను వినోద విజ్ఞానయాత్రకు తీసుకొని పోవాలి. ఆలోగా 'కన్యాశుల్కం' నాటకవిషయం మీతో విచారించాలని ఈరోజు మిమ్మల్ని ఆహ్వానించాను"-హరి.

"మధుమంజరి మన కళాపరిషత్తుకు చెల్లెలుగా ఉండేది''-మల్లిక జాలిగా అన్నది.

''సంయోగవియోగాలు కాలప్రభావాలు. గతాన్ని స్మరించి ఉత్తములు కర్తవ్యాన్ని మరువరు"-హరి.

''అవును. బ్రహ్మాండమైన నిజంచెప్పావురా హరీ! గలగలా దుముకుతూ సెలయేరులా ముందుకుపోయే కాలప్రవాహానికి గతం గతమే. ఇక భవిష్యత్తు సాగరసంగమం - అంటే లయం. వర్తమానమే సత్యం. అది చైతన్యవంతం. పరిణామశీలం"-పూర్ణచంద్రరావు.

"ఇక్కడ నాదొక్క మనవి. నీవు పూర్వం మధుమంజరిలో అన్నట్లు సూత్రధారిత్వం తీసుకోవడానికి నాకు తగిన మనశ్శాంతి లేదు. మధుమంజరిని చూడని ఈ నాల్గు రోజులూ నాల్గు యుగాలుగా ఉన్నది''-మధు.

అందరూ ఒక్క క్షణం నిశ్శబ్దం. చివరకు హరి తన నిర్ణయం తేల్చి చెప్పాడు: " కన్యాశుల్కంలో గిరీశం పాత్రకు మన పూర్ణచంద్రరావు నెన్నుతున్నాను. వాడే ఈ నాటకాన్ని రంగంమీదకు తెచ్చే ప్రయత్నం చేయాలి. మన అందరి అండదండలూ అతని కెల్లవేళలా ఉండాలి. నేను దేశయాత్ర ముగించుకొని వచ్చేంతవరకూ మల్లిక కోశాధికారిగా ఉంటుంది. పూర్ణచంద్రరావు కార్యదర్శిగా ఉంటాడు. నేను వచ్చేసరికి నాటకాన్నొక స్వరూపానికి తీసుకొనిరాగలిగారంటే మెరుగులు తరుగులు నేను వచ్చి చూచుకుంటాను."

ప్రతిపాదన మేకగ్రీవంగా అంగీకరింపబడింది.

# 43

మాలతీ మధుల వివాహం మొత్తాని కందరిలోనూ ఒక క్రొత్త చైతన్యాన్ని కలిగించింది.

మాణిక్యాంబ అహానికి పడగమీద దెబ్బ తగిలింది. సత్యాన్ని గుర్తింపక తన వాత్సల్యాన్ని పగగా మార్చింది. భర్తకు విషం నూరిపోసింది. మధుమంజరిని మూతవేయించింది. చేతికక్కరవచ్చిన కొడుకు తనకు దూరమైపోతున్నందుకు రామచంద్రయ్య హృదయం వ్యథపడుతోంది. కాని, భార్య మాటను కాదని బ్రతకలేననే భయంతో ఆ మాటను బయటికి చెప్పలేకపోతున్నాడు. రామచంద్రయ్య మాణిక్యాంబకు కోపం రావటానికి కారణాలు సులభంగా ఊహించుకోగలిగాడు.కొడుకు పెళ్ళి పెద్దయెత్తున చేయలేదు. తన వంశగౌరవం, హోదా నిలబడేవిధంగా వివాహం తన యిష్టప్రకారం జరుగలేదు. తన స్థితికి తగిన కోడలు రాలేదు. ఇందులో చివరిది ప్రధానం. కలవారి అమ్మాయిని మధు రహస్యంగా వివాహమాడినా మాణిక్యాంబకు కోపం వచ్చేది కాదేమో!

హేమకు మాలతిమధుల వివాహం దోషంగా కనపడలేదు. కాని, అత డనుసరించిన విధం కొంత సౌమ్యంగా ఉంటే బాగుండే దనుకొన్నది. కాని, సౌమ్య మార్గం కలిసివచ్చే సూచనలు కానరానందున అన్నయ్య అంత మొండితేలేడని ఊహించుకొన్నది. "పాషాణాన్ని పగలగొట్టాలంటే డైనమైట్ కావాలి. వాడది ఉపయోగించి పని సాధించాడు. కాని, ఇల్లు ముక్కలైపోయిందని నా విచారం" అని లోలోన కుమిలిపోతోంది. నూత్నదంపతులను అభినందించటానికి వెళ్ళాలని మనసులో ఎంతో ఉబలాటపడింది. తల్లిదండ్రుల కఠిన శాసనాలూ, మల్లిక ముఖం చూడలేని లజ్జా ఆమెను కామేశ్వరమ్మగారింటికి పోకుండా చేస్తున్నాయి.

కామేశ్వరమ్మ నాల్గురోజు లీవిషయాన్ని దివారాత్రాలు ఆలోచించింది. "మాలతి కింత స్వతంత్రశక్తి ఎక్కడినుండి వచ్చింది?....అది అతని సాహచర్యం వల్లనే.... దాని కెవరు కారకులు?.... ఎవరో ఎందుకౌతారు?.... నేనే స్వయంగా పోయి దాన్ని మధుమంజరిలో ఉద్యోగంలో చేర్చి వచ్చాను. అయితే, నేనీ వివాహాన్ని ఎందు కాపజాలకపోయాను?....ఈ ప్రవాహంలో నేనూ కొట్టుకొని పోతున్నాను....ఈ ప్రవాహం ఎక్కడిది? వధూవరుల అనురాగబలంలో నుండి పుట్టిన సంకల్పధార.... నేను నా చేతులతో నా కూతురును ముందుకు పొమ్మని వదలి, వెనక చూచి వెతుక్కుంటున్నాను. అంతే.... అంతఃకరణాల

ముందు అంతస్తులు లేవు, అడ్డంకులు లేవు. వీళ్ళ వివాహం నా కన్ను విప్పింది. కాని, మాలతి భావిజీవితాన్ని గూర్చి నాకు కొండంత భయముంది. భార్యాభర్తల వరకు భద్రంగా నడిచింపే వ్యవహారం.... బంధువులలో పడితే బట్టబయ లౌతుంది....బడబాగ్ని రగులుతుంది!" మాలతి భవిష్యత్తు కామేశ్వరమ్మను కలవర పెట్టుతోంది.

మధు సాహసంకన్నా, మాణిక్యాంబ ప్రతీకారం మనస్సును బాగా బాధించింది హరికి. తన ఆత్మీయుడు, బహిఃప్రాణమూ అయిన మధుకు గృహ బహిష్కారమై, మధుమంజరి మూతపడటంతో, లోలోన సగం కృంగిపోయాడు మనిషి. అత డనుకున్నాడు - "మధు సాహసికుడు. ఉరుకులువారే ఉత్సాహం అతని జీవశక్తి. అతడు చేసే పనుల్లో దాని ప్రభావం తప్పదు. చూచేవారికి అతని చేష్టలు కొండ విరిగి మీద పడ్డట్టుంటాయి. ప్రథమంలో కోపం కూడా వస్తుంది. ఆపైన అసలు విషయం తెలుస్తుంది. వాణ్ణి పూర్తిగా అర్థం చేసుకోవ టానికి అపారమైన సానుభూతి కావాలి లోకానికి." ఆ సానుభూతి మధు తల్లి తండ్రులకు లేకపోయిందని వాపోయాడు. మాణిక్యాంబ పీటికన్నిటికి కూడా తానే కారకుడని ఎన్ని అభూతకల్పనలు చేస్తుందోనన్న భయముందికాని, వాటిని లక్ష్యపెట్టే రోజులు గతించాయి. చివరి కతనికి పెద్ద బెంగ హేమను గూర్చి. ఇంతవరకూ మధు తన చెల్లెలి యోగక్షేమం చూచుకుండేవాడు. ఆమె ఒంటరిదై పోయిం దిప్పుడు. మాణిక్యాంబ సహజ దౌర్జన్యం ఆమె మీదకు తిరిగితే చెప్పు కొనే తోడులేక సతమతమౌతుందేమోనని.

మల్లిక మనస్సి వివాహ విషయాన్ని సమీక్షించేటప్పుడు చిత్రమైన త్రోవన నడచింది. "మాలతి తన పెళ్ళి విషయం సన్నిహితంగా ఉన్న నాతో కూడా చెప్పలేదు. కనీసం పుట్టినరోజున పెళ్ళికూతురులాగా ఉన్నావంటే మరు మాటైనా అనలేదు. ఆమె రహస్యంగా అతణ్ణి వలచింది. అలాగే పెళ్ళిచేసు కొంది. పెద్దలకు చెప్పినట్లే చెప్పింది. వాళ్ళనుకూలంగా లేకపోయేసరికి వారిని లెక్క చెయ్యకుండా తన దోవన తాను పోయింది. ఈ వివాహానికి మూలకారణం మాలతి. ఆడవారి అనుమతి లేనిదే మగపురుగు దగ్గరికి రాదని హరి గారన్నారు. ఆయనగూడా ఇలాగే భావిస్తున్నాడన్నమాట!" ఆమె హృదయంలో మెరపు లాంటి భావం తళుక్కుమన్నది. "హరిగారు నాలో ఏదో ఆకర్షణ ఉన్నదని గుర్తించారు. దుష్యంతుడుగా వేషం వేసుకొని తన వలపంతా ఒలకపోశారు.

ఏకాంతంలో నా సాన్నిహిత్యాన్ని రెండు మూడుసార్లు ఆశించారు. మధులాగా నన్ను వివాహమాడి ఉండవచ్చును కదా! మాలతికి లాగా నాకూ జీవితమకరంద మెన్నడో లభించి ఉండేది కదా! అందుకు నా అంగీకారం లేదనేనేమో ఈ వైముఖ్యం? నిజమే. నేనూ మాలతిలాగా నా వరుణ్ణి నేను ఆకర్షించుకోవాలి. సమవయస్సులో ఉన్న మాలతి తన వరుణ్ణి తాను పొందింది. దానిని లోకం అంగీకరించింది. చిలకాగోరింకల్లాగా వాళ్ళిద్దర్నీ చూస్తుంటే నా గుండెల్లో దాగి ఉన్న ఏదో బలమైన కోర్కె అనుభవం కొరకు అర్రులు చాస్తోంది."

గులాబీ పూవులాగా వైవాహిక జీవితం సుగంధం విరజిమ్ముతూంటే, దాని క్రిందనే పొంచి ఉండే ముల్లులా అడుగడుగున కష్టాలు వెంటనంటుతూ ఉంటే ముళ్ళమీదనే పూలపాన్పు వేసుకొన్న వింత సంతృప్తి ఆ నూతన దంపతుల మనస్తాపాన్ని దూరం చేస్తోంది.

## 44

మల్లిక తన గదిలో పడుకొన్నదే కాని నిద్రపట్టటం లేదు. రాత్రి పన్నెండు దాటింది. ప్రకృతి గాఢనిశ్శబ్దంగా వుంది కాని, హృదయంలో మాత్రం అపరిమితమై సంక్షోభం.

తనలో తన యెత్తున దీపజ్వాలగా వెలుగుతూ తన శరీరాన్ని దహింప చేస్తున్న తన కోర్కె తనను నిద్రపోనిచ్చేటట్టు లేదు. ప్రతి శరీరాంగంలోనూ ప్రవేశించి ప్రజ్వలిస్తున్న ఆ కోర్కె ఏదో ఆరని తృష్ణను మేల్కొల్పి తనపై ఉసికొల్పుతోంది. శకుంతల అనుభవించింది యిట్టి అవస్థేనని అరుణాచలనాథ్ నటనావ్యాఖ్యానంలో చెప్పాడు. తనకు రేఖామాత్రంగా స్ఫురించింది వేదిక మీద. ఈరోజది అనుభూతికి వచ్చింది. సర్వజీవనాడులూ తమ శక్తినంతా బలీయమైన ఆ కోర్కెకు బ్రహ్మరథం పట్టుతున్నాయి. తన కింక నిద్రాప్రాప్తి లేదని లేచింది. పన్నెండున్నర కొట్టింది గడియారం.

వాకిట్లో గుడ్డి వెన్నెల. జగమంతా ఆవిరి క్రమ్మినట్లుంది. తన శరీరం సెగలు పొగలు క్రక్కుతోంది.ఒంటిగా తన గదిలో ఉండటానికి మనసొప్పలేదు. తలుపు తీసుకొని హాల్లోకి వచ్చింది. సోఫాలమీద పొర్లాడింది. తీరని సొక్కు; పడుకుంటే ఎక్కువయ్యే అలసట! అయోమయంగా ఉంది అవస్థ.

చర్మం పేలిపోతోంది గ్రీష్మాతపతప్త భూతలంలా తొలకరి చినుకుల చల్లదనంకోసం తపిస్తోంది. గంధపుపొడి నీళ్ళలో కలిపి శరీరానికి పట్టించింది. పైశైత్యం అంతరుష్ణాన్ని ఆరింతలు చేసింది లోపల మథన ప్రారంభమైంది.

"నా అవస్థ ఆయనకు చెపుతాను.... ఒంటరిగా ఎంతసేపని ఈ బాధ?''

''మగవాడి కేమని చెప్పేది?''

''చెప్పకపోతే యీ నా అనుమాన స్థితి కంతెక్కడిది?''

"లోకం నన్ను వేలెత్తి చూపిస్తోంది. లోకానికి తెలుసు - ఆడది ఈ స్థితిలో ఎక్కువ రోజులు నిగ్రహంతో ఉండలేదని.''

"అందుకనే తేల్చుకోవాలి. ఈ కోర్కె నన్ను చంపేస్తున్నది.''

"ఏదో శక్తి నాలో ఉందంటారు అందరూ....నిజంగా నే నెంత శక్తిలేని దాన్ని?"

''ఆయనన్నా, ఆయన భావనన్నా కొంత ఉపశాంతి కలుగుతోంది. ఆయన ఆదరిస్తే మనశ్శాంతి చిక్కవచ్చు. వెళ్తాను. ఈ కోర్కెను ఆయన ముందు నిలబెడతాను. ఇది నా ప్రాణం తీయటం కళ్లారా చూడమంటాను.''

''తెల్లవారుజామున నాలుగింటికి ఆయన వెళ్ళిపోతారు. వెళ్ళిపోయేముందు నాకూ ఈ కోర్కెకూ గల సంబంధం తేలిపోవాలి. నా కాళ్ళమీద నేను నిలబడా లని కదా ఆయన ప్రయత్నం? నేను నిలబడలేను; ఇప్పు డాధారం లేనిది.''

మల్లిక మగతగా లేచింది. ఆమె శరీరం ఆమె నియతిలో లేదు. ఆమె హరి గది తలుపు తెరిచింది. అతడు గంభీరంగా నిద్రపోతున్నాడు. ఇప్పు డతడు ఆమె భక్తితో దర్శించే హరి కాదు, ఆదరంతో పలుకరించే హరి కాదు; హరి రాశీభూతమైన పురుషత్వం!

అతని ఆకృతిని చేరెడేసి కన్నులనిండా నింపుకున్నది. తమకంతో అతని సెజ్జ ప్రక్కకు వెళ్ళింది. అతని ముఖం నిర్వికారంగా మెరిసిపోతోంది. ''ఈ ముఖావం, ఈ నిర్లిప్తతవల్ల నాకు అస్తిత్వం లేకుండా పోతోంది. నేను నేనుగా బ్రతకాలంటే ఈయన ముఖంలోని ఆ నిర్లిప్తత తొలగిపోవాలి, కాదు, తరిమివేయబడాలి'' అనుకున్నది మల్లిక.

అతని ప్రక్కన కూర్చుంది అతన్ని తాకకుండా. ఆమెలో లజ్జకూ మనస్సుకూ సంఘర్షణ, గుండెల్లో ఘోర రణం. లజ్జకు బుద్ధి మాత్రమే సాయం, మనస్సు కింద్రియాల మద్దత్తు. దొమ్మి యుద్ధం చేసింది మనస్సు. ధర్మ యుద్ధం చేసింది లజ్జ. పద్మవ్యూహంలో అభిమన్యుడులా లజ్జ నేలకొరిగిపోయింది. రెండు చేతులూ అతని శిరోజాల్లోకి పోనిచ్చి, అతని వక్షానికి తన వక్షం ఎదురొత్తి, మోముపై మోముంచి మెల్లగా అతనిమీద కొరిగింది మల్లిక శరీరం. వెచ్చని ఊర్పులు, ఊపిరితిత్తుల నూచగొట్టే ఆవేదన. ఏదో అనుభూతి కొరకు ఆపుకో లేని ఆత్రం.

గాఢ సుషుప్తిలో అతని పురుషత్వం మేలుకాంచింది. జాగ్రదవస్థాధిష్ఠానం కాకుండానే స్వప్నావస్థ బహిర్వలయంలో తెలిసీ తెలియని స్పష్టాస్పష్టమైన అనుభూతి విశేషాన్ని పొంది పారవశ్యాన్ని పొందింది. కరచరణాది కర్మేంద్రియాలు జాగ్రదవస్థ కన్నుల్లో మన్నుకొట్టి తెలివిడిలేని కదలికల్లో మెదలసాగాయి. మసృణమైన లతావల్లరి, మనోహరమైన పల్లవాలు, మృదు మధురమైన పుష్పకదంబాలూ అతని శరీరాన్ని సోకి పుప్పొడితో మకరందంతో ముంచెత్తుతున్నాయి. అతని గండస్థలంమీద తుమ్మెద దాడి చేసింది. షట్పదాలు మోపి ఈషద్ఘర్షణం చేసింది. అతని స్వప్నావస్థ భగ్నమైంది.

హరి కళ్ళు తెరిచాడు. మల్లిక తన కపోలాన్ని చుంబిస్తోంది, అర్ధనిమీలిత నేత్రాలతో. ఆమె శరీరవక్రరేఖలు తన శరీర సామ్రాజ్య సరిహద్దులమీద దాడి చేస్తున్నాయి. సమాంతరంగా ప్రవహిస్తున్న నదులు గట్లుపొర్లి తరంగహస్తాలతో ఏకంకావటానికి సిద్ధంగా ఉన్న ప్రళయక్షణమది. హరి మేల్కొన్నాడు. అదరిపడిపోయాడు. అమాంతం క్రిందకు పొర్లాడు. లేచి నిలువపడ్డాడు. తోమాలలా మంచంమీద పడివున్న మల్లిక పొంగివస్తున్న క్షీరతరంగిణిలాగా ఉంది. అతని వక్షం ఉబ్బెత్తుగా లేచి వాలుతోంది. హరి నిశ్చలుడై కన్నార్పకుండా ఆమెవైపు చూస్తున్నాడు, చందనవృక్షంలా నిలువబడి. ఆమె తెల్లనాగినిలాగా లేచింది. అతని శరీరాన్ని చుట్టుకుంది, పెనవేసింది. అతడు మరలా నిర్లిప్తుడు, అతడు మరలా స్తబ్ధుడు. అతడంతలో పురుషుడుగా పొంగులువారాడు. అంతలో స్కంధప్రాయుడైనాడు. మల్లిక బాహువుల నాతని కంఠానికి చుట్టింది. అతడాధారంగా వేలాడింది. ఆమెకు శరీరంమీద స్మృతి లేదు. అతడా బంధాన్ని ఊడదీశాడు. ఆమె పూలచెండులాగా నేలమీద పడిపోయింది. అతడు నిలువు

చూపుతో దండం నడచినట్లు నడచి హాల్లోకి వచ్చాడు. మండుతున్న తన ఒడలిని బాత్‌రూముకు చేర్చాడు. షవర్‌బాత్‌పైపు తిప్పాడు. దానిక్రింద కూర్చున్నాడు. ఎంతసేపు కూర్చున్నాడో తెలియదు. మూడున్నరకు గడియారం అలారం కొట్టింది. తానూ మేల్కొన్నాడు.

హరి యాంత్రికంగా లేచాడు. వొళ్ళు తుడుచుకున్నాడు. బట్టలు వేసుకున్నాడు. ట్రంకూ, హోల్డాలూ రెండు చేతుల్తో తీసుకున్నాడు. హాలు దాటి పోబోతున్నాడు. మల్లిక గదిలో వెక్కి-వెక్కి యేడుపు వినపడింది. ఒక్క క్షణం ఆగాడు. మరుక్షణం ముందుకు దూసుకొనిపోయాడు భారతాత్మ సందర్శనానికి.

## 45

''మల్లిక మరీ కంటికి కనపడటంలేదేం మాలతీ?'' మధు అడిగాడు.

''అన్నయ్య ఊరికి పోయింది మొదలు మనిషి అదో రకంగా ఉంది"- మాలతి.

"మొదటిసారి వాణ్ణి వదలిపెట్టి ఉండటం ఇన్ని రోజులు. ఒంటరిగా ఉంటే మరీ బిక్కు-బిక్కుమంటుంది. కాస్త మనమధ్య తిరుగుతూ వుండమను. ఆ విషయం మర్చిపోవచ్చు."

''నే నెన్నోసార్లు చూచాను, అసలు మనమాట పట్టించుకునే ధోరణిలేదు."

''అంటే?''

''మల్లిక కేదో నిద్రాదేవత పూనినట్లుంది. రోజుకు దాదాపు 15 గంటలు నిద్రపోతోంది. మెలుకువతో ఉన్న నాలుగు ఘళ్లూ మూతికి తాళం వేసుకుంటుంది. అంతే!"

''అదేంటి పాపం! పెద్ద షాకు తిన్న వ్యక్తిలాగా అయిందన్నమాట?''

''నిజం. నాకు కూడా దాన్నిచూస్తే జాలివేస్తోంది.''

''నీవు మల్లిక మనస్సు ఉత్సాహపడేటట్లు ఏవిధంగానైనా ప్రయత్నం చేయాలి. వాడు మనమీద వదలిపెట్టిపోయాడు. మనం తగిన శ్రద్ధ తీసుకోవాలి.''

''ఆదీ ప్రశ్నించాను. ముఖంమీద మొత్తినట్లే చెపుతుంది కాసేపు మనంపోయి కూర్చుంటే.... 'అబ్బ' కాసేపు ఒంటరిగా పడుకుందామని పిస్తోం'దని.''

"ఎంత చలాకీమనిషి ఎంతలో ఎలాగైందో చూడు!"

"ఈ పరిణామం మీ కాశ్చర్యం కల్గించటం లేదూ?"

"ఆశ్చర్యపడి ఊరుకోవటం కాదు, హేతువు నన్వేషించాలి."

''అన్నయ్య తెల్లవారుజామున ఊరికి పోతాడనగా ఆ రాత్రి మనమంతా ఉల్లాసంగా మాట్లాడుకున్నాం కదా! తెల్లవారింది. మల్లిక నోరుమూసింది. రాత్రి అన్నయ్య మల్లిక నేదైనా కోప్పడి ఉంటాడేమో!"

''వాడికి మల్లికంటే చాలా అభిమానం. వాడు కోప్పడతాడా?.... అయినా, అంత కోప్పడటానికి కారణ మేముందీ మనకు తెలియంది?''

''అయితే యిదంతా ఏమిటి?''

''మల్లిక మనోదౌర్బల్యంవల్ల హరికోసం బెంగపెట్టుకుందేమో!''

''బెంగపెట్టుకోవటానికి చిన్నపిల్లా అండీ?''

''ఆప్యాయతకు చిన్నేమిటి పెద్దేమిటి?''

''అయితే, మల్లిక దగ్గరి కొకసారి పోయొద్దామా?''

''అలాగే.''

ఇద్దరూ హరి వాటాలోకి వెళ్ళారు. ఇల్లంతా నిశ్శబ్దం. ఇద్దరూ కనుసన్నలు చేసుకొని మల్లిక కోసం నెమ్మదిగా వెదకారు. ఆమె తన గదిలో లేదు. వంట గదిలో లేదు. మెల్లగా హరి గదిలో అడుగుపెట్టారు. మల్లిక ఒంటిగా మంచం ప్రక్కన మడతకుర్చీ వేసికొని కూర్చున్నది. తెల్లని బెడ్‌షీటు హరి పక్కమీద పరువబడి ఉంది. దానిమీద రెండు పూలదండలు పొడుగ్గా ప్రక్కప్రక్కన పెట్టబడి ఉన్నాయి. ఒకటి కనకాంబరాల దండ, మరొకటి మల్లెపూల దండ. వాటి నీడలు ఎదురుగ్గా ఉంచబడ్డ బట్టల బీరువాకున్న నిలువుటద్దంలో ప్రతిబింబిస్తూ ఉన్నాయి. ఎడమతొడమీద మోచేయి ఉంచి, గడ్డంక్రింద ముష్టి బిగించి, అద్దంలోని ఆ పూలదండలను తదేకదృష్టితో చూస్తోంది మల్లిక. ఆమెను చూచి దంపతులు నివ్వెరపోయారు.

"చెల్లీ మల్లికా!" మధు పిలిచాడు.

ఆమె నిద్ర మేల్కొన్నట్లు లేచింది. "మీరా! ఎంతసేపయింది వచ్చి?"

"ఇప్పుడే కాని, ఏమిటమ్మా యీ తపస్సు?"

"తపస్సా?" మల్లిక చిరునవ్వు నవ్వింది.

"కాకపోతే యేమిటి యీ మౌనం?"

"నేను మౌనంతో ఉన్నానా?" మల్లిక ఆశ్చర్యంగా అన్నది.

"మాతో నీ విదివరకులాగా ఉల్లాసంగా మాట్లాడటంలేదు"- మధు.

"ఇదివర కెన్నడూ లేనంత ఎక్కువగా మాట్లాడుతున్నా నిప్పుడు."

"ఎవరితో?"

"........" మల్లిక నిశ్శబ్దం.

"నీ వెందుకో పరాకుగా ఉన్నావు."

"అవును. ఏదో పోగొట్టుకున్నట్టు భ్రాంతి. దానికోసం అన్వేషణ."

"మాకు కూడా చెప్పరాదూ, మేమూ సాయం చేస్తాము."

మల్లిక నీరసంగా నవ్వింది.

"మనమీద నమ్మకం లేదేమో!" మాలతి అన్నది.

''నామీద నాకే నమ్మకం లేదు. ఇక నేను మిమ్మల్ని నమ్మగలనా?"

''నీ వాశ్చర్యంగా మాట్లాడుతున్నావే మల్లికా?"- మధు.

"మీమీద నాకు నమ్మకం లేదనుకోవటం ఆశ్చర్యంకదూ?" మల్లిక.

"అవును...." మధు తలవంచుకున్నాడు. కాని, విషయాన్ని మారుస్తూ మరలా ఉపక్రమించాడు. "పరిషత్తు పని ఎంతవరకు వచ్చినట్లు?"

మల్లిక కొంత కలతపడింది ఈ మార్పుకు. "కార్యదర్శి యింతవరకు కనపడలేదు."

"నేను వాణ్ణి పంపుతాను ఉండు. కాలహరణం కావటం మంచిదికాదు.''

''కన్యాశుల్కంలో మీ యిద్దరి పాత్ర లేమిటి?'' మల్లిక ప్రశ్న.

"నీవేమిస్తావో మాకు?"

''నేను కా దిచ్చేది, పూర్ణచంద్రరావుగారు,''

''వాడి మాట అటుంచి, నీవు మమ్మల్నే పాత్రలు తీసుకోమంటావు?''

''మీకు తగ్గ పాత్ర లేమీ లేవు ఆ నాటకంలో.''

''అయితే నీ సంగతేమిటి?''

''నేను కోశాధికారిని మాత్రమే.''

''ఇలా ఎవరికి వారు జారుకుంటే కథ ఎలా నడవాలి?''- మాలతి.

''జారుతూ నడవాలి''- మల్లిక నవ్వింది.

ఆమె నవ్వు కొంత వెగటు వేసిం దా దంపతులకు. కామేశ్వరమ్మకు పండ్లరస మిచ్చే వేళ అయిందని మాలతీ, ఆమె వెంట మధూ నిష్క్రమించారు.

# 46

సాయంకాలం ఆరుగంటలకు పూర్ణచంద్రరావు మల్లిక యింటి తలుపు తట్టాడు. మాలతీమధులు సినిమాకు పోయారు. కామేశ్వరమ్మ లోపల దేవుడు ముందు కూర్చొని ఉంది, మల్లిక బద్ధకంగా పడుకొని ఉంది. తలుపు తట్టిన చప్పుడు విని లేచివచ్చి తలుపు తీసింది.

"మిస్ మల్లికా, గుడ్ ఈవెనింగ్! హరి ఊరికి పోయాడని మీరు చాలా దిగులు పడ్డారట!.... అవును నిజమే. మీ ముఖం చూడండి, ఎలా వాడిపోయిందో! తళతళలాడే మీ లావణ్యాన్ని ఇలా ప్రతి చిన్న విషయానికీ పాడుచేసుకొంటూంటే ఆంధ్ర నాటకరంగానికి అపారమైన నష్టం వాటిల్లుతున్నదన్నమాట! దీన్ని మీరు లోకశ్రేయస్సు కొరకైనా మానెయ్యాలి. పోతూపోతూ వాడు చెప్పే పోయాడు! ఈ సంయోగ వియోగాలు కాలధర్మాలని ఆ మాత్రం గ్రహింపలేక పోయారా?'' చంద్రం నించోనే మాట్లాడుతున్నాడు.

''రండి, కూర్చోండి. మీతో నేను దిగులు పడ్డానని ఎవరు చెప్పారు?'' మల్లిక ప్రశ్న.

''మధుగారు మొన్న కనపడి చెప్పారు. అంతేకాదు, ఇంకా చెప్పారు. నేను పరిషత్తుకు కార్యదర్శిగా నియమితుణ్ణైన తర్వాత కోశాధికారిని కలవడంలో ఇన్ని రోజులు ఆలస్యమైనందుకు మీకు చాలా కోపం వచ్చిందట! దానికి నేను క్షమాపణ చెప్పుకోటానికి వచ్చాను. ఈ బక్కబడిపంతు లేం చేస్తాడు చెప్పండి? కొత్త ఉద్యోగం. బండెడన్ని పుస్తకాలు చెప్పాలి, వ్రాయాలి, దిద్దాలి.

అందులో పరీక్షరోజులు. అసలీ పరిమినెంటు పంపుతున్నారు చూశారూ వాళ్ళకు పిల్లలంటే శ్రద్ధా లేదూ పుస్తకాలంటే భయమూ లేదు. నాకెక్కడ కుదురుతుంది చెప్పండి. నేను వచ్చేటట్టు చదువుతాను, పిల్లలకు వచ్చేటట్టు చెపతాను, పరీక్షల్లో గట్టెక్కేటట్లు చూస్తాను. ఇన్ని పనులూ నామీద పడటం మూలాన నేను వెంటనే రాలేకపోయాను.''

''మీరు మాట్లాడే వైఖరిలోనే మా అందరిలో లేని ప్రత్యేకత ఏదో కనపడుతోంది'' - మల్లిక.

''దాన్నే నేచర్స్ గిఫ్ట్ అంటారు. ఈ ప్రపంచంలో ఎందరో పుటుతుంటారు, ఎందరో పోతుంటారు. కాని, కొందరు కొన్ని ప్రత్యేకతలతో లోకంకన్న అతీతంగా బ్రతికి గౌరవ మర్యాదలు పొందుతారు. ఉదాహరణకు తీసుకోండి. నేనున్నాను. మీరున్నారు. నా ప్రత్యేకతను మీరు గుర్తించారు. మీరేమనుకోకుండా ఉంటే చెపుతాను. మీలోకూడా ఒక ప్రత్యేకత ఉంది. లోకంలో ఎంతమంది ఆడవాళ్ళు లేరు. 'ఆడది' అని ముఖం మీద రాస్తే తప్ప మనం వాళ్ళను గుర్తించటం కష్టం. స్త్రీకుండాలిసిన అసలైన చైతన్యశక్తి మీలో ఉంది. నేను సూటిగా మాట్లాడుతున్నానని మీరు నన్నపార్థం చేసుకోవద్దు. మరి.... ప్రత్యేకతను ప్రత్యేకంగానే చెప్పాలసివుంటుంది-" చంద్రం.

"మీరంతా నాలో ఏదోశక్తి ఉందంటారు. అది నా కింతవరకూ ఏ అక్కరా తీర్చలేదు, ఏ మన్ననా కల్పించలేదు" - మల్లిక.

''అదేంటి మిస్ మల్లికా అలా అంటారు? మీ అపూర్వ చైతన్యంతో హరి హృదయంలోని కళాతృష్ణకు జీవంపోశారు. శకుంతలపాత్ర మీ ప్రత్యేకతతోనే ప్రజాదరణాన్ని పొందింది. మిమ్మల్నింతవరకూ మా హరి యింత అభిమానంతో ఆదరిస్తున్నాడంటే మరేం కారణ మనుకున్నారు? మీరు మీలోని వ్యక్తిత్వాన్ని గుర్తించటం లేనట్టుంది. అది చాల గొప్పదండీ! మహారాణులకో, గొప్పతారలకో, దేవతా కన్యకలకో ఎక్కడో ఎంతో అదృష్టం చేసుకుంటే తప్ప దొరకనిది మీ ప్రత్యేకత!''

''ఎదుటివారిని అమాంతం ఆకాశమెత్తు ఎత్తడంతో మీకు చాలా నేర్పుందండీ!'' మల్లిక మందహాసంతో అన్నది.

''మీరు పొరపడుతున్నారో లేదా నన్ను గౌరవించటానికి అలా అంటున్నారో నాకర్థం కావటంలేదు. మీదివరకే ఆకాశమంతెత్తు లేచి ఉన్నారు....ఎవరూ ఎత్తాలిసిన పనిలేదు. అయినా, నేను మిమ్మల్ని పొగిడితే వచ్చే లాభమేమిటి చెప్పండి. లోకంలో ఒక అపూర్వ శిల్ప ముంటుంది. అందమైన చిత్ర ముంటుంది. అలాగే మోహనమైన రూప ముంటుంది. వాటి ముందు నిలబడ్డ ప్రతి రసికుడూ శిలలా ఉండిపోగలడా? అయితే ఆ కళాఖండాలు తమ కిచ్చే హృదయానందానికి ప్రతిగా ఏమిస్తారు?.... ఏమివ్వగలరు? ఆ అందాన్ని గుర్తించినట్లుగా ఒక్క మాట.... చంద్రుని కొక నూలుపోగులాగా. దాన్నే మీరు పొగడ్తలని కొట్టివేస్తే ఎలా? ఇక దాన్నే మీరు దోషంగా భావిస్తే యీ ప్రపంచంలో సౌందర్యోపాసన, కళాతృష్ణ అన్నీ నశించాలిసిందే.''

''లోకంలో అందరికీ అందాన్ని గుర్తించే శక్తి ఉంటుంది కాని, అందరికీ దాన్ని పొగిడే మంచితనం ఉంటుందంటారా?'' మల్లిక కన్నుల్లో ఆలోచన అలల్లాగా కదలుతోంది.

చంద్రం మల్లిక మాట్లాడే వైఖరిని సూక్ష్మ పరిశీలన చేస్తున్నాడు. ఆమె ప్రశ్న లడుగుతున్న పద్ధతి వెనుక ఏదో తీవ్రమైన అసంతృప్తి, ఏదో ఏపుగా పెరిగిన ఆశ కనపడుతున్నాయి. వాటిని పసికట్టాలని చంద్రం ప్రయత్నిస్తున్నాడు. ''అట్టి సహృదయుల్ని మీ జీవితంలో ఇప్పటికి కొన్ని వేల మందిని చూచి ఉండాలిసింది. మీవంటి ఉత్తమ నటీమణి, మీవంటి అందాలరాశి కనపడితే చాలు-లోకం గుండెల్లో పెట్టుకొని పూజిస్తుంది, గౌరవిస్తుంది. కాని, కళాకారు లందరికీ అంత అదృష్టం పట్టదు. కొందరు గొప్ప కళాకారులై లోకానికి వెలుగు ప్రసాదించగల్గి కూడా దురదృష్టవశాత్తూ చీకట్లో బంధింపబడి చెదలుపట్టిపోతారు. వ్యక్తిత్వం రేకట్టలేక వ్యధతో కుమిలిపోతారు.''

''మీరన్న ఆ చివరి వాక్యాలు నాకర్థం కాలేదు.''

''నేను చాలా స్వతంత్రుణ్ణి. నేను లోకాన్ని చాలా స్వతంత్ర దృష్టితో విమర్శిస్తాను. మీ రన్యధా భావించకూడదు. మనిషికి వాక్స్వాతంత్ర్యం ప్రాణం కన్నా ముఖ్యావసరం.''

''అబ్బే మీరన్నదాని కభ్యంతరం చెప్పటంలేదు; వివరించమన్నానంతే.''

''మీరడిగారు కాబట్టి చెపుతున్నాను నా దృష్టిలో మీవంటి నటీమణి మన దేశంలో లేదంటే ఆశ్చర్యం లేదు. నేను ప్రపంచమనే పదాన్నే ఉపయోగిద్దా మనుకున్నాను మీ రన్నట్లు నావి భట్రాజు పొగడ్తలే అయినట్లయితే అలాగే అనేవాణ్ణి. పాశ్చాత్యదేశాల్లో నటీనటులకు అధిక స్వాతంత్ర్యం ఉంటుంది అన్ని విషయాల్లో. మనవాళ్ళకంత స్వతంత్రదృష్టి లేదు. అందువల్లనే ప్రపంచ తారాపథాల్లో విహరించలేరు.''

''అందుకు కారణా లేమిటంటారు?'' - మల్లిక ప్రశ్న.

చంద్రం ఒక క్షణం ఆలోచన నటించాడు. అత డాలోచిస్తోంది మల్లిక అడిగిన ప్రశ్నకు తగిన సమాధానాన్ని గూర్చి కాదు. మల్లిక ప్రశ్న వెనుక ఉన్న మనస్తత్వాన్ని గూర్చి. ''కారణాలన్నీ చెప్పటం మొదలుపెడితే అదొక పెద్ద గ్రంథమౌతుంది. కాబట్టి, ప్రధానమైనది మాత్రం పేర్కొంటాను. మన దేశంలో నటులకు కొన్నిచోట్ల ప్రోత్సాహం కనబడుతుంది కాని, పోషణ సర్వత్రా మృగ్యమైపోయింది. అందుమూలాన తమ కాళ్ళమీద తాము నిలవ లేక కుప్పకూలుతున్నారు.''

మల్లిక కామాట హృదయానికి తాకింది. చంద్రం తనతో మాట్లాడిన కొద్దిసేపట్లో ఏదో తెలియని విశాలప్రపంచం ఉందని ప్రబోధిస్తున్నాడు. అతడు జీవితానికి క్రొత్త నిర్వచనా లిస్తున్నాడు.''ప్రోత్సాహం....పోషణ....ఈ రెంటిని వివరిస్తారా?'' మల్లిక ఉత్కంఠతో అడిగింది.

''అబ్బో! మీరు సామాన్యులు కారండోయ్! నే నూహించాను, మీలో బాగా పరిణతిచెందిన వ్యక్తిత్వం ఉందని. అది నిజం.... మీకు నిదర్శనాత్మ కంగా చెప్పాలంటే, నాకు కొద్దిగా భయంగా ఉంది. ఎందుకంటే, నేను చాలా స్వతంత్రంగా ఆలోచించి చెప్పుతాను. అది మీకు కష్టం కలిగించవచ్చు.''

''మీ రిన్నిసార్లు చెప్పాల్నా? ఏం ఫరవాలేదు చెప్పండి. సత్యాన్ని తెలుసుకుందామనే యీ తాపత్రయమంతా.''

''సత్యాన్వేషణ వివేకానికి చిహ్నం. మీ రాదృష్టితో అడుగుతున్నారు కాబట్టి చెపుతున్నాను. మిమ్మల్ని వేదికమీద మొదటిసారి చూచినప్పుడే అనుకు న్నాను - మీ కీ రంగం చాలదనీ, ఇంతకన్నా విశాలమైన - దేశవ్యాప్తమైన రంగం కావాలనీ. మిమ్మల్ని రెండవసారి యీ యింట్లోనే మీ రాప్యాయంగా

నాకు సోల్‌ఫోర్స్.... అంటే, కాఫీ అందిస్తున్నప్పుడు చాలా సన్నిహితుడనై చూడగల్గాను. మీలో మేల్కొంచియున్న చైతన్యం నన్ను చకితుణ్ణి చేసివేసింది. మీరిలా నాలుగు గోడల మధ్య ఒదిగి, పంజరంలో చిలకలాగా బ్రతుకుతూ, దేశవ్యాప్తం కావలసిన కీర్తిని మంట పాలు చేస్తున్నారేమో అని జాలి వేసింది. మిమ్మల్ని హరి ప్రోత్సహించాడు. కాని, పోషించనందుకు నాకు చాలా విచారం వేసింది. మేఘాల అడుగున నలిగిపోయే చంద్రరేఖలాగా మీ వ్యక్తిత్వం, ప్రత్యేకత మాటుపడిపోతున్నవని మనస్సు బాధపడింది. మీతో చెప్పాలని ఎన్నోసార్లనుకున్నాను. కాని, నే నెవర్ని? నే నెలా చెప్పగలను మీకు? అందుకని ఊరుకున్నాను."

"మీరలా సంకోచించవద్దు. కళాపరిషత్తులో సభ్యు లెవ్వ డయ్యారో అప్పుడే మా ఆప్తులలో ఒకరైపోయారు. ఇప్పుడు మీరే కార్యదర్శులు.... కాగా, మీరు హరిగారు నాకు ప్రోత్సాహ మిచ్చారు కాని, పోషణ యివ్వలే దన్నారు. మీరసలు ఆ పదాలకు అర్థం చెప్పకుండా అయోమయం చేస్తున్నారు."

''మీరు నాపట్ల చూపిన బంధుభావానికి ఎంతో కృతజ్ఞుణ్ణి. మీరాపదాల కర్థం ఊహించుకోగల రనుకున్నాను.అర్థంకాని మాటలు అనర్థానికి దారితీస్తాయి. విప్పి చెపుతాను వినండి: మీలో ఒక ప్రత్యేకత వుంది. దాన్ని గుర్తించిన హరి మిమ్మల్ని తెచ్చాడు. మీకు అభినయం నేర్పాడు. రంగమెక్కించాడు.ఈ రెండు ఆధారాలతో మీరు పైకి రాగలిగారు. కాని, పరిణతి చెందిన మీ ప్రత్యేకతను తన గుప్పిట్లో పట్టాడు హరి. స్వతంత్రవాయువులు పీల్చాలిసిన మీ ఆత్మను తన ప్రయోజనాల చట్టంలో బిగించాడు. కూపస్థ మండూకాన్ని చేశాడు. ఇప్పుడు స్పష్టమైందనుకుంటాను. మీ పరిణతికి ప్రోత్సాహం యివ్వబడింది. కాని మీ ఆత్మ శక్తిమంత మయ్యేటట్లు పోషణ జరగలేదు. ఇది నా అభిప్రాయం, మీ రడిగారు కాబట్టి చెప్పాను. దీనికి మీరూ నేనే సాక్షి. బయటికి చెప్పబోకండి. లోకం పెక్కు వ్యాఖ్యానాలు చేస్తుంది. మన ఆత్మశక్తిమీద మనకు నమ్మకమేర్పడితే చాలు. లోకాన్ని కాలుతో తన్నివేయగలం. మనం భయపడితే లోకం బెదిరిస్తుంది. సాహసిస్తే లోకం చల్లగా ఒప్పుకుంటుంది.'' చంద్రం తన మాటలన్నింటినీ తనకేతెలియని ఏదో ప్రయోజనానికి అనుబంధంగా అనుసంధిస్తున్నాడు.

మల్లికకు చంద్రంమాటల్లో ఏదో క్రొత్తదనం కనపడుతోంది. అత డెన్నో విషయాలు చెప్పాడావేళ. వాటిని మననం చేసుకోవాలని అనిపించింది. "చంద్రం

గారూ! మీకు శ్రమ కాకుండా ఉంటే అప్పుడప్పుడూ వచ్చి వెళ్తుండండి. మీ మాటలు నాకెంతో ఉల్లాసంగా ఉన్నయ్" - మల్లిక.

తనను వెళ్ళమన్న సూచనను చంద్రం గ్రహించాడు. దానికి చివుక్కు మనిపించింది కాని, ఆమెలో ఏదో ఆలోచన రగుల్కొంటోందని గమనించి లేచి నిలువబడ్డాడు.

"కన్యాశుల్కం నాటకంలో పాత్రధారులను నిర్ణయించారా?" - మల్లిక.

''లేదు. నేనా-కొత్తవాణ్ణి. ఇక్కడి వాళ్లందరూ నాకంతగా పరిచయం లేదు. అందువలన త్వరగా నిర్ణయాలు తీసుకోలేకపోతున్నాను. ఉదాహరణకు మీరే ఉన్నారనుకోండి. మీకేపాత్ర యివ్వాలీ అని తల్లబద్దలు కొట్టుకుంటు న్నాను. మీతో గట్టి పరిచయం లేదాయె. మీ అభిరుచులు, అభిప్రాయాలూ తెలియవాయె. అందులో మీ రొంటరిగా ఉన్నారాయె....''

''మీరు కార్యదర్శులు; అందర్నీ కలిసి వారి అభిరుచులు తెలుసుకొని పాత్ర నిర్ణయం చేయవచ్చు. దానికి మా అందరి సహకారం ఉంటుంది.''

"అయితే నాటకం పేరుమీద మీవద్ద కెప్పుడైనా రావచ్చునన్నమాట?'' చంద్రం వింతగా చూస్తూ మాట్లాడాడు.

మల్లిక ఆ చూపుకు జంకింది. ముఖం వంచుకుని "మీకా అవకాశం హరి గారే కల్పించి పెట్టారు'' అని అన్నది.

''ఆల్‌రైట్.... అయితే ఈ రోజుకు సెలవు''- చంద్రం అంగలువేస్తూ ముందుకుపోతున్నాడు అతనివైపే చూస్తూ నిలువబడింది మల్లిక హాల్లో. అతడు గేటుదాకా వెళ్ళాడు. ఒక్కసారి వెనక్కు చూచాడు. ఒక్కక్షణం సూటిగా మల్లికవైపు చూస్తూ నిలిచాడు. ఆమె తన ముఖం ప్రక్కకు తిప్పుకుందా మను కొన్నది. కాని, అలా చెయ్యలేకపోయింది. అతడు వెళ్ళిపోయాడు. ఆమె సోఫాలో కూర్చొని నిట్టూర్చింది.

## 47

మధు సంతోషావేశాలతో మాలతినీ, మల్లికనూ కేకవేసినట్లు పిలుస్తూ యింట్లోకి వచ్చాడు. గబగబా నటరాజస్వామికి నమస్కరించాడు. కామేశ్వరమ్మ పాదాలకు దణ్ణం పెట్టాడు. మాలతిని రెండు బుగ్గలూ పట్టుకొని అటూ ఇటూ సాగదీశాడు.

"ఏమిటండీ అంత సంబరం?" మాలతి ముసిముసి నవ్వులతో ప్రశ్నించింది.

"నీవు ముందు మల్లికను పిలుచుకొనిరా చెప్తాను" అని అన్నాడు మధు.

మాలతి చెంగునపోయి భోజనానికి కూర్చోబోతున్న మల్లికను చేయి పట్టుకొని లాక్కొచ్చింది.

"చూడన్నయ్యా! నన్నెలా లాక్కొస్తున్నదో మాలతి"-మల్లిక.

"అది మగవాణ్ణి నన్నే లాక్కొచ్చింది. ఇక నీవొక లెక్క?"-మధు.

"ఈ సరసాల కేమిగాని, అసలు విషయం చెప్పండి"-మాలతి.

"చెప్తున్నానహో! అందరూ సావధానులై వినండొహో!.... నా పోయిన బిడ్డ బ్రతికింది. నా మధుమంజరి దొరికింది" దండోరా వేసినట్లు చాటాడు మధు.

"అమ్మయ్య! నా కలత తీరింది." మాలతి తృప్తిని వెల్లడించింది.

"దేవుడు చల్లగా చూచాడు." కామేశ్వరమ్మ నిశ్వసించింది.

"మా అన్నయ్యను వదలి మధుమంజరి బ్రతుకలేదని రుజువైంది" మల్లిక ఆవేశంతో అన్నది.

"మల్లిక అన్నమాట నిజం.... అందుకు నేను గర్విస్తాను"-మధు.

"వివరంగా చెప్పండి ఏం జరిగిందో" మాలతి అడిగింది.

"మా నాన్న మధుమంజరిని అమ్ముతున్నాడు ఒక పార్సీ లక్షాధికారికి. బేరాలు కుదిరాయి. విక్రయాల దగ్గరుంది వ్యవహారం. నే నివ్వాళ ఆబిడ్ సెంటరుకు పోతున్నాను. నా ప్రక్కనే ఒక కారు ఆగింది. ఉలిక్కిపడి చూచాను. పార్సీ లక్షాధికారి కారు. లోనికి రమ్మన్నాడు. తన నెరుకపరచుకున్నాడు. ఈ విక్రయ విషయం చెప్పాడు.

"మధుమంజరి అంతరించిం దనుకున్నాను. ఆ సంస్థను నా ప్రాణంకన్నా అధికంగా ప్రేమించాను కాబట్టి నాకెంతో విచారం వేసింది. ఈ రోజు మళ్ళా దాన్ని బ్రతికిస్తున్నారు. మిమ్మ ల్నెలా అభినందించాలో తెలియదు" అన్నాను.

"మీ సంస్థ లెక్కలన్నీ తనిఖీ చేయించాం. అన్నీ సక్రమంగా ఉన్నాయ్. రామచంద్రయ్యగారికి మధుమంజరి లాభం తెచ్చింది కాని నష్టం కల్గించలేదు

అప్పులేమీ లేవు. ఇంత కమ్మగా నడుస్తున్నదాన్ని ఎందుకు మూసివేశారు? ఎందు కమ్ముతున్నారు?'' అనడిగాడు లక్షాధికారి.

''మీ రామాట మా నాన్నగారి నడుగలేదా?''

''మీ రింకా రామచంద్రయ్యగారిని గౌరవిస్తున్నారా?''

''ఆయనను మా తండ్రిగా గౌరవిస్తాను.... ఆయన అభిప్రాయాలు నాకు నచ్చకపోవచ్చు''

''నిన్నాయన తూలనాడుతాడు. నీవాయనను గౌరవిస్తావు!''

''కొంతమంది ఆవేశంతో ఆత్మీయతను మరచిపోతారు''

''నిజం నీవన్నది. అది మేమూ ఊహించాం. నీతో మాట్లాడాలని అను కుంటున్నాం. నీవే కనపడ్డావ్. మాకెంతో సంతోషంగా ఉంది.''

''చెప్పండి.''

''మధుమంజరి మా చేతుల్లోకి వచ్చింతర్వాత మళ్ళా నిన్నే మేనేజరు చేస్తాం. మా వ్యాపారం చాలా తెలుగుదేశంలో వుంది. నీవు తెలుగువాడివి. నమ్మకస్తుడివి.''

''మీకు పూర్తి నమ్మకం కుదిరితేనే నాకు ఉద్యోగ మివ్వండి.''

''కాదు.... కాదు.... మధుమంజరి కార్మికులంతా నీ మీద ఎంతో మంచిగా చెప్పారు. నువ్వే మళ్ళా మధుమంజరి మేనేజర్. మా కొనుగోలు పది రోజుల్లో ముగుస్తుంది. ఒకటవ తారీకునుండి నీవు ఉద్యోగంలో చేరు.''

''నా ప్రియమైన సంస్థలో పిలిచి ఉద్యోగమిస్తున్నారు. చాలా కృతజ్ఞుణ్ణి.''

''అసలు మీ ఇద్దరికీ అభిప్రాయ భేదం ఎందుకు వచ్చింది?''

''నా పెళ్ళి విషయంలో''

''పెళ్ళి అయిందా?''

''అయింది. మధుమంజరిని మూసివేసిననాడే''

''అయితే ఖుషీగా ఈ పదిరోజులు గడిపెయ్. ఒకటో తారీఖు మా కొలువులో చేరు. నీ సొంత వ్యాపారంగా చూసుకో.''

"నా ధర్మం నేను తప్పక నిర్వహిస్తాను."

"మంచిది. నీ అపాయింట్ మెంటు కాగితం రేపు తీసుకో" అని వెళ్ళి పోయారు. ఇదీ అసలు జరిగిన సంగతి." అని మధు ముగించాడు.

"మీకు పోయిన సామ్రాజ్యం వచ్చినట్లుంది కదూ?" - మాలతి.

"మా అన్నయ్య దానిమీద సర్వాధికారి కాడు. అందుకే ఇన్ని తిప్పలొచ్చాయి. కాబట్టి మళ్ళా మా అన్నయ్య తన కాళ్ళమీద నిలవబడ్డా డనటం న్యాయ మనుకుంటాను" - మల్లిక.

"అవును నీవు చెప్పిందే నిజం చెల్లీ! పరాధీనపు బ్రతుకు పాపకూపం లాంటిది. స్వయం భద్రత లేని బ్రతుకు గాలిలో పెట్టిన దీపం లాంటిది. వ్యక్తి స్వాతంత్ర్యం లేని బ్రతుకు గానుగెద్దు వంటిది." మధు ఆవేశంతో గంభీరంగా అన్నాడు. అతడు మరలా స్వతంత్ర వాయువులను పీలుస్తున్నాడు. అతని అనుభూతి మల్లిక కెంతో ఉల్లాసాన్ని కలిగించింది. మాలతి పరవశత్వాన్ని చెందింది.

"ఇంత శుభవార్త విన్న మాలతికి బహుమానం మేమిటన్నయ్యా?" మల్లిక.

"వారం రోజులు ఊటీ నివాసం" - మధు.

"అవన్నీ యిప్పు డెందుకండీ?" - మాలతి.

"నిలవున్న నీరులా ఎన్నాళ్ళీ యింటిపట్టు? పోదాం పద స్వేచ్ఛగా తిరిగి వద్దాం ఖుషీగా పదిరోజులు. మనలో ఉన్న వ్యక్తిత్వం పరిమళించాలంటే ఒక చోట కూర్చుంటే కాదు దేశం తిరగాలి, అనుభవం గడించాలి."

మల్లిక మధు మాటల్ని ఆశ్చర్యంతో విన్నది.

## 48

పోస్ట్‌మాన్ గేటువద్ద సైకిలు దిగటంతోనే మల్లిక ఆత్రంగా ఎదురు వెళ్ళింది. మధు పేరుమీద కవరొకటున్న దన్నాడు. సరే యివ్వమన్నది మల్లిక. ''వారింట్లో ఉన్నారా?'' ''లేరు, ఊరికెళ్ళారు. వారంరోజులకుగాని రారు.'' ''అయితే వారొచ్చిం తర్వాత వారికే ఇవ్వండి,ఇది పరసనల్ లెటర్'' 'ఆలాగే' అని తీసుకుంది మల్లిక.

అడ్రసు వ్రాసిన చేతివ్రాతనుబట్టి అది హరి వ్రాశాదని తెలుస్తోంది. తన పేరుమీద హరి లేఖ వ్రాస్తాడేమోనని ఆశపడింది. కాని, మధుపేర వ్రాశాడు. ''అవును, మధు నాకన్న ముందువాడు'' అని నిట్టూర్పు విడిచింది మల్లిక. మనసులో మథన ప్రారంభమైంది. ''రహస్యంగా వ్రాస్తున్న ఈ లేఖలో ఏమి వ్రాసి ఉంటారు హరిగారు? నాకు ఉత్తరం రాయజాలని కారణం అందులో ఉందేమో! మధు అన్నయ్య వచ్చేసరికి వారంరోజులౌతుంది. అందాకా ఆ విషయం తెలిసేదెలా?'' అప్రయత్నంగా ఆమె చేతులు కవరును చింపాయి. హరి స్వహస్తంతో వ్రాసిన రెండులేఖ లందులో ఉన్నాయి. అందులో ఒకటి తనకని భావించింది. ఆసక్తితో విప్పిచూచింది. రెండూ మధు పేరనే ఉన్నాయి. మొదటి ఉత్తరం చదివింది. అజంతా,ఎల్లోరాలు చూచి బొంబాయి చేరేనని వ్రాశాడు హరి. కొన్ని ప్రయాణానుభవాలు వ్రాశాడు. మాలతీ, మధుల వైవాహిక జీవితాన్ని పరామర్శించాడు. చివరకు మల్లిక యోగక్షేమాలను తాను వచ్చేంతవరకూ అత్యణ్ణి చూస్తుండమని వ్రాశాడు. అంతే మల్లిక ప్రసక్తి. మల్లికకు ఏడుపొచ్చినంత పని అయింది.

రెండవ ఉత్తరం తీసింది. చదవటం ప్రారంభించింది. ''ప్రియ మధూ! ఈ లేఖ నీ కొక్కడికే వ్రాస్తున్నాను. చెల్లికి కూడా చూపించవద్దు. ఇందులోని మాటలు నీ హృదయంలో అట్టడుగున దాచుకో''-మల్లిక గుండెలు గట్టిగా కొట్టుకొనసాగాయి. ఆత్రంతో రెండవ పేరా మొదలెట్టింది.

''ఇది ఒక రహస్యం. నీనుండి దాచినకొద్దీ అది నా గుండెల్ని తొలిచివేస్తోంది. అందుకని నీకు వ్రాస్తున్నాను నా మనస్సు తేటపడటానికి-నేను తేలిగ్గా తిరగటానికి. సమాహితచిత్తంతో దర్శిస్తేనే కాని తేటపడదు భారతాత్మ!"

'అసలు సంగతి ఇంకా బయటపెట్టరేం?' అని మూడవపేరా నందుకొన్నది మల్లిక.

'''నేను బయలుదేరివచ్చినప్పుడు మీతో ఎవ్వరితో చెప్పిరాలేదు. అందుకు మీ రన్యథా భావింపరు కదూ! దాని కారణం చెప్పటం నా వంతు. అది చెప్పాలనే నా ఆరాటం. కాని, నా మాటలు నా భావాన్నంతా చెప్పగలుగుతాయో లేవో? నేనిలా రావటానికి మల్లిక కారణం. బురదలో పడివున్న మల్లెతీగను పెరికి తెచ్చాను. పాదుచేసి నాటి, ఎరువు వేసి, నీరుపోసి అల్లిబెట్టాను. పూలు పూసింది.

సంతోషించాను. వాసన విరజిమ్మింది. లోకం ఆనందించింది. నాకూ ఆనందం వేసింది.

"మల్లికలో వయసుకు మించిన వ్యక్తిత్వం ఉంది. అది మేల్కొన్నది. సముద్రుడులా ఉప్పొంగుతున్న నన్ను చూచి తన జీవనవాహినిని నాలో ఐక్యం చేయాలని ఆత్రపడింది.తన మధుర తరంగ విన్యాసంతో నన్నాకర్షింప యత్నించింది. నేనూ జలరూపుడనే. ఆర్ద్రమైన నన్ను నేను నిలవరించుకోవటానికి కొంతకాలం పట్టింది. ఆమె ఉప్పెనలా పొంగి నన్ను పొందాలని చూచింది. సముద్రుడను చట్టాతీతమైనాను. నాపై తరంగాలు పొరలాడినాయి. సుడిగుండాలు సుళ్ళు తిరిగాయి. బుద్బుదాలు పొటమరించాయి. ఫేనం పేరుకొని నిలిచింది. కాని, నే నల్లాగే శిలలా నిలిచిపోయాను- కఠినుడను.... జీవితంలో నీవు కోరిన వ్యక్తిని నీవు పొందకల్గావు. నాకా అదృష్టం లేదు. మల్లిక స్త్రీ- ఆమెకు తగిన పురుషుని అన్వేషించాలి. ఇది యొక క్రొత్త బాధ్యత - నీ హరి."

ఉత్తరం చదివిన మల్లిక భోరుమని యేడ్చింది. నిజాన్ని వ్రాసిన హరి మీద అపారమైన గౌరవం కలిగింది. కాని, తన ప్రస్తుత స్థితిని గూర్చి మనస్సు తల్లడిల్లిపోయింది. హరి దృష్టిలో మల్లిక ఒక స్త్రీ. ఆమెకు తగిన పురుషుని కోసం ఆయన ప్రస్తుతాన్వేషణ : అది ఒక క్రొత్త బాధ్యత. హరి దృష్టిలో మధు ఎంత అదృష్టవంతుడో మల్లిక దృష్టిలో మాలతి అంత అదృష్టవంతురాలు. ఆమె కూడా తాను వలచిన పురుషుణ్ణి పొందింది. ఆమెతో పోల్చుకుంటే తాను దురదృష్టవంతురాలు.... తన దురదృష్ట మేమిటి? హరి మాటల్లో.... మల్లిక హరిని ప్రేమించలేదు. "నే నొక స్త్రీగా అతణ్ణి వాంఛించానట! - పురుషుడంటే మగవాడు మాత్రమే కాడు. అయితే, హరి మగవాడే కదా? అత డెందుకు పురుషుడు కాడు? ఆయన నన్ను వరించలేదు. అందువలన నా పురుషుడు కాడు" అని అనుకొన్నది మల్లిక. మల్లికవలె మాలతికీ వ్యక్తిత్వం ఉన్నట్లు ఎవరూ అనరు. కాని, మల్లిక కన్న ఆమె ఎక్కువ సాధించింది. తన తల్లి నిర్వహించవలసిన బాధ్యత తానే నిర్వహించుకొన్నది. కాని, మల్లిక హరి నిర్వహించవలసిన ఈ క్రొత్త బాధ్యతను తాను స్వయంగా నిర్వహించుకొనగలదా? అలా నిర్వహించుకొనకపోతే మాలతికున్న ప్రత్యేకత మల్లికకు లేదు. అసలు ఆమె వ్యక్తిత్వానికి అస్తిత్వం లేదు.... అంతేకాదు, హరి హృదయం ఇంత స్పష్టమైన

తరువాత కూడా స్వయంగా పంపేంతవరకూ ఆయనకు భారంగా ఉండటం మల్లికకు బాధ అనిపించింది. మల్లిక ఆ ఉత్తరాన్ని తన వద్దనే దాచిపెట్టుకుంది. అది మధు చేతిలో పడితే వచ్చే ప్రత్యేకమైన లాభం కనపడలేదు. హరి హృదయం తెలియవలసింది తనకు. అది తెలిసింది.ఆఉత్తరానికి నిజంగా తానే వారసురాలు.

"హరి గారింటి నుండి నా ఉద్వాసనకు ఈ ఉత్తరంలో అంకురార్పణ జరిగింది. పరిస్థితులు కూడా దాని కనుకూలంగానే ఉన్నాయి. చంద్రం అన్నట్లు ఆయన నాకు ప్రోత్సాహ మిచ్చారేకాని పోషణ యివ్వలేదు. పోషణలేని దుర్బలాత్మను ఎవరికో రేపు కట్టబెడతారు. ఉన్న స్వాతంత్ర్యం కోల్పోయి ఎవరి చెప్పుచేతల్లోనో నడవాలి. దానికన్న నా కాళ్ళమీద నేనే నిలువబడి నా ఆత్మను నేనే పోషించుకుంటాను. మధు అన్నయ్య అన్నట్లు పరాధీనపు బ్రతుకు పాప కూపం లాంటిది. ఈ కూపస్థ మండూక స్థితినుండి విశాల విశ్వంలోకి దూకాలి. నే నొంటిగా అంత సాహసం చేయగలనా? ... ఇంక నాకెవరున్నారు తోడు? నాలో ఉన్న స్త్రీయే నాకు తోడు!" ఆలోచనా వలయంలో సుడులు తిరుగుతూ మల్లిక తలుపు దగ్గరిగా వేసి మంచంమీద నడుం వాల్చింది.

## 49

దీపాలు పెట్టిన తర్వాత చంద్రం వచ్చాడు మల్లిక యింటికి. కామేశ్వరమ్మ గారి వాటా తాళం వేసి ఉంది. కాని, హరి వాటాలో లైట్లు వెలుగుతున్నాయి. తలుపు నెమ్మదిగా తీశాడు. హాల్లో ఎవరూ కనపడలేదు. "మిస్ మల్లికా! మిస్ మల్లికా!'' అని పిలిచాడు. మల్లిక తన గదిలో నుండే పలికింది. "రాండి చంద్రం!'' అని పిలిచింది. "చంద్రంగారిని చంద్రం చేసిందే!'' అనుకుంటూ మెల్లగా లోగడియపెట్టి గది వాకిట్లోకి వెళ్ళాడు చంద్రం.

మల్లిక మంచంమీద పడుకుని ఉంది. తల దువ్వుకోలేదు. ముఖానికి టాయిలెట్ లేదు. తెల్లని వాయిల్ చీరె; నీలి చుక్కల జాకెట్ వేసుకొని ఉంది.

"నేను లోనికి రావచ్చునా మిస్ మల్లికా?"

"రాండి....వచ్చేటప్పుడు హాల్లోనుంచి ఒక కుర్చీ తెచ్చుకోండి"-మల్లిక.

'పడుకొని రాణిలాగా శాసిస్తుందేమిటి?' అని చంద్రం చివుక్కుమన్నాడు కాని, ఆరోగ్యం బాగలేదేమోనని సరిపుచ్చుకొని, ఒక కుర్చీ తెచ్చుకొని,

మంచాని కొక గజం దూరంలో వేసుకొని కూర్చున్నాడు. "మిస్ మల్లికా! మీ వొంట్లో బాగుండలేదా?"

"ఒంటికేం? మనసులో బాగుండలేదు"-మల్లిక.

"మీ రిలా బెంగపెట్టుకుంటే ఆరోగ్యం పాడై పోతుంది. కళాకారుల జీవితం జాతికి మూలధనం. అదే పాడైపోతే, దేశం బీడుపడిపోతుంది."

"నాకూ, దేశానికీ అంత సంబంధం ఉందా?"

"అదేమిటి అలాగంటారు? జాతిని ప్రతిబింబించేది నాటకం. ఆ నాటకానికి నటీనటులు ప్రాణం. ఆ ప్రాణం పాడైతే ఆ నాటకం పాడు. ఆ నాటకం పాడైతే జాతి పాడైనట్లే."

"హరిగారూ నన్నూ, నిన్నూ ఉద్ధరించి, జాతిని బాగుచేశారంటారా?"

"నాకు నమ్మకం లేదు."

మల్లిక ఆశ్చర్యపడింది. "వారివల్ల ఉపకారం పొంది, వారినే శంకిస్తున్నారా?"

"ఉన్నమాట అన్నాను. నాకు వాడు చేసిన ఉపకారం ఒక వ్యాపారపు బాండు."

"మీ మాట నా కర్థం కాలేదు!"

"మీ - అంటే, నీ-మెదడును అర్థంగాని స్థితిలో పెట్టాడు వాడు."

"నన్ను ప్రోత్సహించా డన్నారుగా?"

"ఇది పోషణలోని భాగం. అది వాడు చేయలేదు."

"సరే, నన్ను ఎట్టి స్థితిలో ఉంచారు?"

"అది పూర్తిగా మీ సొంత విషయం. నేను వ్యాఖ్యానం చేయటం బాగుండదు."

"నాకు సాగదీయించుకోవటం ఇష్టంలేదు."

"మీ రలా అనుకుంటే, ఇదుగో చెపుతున్నాను: మిమ్మల్నీ, నన్నూ ప్రోత్సహించింది మనకోసం కాదు, దేశంకోసం కాదు - తన స్వార్థకోసం; తన లాభంకోసం."

"మీరు నిర్దయగా మాట్లాడుతున్నారు."

"వాడు నిర్దయుడైతే తప్పులేదు కాని, నే నున్నదంటే తప్పైందా?"

"మీరు వివరంగా చెప్పాలి."

"హరి నా దృష్టిలో ఒక వ్యాపారి, స్వార్థపరుడు, లోభి, మోసగాడు. హరిహర నాటక కళాపరిషత్తు అనే పేరుతో ఒక సంస్థను స్థాపించి తన భాగస్వామి మధుకు మధుమంజరి వ్యాపార ప్రచారంలో తోడ్పడటమే కాకుండా తాను సొంతగా అయిదువేల రూపాయలు వెనకేసుకున్నాడు. ఇప్పుడు విద్యార్థుల డబ్బుమీద దేశం తిరిగివస్తాడు వాళ్ళ డబ్బులో కొంత మూట కట్టుతాడు. ఉన్నంతలో ఇది ఉత్తమ వ్యాపారం. కాని, ఘోరమైన, అమానుషమైన వ్యాపారం మరొకటి చేశాడు."

"ఏమిటది?"

"బానిస వ్యాపారం?"

"ఎక్కడ?"

"ఇక్కడ."

"ఎలా?"

"నిన్ను కొని!"

"నన్ను కొనలేదు."

"అదే నీకర్థంగాని అయోమయస్థితి వాడు కల్పించింది."

"నీవు ఏ ఆధారంతో అంటున్నావు ఈ మాట?"

తాను నోరు జారి 'నీవు' అన్నాడు చంద్రం. ఆ మాటే త్రిప్పికొట్టింది మల్లిక. దాన్ని గమనించనట్టు సాగిస్తున్నాడు చంద్రం. కాని, ఆమె గడుసు [illegible] నివ్వెర[illegible]

'నీ కథంతా దీనికి ఉదాహరణమే. రెండువేల రూపాయ లిచ్చి నీ పినతండ్రి అడ్డం తీసేశాడు. మాటపట్టింపుతో హేమ అడ్డం తొలగించాడు. నీమీద [illegible] పెట్టాడు. అందులో మంచి తెలివితేటలు చూపించాడు. నాటకాలకు [illegible]ది ప్రధానంగా ఆడపాత్రలు. నీవు దొరికావు. ముందు బుక్ చేశాడు. నీ వాడిన నాటకంమీద అయిదువే లొచ్చాయి. నీకందులో పైసా రాదు."

"నా తిండీ తీర్థం అంతా ఆయనేగా?"

"నిన్నేకాదు - కుక్కను పెంచుకున్నా పెట్టాలవన్నీ. మీరు వంట చేశారు. ఇల్లు కాచుకొని ఇంటి పనులు చేసిపెట్టారు. పైపెచ్చు నాటకాలాడి డబ్బు సంపాదించిపెట్టారు. మీరు తిన్న తిండి ధర్మతిండా?....కాదు!"

"ఇవన్నీ నా యిష్టంతో చేశాను. ఆయన బలవంతం చేయలేదు."

"అదుగో, నీవద్ద అ మెత్తదనం ఉండబట్టే వాడు కరకుతేలాడు."

ఆ మాట తగిలివచ్చింది మల్లికకు. చంద్రం మాట్లాడుతూనే ఉన్నాడు:

"ఇంకా ఎన్నో నిదర్శనాలు చూపించగల్గేవాణ్ణి. కాని, మీతో నాకట్టే ఎక్కువకాలం పరిచయం లేకపోవటంవల్ల ఇట్టి అవస్థ ఏర్పడింది. లేకపోతే ప్లీడరు వాదించినట్లు వాదించేవాణ్ణి అయినా మీరేమీ అనుకోకపోతే నేను కొన్ని ప్రశ్నలు వేస్తాను. వాటి సమాధానాలనుబట్టి మీకే తెలుస్తుంది వాడి తత్త్వం. మీ యిద్దరి సంబంధాన్ని గురించి అడిగినప్పుడు మీరిద్దరూ ఇద్దరే అంటే ఒప్పుకొన్నాడు వాడు. నిజమేనా?"

అరనిముసం నిశ్శబ్దం తరువాత "నిజమే" అని మల్లిక ఒప్పుకొన్నది.

"కాని, లోకం మీరిద్దరు వేరువేరు కాదనుకొంటోంది. ఇట్టి ఇరకాటంలో పెట్టి, నిన్ను వేధించి, చివరకు నీకు సంఘంలో గౌరవం లేకుండా పోయింతర్వాత తన కంపెనీకి తొత్తుగాచేసి నీ రక్తాన్ని పిండి ధనం సంపాదిస్తాడు....అదీ వాడి నాటకం."

"ఆయన నన్నెవరికైనా యిచ్చి పెళ్ళి చేస్తాడేమో?"-మల్లిక.

"చూడు. నిన్నెంత మోహంలో ముంచేశాడో నీమీద లోకాపవాదు వచ్చింతర్వాత ఎవరో నాలాంటి సన్నిహితుడు తప్ప ఎవరు నమ్ముతారు? .... మాట వరుస కంటాను, ఎవరు పెళ్ళి చేసుకుంటారు?"

"........" మల్లిక నిశ్శబ్దం.

"లోకంలో సత్యాలన్నీ కష్టంగా ఉంటాయి వింటానికి. నువ్వే ఆలోచించుకొని నిర్ణయానికిరా ఈ విషయంలో."

ఒక్క క్షణం ఇద్దరూ మౌనం.

"మరొక విశేషం. మాలతి ఈ విషవలయం నుండి తప్పించుకుంది మధు సహాయంతో." మరలా ఉపక్రమించాడు చంద్రం

"ఏమంటున్నావూ?" మల్లిక ఆశ్చర్యంతో అన్నది.

"నీకు వివరంగా చెపితే కాని అర్థం చేసుకొనే స్థితిలో లేవు. మాలతికి ట్యూషన్ ఫీ ఇప్పించటానికి, ఉద్యోగం రావటానికి హరి కారకుడు కదా?"

"అవును."

"ఎందు కిప్పించా డా ఉద్యోగం? ఎందుకు చేయించాడా ధనసహాయం?"

"చెప్పు అది కూడా నీవే."

"ఆమెను నీకన్న చాల చౌకలో కొనాలని చూచాడు. మధుకీ విషయం తెలుసు. అతడు ఆమెకు చెప్పి ఉంటాడు."

"నీ వెలా చెప్పగలవు?"

"మధు హరికి బహిఃప్రాణం కదా? హరి అన్ని విషయాలూ వాడికి చెపుతుంటాడు కదా? వివాహ విషయం వాడికి ముందు చెప్పలే దెందుకనీ? .... లేక హరి తిరిగి వచ్చేంతవరకు ఆగమన్నాడుగా - ఆగలే దెందుకని?....పోనీ, మాలతి నీకు చాలా సన్నిహితురాలే కదా - ఆమె పెళ్ళి విషయం నీతో ఏమైనా చెప్పిందా? అందాకా ఎందుకు?....ఆమె తల్లితో చెప్పిందా?....ఎందుకు చెప్పలే దంటే-అసలు రహస్యం బైటపెట్టితే వ్యాపారిమైన హరి వివాహం వదనీయడు. నీకు చెపితే నీవూ విప్లవం తీసుకరావచ్చు. అందువల్ల మధు నెమ్మదిగా ఆమెను తనదాన్నిగా చేసుకొని హరి యెత్తుకు ఎదురెత్తు వేశాడు."

"వాళ్ళిద్దరు కూడా నాటకాలు ఆడారు కదా?"

"అదంతా ఒక నాటకం. ఇద్దరూ తమ కార్యాన్ని సాధించుకోవటానికి నాటక రంగాన్ని ఆశ్రయించారు. ఏరీ యిప్పుడు? నే నొంటరిగా ఈ నాటకం కోసం వస్తున్నాను కదా! పాత్రధారుల నిర్ణయమే కాలేదాయె. ఒకరు దేశ యాత్రలకు వెళ్ళిరి. ఒకరు వేసవి యాత్రలకు వెళ్ళిరి. ఇక మిగిలింది మనం. మనం నానా గడ్డి తిని యీ చాకిరి చేసిపెడితే పెద్దదొరల్లాగా రేపు వచ్చి అన్నీ మూట కట్టుకుంటారు."

"హరి-మధుగార్ల స్నేహం పవిత్రమైనది."

''వ్యాపారానికి పవిత్రమేమిటి అపవిత్రమేమిటి? డబ్బు దగ్గర యిద్దరూ భాగస్థులు. కాని, వీళ్ళిద్దరిలో మధు హరిని మించినవాడు. ఎలాగంటే,హరి అతని చెల్లెల్ని కూడ నాటకాల్లోకి దింపాలంటాడు. మధు ఏలాగో ఒకలాగు మసిపూసి మారేడుకాయ చేసి తన చెల్లెల్ని మీనుండి దూరంగా ఉంచాడు కదా!"

"హేమక్కకే యిష్టం లేదసలు."

''ఇష్టానిష్టాలు చెప్పి చేయించుకొనేవాడిమీద ఉంటాయి. మధు మీ కను కూలంగా చెప్పానంటాడే కాని చెల్లెలికి అసలు ఏం నూరిపోశాడో మీకేం తెలుసు? ఇంకా వాణ్ణిగూర్చి చెపితే మీ రాశ్చర్యపోతారు."

''ఏమిటి చెప్పు."

''వాడు యుగంధరుల్లాంటివాడు. అన్నీ జరిగినంతవరకూ అసలు సంగతి బైటికి పొక్కదు. మధుమంజరి మూతపడటం, ఇప్పుడు ఊటీకి ప్రయాణం కట్టటం. అన్నీ బ్రహ్మాండమైన యెత్తులు.''

''నీ మాటలు నిజంగా ఆశ్చర్యం వేస్తున్నాయి....ఆ యెత్తు లేమిటి?''

''ఇంతదాకా వచ్చి ఆ కాస్తా ఎందుకు వదుల్తాను?....అదీ చెప్తాను. మధు మంజరివల్ల ఏమీ నష్టం లేకపోతే, రామచంద్రయ్య లెక్కల మనిషి కదా, ఎందు కమ్మతాడు? లెక్కల్లో లేని లోటు ఇనప్పెట్టెలో ఉండేదన్నమాట! అందుకనే తండ్రికి తప్పు దంచనా లిచ్చి కంపెనీని అమ్మించి ఇప్పుడు మళ్ళీ అందులోనే చేరుతున్నాడు.''

''రామచంద్రయ్య కొడుకు పెళ్ళిమీద కోపం వచ్చి అమ్మేశాడటగా?"

''అది మీకు చెపుతున్న కారణం. కొడుక్కిచ్చే జీతం ఎవడికిస్తే వ్యాపారం గడవదు? అందుకు కొట్టు మూయాలా? ఇదివరకే మధుమంజరికి కీర్తి వచ్చింది. ఇక దాన్ని దోచుకుంటాడు మధు. ఇప్పుడు పోయేది తన సొమ్ము కాదు. రామచంద్రయ్య ముందైతే ఆ పప్పులుడికేవి కావు.''

''ఏమిటో అంతా అయోమయంగా వుంది."

''స్పష్టమైన రెండవ విషయం చెప్తాను."

"ఖాసీ!''

''మధుకు పెళ్ళి కావటంతో ఇక్కడి వాతావరణం కొంత మారవచ్చు.''

''అంటే?"

''మీకు స్వప్తి చెప్పవచ్చు.''

''ఎందుకు?''

''వాళ్ళిద్దరు భార్యాభర్తలూ, ఒక ముసలమ్మా ఆ రెండు గదుల్లో ఎన్ని రోజులు మగ్గుతారు? - ఆ అర్థం మీకు తెలపాలనే యీ ఊటీ ప్రయాణం. అక్క డొక పంచవర్ష ప్రణాళిక వేస్తాడు. పంచప్రాణాలూ తీస్తాడు. అతని అసలు లక్ష్యం ఈ ఆస్తిని కాజేయటం కూడా. అందుకే ఇక్కడ తిష్ఠ వేశాడు."

''ఆస్తి కాజేయాలనే దుర్బుద్ధే వుంటే ఇంతకన్న పెద్ద సంబంధాలే వచ్చేవిగా?''

''ఇక్కడ ఒక్క మానవ సహజ దౌర్బల్యాన్ని మనం మర్చిపో కూడదు."

''ఏమిటది?''

''మనిషి, మనిషీ కలిసి వుంటే క్రమంగా మనసులు కూడా కలుస్తాయి. ఆ సహజ దౌర్బల్యంతో వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకున్నారు.''

''హరిగారు నన్ను పెళ్ళి చేసుకోలేదేం?''

''అందుకనే వాడు మోసగాడన్నది. మోసం చేసింది నిన్నొకదాన్నే కాదు- హేమను కూడా. నీవు నీ కాళ్ళమీద నిలబడకుండా ఉండాలని ఉద్యోగానికి పనికివచ్చే చదువు చెప్పించలేదు. నీవు ఉద్యోగం చేస్తే వాడి ఆట సాగదు. నీవు జీవితాంతం వంటయింటి కుందేలువు కావాలనే వాడి ఉద్దేశం."

"నాకేమన్నా విముక్తి మార్గముందా?"

"లేకేం? నీవు ఈ బంధాలనుండి విముక్తి చెందాలి. నీవు విహరించటానికి విశాల విశ్వం ఉంది."

"దేశదిమ్మరిని కమ్మంటావా?''

"కాదు. స్వతంత్రురాలయిన కళాజీవివి కమ్మంటాను.''

''నాకంత శక్తి ఎక్కడిది?''

''ఉంది. దాన్ని సద్వినియోగం చేయాలి.''

''నీవు మార్గం చూపిస్తావా?''

''అంతకన్న నా జన్మకు మరో అదృష్టం కల్గుతుందా? నీవూ నేనూ కలిసి మద్రాసు పోదాం. అక్కడ చిత్ర విచిత్ర లోకం ఉంది. అందులో అడుగు పెట్టామా నీ ఛాయా చిత్రాలు అఖిలభారతంలో పూజింపబడతాయి.''

''నాటక రంగానికీ చలనచిత్ర రంగానికీ భేదమేమిటి?''

''ఇందులో నీకు ఫలం ఈరోజు చేతికందదు. జీవితమంతా కృషి చేస్తే చివరకు మిగిలేది ఎముకల్లో సున్నం. చలనచిత్ర రంగంలో గంటల్లో గడించ వచ్చు.... వందలూ, వేలూ. అదృష్టం కలిసివస్తే తారాపథం కొద్దికాలంలోనే అరచేతిలో ఇముడవచ్చు. నీకీ దైన్యావస్థ అప్పుడుండదు. వీళ్ళందరి నాటకాలూ డబ్బుకోసమే. ఆ డబ్బు నీ చేతిలో ఉంటే నీ వన్నిట్లోనూ స్వతంత్రురాలివే.... నీ కాళ్ళమీద నీవు నిలబడాలంటే నీవు నాతో రా, నీకు స్వర్గం చూపిస్తా! నీ చేత రాజ్యాలేలిస్తా!''

''ముందు మీరుతో ప్రారంభించి తర్వాత నీవంటున్నా వెందుకో?''

''ఇన్ని రోజులూ నన్ను హాల్లో కూర్చోపెట్టి బైటికి పంపేదానివి. ఈ రోజు నీ గదిలోకే రమ్మన్నావు. నీవు నన్ను దగ్గరివాడుగా అనుకుంటూంటే నేను లౌకిక మర్యాదలతో నీకు దూరం కాదలుచుకోలేదు.''

''నీ కెదుటివారి కాళ్ళకు బందాలు వేయటం బాగా తెలుసు.''

''లేకపోతే వ్యవహారం నడవటం కష్టం.... నేనసి లివ్వేళ కామేశ్వరమ్మ గారిని కూడా దర్శించిపోదా మనుకున్నాను.''

''ఇంతభక్తి ఎప్పణ్ణుంచి? ఆమె - ఎక్కడ్లో దేవుని కల్యాణముందట - బంధువు లింటికి పోయింది. రేపల్లా ఉపవాసం. ఎల్లుండి పారణ చేసికాని తిరిగి రాదు.''

''పుణ్యాత్మురాలు.''

''ఏం?''

చంద్రం నవ్వాడు.

''నాకు మద్రాసుపోయే అదృష్టముందా?''

''ఏదీ నీ చేయి?'' కుర్చీ మంచం దగ్గరికి లాక్కున్నాడు చంద్రం.

''సాముద్రికం చెపుతావా?''

''బతకటానికి పదివేల విద్యలు-'' చంద్రం ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొని మరో చేత్తో నిమురుతూ రేఖలు గణిస్తున్నాడు.

''ఏమైనా నా కా గీత వుందా?''

''నీ ఒక్క గీతే కాదు. దాని ప్రక్కన మరో గీత కూడా ఉంది.''

చంద్రం మల్లెచెండులా ఆమె చేతిని నలిపివేస్తున్నాడు.

## 50

మల్లికా, చంద్రం ఏకాంతంగా ఒకచోట కూర్చున్నారు. ఎదురుగ్గా సముద్రపు హోరు.

''మల్లికా! యిక యింటికి పోదామా?''

''అప్పుడేనా! పోదాంలే. రేపట్నుంచీ యిలా తీరిగ్గా కూచోటానికి వీలుంటుందో ఉండదో!''

''అవును. రేపటినుండి నీవు సినీతారవు. నీ మనోహర నృత్యభంగిమలతో నీ మొదటి పిక్చర్ బాక్సాఫీస్ హిట్ కావాలి. ఇక నీకు సిరిఎత్తుకుందన్న మాటే!''

''అది సరే. శ్రీకంఠానికి నా మాట చెప్పావా?''

''నీతోనే స్వయంగా మాట్లాడతా నన్నాడు.''

''ఎప్పుడు వీలుంటుందో కనుక్కోపోయావ్?''

''రేపు ఉదయం చెప్తానన్నాడు.''

''ఇప్పటికి పది రోజులు తెల్లవారినై ఇల్లాగే.''

''అలాగంటే యెలా? వాడూ ప్రొడ్యూసరు చుట్టూ తిరుగుతున్నాడు తొందరపడితే పనులౌతాయా?''

''కూర్మయ్య చూడు, అతని తరహాయే వేరు''

''నాకు తెలిసినంతలో అతనివంటి యోగ్యుడు మరెవ్వరూ లేడు.''

''కానీ అంత పలుకుబడి ఉన్నట్లు లేదు.''

''ఎలా ఉంటుంది? అందరూ చేసే అన్యాయాలు అతడు చేయడాయె,''

"మొదటి పిక్చరు సక్సెసైతే నీకు తర్వాతి అయిదారు పిక్చర్లకు కంట్రాక్టిస్తానన్నాడు."

"నా అదృష్టంతో మొదటిసారి పందెమాడుతున్నాను. గెలిచానా - యీ యిసుకదిబ్బమీద యింకా కొన్నాళ్ళుంటాను. లేకపోతే...."

"హైదరాబాదుకు మళ్ళీ పోతావా?"

"ఎవరున్నారని పోయేది?"

"సూత్రధారుడున్నాడుగా."

''మళ్ళీ ఆ స్మృతులు జ్ఞాపకం రానీయకు.''

''మనం పరిషత్తు డబ్బు వాడుకుంటున్నాం. మనమీద హరి వారంటు తెస్తే?''

''కార్యదర్శివి నీవున్నావుగా!''

''నేను ఖైదుకు పోయినా నష్టంలేదు. నీవు నా వెంట వస్తే కాల్‌షీట్సు కెవరుపోతాడు?''

''నామీద హరిగా రంతపని చేయరనుకుంటాను.''

"చేయడని నమ్మకమేమిటి?''

''ఆయన తత్త్వం నాకు తెలుసు.''

"అయితే, ఈ డబ్బు ఎవడిచ్చుకుంటాడు?"

''ఆయనే.''

''వాడికేం పట్టింది?....పగపడితే మన ప్రాణం తీయవచ్చు.''

''నాకు వ్యక్తిత్వం వచ్చింతర్వాత ఒకరి చేతులో పెట్టాలిసిన బాధ్యత ఆయనకుందిగా? ఈ మాత్రం ఖర్చు కాకుండా నన్ను పంపగలడా? దానికా డబ్బు చెల్లయిందనుకుంటాడు."

''వాడి డబ్బు ధర్మంగా తీసుకుంటావా?"

"లేకపోతే, మగవాడివి - సంపాదించి తీర్చు."

''నీవు సంపాదిస్తే యేం, నేను సంపాదిస్తే యేం?"

''ఇద్దరి సంపాననకూ భేదముంది. నా సంపాదన నాకే దక్కుతుంది, నీ సంపాదన ఇద్దరికీ దక్కుతుంది,"

"ఏమిటా పక్షపాతం?"

"నీవు నన్ను తీసుకువచ్చావు. నన్ను నీవు పోషించాలి. నా బాధ్యతలన్నీ నీవి."

''కాబట్టే ఇక్కడ అడుగు పెట్టింది మొదలు కాలికి బలపం కట్టుకొని తిరగటం, నాకు దూరపు బంధువైన కూర్మయ్యగారితో నీకు పరిచయం కలిగించటం, ఈ కాంట్రాక్టు తెప్పించటం."

''కూర్మయ్యగారి ఒక్కరివల్ల అయిన పనా యిది? ఆ ప్రొడ్యూసర్‌ను ఎవరు చూచి వచ్చారు?"

"నీవే ననుకో....అసలు కూర్మయ్య లేకపోతే?"

''అసలు ప్రొడ్యూసరు లేకపోతే?"

''ఇంతకూ నీవనేది....యిదంతా నీ ప్రయోజకత్వమే అంటావు?"

''కాదు, ఇదంతా నా సంపాదనే అంటున్నాను."

''నేను నీకు చేస్తున్న సేవను గణింపవేంటి?"

''గణింపు కోసమే చేస్తున్నావా?"

"గణింపు లేకపోయినా కనీసం గుర్తించమని కోరటం తప్పా?''

"నీ ధర్మం నీవు నిర్వహించు. ఒకరు గుర్తిస్తేయేం? గుర్తించకపోతే యేం?"

"నాచేత వెట్టిచాకిరి చేయించాలనా నీ ఉద్దేశం?"

"నీకు ప్రతిఫలం ముందే ముట్టజెప్పాను."

''నీ అవసరం కాబట్టి నీవలా చేశావు.''

''లోకంలో కొంతమంది ఏ అపేక్షా లేకుండా సాయం చేస్తారు. కొందరు చేయి తడిపితేగాని గుక్క తడపరు.''

''నీవు ఎవర్ని గురించి అంటున్నావో నాకు తెలుసు .... నీ శరీర మిక్కడ....నీ మన స్సక్కడ."

''అక్కడంటే ఎక్కడ?"

"నీ మనసున్న చోట.''

"నీ వేలాగన్నా నాకు సమ్మతమే, ఇక్కడి మనుషులకు కావలసింది నా శరీరం, నా అందం, నా చందం. అక్కడి వారికి ఈ శరీరంతో పని లేదు. నా మనస్సు కావాలి. ఇక్కడి వారికి నా శరీరంవల్ల వచ్చే డబ్బు ప్రధానం. అక్కడివారికి నాలో పెరిగే వ్యక్తి ప్రధానం."

''అంత ఆప్తుల్ని వదలి యింతదూర మెందుకు వచ్చావు?''

''ఈ ఉప్పునీటి కుప్పను చూచిపోదామని''

''అంకా మొదటి కంట్రాక్టు మొదలుకాలేదు. అప్పుడే ఇంత వైరాగ్యమా?'

''లోకంలో ఎవర్నీ నమ్మలేనప్పుడు విచారమూ, వైరాగ్యమూ కాక ఏముంది?''

''నన్నుగూడా నమ్మటం లేదా?''

''ఇంకా నీవు నాకంత నమ్మకం కల్గించలేదు.''

''నేనేం చెయ్యలేదు?''

''కళాపరిషత్తు డబ్బు తిరిగి యిచ్చే బాధ్యత నీదని ఒప్పుకోలేదు.''

''నిజంగా నాది కాదు.''

''అదే ద్రోహం''

''అంతమాటా?''

''లేకపోతే నన్ను తొత్తుగా చేసి, నా రక్తాన్ని పిండి, డబ్బుగా మార్చి దాన్ననుభవిద్దామనేగా నీ అభిప్రాయం''

''నేనన్న మాటలను నాకే చెప్పచెపుతున్నావు. గుర్రాన్నీ గాడిదనూ ఒకే గాటన కట్టేస్తున్నావు.''

''గుర్రమూ....గాడిద....'' పెద్దగా నవ్వింది మల్లిక.

''నీ మేలు కోరేవాణ్ణి యిలా నిందించకూడదు.''

''నీకు కోరటం తెలుసు, ఇవ్వటం చేతకాదు. ఏ కోరిక లేకుండా నాకిచ్చే వాడు నా మేలు కోరేవాడు''

''అయితే . హరిని వదిలి ఎందుకు వచ్చావు?''

''నీవు కోరావు కాబట్టి''

''నీవు పెద్ద దాతవు....నేను బిచ్చగాణ్ణి''

"కాదా?"

"నీవు శ్రుతి మించుతున్నావు."

"ఈ సముద్రపు హోరు కన్నా నా?"

"నీవు తారవౌతావని కలలుగని గర్విస్తున్నావు."

"నీకు నేను దక్కానని నీవు గర్వించేదానికన్నా నా?"

"చక్కని ఉద్యోగాన్ని వదలిపెట్టి వచ్చాను."

"వచ్చినందుకు మెచ్చుకొన్న కాను కిదుగో" అంటూ మల్లిక ఆతని కెదురుగా ఎగ్రబాకింది.

"మనసెంత వేడో నీ ఒడలంత చలువనే మల్లీ!"

"బడబాగ్నిని దాచుకొన్న ఈ మున్నీటిని చూచి నన్ను చూడు. మల్లిక అతని మెళ్ళో మల్లెదండగా వ్రేలాడుతోంది."

## 51

హరి అనుకున్న రోజుకన్నా మూడురోజులు ముందే వచ్చాడు. వాకిట్లోకి వచ్చేసరికి మధూ మాలతీ హాల్లో కూర్చొని ఉన్నారు. మధు ప్రాణాలు లేచి వచ్చినట్లు ఎగిరి ముందుకు గంతేసి హరిని కౌగిలించుకున్నాడు. "భారతాత్మను దర్శించిన మహర్షులకు స్వాగతము సుస్వాగతము" అని నాటకీయంగా ఆహ్వానించాడు. మాలతి కాళ్ళకు నీళ్ళిచ్చింది. మల్లికను గూర్చి అడగాలనుకున్నాడు హరి. కాని, అడగలేకపోయాడు.

"కన్యాశుల్కం నాటక మెంతవరకు వచ్చింది?" హరి మొదటి ప్రశ్న.

హరి రక్తంలో జీర్ణించుకున్న సూత్రధారిత్వ దీక్షకు మధు నిశ్చేష్టుడైనాడు. జరిగిన పరిస్థితులకు తలవంచుకున్నాడు.

"ఏం? మాట్లాడవేమిరా మధూ?"

"కథ అడ్డం తిరిగింది!"

హరి వెలవెలపోయాడు. మధు మౌనం దాల్చాడు. మాలతి హరి గది తలుపు తాళం తీస్తోంది.

"చెల్లీ! అమ్మా, మల్లికా క్షేమంగా ఉన్నారా?"

మాలతి తలుపుమీద పడి ఏడుస్తోంది. కామేశ్వరమ్మ అప్పుడే కన్నీరపోటు వేసుకుంటూ ప్రవేశించింది. హరి కయోమయమైంది. వెర్రిగా అడిగాడు అందర్నీ పెద్దగా ''ఏదీ, మన మల్లిక?'' అని.

"చంద్రం, మల్లికా లేచిపోయారు!'' కామేశ్వరమ్మ రుద్ధ కంఠంతో చెప్పింది.

"మీరంతా ఉండి కూడా మల్లిక పోయిందన్నమాట?'' అతడు తీక్షణంగా ఆలోచిస్తూ నిలువబడ్డాడు,

"అదంతా నా పొరపాటు. అమ్మాయీ అల్లుడుగారూ ఊటీకి వెళ్ళారు పదిరోజులపాటు. నేనూ మల్లికా ఉన్నాము ఒంటిగా. దేవుని ఉత్సవాలకని వెళ్ళి నేను రెండురోజులింట్లో లేను. ఇంతలో ఈ ఉపద్రవం కలిగింది. పోతూ పోతూ ఈ కవరు మాత్రం పడవేసి వెళ్ళింది నీ పేర'' అని ఒక కవ రిచ్చింది. హరి చదివాడు:

''పూజ్యులు హరిగారికి - నమస్కారములు. నేను వెళ్ళేటప్పుడు మీతో చెప్పి వెళ్ళనందుకు అన్యథా భావించరనుకుంటాను. నాకు నా కాళ్ళమీద నిలబడే శక్తి మీ దయవలన కలిగింది. తమ పిల్లలు తమ బాధ్యతలను, పెద్దల బాధ్యతలను గుర్తించి ఉభయతారకంగా వాటిని నిర్వహింపగలిగితే సంతోషించే లోకాన్ని చూచాను. మీ రింటికి తిరిగివచ్చిన తర్వాత యేర్పడే క్రొత్త బాధ్యత మీకు లేకుండా విశ్రాంతి కల్పిద్దామని చంద్రాన్ని నా పురుషునిగా ఎన్నుకొని వెళ్ళిపోతున్నాను. క్షమించండి. నా జీవితంలో ఎప్పుడైనా మిమ్మల్ని దర్శించుకొని, మీ ఋణాన్ని తీర్చగల్గే శక్తి నాకు భగవంతు డీయాలని ప్రార్థిస్తున్నాను.

మీ - మల్లిక.''

హరి నిశ్చలంగా ఆ ఉత్తరాన్ని జేబులో పెట్టుకున్నాడు.

''నా మధుమంజరి దొరికింది; నీ మల్లిక పోయింది'' - మధు.

''నీవు మరలా మేనేజరువు కాగలవు కాని, నేను సూత్రధారుణ్ణికాలేను"- హరి.

''ఈ చంద్రం వల్ల వచ్చాయి యిన్ని తిప్పలు'' - మధు.

''ఈ తిప్పలకు మూలం నీవురా మధూ!'' - హరి.

మధు అదిరిపోయాడు: ''నీకేదో అపోహ కలిగినట్లుంది.''

''లేదు, ఇది యథార్థం. నీవు తొందరపడిచేసికొన్న ఈ వివాహఫలితం."

''మా వివాహం పవిత్రమైంది; వాళ్ళది తుచ్ఛమైంది."

"పవిత్రములు, మహిమాన్వితములు అయిన సాధనాలను దేశకాల పాత్రనుగుణంగా అనుసంధించకపోతే మనమే కాక మన చుట్టూ ఉన్నవారు కూడ బాధపడవలసి ఉంటుంది. వారి నీచ బుద్ధికి నీ వివాహం కారణం."

మధు ముఖం వెల వెలపోయింది.

"నిగ్రహంతో ఇంద్రియాలను అణచి, నిస్వార్థంతో చరిత్రకు వన్నెబెట్టి, ఓర్పుతో ఫలంకొరకు పురుషకారం చేస్తే పూర్ణఫలం తప్పక లభిస్తుంది. మన కళాపరిషత్తు కా అదృష్టం పట్టలేదు" - హరి.

మధు మరలా నిశ్శబ్దం.

"నే నొచ్చేంతవరకూ మధుమంజరితో పాటు నాటక కళాపరిషత్తును కూడ నీ యాజమాన్యం క్రింద వుంచు."

''నీవు మరలా ప్రయాణమా?"

''యూరపుకు. రెండు సంవత్సరాలు బ్రిటన్‌లో. మరి రెండు సంవత్సరాలు యూరపుఖండ దేశాల్లో నా విద్యాభ్యాసం."

''ఇన్ని రోజులు నిన్ను వదలి బ్రతుకలేనురా హరీ!" - మధు.

"అందుకే నీకు జంటగా మా చెల్లెలి నట్టిపెట్టి పోతున్నాను."

''మల్లిక సంగతి ఏమంటావు?"

''నేనెవరిని? ఏమనేది?....కాని, ఏ పరిస్థితులలోనైనా మల్లిక మీగడపతో అడ్డుగు పెడితే ఆమెను ఆదరించండి - అంతే!"

హరి కొన్ని క్షణాల్లో మళ్ళీ బయలుదేరాడు.

"మధూ! ఒక్క మాట....నేను నీకు వ్రాసిన ఉత్తర మందిందా?"

"లేదు."

''నే నూహించా నా మాట."

''ఏమి ఉత్తరం?"

''మల్లికచేత నాకు ఈ ఉత్తరాన్ని వ్రాయించిన ఉత్తరం."

మధు అర్థంకాక తెల్లబోయాడు. హరి తన వస్తువులన్నీ సర్దుతున్నాడు.

''సరాసరి ఇంగ్లండేనా ప్రయాణం?" - మధు.

"కాదు. ముందు మా అమ్మానాన్నల వద్దకు. వాళ్ళను చూచి చాలారోజు లయింది. వాళ్ళదగ్గర పదిరోజు లుండి ఆ తర్వాత విదేశయాత్ర."

"అత్తయ్యా, మామయ్యాలకు నమస్కారాలు చెప్పు'' - మధు.

హరి తల ఊపాడు. మధును దగ్గరికి పిలిచి "హేమ వచ్చి మిమ్మల్ని చూచి వెళ్ళిందా?" అనడిగాడు.

''లేదు.''

''ఆమె కింక చలనం లేదు. ఆమెను గూర్చి భయంలేదు''- హరి తనలో అనుకున్నాడు.

''మాలతిని వచ్చే సంవత్సరం చదివించమంటావా?''

''కామేశ్వరమ్మగారివలె మాలతి కూడా ఉపాధ్యాయిని కావాలని నా కోరిక'' - హరి.

''మల్లిక లేదని వినగానే ఈ ఇంట్లో ఒక్క క్షణం నీ కాలు నిలువలేదు. నిలబెట్టుకొనే అదృష్టం లేదు మాకు. నీకు దూరదేశాల్లో భగవంతుడు ఎప్పుడూ అండగా ఉండాలి!"అని దీవిస్తూ ఒక కమలాఫలం చేతిలో పెట్టింది కామేశ్వరమ్మ. అతడు ప్రేమతో తీసుకొన్నాడు.

"అన్నయ్యా! నీ వొచ్చేటప్పుడు నీ చెల్లెలి కేం బహుమతి తెస్తావో?" - మాలతి.

"విశ్వమానవ సౌభ్రాతృత్వము" - హరి.

"దూరదేశాల్లో ఉన్నప్పుడు మమ్మల్ని మర్చిపోవుకదూ?"

"ప్రేమహృదయాలు ఎంత దూరంగా ఉంటే అంత సన్నిహితంగా బ్రతుకుతాయి" అని హరి టాక్సీలో ఎక్కి వెళ్ళిపోయాడు.

## 52

మల్లిక యిప్పుడు ప్రసిద్ధాంధ్ర సినిమా తార ఆమె సినీరంగంలో అడుగుబెట్టి దాదాపు నాల్గు సంవత్సరాలు. అంత తక్కువ కాలంలో ఇరవై అయిదు చిత్రాలకు పైబడి పనిచేసింది. అన్నీ బాక్సాఫీసు హిట్సే!

మల్లిక పేరు వినని తెలుగువాడు లేడు. ఆమె నటించిన చిత్ర మాదని తెలుగు సినిమాహాలు లేదు. ఏ మహాకవికి, ఏ రాజకీయవేత్తకూ లేని గౌరవం ఆమెకు పెక్కుసార్లు లభించింది. ఆమెకు వెండితెరదేవత అని బిరుదు వచ్చింది.

మల్లికకు కీర్తి రావటానికి హేతువులు పెక్కురు పెక్కువిధాలుగా చెప్పుకుంటారు. దేవవేశ్యగాగానీ, నాగకన్యగాగానీ వేషం వేసిన పౌరాణిక చిత్రం శతదినోత్సవం చేసుకుందన్నమాటే. దానికి కారణం, ఆమె నాట్య చాతుర్యమని చెప్పుకున్నా, అంతటితో ఎవ్వరూ సంతృప్తిపడరు. ఆమె నాట్యాలు చేసేటప్పుడు దర్శకులు సాధ్యమైనంత తక్కువ వస్త్రాన్నే ఆమె శరీరానికి అలంకరింప జేసేవారు. మల్లిక శరీరవక్రాంచలరేఖ కదలాడిందా దేశం విరగ పడిపోయేది. ఏమిటో ఆ శక్తి! అందరూ వింత వింత కథలుగా చెప్పుకుండే వారు. సాంఘికాలలోనూ, జానపదాలలోనూ ఆమెకు చైతన్యంగల పాత్ర లిచ్చే వారు. బుద్ధిమంతులైన దర్శకులు ఆమెకు లైంగికభావ ప్రేరకమైన మనస్తత్వా నికి ప్రాధాన్యమిచ్చే పాత్రల నిచ్చేవారు. మల్లిక మనస్తత్వ వైవిధ్య ప్రదర్శనం తోనూ, సంశ్లిష్ట మనోభావ వ్యక్తీకరణంతోనూ రసికుల హృదయాలను ఆకట్టి వేస్తోంది. ఈ విధంగా త్రిగుణాత్మకమైన ఆంధ్ర వినోద ప్రజాజగత్తులో ఆమె విశిష్ట స్థానాన్ని స్థాపించుకుంది.

మల్లిక అడుగు పెడితే చాలు, పిక్చర్ డబ్బు పోసుకొంటోంది. రోజు రోజుకూ మద్రాసులో ఆమెచుట్టూ ప్రొడ్యూసర్ల, డైరెక్టర్ల రద్దీ ఎక్కువయింది. వచ్చే రెండు సంవత్సరాల్లో దాదాపు వంద కంట్రాక్టు సిద్ధంగా ఉన్నాయి. మల్లికకు క్షణం తీరిక, నిమిషం శాంతి లేదు. మద్రాసులో మల్లిక రెండు సంవత్సరాల క్రితమే ఒక బంగాళా కొన్నది. సొంత కారు, సొంత ఆఫీసు. ఆమె ఒక చిన్న రాజ్యానికి మహారాణి.

పూర్ణచంద్రరావు మల్లిక ఎస్టేటుకు మేనేజరు. అతడుకూడా చిత్ర రంగంలో అడుగుపెట్టాలని చూచాడు. రెండు మూడు చిత్రాల్లో నటించాడు. ఒంటిగా నటించిన చిత్రాలు ఫెయిలైపోయాయి. మల్లికతో కలసి నటించింది ఒక్కటే ఒక్క చిత్రం తనకు నటన రాదనిపించింది. దానితో సినీరంగానికి స్వస్తి చెప్పి మల్లిక యింటి యజమానిగా బ్రతుకీడుస్తున్నాడు.

మల్లికా చంద్రం సినీ వ్యక్తులు. రాత్రింబవళ్లూ కాల్‌షీట్సుమీద పనిచేసే వారు. అవుట్‌డోర్, ఇన్‌డోరు షూటింగులకు ఊపిరాడకుండా తిరిగి వచ్చేవారు. ఎప్పుడో ఒకరోజు తీరిక దొరికేది. మల్లిక స్వయంగా నటరాజస్వామికి పూజ చేసేది. ఒక్కొక్కరోజు ఉదయం బయలుదేరి వెళ్ళితే యింటికి వాళ్ళు చేరేసరికి అర్ధరాత్రి దాటుతుండేది.

ఆరోజు అలాగే మల్లిక, చంద్రం వచ్చేసరికి రాత్రి ఒంటిగంట అయింది. కారులోనుండి దాసీలు ఇద్దర్నీ చేతుల్తో పట్టుకొనివచ్చి పక్కలమీద పడుకోపెట్టి తలుపువేసి వెళ్ళారు. ఇద్దరూ తప్పతాగారు. ఇంద్రియాలు స్వాధీనం తప్పి కదలుతున్న శవాల్లా పడుకొన్న యిద్దరూ ఒకరిప్రక్క కింకొకరు వచ్చారు. ఇద్దరూ అస్పష్టమైన తెలివిడితో మాట్లాడుకుంటున్నారు:

"సాయంత్రం కాల్‌షీట్ అయింతర్వాత ఎక్కడి కెళ్లావ్?"

"నీవు మేనేజరువు.... తెలుసుకోలే?"

"నేనెక్కడికోపోయాను"

"ఎక్కడికి?"

"నీవు చెప్పు ముందు."

"నన్ను శరశ్చేంద్ర తీసుకెళ్ళాడు తన కార్లో బారుకు."

"ఏ మంటాడు?"

"నన్ను తెగ పొగుడుతాడు....లోకమంతా తన మీదనే పోతున్నట్లు కోతలు కోశాడు....ఇద్దరం తాగాము. నేను సోఫాలో సొమ్మసిల్లాను....వాడు వచ్చి మీద చెయ్యి వేశాడు."

"ఎక్కడ?"

"పరాయి మగవాడు వేసిన చేయిసంగతి నీ కెందుకు?"

"నాకు తెలుసు ఎక్కడ వేశాడో."

"తెలిస్తే నోరుమూసుకో....నీ వెక్కడి కెళ్ళావు నేను సెట్‌మీద కెళ్ళి నప్పుడు?"

"మంజువాణి ఫ్రీగా వుంటే అలా వెళ్ళాము!"

"ఎలా?"

"అంతా చీకటిగా వుందే అలా."

"అవును అంతా చీకటిగావుందే అప్పుడు మంజువాణి ఏమంది?"

"అదేమీ అనలేదు."

"అయితే నీవేమన్నావు?"

నీవు చెప్పకో చూద్దాం."

"నేను విన్నాగా!"

"అయితే ఊరుకో."

"ఊరుకోను. అరుగో నావైపు ఎర్రని కళ్ళతో చింపిరి జుట్టుతో కోర మీసాలతో నవ్వుతూ వస్తున్నారు. రానీ, వీళ్ళందర్నీ ఒక్కసారి నలిపేస్తాను." మల్లిక తడువుకుంటూ చంద్రాన్ని బాహువుల్లో ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

"అవును, అల్లాగే వొత్తెయ్యాలి. వాళ్ళ పని అంతే కావాలి. నలిగిపోనీ నల్లుల్లాగా. ....నీవు కొంచెం తొలగిపో.... ఇ దెవరు.... ఇంకెవరు.... మా మల్లిక లేదు.... రా చేతుల్లోకి రా." మల్లికను తన బాహువులతో ఎదురు బంధించాడు.

ఒక్క క్షణం ఇద్దరూ పెనగులాడారు.

"ఎవరివి నువ్వు?" పెద్దగా అడిగాడు చంద్రం.

"నేను శక్తిని.... స్త్రీశక్తిని!" మందంగా చెప్పింది మల్లిక.

"ఏం కావాలి నీకు?" - చంద్రం.

"ఒక్క పండు.... అందుకోసమే నిన్ను బ్రతిమిలాడుతున్నా"

"వద్దు. పాడుపండు ప్రతిబంధం."

"నీకు తెలియదు.... ఇటురా.... అదో అనుబంధం."

"అను.... అను.... బంధం.... బంధం...."

"అ....వు....ను....అ....దే....మ....క....రం....దం."

జాగృతికీ, స్వప్నానికీ నడుమ వెలిగే ఆ మానసిక స్థితిలో బ్రతుకూ-చావుకూ మధ్య బ్రతికే ఆ నాలుగు ఘళ్ళు తప్ప దినమంతా వారిరువురూ దివ్య భోగులు.

మల్లిక మనసులో ఆ సంధి సమయంలో కూడా ఏదో తీవ్రమైన కోర్కె ఒకటి గాఢంగా వెలిగేది. తన కడుపు పండాలనీ, తల్లినై మనుగడ పొందాలనీ ఎప్పుడైనా కలిస్తే హేమకూ, హరికీ, మాలతికీ, మధుకూ తానా పసి మొగ్గను చూపాలని.... మల్లిక మనసులో మండే ఆ ఒక్క తేజం తప్ప ఆమెలో మరే శక్తీ లేదిప్పుడు. తన బ్రతుకుమీద తనకు సంతృప్తి కలిగింది. తన చివరి కోర్కె కొరకే నిరీక్షణ! ఈ సర్వవ్యవహార జగత్తూ.

## 53

మాణిక్యాంబా రామచంద్రయ్యలు కొడుకును కాదని సాధించిందేమీలేదు. రామచంద్రయ్య భార్య ప్రోద్బలంవల్ల మధుమంజరి నమ్మాడు. తర్వాత ఎంతో బాధపడ్డాడు. మధుమంజరికి మధు మరలా మేనేజరై వ్యాపారాన్ని సమర్థవంతంగా నిర్వహిస్తూ వేలకువేలు గడించి కంపెనీవారి కిస్తున్నాడు. మధు కిప్పుడు ఇతర కార్యకలాపా లేమీ లేవు. స్వీయశక్తులన్నీ వ్యాపారంమీద కేంద్రీకరించాడు. మేనేజరు సామర్థ్యాన్ని గుర్తించి కంపెనీవారు మధుకు పెద్దమొత్తాన్ని జీతంగా ఇస్తున్నారు.

హరి లేడని అనుకుంటూనే నాలుగేళ్ళు గడిచాయి. మాణిక్యాంబ కొడుకును చూడకపోవటంలో. బెంగ పెట్టుకుంది. అన్నం తినక నీళ్ళు త్రాగక రోజు లీడుస్తున్నది. అవ్యవస్థితమైన ఆహారం, అనియతమైన నిద్రాదులు ఆమె ఆరోగ్యాన్ని బాగా క్షీణింపజేశాయి. రామచంద్రయ్య భార్యకు చెప్పలేడు, తాను స్వతంత్రించలేడు. మాణిక్యాంబకు చింత చచ్చినా పులుపు చావలేదు.

హేమకు ఫైనలియరు పరీక్షలు దగ్గరికి వచ్చాయి. ఇంతవరకూ ప్రతి సంవత్సరమూ ఫస్ట్‌క్లాసులో పాసయింది. పెద్దవాళ్ళ పట్టింపులు పెద్దవై కుటుంబ సమైక్యాన్ని కుంటుపరుస్తున్నా నిబ్బరంతో ఓర్చుకొని తన సాయశక్తులా దానిని సవ్యంగా మార్చటానికి యత్నించింది. ఆమె మాట చెవినపెట్టే వారే లేక పోయారు. ఆమె ఏకైక లక్ష్యం చదువు. దాన్ని పూర్తి చేస్తోంది. ఆమెకు హరి మీద అనుమాన మొకటి ఉండేది. అది మల్లికతో సంబంధాన్ని గూర్చి. మల్లిక

లేచిపోయింది. మల్లిక ఎప్పుడూ అటువంటిదే. హరి పరిశుద్ధుడుగా ఉండి ఉంటాడంటే నమ్మలేకపోయింది. ఆమెలోని ఆ అనుమానమే హరిని గూర్చి ఆమె నింకా సౌముఖ్యం చేయంది.

మాణిక్యాంబ మేడమీద వడియాలు ఎండబెట్టి వాటిని చేటతో ఎత్తుకొని మెట్లు దిగబోయింది. ఎండలో ఒక అర్ధగంటసేపు ఉన్నందువల్ల తల తిరిగి నట్లయింది. అక్కడినుండి క్రిందకు దొర్లుతూ జరజరా పడిపోయింది. పని మనిషీ, హేమ, రామచంద్రయ్యలు ముగ్గురూ ఆత్రంతో వచ్చి ఆమెను మంచం మీదకు చేర్చి డాక్టరును పిలిచి చూపించారు. ఆమెకు కుడిచెయ్యీ, కుడికాలుకు పక్షవాతం వచ్చింది. ఎడంచెయ్యి మణికట్టువద్ద ప్రాక్చరయింది. డాక్టరు కట్టు కట్టి, ఇంజక్షన్లూ మందూ ఇచ్చి వెళ్ళాడు.

హేమకు పరీక్ష రోజులు. జీవితాన్నటో ఇటో తేల్చే పరీక్షలు. తల్లికి పక్షవాతం రావటంతో యింటిపనులు కొన్ని హేమ చేయవలసి వచ్చింది. రామ చంద్రయ్యగారి కన్ని పనులూ అందింపవలసి వచ్చింది. హేమ తండ్రితో అన్నది:

"నాన్నగారూ! అమ్మ కిలా వుంది. అన్నయ్యా వదినలను పిలిపించరూ?"

రామచంద్రయ్య కూడా అదే మనసులో యోచిస్తున్నాడు. "అవును. నేనూ అదే అనుకుంటున్నాను. కాని...." అని నీళ్ళు నమిలాడు.

"ఇన్నాళ్ళూ లేంది ఇవ్వేళ ఎలా పోయి పిలుద్దామా అని కదూ మీ అను మానం? అన్నయ్య అలా అనుకునే మనిషి కాడు. పిలిస్తే తప్పక వస్తాడు."

"అయితే నీవు వెళ్ళిరామ్మా! పిలిచిరా!"

"అమ్మ కీ విషయం చెప్పి ఒప్పించండి. నేను వెళ్ళి వాళ్ళను పిలుచుక వస్తాను" అని ఉత్సాహంతో హేమ కామేశ్వరమ్మ గారింటికి జీపుమీద వెళ్ళింది. జీపు చప్పుడుకు ఇంట్లోనుంచి ముగ్గురూ బైటకు వచ్చారు. ఎదురుగా హేమ. అమాంతంగా అన్నయ్యను కౌగలించుకొని బోరున ఏడ్చింది హేమ. నాలుగేళ్ళు మొగం చూచుకోని బాధంతా జలజలా ద్రవింపజేసింది. మధుకూడా కంటతడి పెట్టాడు. కల్లికూతుళ్ళ కళ్ళు చెమ్మగిల్లాయి.

"అన్నయ్యా! అమ్మ పక్షవాతం వచ్చి పడిపోయిందిరా! చెయికూడా ప్రాక్చరయింది. నాన్న మిమ్మల్ని పిలుచుకరమ్మన్నాడు." హేమ గద్గదికతో చెప్పింది.

"ఈ రోజున కనపడ్డాడా కొడుకు?"

"అలా అనకురా! అమ్మ అందరికీ కావలసిందే. ఆపదలో ఉంది."

"శరీరస్థితి ఇప్పు డెలా ఉంది?"

"ప్రమాదం లేదుకాని, అమ్మ బాగా బాధపడుతోంది."

"పరువున్న వాణ్ణైతే, అభిమానమున్న వాణ్ణైతే ఆ యింటికి రావద్దని వారి ప్రతిజ్ఞలు. ఏ మొగం పెట్టుకొని వచ్చేది చెల్లీ?"

"మన తల్లిదండ్రులు కోపంవస్తే నాలుగంటారు. అనురాగంవస్తే నాలుగు పెడతారు. అవన్నీ పట్టించుకుంటే ఎలారా? మీ యిద్దరిమధ్య గండిపడింది. పూడే కాల మిదే. కలవండి మీ యిద్దరూ. మన యింటి నొకటి చేయండి. గోడలు పగిలిన ఇల్లు ఎప్పటికైనా అపాయమే."

"ఇంకా తెలిసిరావాలి. అప్పుడే చాలదు. ఇన్నిరోజులు నేను పడిన బాధంతా ఇంత తేలిగ్గా సంధికివస్తే ఆ ప్రాణాలకు అర్థం కాదు."

"అయితే నీ పట్టుదల వదలవన్నమాట! నీ చెల్లెలిమాట మన్నించవన్న మాట! మరోసారి ఆలోచించు.... నిన్నూ వదిన్నూ తీసుకరమ్మన్నాడు నాన్న. మీ యిద్దరూ మీ యింటికి రాండి. అమ్మను ఆదుకోండి. ఆడబడుచు గౌరవం నిలపండి."

"...." మధు నిశ్శబ్దం.

"హేమా! నేను వస్తున్నాను పద." మాలతి ముందుకు వచ్చింది.

"వదినా! నిజంగానా?...." అంటూ హేమ మాలతిని కౌగిలించుకుంది సంతోషంతో.

"ఈ రోజు పెద్దది మూలబడింది కాబట్టి మీ నాన్నకు మేం కావలసి వచ్చాం చాకిరీ చెయ్యటానికి. ఇక్కడ కూడా వడ్డీలెక్కే.... మాలతీ! నేను వెళ్ళటం లేదు. నా మాట కాదంటావా సరే...."

మాలతి బోరున యేడుస్తూ భర్త గడ్డం పట్టుకొని బ్రతిమిలాడింది. "నా జన్మలో నా యింటికి పోయి నావాళ్ళకు సెవచేసే అవకాశం నాకు ఈనాడు కల్గింది. అత్తగారిబ్బందిలో ఉంది తప్పక వెళ్ళి మనం ఆదుకోవాలి. నేను కోరిం దెన్నడైనా కాదన్నారా మీరు? ఆ ధైర్యంతో....చనువుతో మిమ్మల్ని వేడుకుంటున్నాను. ఈ ఒక్కసారికి మన్నించి రండి పోదాం మనింటికి."

మధు గంభీరుడైనాడు. "పిచ్చిదానివే మాలతీ! ఎవరు నిన్ను చీదరించుకొని విదిలించివేశారో వాళ్ళనే నీవాళ్ళంటావు. ఇంత మంచిదానివి ఎలా బ్రతుకు తావక్కడ కాలు పెట్టి? నీ యోగ్యతను మన్నించే ప్రాణి లేదక్కడ."

"నీవే ఇలా అంటే ఎలాగురా? వాళ్ళు మిమ్మల్ని వెళ్ళగొట్టినా - మళ్ళా పిలుస్తున్నారుగా! అది చాలదా?.... ఇప్పుడు నీవు వస్తే నీచేయి మీద ఔతుంది. లోకం వాళ్ళ తప్పునే ఎత్తి చూపుతుంది. ఇంతకన్నా నీవు మరీ పంతం పట్టటం బాగుండదురా అన్నయ్యా మనలో!"

మధు మాట్లాడలేదు. కామేశ్వరమ్మ కల్పించుకున్నది. "అమ్మాయి అన్నట్లు మీరిద్దరూ మీ యింటికి ఇప్పుడు పోయిరావటమే బాగుంటుంది బాబూ! లోకం మెచ్చుతుంది. దేవుడు మెచ్చుతాడు." ఆమె కంఠం జీరపోయింది.

"మీ రింతగా అంటున్నారు కాబట్టి.... మాలతిని పంపించండి.... అమ్మడూ హేమా! మీ వదినను తీసుకపోయి మరలా భద్రంగా నాకు వప్ప చెప్పే పూచీ నీది."

"వదిన గుణమే ఆమెకు భద్రం...." అంటుండగానే మాలతి కామేశ్వరమ్మకూ మధుకూ చెప్పి, పోయి జీపులో కూర్చుంది. హేమ ఆమె ప్రక్కన కూర్చుంది. జీపు గాండ్రించుకుంటూ ముందుకు వెళ్ళిపోయింది.

## 54

మాణిక్యాంబకు పడిపోయిన కుడిచేయి కుడికాలూ ఇంకా స్వాధీనం కాలేదు బాగా. పది రోజుల నుండి ఇంజక్షనులూ తైల మర్దనలూ జరుగుతున్నాయి. కొద్దిగా సుముఖంగా ఉంది. ఎడమచేయి ఫ్రాక్చరు కట్టు విప్పదీశారు. అంతకుపూర్వం రెండు చేతులూ లేక మాణిక్యాంబ అన్ని పనులకూ బాధపడేది. ఆడతోడూ, కోడలూ-అయిన మాలతి కాలనక చేయనక అన్నివిధాలా సేవలూ అత్తగారికి చేస్తోంది మౌనంతో,

మాణిక్యాంబకు కోడలు విలువ ఇప్పుడు తెలిసింది బాధ వచ్చినప్పుడు ఆత్మీయులు ఆప్యాయతతో సేవచేస్తే సమకూరే సంతృప్తి ఆమెకు అనుభూతికి వచ్చింది. మాలతిమీద ద్వేషం పోయింది. కాని, సానుభూతి, అనురాగం మాత్రం కుదరలేదు. కొడుకు తనను చూడటానికి రాలేదని గుర్తుకు వచ్చినప్పు డెల్లా దుఃఖ మెంత వచ్చేదో అభిమాన మంత ముంచుకొని వచ్చేది.

"అయితే, వాడసలు రానన్నా డటే మాలతీ?"

"అలా యేం అనలేదు."

"ఒకసారి రావటానికి మరేం వచ్చిందట?"

"నా కిద్దరకూ చెప్పే సామర్థ్యం లేదు."

"వాడు నేను పోతే కాని ఈ యింటికి రాడేమో!"

"అదేంటి అత్తగారూ! అంత లేసి మాటలనుకుంటూరు?"

"అవునే, ఏం చేసేది? నాగీత అలా వుంది."

"వారూ యింతలోనే వస్తారు."

"వస్తాడో.... చస్తాడో.... చూస్తున్నాంగా నాలుగేళ్ళబట్టి." విసుగ్గా మాణిక్యాంబ మంచంమీద కొరిగింది.

మాలతి అదిరిపోయింది మాణిక్యాంబ నోటి దురుసుదనానికి. పడగ చితకపొడిచినా తోకతో కొట్టే త్రాచుపాములా అనిపించింది మాణిక్యాంబ కోపం.

తాను అత్తవారింటికి వచ్చి పదిరోజులయింది. అమ్మగారింటికి పోవటమే పడలేదు. వాళ్ళ యోగక్షేమాలూ తెలియలేదు. వారం రోజుల క్రితం కామేశ్వరమ్మ వచ్చి పలుకరించి పోయింది. అంతే. నాలుగురోజులబట్టీ వాన్నా, ముసురూ, బ్రహ్మాండమైన వర్షం. అకాశానికి చిల్లులు పడ్డాయి. ఆనాటి సాయంకాలం ఏడున్నరకు ఇంటిముందు టాక్సీ ఆగింది. హారన్ మోగింది. హేమ ఎవరా అని చూచింది. మధు మాలతిని పిలవమని కేకవేస్తున్నాడు టాక్సీ లోనుండే.

"రారా అన్నయ్యా! లోపలికి."

"ఖాదమ్మ డూ, మాలతిని పంపు."

"సరే. నీ యిష్టం. పదినా! అన్నయ్య పిలుస్తున్నాడు."

మాలతి వర్షధారల్లో తడుస్తూనే టాక్సీదాకా వెళ్ళింది. మధు తలుపు తెరచి లోపలికి లాక్కున్నాడు.

"మాలతీ! పదిరోజులబట్టి మొగమే చూపించలేదు."

"ఇక్కడ అత్తగారి సేవలోనే సరిపోతోంది."

"అమ్మేమన్నా కాస్త దారిన పడిందా?"

"ఆరోగ్యంలో కొంత దారిన పడ్డారుగాని ఇంకా అంతఃకరణలో పడ లేదు."

"నేను చెపితే నమ్మావా? ఆమె అంతే."

"ఏమో బాబూ! ఆమె అంతే.... మీరూ ఇంతే."

"ఓయబ్బో! పది రోజులకే అత్తగారింటి వాసన ఇంత మాటుగా సోకితే ఇంకా జీవితమంతా ఉంటే నన్ను రేకట్టనిస్తావా?"

"నాలో అంతశక్తే వుంటే మిమ్మల్ని లోపలికి రప్పించలేకపోయానా?"

"నేనెన్నడో ప్రతిజ్ఞ చేశాను. నేను నా ప్రాణాలలో మళ్ళా యీ గడపలో అడుగుపెట్టేది లేదు."

"అబ్బా! ఊరుకోండి. మీరూ మీ అమ్మగారూ మాటమాటకూ ప్రాణా లతో ముడిపెడతారు. నాకు భయం వేస్తోంది."

"నీ అండన ఉన్నవారికి ప్రాణభయం లేదు మాలతీ!"

ఆమె పదిరోజుల వలపు కుమ్మరించే నవ్వు నవ్వింది. కొంటెగా ఆమె పెదిమలను మునివేళ్ళతో పట్టి వాటిని తన పెదిమలతో ముద్దుపెట్టుకున్నాడు. డ్రైవరున్నాడని మాలతి సిగ్గుతో కుచించుకుపోయింది.

''నేను మద్రాసు పోతున్నాను మధుమంజరి పనిమీద.''

''ఈ వర్షంలో బయలుదేరారేం?''

''జరూరు పని. లక్షరూపాయల కొటేషను రేపు సాయంకాలం 5 గంట లకు మద్రాసులో దాఖలు చేయాలి. మధుమంజరి శ్రేయస్సుకు మనమేమైనాసరే."

"ఎందుకో నాకు భయంగా ఉంది, మీ రీ హడావుడి ప్రయాణం చేస్తుంటే!"

"నీవు సొంతంగా నన్ను ప్రయాణం చేయలేదు కదూ. అందుకని...."

"మళ్లా ఎప్పుడు తిరిగివస్తారు?"

మధు నవ్వాడు. "నేనెన్ని తిరుగుళ్ళు తిరిగినా చివరకు చేరేది నీ దగ్గరికే. మనకు కాలం గణనీయం కాదు" అని గడియారం చూచుకొని టైమైందన్నాడు.

మాలతి కన్నీరాగబట్టుకోలేక అతన్ని వక్షస్థలం మీద మోముంచి ఏడ్చింది. జలసిక్తమైన కుంకుమ అతని నెక్‌టైకి అంటుకున్నది. అతడు ఓదారుస్తూ మాలతిని ఇంట్లోకి పంపాడు. వర్షధారలమధ్య మసకమసకగా కన పడుతూన్న మాలతిని కన్నులు విప్పార చూచాడు మధు; నెక్‌టైమీది కుంకుమ గుర్తును చూచుకున్నాడు.... నవ్వుకున్నాడు తనలో తాను.

నాంపల్లి స్టేషనులో అడుగుపెడుతుండగానే మద్రాస్ ఎక్స్‌ప్రెస్ బయలు దేరింది.వెంటనే టాక్సీమీద సికిందరాబాదుకు వెళ్లి బండినందుకున్నాడు.భోరుమని యేడుస్తూ ఇలజను ముందుకు సాగింది. వర్షధారలు భూమినీ ఆకాశాన్నీ కలిపి కట్టుతున్నాయి. ఆ బంధాలన్నీ తెంపుకుంటూ మహాప్రస్థానం సాగిస్తోంది ఎక్స్‌ప్రెస్. జనగాం స్టేషను చేరేసరికి వర్షం మరీ అధికమైంది. వరుణదేవుడు బుసలుకొడుతున్న ఇంజనును చూచి సహించలేకపోతున్నాడు.

బండి మొండికిపడి ముందుకు సాగింది. ప్రయాణీకులు నిద్రతూగులో పడ్డారు. బండి తూగుతూనే నడుస్తోంది. మధు ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంటు పైబెర్త్ మీద పక్క వేసుకొని పడుకున్నాడు. అతని మనసంతా మాలతి ముఖాన్నే మరీ మరీ భావిస్తోంది. టాక్సీలో ఆమెను నిశ్శబ్దంగా పెట్టుకున్న ముద్దు జ్ఞాపకంవచ్చి తనలోతాను సిగ్గుపడుతూ తన ముఖాన్ని చేతుల్తో కప్పుకున్నాడు.

ఇంజను ముందు అంతా జలమయం. నీటిని త్రోసుకుంటూ ఇంజను ఈదుతోంది. ప్రళయంలో ప్రవేశించినట్లుంది బండి. అర్ధరాత్రి ఇరులు జడలు విరియబోసుకొని మృత్యులాస్యం చేస్తున్నాయి. నిండుకుండల్ని పగులగొట్టాలని ఒడిసిరాళ్లు విసురుతున్నాయి. హోరుమని రైలు చక్రాల క్రింద చప్పుడు. మధు భావనలో మధురభావలహరి. ఆ అంధకారంలో ఏదో ప్రళయధ్వని. ఆ ధ్వనిలో నిండుజీవుల ఆర్తనాదాలు. రైలు బ్రిడ్జి కూలి రైలుపెట్టెలు నీటిలో మునిగి

పోయాయి. కొన్ని నిండుజీవాలు మునిగిపోయాయి. అంతా చీకటి. ఎన్నో కుటుంబాల చరిత్రలలో అకస్మాత్తుగా అంధకారం. ఎన్నో ఫలోన్ముఖమైన జీవితాలు ఆ జలరాశిలో బలి. అది ఒక ఘోరకలి.

తెల్లవారేసరికి హైదరాబాదులో జనగాం రైల్వే ప్రమాదపు వార్త మంటలా వచ్చిపడింది. కుండపోత వర్షంలో వేలాది గుండెలు భగ్గున మండిపోయాయి. రామచంద్రయ్య నట్టింట చిచ్చుపడింది. మాలతి నుదుటి కుంకుమరేఖ చెరిగింది. భోరుమని యేడుస్తూ జీపు జనగాంవైపు పరుగెత్తింది. మూడు రోజులపాటు రామచంద్రయ్య, మాలతి, హేమ ఆ విలయదృశ్యంలో వనస్థాపన చేశారు. ప్రమాద స్థలానికి ఆరు మైళ్ళ దూరంలో ఈతచెట్ల గుబురుల్లో మధు శరీరం కనపడింది. ప్రకృతి అంతా బావురు మన్నది. విరియబూచిన చెట్టు విరిగి భూమి మీద పడింది. మాణిక్యాంబ కుడిచేయి మళ్ళా చచ్చుపడింది. రామచంద్రయ్య రెండు చేతులూ తెగినట్లైనవి. మాలతి తాను అగ్నిలో దగ్ధమైనట్లు అయింది. శవం మీద పడి ఏడుస్తున్న మాలతిని, హేమను ఓదార్చేసరికి రామచంద్రయ్యకు బ్రహ్మప్రళయమైపోయింది.

ం ం ం

కర్మకాండ యథావిధిగా నడిచింది. ఏ కొడుకుచేత తాను తల కొరివి పెట్టించుకోవలెనో, అతనికే రామచంద్రయ్య పెట్టవలసివచ్చిందని లోకం వాపోయింది. కోడలైనా కొడుకుగా మన్నిస్తారేమోనని ప్రజ భావించింది. నెలరోజుల లోపల కోడల్ని పుట్టింటికి పంపిస్తూనే, సంవత్సరానికి రెండువందల రూపాయల భరణం యిచ్చే కాగితం వ్రాయించి, మాలతి సంతకం పెట్టించుకున్నాడు రామచంద్రయ్య. ఏ ప్రేమనిధి శాశ్వతమని నమ్మిందో, అదే పోయింది మాలతికి. ఇక రామచంద్రయ్య పాపపు డబ్బు నా కెందుకని, ఆయన చెప్పినట్లల్లా కాగితాలు వ్రాసి యిచ్చింది. సంబంధం తెంచుకొని తన పుట్టింటికి వచ్చింది. కామేశ్వరమ్మ కూతురు ముఖం చూచి కుమిలిపోతోంది. ఆమెకు కూడూ, నీళ్ళూ లేవు. మాలతి జీవచ్ఛవంలా బ్రతుకీడుస్తోంది.

మధుమంజరి కార్మికవర్గం కట్టలు తెగేటట్లు దుఃఖించారు. పాలకవర్గం మధు కుటుంబానికి పదివేల రూపాయలు కృతజ్ఞతా చిహ్నంగా మంజూరు

చేశారు. మధుమంజరి ముఖాన పూర్వపు కళ పోయింది. అది క్రమంగా మూత పడింది.

## 55

హైదరాబాదును గూర్చి ఎన్నో కలలు కంటూ బేగంపేట విమానాశ్రయంలో దిగాడు ఫారెన్ డాక్టర్ హరి. తనకోసం తన మధు ఎంతమందిని విమానాశ్రయానికి తెస్తాడో అనుకున్నాడు. గంపెడాశతో విమానం దిగాడు.

ఎదురుగ్గా వస్తున్నారు తన తల్లిదండ్రులు, వారి వెనుక అరుణాచలనాథ్. ఆరిపోయిన అగ్నుల్లాగా ఉన్నారు వారు. తెచ్చికోలు నవ్వుతో తనకు ఆహ్వానం పలుకుతున్నారు. మధు లేడు. హరి గుండె లవిసిపోయాయి. తల్లిదండ్రులను కౌగిలించుకున్నాడు. అరుణాచలనాథ్‌ను సమీపించాడు. అతడు భోరుమన్నాడు. అయోమయమైపోయింది హరికి. కుప్పగూలిపోయే హరిని రెక్కలు పట్టుకొని తీసుకవచ్చారు ఇంటికి. మాలతిని, కామేశ్వరమ్మను చూడలేకపోయాడు హరి. మధు ఫోటోను కౌగిలించుకొని పసిపిల్లవాడులా వెక్కివెక్కి యేడ్చాడు. రఘుపతి కుమారుణ్ణి పొదివి పట్టుకొని వరంగల్లు తీసుకువెళ్ళాడు.

పదిరోజుల తర్వాత హరి వచ్చాడు హైద్రాబాదుకు. హుటాహుటి కామేశ్వరమ్మ నట్టింటికి వచ్చాడు.

"చెల్లీ, మాలతీ! నీకు రామచంద్రయ్య భరణమిచ్చాడా?"

"ఆ పాపపు డబ్బు ఏమిటిలే అని నేనే ఒప్పుకున్నాను"

"మధు ఆత్మకు శాంతిలేదు. బ్రతికి ఉన్నన్నినాళ్ళు వాడికి నట్టింట్లో ప్రశాంతంగా కూడు పెట్టలేదు. చచ్చిం తర్వాతనైనా అతని భార్యకు సగం భాగం ఇవ్వాలసింది పోయి ఏమిటీ ఈ పీనాసి చేష్టలు?"

"పోనిద్దూ. ఎక్కడ పాపముంటే అక్కడే హరిస్తుంది."

"అలా పాపం తలిస్తే ఆ కిరాతక పనులకింక అంతుండదు."

"నీకు గూడా కోపం వచ్చిందా అన్నయ్యా?"

"నాకు ఒక్కగాను ఒక్క చెల్లెలు. ఒక్క బావమరది. వాణ్ణి బ్రతికించుకోలేని నిర్భాగ్యుణ్ణి. నా చెల్లెల్ని కూడా బ్రతికించుకోవద్దంటావా?"

"నాకేం అన్నయ్యా! మీరందరూ ఉన్నారు!"

"మొన్నటిదాకా మధు ఉన్నాడనే అనుకున్నాం. ఏడీ ఈ రోజు మధు? ఏడీ నా మధు?" హరి బావురుమన్నాడు. మాలతికూడా బావురుమన్నది.

"ఏమిటి బాబూ! పెద్దవాడివి నీవే నిగ్రహించుకోలేకపోతే ఎల్లా?" కామేశ్వరమ్మ ఓదార్చింది.

"నిగ్రహాన్ని అసమర్థతగా లెక్కగట్టి మన మంచితనంమీద బేరమాడి లాభాలు తీసే దళారులు బయలుదేరిన తరువాత ఇక మెత్తగా కూర్చోటం అపాయం."

''నీలో మళ్ళా మధు ఆవేశించినట్లున్నాడు!" కామేశ్వరమ్మ ఆశ్చర్య పడింది.

''మధు స్వచ్ఛమూ, స్వతంత్రమూ అయిన నిజాయితీకి ప్రతిబింబం. వాడికి అన్యాయం జరిగితే ధర్మలోకం ఊరుకోదు."

''అయితే, నీవనేదేమిటి?''

''రామచంద్రయ్య సగము ఆస్తిమీద దావా వెయ్యాలి.''

"అసలే పగిలిపోయాం.... ఇంకా ఎందుకీ పగలు?" కామేశ్వరమ్మ.

"మామ్మగారూ! మీరు నన్నర్థంచేసుకోవటం లేదు. మధు చావు మనకు చెప్పిన గుణపాఠం బ్రతుకులు శాశ్వతం కావని, మనవెంటనే మృత్యువు వెన్నంటుతోందని. మనమంతా శాశ్వతం కాదు. మాలతి రేపు ఒంటరిదౌతుంది. ఇప్పుడు మీలాగానే ఏకాకిగా ఉండిపోవలసిందేనా?.... మాలతి కన్నా మీరింకా అదృష్టవంతులు. మీ కాడపిల్లైనా ఉంది. నా చెల్లి కిక ఎవరు ఆధారం? రామ చంద్రయ్య సగమాస్తి ఇవ్వాలి. హేమతో సగభాగస్వామి కావాలి. ముందు ఆస్తిని కల్పించి ఇవ్వాలనే బాధ్యత మీది. ఆమీద అందను సంపాదించుకొనే బాధ్యత మాలతిది."

కామేశ్వరమ్మ ఒక్కక్షణం ఆలోచించింది. లేచి వణుకుతూ హరి చేతులు పట్టుకొని అన్నది: "నీ చెల్లెలి భారం నీది.... నేను రిటైరైనదాన్ని."

"బాధ్యతలు తీసుకోవటం నాకలవాటే.... ఇది నా చెల్లెలి పని కావటం మరీ సంతోషం."

హరి అంగలు పంగలువేస్తూ వెళ్ళిపోయాడు.

రామచంద్రయ్యకూ మాలతికీ మధ్య కోర్టులో వ్యవహారం నడిచింది. హరి పట్టుదలతో మాలతి పక్షాన కృషి చేశాడు. సంవత్సరంలో జడ్జిమెంటు వచ్చింది. సగం ఆస్తిమీద మాలతికి డిక్రీ యిచ్చారు. హరి తాను చెయ్యవలసిన బాధ్యతలన్నీ అయిపోయినట్లు తేలికపడ్డాడు.

డాక్టర్ హరికి ప్రభుత్వంలో వేయిరూపాయల జీతం మీద ఉద్యోగం వచ్చింది. క్రొత్త ఉద్యోగంలో చేరి వారం రోజులయింది. అతని దృష్టి దేశం మీదకు మళ్ళింది. తాను పాశ్చాత్య దేశాల్లో గడించిన విజ్ఞానాన్నంతా మన దేశ కాల పరిస్థితులకు అనువైన విధంగా వినియోగించాలని ప్రణాళికలు సిద్ధం చేస్తున్నాడు.

ఒక రోజు "డాక్టర్ (మిస్) హేమ" అనే విజిటింగ్ కార్డు వచ్చింది తన ముందుకు. లోనికి తీసుకరమ్మన్నాడు ప్యూనును. దాదాపు ఆరు సంవత్సరాల క్రితం చూచిన హేమ నిరాడంబర వేషంతో తన యెదుటకు వచ్చింది.

హేమ మాటాడలేక కంటతడిమాత్రం పెట్టింది. జాలికొలిపే ఆమె కన్నుల్లో ఎన్నో యేళ్ళ తపస్సు ఉంది. ఎంతో పావిత్ర్యముంది. ఎంతో దీక్ష ఉంది.

"మధును కోల్పోయి నేనింకా బ్రతికే ఉన్నాను" - హరి రుద్ధంగా అన్నాడు.

"నే ననకండి. మన మనండి."

"నీవన్నది నిజమే కాని, అది నీవంటేనే బాగుంది."

"మీకు డాక్టరేట్ వచ్చినందుకు అభినందిస్తున్నాను."

"మన ఇద్దరి డిగ్రీలను చూచి మధు అభినందించవలసింది."

"మన కా అదృష్టంలేదు."

"అందుకనే ముందు నిన్ను నేనభినందిచలేదు."

"నేను మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలని వచ్చాను."

"నే నిక్కడ ప్రజావ్యక్తిని. నీవేమైనా మాట్లాడవచ్చు."

"ఇది నా వ్యక్తిగతమైనది."

"అయినా ఫరవాలేదు, వింటాను."

"నేను ప్రాక్టీసు పెడుతున్నాను.... మీతో చెప్పాలని వచ్చాను."

"కాశీయాత్రకు కొండుభొట్ల ఆజ్ఞ ఎందుకు?"

"మా అన్నయ్య ఉంటే ఈ మాట అనేవాడుకాడు" - హేమ గొంతు జీర పోయింది.

హరి కదలిపోయాడు, "క్షమించు హేమా! తొందరపడ్డాను"

"బావా! మా అన్నయ్య పేరుమీద ఒక నర్సింగ్ హోము తెరుస్తున్నాను. అందులో ఉచితంగా వైద్యం చేస్తాను. ఆ స్మారకనిధి కమిటీకి నీవ్వాధ్యక్షుడవు కావాలని కోరుతున్నాను."

హరి కన్నులవెంట అప్రయత్నంగా నీరు వచ్చింది. "మధు నన్ను సూత్ర ధారుణ్ణి చేసినా ఎం.ఏ. డిగ్రీకన్నా ఎక్కువ గౌరవం చేశాడు. నీవు నన్ను వాడి స్మారకనిధి కమిటీకి అధ్యక్షుణ్ణి చేసి డాక్టర్ డిగ్రీకన్న అధికమైన అర్హత నిచ్చావు. నీవు మధు చెల్లెలివి హేమా, నీవు మధు చెల్లెలివి!" అతడు కన్నులు ఒత్తుకున్నాడు.

"ఈ బ్రతుకు నాకు మా అన్నయ్య పెట్టిన భిక్ష. వాడి మనస్సుకు విరుద్ధంగా నేనెన్నడూ నడవలేదు. నా కాళ్ళమీద నన్ను నిలవబడమన్నాడు. నేనీరోజు అలా నిలవగలిగాను. అప్పుడు మా అన్నయ్య కెంత స్వాతంత్ర్య ముండేదో ఇప్పుడు నాకంత స్వాతంత్ర్యమున్నది. "మధు నర్సింగ్ హోం" నేను మా అన్నయ్య కంకితంగా నిర్మించుకొన్న సంస్థ. వాడి పేరుమీద ప్రజా సేవ చేయటమే నా కర్తవ్యం. ఇదే నా జీవిత ధ్యేయం. ఇప్పటికే మీ టైం చాలా తీసుకున్నాను. సెలవు" అని హేమ నిష్క్రమించబోతోంది. హరి పిలిచాడు. ఆమె ఆగింది.

''డాక్టర్ హేమా! నీ విప్పుడు పరిపూర్ణ వ్యక్తివి. మధు కన్నకలలన్నీ నీలో రూపుకట్టాయి. అతడు కృతార్థుడైనాడు. ఉత్తమురాలైన ఇల్లాలూ, ఉన్నతు రాలైన చెల్లెలు....వాడి పేరుమీది స్మారకనిధికి నా మొదటి విరాళం స్వీకరించు"- అని రెండు వేల రూపాయలకు చెక్కువ్రాసి యిచ్చాడు హరి.

హేమ తీసుకున్నది. వెంటనే హరి మల్లిక తండ్రి కిచ్చిన డబ్బు జ్ఞాపకానికి వచ్చింది. కాని అతని ప్రవర్తనలో కల్మషం లేదు. అతడు నిర్మలహృదయుడే కావచ్చు అప్పుడు కూడా! అని అనుకుంటూ మెల్లగా వెళ్ళిపోయింది. హరి ఆమెను ప్రసన్నంగా చూచాడు.

## 56

"మధు నర్సింగ్‌హోమ్" ముందు మధ్యాహ్నం పన్నెండు గంటలకు ఒక కారు ఆగింది. లోపలినుండి ఒక నల్లని స్త్రీ వ్యక్తిని ఇద్దరు ఆడవాళ్ళు మోసుకొని వచ్చి నర్సింగ్ హోమ్ థియేటర్ బెంచిమీద పడుకోపెట్టారు.

డాక్టర్ హేమ ఆత్రంగా థియేటర్‌లోకి వచ్చింది. ప్రక్కన ఉన్న స్త్రీలలో ఒకతె ఇలా అన్నది. "ఈమె మల్లికగారు. సినీనటి. మద్రాసునుంచి వస్తోంది- మీ నర్సింగ్ హోమ్‌లో కాన్పు కావాలని. దోవలోనే ఒకటి రెండుసార్లు నొప్పులు కనపడ్డాయి. మనిషి చాలా నీరసించివుంది. సొమ్మసిల్లిపడిపోయింది. నాడి చాలా బలహీనంగా ఉంది. భయంగా ఉందండి."

హేమ వెంటనే రోగికి తగిన పరీక్షలు చేసింది. చేసేకొద్దీ ముఖం చెమటలు క్రమ్మాయి. ఆక్సిజన్ పెట్టించింది. నెత్తు రెక్కించటం ప్రారంభించింది. రెండు మూడింజక్షన్సు చేసింది. రోగి స్థితిని అనుక్షణం పరిశీలిస్తోంది.

ఈ మల్లిక పూర్వపు మల్లిక కాదు. పూర్వపు లావణ్యం లేదు. పూర్వపు విలాసం లేదు. వొళ్ళంతా అమ్మవారి మచ్చలతో అల్లుకొనిపోయిన నల్లనికప్పు. ముఖం నిండా గుంటలు. ఒక కన్నులో పువ్వు. స్ఫోటకం చేసిన విలయతాండవంతో మల్లిక ఆకర్షణ నశించిపోయింది. కాని, తాను తల్లి కావాలన్న కోరికను మాత్రం రక్షించుకొన్నది. మల్లికను చూస్తే హేమకు జాలి వేసింది. ఆ రోజు నా కాళ్ళను చుట్టుకొని ఏడ్చింది. ఈ రోజు మళ్ళా నా వద్దకు వచ్చింది. వస్తానని చేసిన వాగ్దానం నిలబెట్టుకుంది.

ప్రక్కనున్న ఆడమనిషి ఒక చేతి ఉత్తరం, ఒక పెద్ద సీల్డుకవరు డాక్టర్ హేమ కిచ్చింది. హేమ వుత్తరం చదివింది.

"అక్కా! - నిన్ను డాక్టరుగా చూడగలిగితే సరే, లేకపోతే నీవైనా నేనున్న స్థితిలో నన్ను చూడు. హరిగారిని పిలిపించు. మాలతిని పిలిపించు. అందర్నీ చూస్తినా సంతోషం- లేకపోతే నేను కుక్క చావు చావలేదని సంతృప్తి. నా కడుపు పండి నేనున్నానా సరే. నేను లేకపోతే ఆ గుడ్డును అనాథ శరణాలయంలో పారెయ్యబోకండి. చంద్రం వచ్చి అడిగితే ఇచ్చెయ్యండి. అలా జరుగుతుందని నాకు నమ్మకం లేదు. అలా జరక్కపోతే మీకేమీ భారం కాదనుకుంటాను. నా విల్లు చూడండి - మల్లిక."

హేమ కన్నులనుండి రెండు బాష్పబిందువులు రాలాయి. హరికి ఫోను చేసింది. మాలతికి కబురంపింది. కవరు విప్పి చూచింది. హరి దేశయాత్ర చేస్తున్నప్పుడు మధు పేర వ్రాసిన ఉత్తరం మొదట కనపడింది. ఆ ఉత్తరాన్ని చదివి, గుండెకు హత్తుకొని ఒక్కనిట్టూర్పు విడిచింది హేమ. "దేశంలో ఇంకా ఋషికల్పులు బ్రతికే ఉన్నారు" అని అప్రయత్నంగా అన్నది. తన అపోహకు పశ్చాత్తాపం పడింది.

మరలా మల్లిక వద్దకు పోయింది. రోగి స్థితి మెరుగయ్యే సూచనలు అంతగా కనపడటంలేదు. హేమకు గుండెల్లో వెచ్చని మంట మొలిచింది. వైద్య లోపం లేకుండా మందు రోగి శరీరంలోకి ఎక్కిస్తూనే ఉంది.

విల్లుతీసి చదివింది. మద్రాసులో బంగళా హరిహర నాటక కళాపరిషత్తుకు దానం చేసింది. తన సంపాదనలో మిగిలి ఉన్న రెండు లక్షలు తనమైనర్‌కు (బిడ్డకు) చెందాలని చెప్పింది. మైనర్ రక్షణభారం హేమమీద ఉంచింది. మైనర్ లేకపోతే ఆ డబ్బు మధు నర్సింగ్ హోముకు చెందాలని వ్రాసింది. చంద్రం భాగం చంద్రానికి ముట్టచెప్పినట్లున్నది.

హేమ ముఖం తెల్లబోయింది. హరి రెండువేలకే తానపార్థం కల్పించుకున్నది. మల్లిక రెండు లక్షల కేమనాలి?....మల్లిక సొంత చేతుల్తో సంపాదించి రెండు చేతుల్తో దానమిస్తోంది.

హరి నర్సింగ్ హోమ్‌కు వచ్చాడు. మాలతి వచ్చింది. హేమ సంగతి అంతా చెప్పి రోగి ముందుకు తీసుకవెళ్ళింది. ఆమె వికృతరూపానికి అందరూ ఆశ్చర్యపోయారు.

మల్లిక కదలింది. మళ్ళీ నొప్పులు వచ్చాయి. నీరసంగా కన్నులు తెరిచి మూలుగుతోంది. హరి, మాలతి ఆత్రంతో చూస్తున్నారు. హేమ డాక్టరుగా ఆమెను అంటి పెట్టుకొని ఉంది మల్లిక అందర్నీ ఒక్కసారి చూచి నోటి వెంట మాటల్లేక జల జలా కన్నీరు కార్చింది. బలమైన నొప్పి వచ్చింది. ఆడ శిశువు జన్మించింది. కాని, రోగికి చలువలు క్రమ్ముకొచ్చాయి. కన్నులు తెరవలేక తెరిచింది. పసిగుడ్డును కన్నులముందు చూపించింది హేమ. ఆమె పెదవుల వద్దకు పసివాని చెక్కిళ్ళు చేర్చింది. ఆమె పసిపాపను ముద్దిడేలోగా మృత్యువే ఆమెను ముద్దుపెట్టుకొన్నది.

హేమ ఒకచేత్తో శిశువును పట్టుకొని, ఒక చేత్తో మల్లిక ముఖంమీద గుడ్డ కప్పింది.

అందరూ ముఖాలు చేతులతో కప్పుకొని ఏడ్చారు.

ం ం ం

మర్నాడు దినపత్రికలన్నీ "తెలుగుతార అస్తమయం" అని వాపోయాయి. కాని, మల్లిక ఎవరు? ఆమె ఎందుకు బ్రతికింది?.... ఎలా బ్రతికింది? ఎలా పోయింది? ఇవన్నీ లోకం పట్టించుకోలేదు. తెలుగుతార పోయిందని ఒకసారి నిట్టూర్చింది.

పసిపిల్లకు నీళ్ళుపోసి పొత్తిళ్ళలో పట్టుకొని ఉన్నది హేమ.

హరి నర్సింగ్‌హోముకు వచ్చాడు. హేమ చేతుల్లో నిశ్చింతగా నిద్ర పోతున్న పసిదాన్ని చూచాడు.

"ఈ పాపకు తన భవిష్యత్తుమీద ఎంత విశ్వాసముంది!" ఆశ్చర్యంగా అన్నాడు.

"బరువెత్తుకొనేవారున్నారుగా!" హేమ.

హరి నవ్వాడు. "ఇప్పుడు మధు ఉన్నట్లయితే....మనిషితోపాటు బాధ్యతలూ వెంటవస్తాయి అనేవాడు."

హేమ గంభీరంగా అందుకొని "కాదు. అయితే నాకు తెలీక అడుగుతాను చెల్లీ! బావ ఏ గంగలో దూకితే నీవూ ఆ గంగలో దూకటానికి సిద్ధమన్న మాట! అనేవాడు" అని అన్నది.

హరీ, హేమా ఆప్యాయంగా నవ్వుకొన్నారు.

"హేమా! ఈ బిడ్డకు పేరేం పెడుతున్నావు?" హరి చిరునవ్వుతో ప్రశ్నించాడు.

"నవమల్లిక!"

"నీకు మంచి సంస్కారముంది హేమా!" హరి ఆ మాటలంటూంటే అప్రయత్నంగా వారిరువురి చూపులూ ఏకమయ్యాయి.

—1968

కథానిక:

# ంతలోనే మార్పు

గడియారం పన్నెండు కొట్టింది. సూర్యుడు తన ప్రచండకిరణాలతో నిప్పులు కురిపిస్తున్నాడు. సరస్వతమ్మ భర్త రాకకై ఎదురు చూస్తున్నది, యింటి లోపలి వాకిటిద్వారబందానికి అనుకొని. ప్రసన్న అప్పుడే ఏదో మాసపత్రికను చదువుతూ నిద్రపట్టించింది, ఆ వసారా గదిలో చాపమీద పండుకొని.

సరస్వతమ్మ తలలో ఎన్నెన్నో ఊహలు తిరుగుతున్నాయి, నిట్టూర్పులు గూడా విడుస్తున్నది. "భర్త ఎప్పుడు వస్తాడా! ఈ దినమైనా ఆ శుభవార్త విన గల్గుతానా! దైవాజ్ఞ ఎట్లున్నదో! ఆడపిల్లలకన్న తలిదండ్రుల కష్టాలు నిజంగా మా మీదుగా ఋజువౌతున్నాయి" అని అనుకుంటూ కూర్చోబోతున్నది. ఇంతలో కారుహారను బయటనుండి వినబడింది. వెంటనే ఒక్క పరుగున భర్త నోటిగుండ శుభవార్త విందామను ఆశతో తలుపు గబగబతీసి ఏదో ప్రశ్న పరంపర భర్తపై కురిపించబోయింది.

రాఘవరావు ప్రాథమిక పాఠశాలనుండి చిరంజీవి సుబ్బారావును తీసికొని, నూనె కారుతున్న ముఖం, చెమటకు అక్కడక్కడ తడిసి, కొద్ది నల్ల బడిన లాల్చీ, దోవతితో, నిరాశగొల్పే ముఖంతో తలుపుతీయగానే సరస్వతమ్మ ముందు ప్రత్యక్షమయ్యాడు.

దినాంచూచే నిరాశాపూరితవదనమే అప్పుడు గూడ చూడటంవల్ల తాను కురిపించదలచుకున్న ప్రశ్న పరంపరను ఆపుకున్నది. వెంటనే స్నానానికి నీళ్ళు, అవీ ఇచ్చి, భోజనానికి కూర్చున్న తర్వాత నెమ్మదిగా, "ఏమండీ! ఈ దినం ఏం జరిగింది?" అని ప్రశ్నించింది సరస్వతమ్మ.

"ఏముందీ? దినాం ఏం జరుగుతున్నదో అదే ఈ దినమూ జరిగింది. ఈ చుట్టుపక్కల నాకు తెలిసినంతవరకు వెదికివచ్చాను, ఎక్కడైనా వరుడన్నమాట దొరకకపోతే, కట్నాలిస్తామన్నా దొరికితేనా! తిరిగి తిరిగి విసిగి, వేసారి, నిప్పుల

హాతో ఇంటికన్నా జేరుకున్నాను'' అని గబగబ నాలుగు మెతుకులు నోట్లో నేసుకొని బెడ్‌రూమ్‌కు వెళ్ళి, "పిచ్చితల్లి, చదువంటే చాల యిష్టం కాని, ఏం చేసేది?" అని ప్రసన్నను చూచి అంటూ పడుకున్నాడు.

పండుకున్నాడే గాని నిద్రపడితేనా? ఏదో ఒక గంటసేపు కలతనిద్ర పోయి, సాయంత్రం మూడుగంటలకల్లా మరల కారువేసుకొని వరాన్వేషణకు బయలుదేరాడు రాఘవరావు.

రాఘవరావు ఒక ప్లీడరు. ఒక సంపన్న గృహస్థుడనే చెప్పవచ్చును. తింటానికి, కట్టడానికి కావలసినంత ఉంది. రెండంతస్తుల మేడ. సంపత్తితో సహా సంతానం గూడ దేవుడిచ్చాడు. ఇద్దరు మగబిడ్డలు, ఇద్దరు ఆడబిడ్డలు. పెద్ద కుమారుడు లక్ష్మణరావు, డాక్టరు కోర్సు చదివి డాక్టరయి తన జీవితాన్ని తాను గడుపుకుంటున్నాడు. పెద్ద కుమార్తె సుభద్ర, ఏదో తానొక కాపురం చేస్తూ ఒకరికింత యిస్తూ, తాను తృప్తిగా భుజిస్తూ, పుట్టినింటి మెట్టినింటికి పేరు తెస్తున్నది. చి॥ సుబ్బారావు 8 వ తరగతి ప్రాథమిక పాఠశాలలో చదువు కుంటున్నాడు, ఇంక మిగిలిందల్లా ప్రసన్న వివాహం ఒక్కటే ప్రస్తుతం. అందుకోసమే రాఘవరావు కాలికి బలపం కట్టుకొని వరుడు దొరకని ఆ రోజుల్లో తిరిగి వేసారుతున్నాడు. అతడొక్కడే కాదు - అతని తరఫున అతని స్నేహితులు, బంధువులు, ముఖ్యంగా అల్లుడు, కుమారుడు చాలా కష్టపడుతున్నారు. ఈ విషయం చూస్తుంటే చదువుకొన్న ప్రసన్న తన తండ్రి అవస్థను గురించి చాలా విచారించుతూ ఉంటుంది.

"కల్యాణం వచ్చినా కక్కు వచ్చినా ఆగదు'' అని అంటారు పెద్దలు.... ఏమో ప్రసన్న ముఖాన పెండ్లయ్యే గీత లేదేమో!" అని చింతించే అమ్మ దగ్గ ఱకు ప్రసన్న "బావదగ్గరి నుంచి పుత్తరం వచ్చిందే!" అని ఉత్తరం చింపుతూ వచ్చింది. దాని సారాంశం.... వాళ్ళ ఊళ్ళో ఒక సంపన్న గృహస్థుని కుమారుడు సత్యనారాయణరావు అనే ఇరువదేండ్ల పిల్లవాడు B.Sc. ఫైనలు పరీక్ష వ్రాసి వచ్చాడని, ప్రసన్న ఫోటో చూచి పెండ్లికి ఒప్పుకున్నాడని, కట్నం తీసికుంటే తన చదువుకే అవమానమని అన్నాడనీ, అందువల్ల వెంటనే బయలుదేరి రావలసింది" అని వినిపించింది.

సరస్వతమ్మ సంతోషానికి మేరలేదు. ఆనాడు పంచభక్ష్య పరమాన్నాలు చేసింది. రాఘవరావు ఇంటికి వచ్చాడు, ఆనాడు కూడా నిస్పృహతో. ఇంట్లో అంతా నవ్వులు. కారణం ఏమై ఉంటుందబ్బా! అని కారును స్టాండులో వుంచి వచ్చేసరికి అల్లుని ఉత్తరం, అందులోని సంగతులు గోచరించాయి. ఏమని చెప్పాలి అప్పటి ఆడపిల్లల తల్లిదండ్రుల సంతోషం!

వివాహం నిశ్చయమయింది. మహా వైభవముతో జరిగింది. రాఘవరావు చిరంజీవిని ఒకరిచేతిలో పెట్టేసరికి సగం భారం వదిలిందని సంతోషించాడు.

జూను నెల మొదటివారం. ప్రతి విద్యార్థి పత్రికలు కొని ఫలితాలకొరకు వెతికేవాడే. కొందరు జయించేవారు. కొందరు ఓడేవారు. సత్యనారాయణరావు మొదటి కక్షలోకి జేరాడు. ఉద్యోగం చేయడం ఇష్టంలేదు. తన తండ్రికి ఇద్దరు కుమారులు. పెద్దవాడు క్షయరోగ పీడితు డగుటచేత అసమర్థుడు. ఇక ఇంటి మంచి చెడ్డలన్నీ తానే చూచుకోవాలి. 25 ఎకరాల నిక్షేపంవంటి ఎస్టేటు, 5 మామిడితోటలు, పెద్ద కాపురంకు తానే యాజమాన్యం వహించవలసి వచ్చింది ముసలితండ్రి ఆధారంతో.

ప్రసన్న కాపరానికి వచ్చింది. చిలకాగోరంకల్లా ఆ భార్యాభర్తలను చూస్తుంటే అన్నావదినలకే గాక ఊరిలో అందరికీ చవులూరినై. అందరికీ ముద్దు లొలికే ఒక బాలారత్నం వారిద్దరిని సంతోషపెట్టింది రెండు సంవత్సరాలయ్యే సరికి.

బిడ్డకు ఒక సంవత్సరం వచ్చింది. చూడటానికి ముద్దు గొల్పుతున్నది. ఇంతలోనే ప్రసన్న మామగారికి ఎక్కడనుండి వచ్చిందో గాని ఆ మాయ కుష్ఠురోగం వచ్చి మీదపడింది. ఆపైన పక్షవాతం. అందరూ ఆ యింటికి రావ టానికే భయపడటం మొదలుపెట్టారు. భార్యసహితం భర్తసేవ చేయటానికి వెనుకంజవేసి, 'వంట వంట' యని వంటఇల్లు వదలి వచ్చేదికాదు. సత్యనారా యణ రావయితే ఏ రెండు గంటలో ఇంటివిషయాలు చూసుకొని ఇంట్లో అసహ్యించుకొంటూ వేలువిడిచిన ఒక అక్కయ్య (బాల వితంతువు) ఉంటే ఆమె గారింట్లో రోజుకు చాలకాలం గడిపేవాడు. ఆమె మటుకు అప్పుడప్పుడు వచ్చి ఇల్లుచూచి పోతుండేది, ఏమిటో! ప్రసన్నను, ప్రసన్న ప్రవర్తనను పరిశీ లిస్తున్నట్లుగా చూస్తుండేది ఆమెతట్టు.

మామ బాధ చూడలేక పోయింది ప్రసన్న. రెండుసార్లు పుట్టింటికి రమ్మనమని ఉత్తరాలు వచ్చినా మామ పరిస్థితి తెల్పుతూ రావటానికి వీలులేదని తిరుగు కబురంపింది. మామగారికి సర్వవిధోపచారాలు చేసింది. మామగార్కి కుమారుడు తానేనని అతనిచేత మెప్పు పొందింది. అటు అత్తగారికి కోపం రాకుండా ఇంటిపనులు, ఇటు మామగారి మనసు నొవ్వకుండ ఉపచారాలు చేయ టంలో పేరుపొందింది. విధినిర్ణయంప్రకారం ఆమె మామగారు ఒక నెలదినాలు మంచంలో బహుకష్టపడి,దివంగతుడయ్యాడు ఆఖరికి ప్రసన్నను తలచుకుంటూ. ఆ సమయంలో ఊరివారిలో ఆమెభక్తి, విధేయతలను మెచ్చుకొనని ప్రాణిలేదు.

కష్టాలన్నీ మానవులను ఒకసారే పరీక్షిస్తవని - మామపోయిన మూడు నెలలకు కలరా ఆ ఊరిలో వ్యాపించింది. చాల మందిని తన వశం చేసికొంది. అందులో ప్రసన్న ముద్దుపట్టి ఒకటైపోయింది. తాతపోయిన మార్గాన్నే తొక్కింది అప్పుడే ఏమిటో మునిగిపోయినట్లు, తల్లిదండ్రులను శోకసాగరంలో ముంచి.

ఎన్ని కష్టాలు వచ్చినా ప్రసన్న ఓర్పుతో, ధైర్యంతో ఎదురొడ్డింది. ఊరిలో మంచిపేరు వడసింది. ఇంతమంది ఆమెను ఆదర్శనారీమణిగా నిర్ణ యించుకొన్నా ఆ వేలువిడిచిన ఆడబిడ్డ - రామక్క - మాత్రం ఓర్వలేక పోయింది. సత్యనారాయణరావు తన ఇంటివద్ద నాలుగునెల్లబట్టి చాలవరకు ఉండటంవల్ల ప్రసన్న మీద అదీ, ఇదీ నూరిపొయ్యటం మొదలుపెట్టింది. సత్యం సత్యాన్ని నిర్ణయించుకోలేకపోయాడు. మనస్సులో అనుమానపడు తున్నాడు. సాక్ష్యాధారాలు దొరకటంలా. బాధపడుతున్నాడు. కాని ఒక చెవితో అక్క మాటలు వింటున్నాడు రెండో చెవిగుండ విడవకుండా.

ఒకనాడు సాయంకాలం పుట్టింటినుండి వచ్చిన ఉత్తరం భర్తకు చూపిం చింది ఆప్యాయంగా భోజనం అయిన తర్వాత ప్రసన్న. పుట్టింటికి పంపటానికి సత్యానికి పూర్తిగా యిష్టం లేకపోయినా అతని అమ్మ "పోయిరానివ్వరా నాయనా! చాలరోజులయింది వాళ్ళ పుట్టింటికివెళ్ళి. దాని తల్లిదండ్రులవిమాత్రం కళ్ళుకావటరా!" అన్న దానిమీద పదిహేను దినాలగడువుతో ఒప్పుకున్నాడు సత్యం.

మర్నాడు ప్రయాణం. ఒక్కతే ఎట్లా పోవటం? సత్యం రానంటే రానన్నాడు. దైవవశాత్తు ఆ రాత్రి బండికే లక్ష్మణరావు దిగాడు. మర్నాడు మధ్యాహ్నపు బండికి అన్నాచెల్లెలూ వెళ్ళిపోయారు.

పదిహేను రోజుల గడువు అయింది. రామక్క పోరుమీద ఉత్తరం వ్రాశాడు సత్యం. ఇక్కడ సుబ్బారావుకు స్ఫోటకము పోసి వుంది. "కొంచెం నెమ్మదించిన తర్వాత పోదుగానిపిలేమ్మా!"అని అన్నదానిమీద ప్రసన్న ఇంకొక పదిహేనుదినాలు ఉండివస్తానని మరల ఉత్తరం వ్రాసింది. "మంచిది" అని తిరుగు ఉత్తరం వచ్చింది.సుబ్బారావు కొద్దిగా తిరగటం ప్రారంభించాడో లేదో సరస్వతమ్మకు జ్వరం రావటం మొదలుపెట్టింది. ఆ జ్వరమే పెద్దది అయింది. ఆమెకు స్వస్థతచిక్కేసరికి మరి ఒక నెల అయింది. అమ్మ జ్వరం విషయం ఉత్తరాని కంతవరకు సమాధానం రాలేదు. ఈ విషయం ప్రసన్నహృదయంలో ఒకమూల బాధిస్తూనే ఉన్నది.

రామక్కకు మంచి అవకాశం దొరికింది. రెండు నెలల ఆలస్యానికి ఏదో కారణం ఉంటుందని ఏవేవో ఆపోహలు సత్యం మనస్సులో రేకెత్తింప జేసింది. పాపం సత్యం హృదయం సత్యానికి దూరమయింది. ప్రసన్నహృదయాన్ని శంకించాడు. ఆనాడు ఆవేశపూరిత కవిత్వంతో వర్ణించిన ప్రసన్నను నేడు పరుషోక్తులతో దూషిస్తున్నాడు! కాలమహిమకులోనై,నాయకత్వాన్ని కొంత కోల్పోయాడు. దానితోపాటు గుణంలో మార్పు వచ్చింది.

o o o

నిరీక్షించింది. భర్త దగ్గరనుండి మరల ఉత్తరం పొందలేకపోయింది. మనస్సు కలవరపడింది. కొద్దిదినాల్లో బయలుదేరి అత్తగారింటికి జేరింది ఒంటరిగా ప్రసన్న.

ఇంట్లో భర్త కనబడలేదు. అత్తగారి నడిగింది భర్త సంగతి. "ఏమో నమ్మా! నీకూ వాడికే తెలియాలిగాని నీవు పోయినప్పటినుండి ఇంట్లో ఒకటే ధాముధీములూ" అని విసుగుగా అంటూ వంటశాలలో ప్రవేశించింది. ప్రసన్న మనస్సు చివుక్కుమన్నది. తన ఆలస్యం భర్త మనస్సుకు నొప్పికల్గించిందేమోనని విచారపడింది ప్రసన్న.

ఒక అర్ధగంట అయింతర్వాత సత్యం వచ్చాడు. వస్తూనే కళ్ళెర్రజేస్తూ "ఓహోహో విజయం చేశారే! ఇంటి కోడలుగారు!" అని వికటంగా మాట్లాడాడు.

"క్షమించండి! ఏదో పుట్టింటికి వెళ్ళిం తర్వాత ఇంతమాత్రం ఆలస్యం చేయగూడదని తలంచలేదు లెండి" అని ప్రసన్న అన్నది గద్గదస్వరంతో కండ్లకు నీరు చుట్టుకుంటూ. ఆ కరుణామూర్తిని చూచి కరగని ఆ గుండెతో సత్యం "ఉత్తరమేస్తేగాని రాణిగారు కదలరన్నమాట, తండ్రిగారి సౌధాగ్రం నుంచి" అని విసరబుచ్చుకొంటూ క్రాపు దువ్వుకొని ఉత్తరీయం భుజం మీద వైచికొని బైటికి వెళ్ళిపోయాడు.

సాయంత్రందాకా నిరీక్షించింది ప్రసన్న. రాత్రి పదిగంటలయింది. ఇంకా రాలేదు. సత్యం. రాత్రి బండిలో నిద్ర పట్టనందున నిద్రవస్తూంటే వెంగుమీద వంట ఇంట్లో అట్లా నడుంవాల్చింది. అత్తగారు భోంచేసి నిద్రపోతోంది ఒక రూమ్‌లో.

కొద్దిసేపటికి తలుపులు తెరచిన చప్పుడు వినబడింది. చెప్పులు గబగబా విడిచి లోపలికివచ్చారు సత్యం. వెంటనేలేచి ప్రసన్న నవ్వుమోముతో ఎదుర్కొని కాళ్ళుకడగబోయింది. ఆమెచేతిలో చెంబులాక్కొని ముఖానికేసికొట్టి చెయ్యిపట్టి లేవనెత్తాడు. ఒక్కసారిగా గుడ్లెర్రజేసి "రెండునెలలు మీ ఇంట్లో ఉండడానికి కారణం నిజంచెప్పు!" అని గర్జించాడు.

"మీకు ఉత్తరాలు వ్రాస్తినిగదండీ! అంతకన్న వేరేమీలేదండీ! మీ మీద ఒట్టు. నామాట నమ్మండి"అని అన్నది ప్రసన్న దుఃఖంతో,సగం మూసుకపోయిన గొంతుతో.

"అట్లాగా! తెలిసిందిలే నీ తంతు.రంకు నేర్చినమ్మ బొంకు నేర్వదా అని ఇంక నామీద గూడా ఒట్టుపెట్టుకుంటున్నావూ!" అని కోపించాడు.

"కాదండీ! పొరబడి తొందరపడకండి, నిజం నిలకడమీద తెలుస్తుందండీ! ఇన్నాళ్ళనుండి నా మనస్సు కనిపెట్టలేకపోయారుగదండీ!" అని కాళ్ళ మీద పడింది.

సత్యంకండ్లకేంకనపడటంలేదు.ఆమెజుట్టుపట్టుకొని పైకిలేవదీసి ఆ పాలు చిలికే బుగ్గలమీద కఠినంగా ఒక లెంపకాయి ఇచ్చాడు. ఐదేళ్లంటినా కరుణ లేదా హృదయానికి, అంతటితో ఊరుకుంటే బాగుండేదే-మూలనున్న కర్రతో

"నోరు తెరిచావంటే చంపుతా"నని అంటూ వొళ్ళల్లాముక్కలు చేసిపెట్టి మళ్ళా చెప్పులువేసికొని కారణం ఏమిటి ఈ కోపాని కని అడిగినా ప్రసన్నకు సమాధానం ఇవ్వకుండా వెళ్ళిపోయాడు.

వెదకి వెదకి కోరి తెచ్చుకున్న అల్లుడు ఇట్లా తయారయ్యాడని వింటే తన తండ్రి ఎంత ఘోషిస్తాడో ఊహించుకుంది, ఏడ్చింది, ఏమిచేస్తుంది పాపం? శరీరం కండలు వాచినై. కాని పరులకంటికి ఈ సంగతి తెలియకుండా గృహ కృత్యాలు నిర్వర్తించింది. ఇట్లా దినం ఒక గండంగా గడుస్తున్నది.

ఆనాడు - అంపకాలనాడు - తల్లి, తండ్రి, అన్న చెప్పిన బుద్ధులు చెవులలో రింగుమన్నాయి. ముఖ్యంగా పెద్దన్న చెప్పిన మాటలు - ఇచ్చిన పుస్తకం "కుమారీ హితచర్య" సారాంశం అన్నీకలసి ఒక్కసారిగా తలలో గిర్రున తిరిగాయి. వాటియందు సమాహితం బాగా నిలిపింది. అవే ఆధారం చేసుకుంది తన భావి జీవితానికి.

ఎన్ని దినాలు ఎన్ని విధాల భర్త హింసించినా మహాప్రసాదమని స్వీక రించింది ఆ పతివ్రత. అయినప్పటికి ఆడబిడ్డనుగాని, భర్తనుగాని పల్లెత్తి మాటని యెరుగదా మహాసాధ్వి. భర్త హింసించే సంగతి పరుల కెవ్వరికి తెలియ కుండా దాచింది సంసారపు గుట్టులా ప్రసన్న.

వినాయక చతుర్థి వచ్చింది. సుభద్ర ఆహ్వానించింది ప్రసన్నను, సత్యాన్ని. సత్యం వొళ్ళు కులాసాగాలేదని అడ్డుకొట్టాడు. అక్క బలవంతంతో ప్రసన్న వెళ్ళక తప్పిందికాదు.

వెళ్ళింది. మర్నాడు పండుగ. తెల్లవారుఝామున తలంటి పోసుకొమ్మన మనింది సుభద్ర. వద్దన్నది కాని బలవంతం మీద అక్క స్నానం చేయించింది. ఆమెను చూచేసరికి గుండె భల్లున పగిలింది సుభద్రకు. ఆ శరీరం నిండా కదు ములు నెత్తురు కందురులు.

''ఏమిటి ప్రసన్నా! ఇది?" అని ప్రశ్నించింది ఆతురతతో సుభద్ర.

''ఏం లేదక్కయ్యా!" అంది హీనకంఠంతో తలవంచుకొని కండ్లకు నీరు చుట్టుకుంటుంటే ప్రసన్న.

ఆ పద్మాలవంటి కండ్లనుండి నీళ్ళురావడం సుభద్ర చూడలేకపోయింది. తనకును దుఃఖముతో పాటు కోపము వచ్చింది. అంతా గ్రహించింది ప్రసన్న ముఖం చూచి. ఆనాడే రాఘవరావుకు టెలిగ్రాం ఇప్పించింది సీరియస్‌గా.

ఆనాటి సాయంకాలమే ఉండనంటే ఉండనని ప్రసన్న అత్తగారింటికి వెళ్ళిపోయింది.

o o o

ఆనాడు రాత్రి పదిగంటలయింది. చెప్పులు చప్పుడు గబగబా వినబడింది వాకిట్లో. ప్రసన్న తలుపు తీసేసరికి చేతిలో లాటీకర్ర. ఎర్రముఖం, నిప్పులు గురిపించే ండ్లూ మంచి హడావుడిగా వస్తున్న సత్యం ప్రత్యక్షమయ్యాడు ఎదుట. ఎప్పుడైతే సత్యాన్ని చూచిందో ఆనాడే అంత్యదినమని తలంచింది ప్రసన్న. ఆమె శరీరంలో ప్రాణలేదు. ధైర్యాన్ని చెప్పటానికన్నా అత్త ఇంట్లో ఉన్నదా అంటే ఆమెగారు గూడ పెద్ద కొడుకును చూచి రాబోయింది పదిమైళ్ళ దూరంలో ఉన్న పట్టణం హాస్పిటలుకు.

సత్యం వచ్చాడు. తన పని ప్రారంభం చేశాడు పదిరెట్లధిక కోపంలో. తన్నులు తన్ని గృహం నుంచి బయటికి వెళ్ళగొట్టాడు. శోకహృదయ ఆ ప్రసన్న చేయునదిలేక నెమ్మదిగా మరుగుచీకటిలోగుండా సుభద్ర ఇంటి అరుగు మీదకు జేరుకున్నది. పమిటిచెంగు అ బజారు వాకిటి అరుగుపై వేసికొని పండు కున్నది కళ్ళనీళ్ళు వొత్తుకుంటూ.

o o o

సత్యం ఇంటితలుపువేసి, తాళపుచేతులు బొడ్లొ కట్టి, పెద్ద "హీరో" మాదిరి ప్రక్కనున్న అక్కగారింటికి బయలుదేరాడు పెద్దయుద్ధంలో జయ మొంది వచ్చినట్లుగా. కాని బజారువాకిలి లోపలివైపు గడియలు వేసి ఉన్నాయి.

దొడ్డివాకిలిన వెళ్ళాడు. అదీ లోగడియే. కేకవేయబోయినాడు. అంతలో రెండు గొంతులు అకస్మాత్తుగా లోపలినుండి వినబడుతున్నాయి. ఎవరై ఉంటా రని ఆలోచించాడు. "ఆమె మా అక్కయ్యే! అత డెవడై వుంటాడు?" ఆలోచించగా ఆలోచించగా తుంబళ సుబ్బయ్య గొంతని దృఢంగా నిశ్చయించాడు. నిజం కొంకకు నక్కి కూర్చున్నాడు చీకటి మరుగుల్లో.

అర్ధగంట అయింది. తాననుకొన్న సుబ్బయ్యే బయటికివచ్చి నక్కుతూ నక్కుతూ నక్క మాదిరిగా ఇంటిదోవ బట్టాడు.

సత్యానికి తల గిర్రున తిరిగింది. ఇంటికి వచ్చాడు. తలుపుతీసేసరికి గృహంలో వస్తువులన్నీ తనను హేయంగా చూచినట్లు తోచింది. అన్నీ వెక్కిరించాయి. తన నొక వెధవను చేశాయి. ప్రసన్న లేకపోతే ఇల్లు ఏదో బావురు మంటున్నది.

ఆ పాట్లనే ఒక అర్ధగంట వాకిట్లో నిలబడ్డాడు. ఏమి ఆలోచనలు తిరిగినవో సత్యం తలకాయలో. ఏం సత్యం దొరికిందో వాటిలో. గిర్రున వెనక్కు తిరిగాడు. తిరగటమే ఆలస్యంగా గబగబా పరుగెత్త సాగాడు సుభద్ర ఇంటి వైపు.

o o o

ప్రసన్న శరీరం ఆమెకే తెలియదు. మూర్ఛ వచ్చినట్లు పడివున్నదా కఠిన శిలల అరుగుమీద. అట్లా ఉండి ఎంత కాలమయిందో తెలియదు కాని ఎవరో తనకు శీతలోపచారాలు చేస్తుంటే తిన్నగా కండ్లు తెరిచింది 'అమ్మా!' అంటూ హీనస్వరంతో.

ఎదురుగ్గా కఠినంగా ఓ గంటముందు చావగొట్టిన భర్త, తాను వీడిన తన గృహం పొడకట్టినై. ఇప్పుడో పెండ్లినాటి వెలుగు చూపులతో కూర్చున్నాడు తన చూపులకొఱకు ఎదురుచూస్తూ సత్యనారాయణరావు.

ఆ కరుణామూర్తిని చూచేసరికి కండ్లనుంచి ఆనంద బాష్పాలు రాలినై ప్రసన్నకు. మరు నిమిషంలో తన బుగ్గమీద భర్త చల్లనిముద్దు నాట్యమాడటం చూచి పరవశమయింది ఆత్మలో.

మర్నాడు ఉదయం ఎక్కడలేని కాంతితో శాంతమూర్తిగా సూర్యుడుదయించాడు, లోకమెల్ల ఆనందం. సత్యం పెండ్లినాటి పట్టుధోవతి, ప్రసన్న పట్టు చీరె కట్టుకొని కొత్త దంపతుల్లా సుభద్రగారింటికి "సత్యదత్త" వ్రతానికి పిలువ వచ్చారు.

వారిద్దరిని చూడగానే సుభద్ర, అప్పుడే బండి దిగివచ్చిన రాఘవరావు ఆశ్చర్య పడ్డారు.

మరు నిమిషంలో అందరినోళ్ళనుండి ఒక్కసారి నవ్వులు వినపడ్డాయి.

—మేధావి, 15 ఆగస్టు 1951.

కథానిక:

# ఏది ప్రజాసేవ ?

"అబ్బా! నేటికి ఆ పరీక్షల గొడవ తీరింది. హాయిగా ప్రకృతి సౌందర్యాన్ని చూడగల్గాను శాంతితో" అంటూ మదనమోహన్ ఆ యిసుక తిన్నెపై వ్రాలాడు.

సముద్రుడు సామగానం చేస్తున్నాడు అతని మనశ్శాంతికై ఆప్తమిత్రుడులాగా, పరీక్షసౌఖ్యాచే డస్సిన అతని శరీరానికి కొంత ఉత్సాహం కల్పిస్తున్నాడు. పదిరోజులక్రితంకంటే నవీనత తోస్తున్నదా గానంలో.

అట్లా సముద్ర కెరటాలను చూస్తూ నిమీలిత నేత్రుడై స్థిమిత చిత్తుడై పరుండియున్నాడు మదనమోహన్. ఆ కెరటాలపై కుంకుమ చల్లి గిలిగింతలు పెట్టుతున్నట్లు సముద్రంపై వాలుతున్న సూర్యబింబ దృశ్యం కండ్లకింపుగా ఉన్నది. మోహన్ ఏదో ఆలోచిస్తున్నాడు వొంటిమీద ప్రజ్ఞలేకుండ. అసలు వస్తుతః అతనికి స్వాతంత్ర్యము, ప్రజాసేవ అంటే యెంతో యిష్టము. ఇప్పటికే వాటిని గురించి అతడు చేసే సేవ అపారము. అతని దినచర్యలో మూడు భాగములు ఈ యోచనతో గడిచిపోతుంటాయి. ఈ ఆలోచనలే అతని మనస్సులో తిరుగుతుండటంవల్ల ఇసుకపై కదలకుండా పరుండి యున్నాడు. ఈ లోకమే మరచాడు.

"హల్లో మదనమోహన్!" అనే ఒక మృదువైన లావణ్యముగల గొంతు వినబడింది. ఆ స్వరం అతనిని ఈ లోకానికి తెచ్చింది.

కన్నులెత్తి చూచాడు. వెంటనే లేచి కూర్చుంటూ "హల్లో సరళా! రా" అంటూ మంచి ప్రేమతో ఆహ్వానించాడు.

సరళ నవ్వుతూ దగ్గరికివచ్చి కూర్చున్నది.

"సరళా! ఇవ్వాళటితో పరీక్షలయిపోయినవి! ఎంతో తెరపిచ్చినట్లున్నది!"

"అంతేగదూ, మోహన్! ఎవరికైనా! ఈ పరీక్షలంటే ఎంతో తలనొప్పి!"

"ఓహో అందుకే కాబోలు నీకు ఉమెన్స్ కాలేజీలో ఫస్టు మార్కులు వస్తూంటాయి."

"వాటినేం నేను రమ్మంటం లేదు. వస్తుంటే నన్నేం చెయ్యమంటావ్! చెప్పు, నా సంగతి అట్లుండనీ నీవు మాత్రం తక్కువ తిన్నవాడివా! మొన్న బి.యస్సీలో యూనివర్సిటీలో ఫస్టు వచ్చి!"

"ఆ పేపర్లు దిద్దిన ప్రొఫెసర్‌కు తలకాయ లేనట్లుంది. నిద్రపోతూ మార్కులు వేశాడు. లేకపోతే ఇంత తెలివిగలదానివి, ధనికురాలవు నీవు సెకెండు క్లాసులో రావడమేమిటి? ఏదో వారములు చేసుకొని చనువుకునే నాకు అన్ని మార్కులు వేయడ మేమిటి?"

"ఆ చాల్లేవోయ్! నీ చురుకుమాటలు చాలించావుగావు! మోహన్! ఇంతకూ నేను వచ్చింది ఒక కారణంతో. నీకు చెబితే యేం కోపం వస్తుందో!"

"అరే! నీవు ఎవరిదగ్గర మాట్లాడుతున్నావో తెలిసి మాట్లాడుతున్నావా! నేనేం విజిటింగు కార్డు పంపిన రెండు గంటలకయినా తిరుగు రిప్లయి యివ్వని, ప్రజల బాధల నెరుగని అధికారిని అనుకున్నావా? నేను ప్రజా సేవకుడను. అందరి విషయాలు వింటాను, సహాయం చేస్తాను. వారితో కష్టపడుతాను. వారి చిరునవ్వు ముఖాలు చూచిందాకా నాకు మనశ్శాంతి ఉండదు. అట్టి నాదగ్గర స్నేహితురాలవు నీవు భయపడవలసిన దేమున్నది? ఏమిటి చెప్పు!" అంటూ ఆప్యాయంగా అడిగాడు మోహన్.

"పరీక్షలు అయిపోయిన పిక నీ ప్లాను యేమిటి యీ సమ్మరువెకేషన్సులో"

"ఏమున్నది? ఆ సత్రపుగదిలో రాత్రింబవళ్ళు చదవకుండా స్వేచ్ఛగా, స్వాతంత్ర్యంతో ప్రజా సేవ చేయవచ్చు 24 గంటలూ!"

"బాగా చెప్పావు మోహన్! నేను గూడ నీతోటి సేవచేయవలెనని ఎంతో ఉత్సాహంగా ఉన్నది. ఏం అంటావు?"

"సరళా నీవు భాగ్యవంతుని బిడ్డవు. నీ కేమి లోటు? నీవు ఒకరిచేత చేయించుకొనే దానివిగాని ప్రజా సేవ చేసేదాని వౌతవా! నీవు నీవుగానే మాట్లాడుతున్నావా?"

"అవును మోహన్! నేనే మాట్లాడుతున్నాను. ఆ ధనం మా నాన్నకున్నప్పటికిని నన్నింతగా వేరుచేయతగదు. నత్తగుల్లల్లోని మణి నత్తగుల్లకాదుగా. ధనిక వర్గానికి చెందినంత మాత్రాన ప్రజా సేవకు పనికిరానా నేను? నీవంటి పావనమూర్తుల సేవచేసే భాగ్యము లేదా? నాకున్న ధనము, యావదాస్తి

ప్రజలకే అర్పితం చేస్తానని ప్రతిజ్ఞ చేసినా నీవు నమ్మరా? 'ధనికవర్గము' అనే ఒక్కమాట మమ్మల్ని అసత్యవంతుల నొనరించినదా? లేకపోతే ధనికవర్గము నీ మనస్సునుండి బహిష్కరించబడినదా? మోహన్! నేను చెప్పినది సత్యము. ప్రమాణం చేస్తున్నాను. ఈ కోర్కె మన్నించు. నాకు నీ హృదయంలో స్థానం యివ్వు" అని దీనంగా బ్రతిమిలాడింది, కన్నులు చెమ్మగిల్లుతుండగా.

మోహన్‌కు తల గిర్రున తిరిగింది. ఆనందం, ఆశ్చర్యం పట్టడానికి శరీరం చాల్లేదు.

"నిజమా! ప్రమాణం చేస్తున్నావా? ప్రజాసేవకొరకే నీ సర్వస్వం ధార పోస్తున్నావా?"

"ఇంకా సందేహిస్తున్నావా? ఇదిగో ప్రమాణం" అని అంటూ మోహన్ చేతిలో చెయ్యి వేసింది.

మోహన్ ఎక్కడలేని ఉత్సాహంతో "థ్యాంక్సు సరళా! నీవింత మృదు హృదయవని నేనెన్నడూ తలచలేదు సుమా!" అంటూ గట్టిగా షేక్‌హాండ్ యిచ్చాడు.

"మోహన్! అంతేకాదు. ఈ స్నేహితురాలిది ఇంకో కోరిక."

"అయ్యో! అంత వేడుకొనే దైన్యానికి అవసరమేమిటి?"

"ఏమో! అనుగ్రహిస్తారో, ఆగ్రహిస్తారో!"

"ప్రజాసేవకులవద్ద అంత ప్రార్థన లవసరంలేదు. బహువచన ప్రయోగాలవసరంలేదు. అవశ్యం, ఏదీ త్వరగా చెప్పు."

"ఏమీ లేదు మోహన్! ప్రజాసేవ కెన్నడు నేను నడుము గట్టినానో అప్పుడే నీ సేవకుగూడ కంకణము కట్టికొన్నాను" అని దీనంగా వేడుకుంటూ కృష్ణుని ముందు భక్తురాలి మాదిరి చేతులుజాపి కూర్చున్నది.

"సరళా నీకేమయినా పిచ్చిపట్టిందా? నీ వెక్కడ? నే నెక్కడ? పెద్దలు విన్న మొప్పము సుమా!"

"మోహన్! ప్రేమకు హెచ్చుతగ్గులున్నవా? నీవు బీదవాడవు. నేను ధని కుని కుమా రైనైనా?సంఘమున నీకెంత గౌరవమున్నదో నాకంతియెగదా!ఇక మన ?? మా నాన్నగార్కి నా ఇష్టమే ఆయన ఇష్టము. ఆయన ముసలి

వాడై వరాన్వేషణ చేయజాలక నాపైనే ఆ భారము మోపినాడు ఒక ప్రధాను నిగా చూచుకొమ్మనమని. నా మనస్సు మనిద్దరము స్నేహితులమయినప్పటి నుండియు నీపై లగ్నమై యున్నది. కాని కాలము కలసిరాలేదు. నేటికి నా భాగ్యము పండే దినమువచ్చింది. దీనికి కాదంటివా? నా ప్రాణములు నిలువవు. నీ తోటి ప్రజాసేవకురాలిని నొకతెను ప్రాణముల హరించినవాడివౌతావు! ఇకమీద నీపై భారముపెట్టుతున్నా"నని మోహన్ పాదాలను గట్టిగా పట్టుకున్నది.

మోహన్‌కు భూమి తనచుట్టు తిరుగుతున్నదని బాగా తెలిసింది. కండ్లు మైకం కమ్మినవి, నోట మాట రావటంలేదు. పదిహేను నిమిషాలు అట్లాగే గడచిపోయినవి. "నీతోటి ప్రజాసేవకురాలి ప్రాణములు హరించినవాడివౌతావు" అనేమాట మరోసారి రింగున మ్రోగింది చెవుల్లో. తనకు కుడిభుజంగా పని చేయువాడు ఎవ్వడులేడు. ఈ కాలములో రంగముపై బల్లగుద్ది చెప్పువారేగాని ఆచరణలో పెట్టే ఘటాలెక్కడనూ, నూటికి కోటికికూడా కనపడరు. ఎవరో తనవలె స్వతంత్రజీవి ఉన్నా సహాయమెవ్వరు చేయకపోగా అణగద్రొక్క చూచేవారుగాని లేరు. అటువంటి సమయంలో తనకు ప్రజాసేవకురాలొకతె దొరికినదంటే ఆమెను వదలుకొనిన చేపట్టుకొమ్మను వదలుకొనినట్లే. అనే పెక్కు భావాలు గిర్రున తిరిగినవై మోహన్ తలలో, తనకు తెలియకుండానే "లే సరళా! నీ కోర్కె ఎన్నడైన కాదన్నానా నేను?" అని లేవదీశాడు.

సరళముఖం వికసించింది. ఎక్కడలేని తేజస్సు ఉట్టిపడింది. "మోహన్ ఈ మాట నీ నోటిగుండానేనా వచ్చింది? ధన్యోస్మి!ధన్యోస్మి!!" అని ఒక్కసారి గాఢంగా కౌగిలించుకున్నది మోహనుని. ఇంతలో ఒక విజిలు వినపడింది. టైము చూచింది సరళ. రాత్రి తొమ్మిది; బీచినుంచి బయటికి పోవాలి యింక.

మోహనుకి తెలివి తప్పినట్లయింది. ప్రజాసేవలో యింతవరకు సోదరుల వాత్సల్యము తెలిసినవాడే కాని, ప్రణయ సంబంధాలు తెలియని వాడగుచే యిప్పటి స్త్రీ స్పర్శ మైమరపింపచేసింది. వెర్రివాడయినాడు. ఏదో ప్రవాహంలో కొట్టుకుపోతున్నట్లయింది. ఆ ప్రవాహంలో సరళ చిటికినవ్రేలనే ఒక యూతకాయ చిక్కింది. దానిని పట్టుకొని అది దోవదీసినట్లు నడచిపోయినాడు.

మదన్‌మోహన్ ఒక సామాన్యమైన గ్రామానికి చెందినవాడు. తనను కంటూనే తల్లి చనిపోయింది. తర్వాత తల్లిలా పెంచిన అక్క భర్త పెట్టిన హింస వలన ఆత్మహత్యకు గురి అయింది, ఇక మిగిలిన తండ్రి ఏదో యింత అప్పో సప్పో, చేసి, మెట్రిక్యులేషన్ చదివించి, క్షయతో దివంగతుడైనాడు. చేయునది లేక మోహన్ ఒక టీచర్ పనిచేస్తూ, కొంత ధనం ఆర్జించాడు. రెండు సంవత్సరాలయింం తర్వాత కొంత పలుకుబడి ఆ వూరిలో సంపాదించి, ఎవరో ఒక సంపన్నుని సహాయముతో ఎఫ్.ఎ. పూర్తిచేశాడు. తాను కష్టించిన ఫలితంగా యఫ్.ఎ.లో ఫస్టుక్లాసు వచ్చింది. అతని తెలివితేటలు అందరికి ఆశ్చర్యం, ఆత్యానందం అందజేసినవి. దానితో కొంత ధనము వారిని, వీరిని యాచించి, గణించి మద్రాసు చేరుకున్నాడు. సత్రంలో జేరాడు. స్వంతపాకం, వారాల భోజనం. అతని మెళుకువను చూసి, క్లాలులో "ఫ్రీషిప్పు" యిచ్చారు తన కాలేజీ జీవితం వృధా కాకుండా మాత్రము చూచుకుంటుండేవాడు.

విద్యావిషయంలోనే కాకుండ మోహన్ ప్రజాసేవలో కూడా నలిగిన చెయ్యి. కొంత పలుకుబడిని కూడా సంపాదించిన వ్యక్తి. అతని ఆశయం ముఖ్యంగా "మానవునికి స్వాతంత్ర్యం, ప్రజాసేవ, జీవిత ధర్మాలు" అని.

ఇతనికి బి.ఎ. లో సరళ క్లాస్‌మేట్. వస్తుతః మోహన్‌ది పుట్టుక మంచిది. రూపవంతుడు, ఆజానుబాహువు, సుందరరూపి. వంకర దిరిగిన క్రాపు, బీద తనముచే మంచి బట్టలు వేయకపోయినను అతనిని చూస్తే కాలేజీ పిల్లలందరికి ఆకర్షణీయముగా ఉండేవాడు. బి. యస్‌సి. సీనియరులో కాలేజీ యూనియన్ ప్రెసిడెంటయినాడు.

సరళ కూడా చామంచాయ రంగు, అంగసౌష్ఠవము, విద్యానిపుణత, దానికితోడు ధనము నలిగియుండుటచే ఆమె కూడా ఎంతయో కాలేజీలో శోభించెడిది. బి.యస్.సి. సీనియర్‌లో ఆమె వైస్ ప్రెసిడెంట్ అయింది యూనియన్‌కు.

ఇంతవరకు క్లాస్‌మేట్సల్లా స్నేహితులయ్యారు. ఆ సంవత్సరం యిద్దరు కలిసి ఎన్నో సంస్కరణలు చేశారు. పేరు పొందారు. మరుసటి సంవత్సరం

యం.బి.బి.యస్. కు మోహన్‌కు సీటు రావడంతో ఆ కాలేజీ వదిలాడు. ఆమె ఉమన్స్ మెడికల్స్ కాలేజీలో చేరింది యం.బి.బి.యస్. కోర్సుకు.

ఇందువల్ల తరచు యిద్దరు కలుసుకోవడానికి వీలుకాకపోయింది. కాల చక్రం తిరిగింది. ఫైనల్ పరీక్ష యిచ్చివచ్చిన సాయంత్రం యీ సంఘటన జరిగింది,

చినచిన్న పబ్లిక్ ఎక్సామినేషన్ రిజల్టున్నీ పడ్డాయి, ఆనాడే యం. బి. బి.యస్. ఫలితాలు వస్తాయి. మోహన్, సరళ కారువేసుకొని స్టేషన్‌కు వెళ్ళారు; అప్పుడే వచ్చింది ఎక్స్‌ప్రెస్. పత్రిక కొన్నారు. ఇద్దరి నెంబర్లు ఫస్టు క్లాసున ప్యాసయినట్లున్నవి. ఒక్కసారి యిద్దరి కండ్లనుండి ఆనంద బాష్పాలు రాలినవి. గాఢంగా ఒక్కసారి కౌగిలించుకొన్నారు. వెంటనే కారులో యింటికి వెళ్ళి యీ విషయం వాళ్ళ నాన్నకు తెల్పింది సరళ. ఆయన సంతోషించి, దంపతులను దీవించాడు:

స్వతంత్ర వాయువులతో నిండిన ఆ మోహన్ స్వంతంగా ఏదైనా నర్సింగ్ హోం తెరువదలచాడు. ఒకరిక్రింద లొంగిఉండటం-సంఘానికి తప్ప అతనికిష్టం లేదు-అందువల్ల యోచన చేశాడు. ఆఖరుకు తన విద్యను ప్రజాసేవార్థమై విని యోగపరచదలచాడు. స్వంత హాస్పిటలొకటి తెరువదలచాడు. ఈ అభిప్రా యాన్ని సరళ, మామగారులకు చెప్పి ఒప్పించాడు.

మూడు నెలల్లో ఒక భవనం తయారయింది. అందులో డాక్టరు - మదన మోహన్, లేడీ డాక్టరు సరళ. దైవము కూడివచ్చింది. రేయనక పగలనక ప్రజలకు సేవచేయటం మొదలు పెట్టారు. వారు చేబట్టిన కేసులు పెదిమవిరచి యింతవరకు బయటకుపోలేదు. ధనార్జన బాగుగానే అయింది. మోహన్ సరళల ప్రతిభ పట్నంలో బాగా వ్యాపించింది.

మోహన్ జాతీయ భావాలు పెరిగేకొద్దీ భావాలు యింకా సూక్ష్మరూపం దాల్చినవి. హాస్పిటలులో అధిక ఫీజులు తీసివేసి కనీస ఖర్చుతో వైద్యం సాగిం చాడు. ప్రజలు గుంపులు గుంపులుగా వచ్చేసేవారు. విసుగుకొనక, ప్రేమతో, ఓర్పుతో, వారికి సరియైన మందులువాడి, నయముచేసేవాడు. అతని ఔదార్యం ప్రసిద్ధికెక్కింది. ప్రక్కన డాక్టర్లకు కంటకంగా ఉండడం మొదలుపెట్టింది.

స్వాతంత్ర్య దినం వచ్చింది. బీదలకు తమ లాభంలో కొంత పంచి పెట్టదలచారు భార్యాభర్తలు. అపంచటంలో మరియొక అభిప్రాయం తట్టింది: లాభం మాత్రమే యేల పంచిపెట్టవలయును? మన ఆస్తియేమి శాశ్వతమా? అని తలచారు. కాని ధనమూలంగా పంచివ్వటం విలువయినపనికాదని మరల తలచి భోజన వసతి కల్గించారు.

బీదలకు ఉచితవైద్యం, ఉచితాన్నం వైభవంగా జరుపుతున్న వారిద్దరి పేరు పట్నంలో మారుమ్రోగింది. దినాలు గబగబాగడచినై: అమావాస్యదినాలు వచ్చినవి. ఈ ఉచిత చికిత్స. అన్నదానాలతో ప్రజాసేవచేసి, తాము బీదలయి నారు ఆ భార్యాభర్తలు. తోడి బీదల బాధలు చవి చూచారు. ధనమున్నప్పుడు తనదగ్గరకు వచ్చువారు తనను యిప్పుడు చులకనగా చూడటం గమనించాడు. ఈ పాడులోకంతీరే యింతని విసుగుజెందాడు. విచారించాడు.

పూర్వం తాను దానంగా ఇచ్చిన ధనం ఖర్చుకాగానే వారిమాదిరిగా తీసు కొన్నవారు కూడ బీదలైపోవడం సహజం అయింది. ఇదివరకు తాను నివారణ చేసిన రోగులకు తిరిగి రోగం తిరుగబెట్టడం చూచాడు. గందరగోళ మయింది! మనస్సు వ్యాకులమయింది! తానెందుకు ప్రజాసేవ చేస్తున్నాడు? దానివల్ల యేం లాభం? సమాధానం రాలేదు: సతమతమవుతున్నాడు రాత్రింబవళ్ళు! బుద్ధిశక్తి యంతయు ఖర్చుపెట్టాడు దొరుకుతుందేమో నని. తాను చేస్తున్నది జబ్బుల నివారణ. దానివల్ల రోగికి సంతోషము, అందువల్ల తాను ప్రజానందానికే పాటు పడుతున్నానని అనుకున్నా, తానిచ్చిన ధనం అయిపోంగానే వారికి సుఖమెక్క డిది? అప్పుడు మోహన్ నిజంగా ప్రజాసేవ చేస్తున్నాడా లేదా? దాని గమ్యమైన ఆనందం లేకపోయింతర్వాత తాను చేసి ఏం ప్రయోజనం, బూడిదలో పోసిన పన్నీరు చందం కాకపోతే!

ఆలోచన మించింది: జ్వరంలోకి దింపింది. ఆ జ్వరం క్రమేపి దీర్ఘ జ్వరంలోకి దింపింది. ఎంత జ్వరంకాచినా భావాలు మాత్రం నిర్మలంగా తలలో తిరుగుతున్నాయి.

క్షణం నిద్రపట్టదు. ఎప్పుడూ యిదే ఆలోచన: "నేను చేసే ప్రజాసేవ నిజమేనా? ఎట్లా ఔతుంది? గమ్యం ప్రజానందం చెందలేదుకాబట్టి. అప్పుడు

నా ప్రజాసేవే నిజం కానప్పుడు నేను ఆశయంగా తీసికొన్న స్వాతంత్ర్యానికి మాత్రం నిజమైన స్వాతంత్ర్య మెక్కడ ఉన్నది?" అని చింతించుతూ చిన్నగా మూల్గుచూ పండుకొన్నాడు.

సరళ మనస్సు సరీగా లేదు. మోహన్‌లో మార్పుకు యేదో కారణం తెలుసుకోవటం ఆమె కొక బ్రహ్మవిద్య అయింది. ఎప్పుడూ ఆలోచన, అసంతృప్తి, విసుగు, వేసారటం. కారణం చెప్పడు: జ్వరం తీవ్రతను జెందుతున్నది ఆమె కేమీ తోచక కాలుగాలిన పిల్లిలాగా తిరుగుతుంటుంది హాస్పిటలుకు' యింటికి.

మోహన్‌కు నిద్రపట్టదు, ఎంత ప్రయత్నించినా. మరల ఊహలను నాల్గువైపులా పంపాడు: "అసలు నేను స్వతంత్రుడ నయ్యానా? ప్రజల కీమాట చెప్పటానికి.... కాకేమి? నామాట అన్న ఎవరూనూ జవదాటరే. ఇంటిలో అంతే. బయటను అంతే. నాస్వతంత్రత కేమి లోటు? అదియునుగాక రాజకీయముగా మొన్ననే స్వతంత్రము వచ్చింది. నిజముగా నేను స్వతంత్రుడనే" ....

"అయితే నీ వెందుకు ఇట్లా పండుకోవాలి?" అనే ప్రశ్న అతని అంతఃకరణం వేసింది. ఊహలన్నీ ఒక్కసారి ఆగిపోయినాయి. భయమేసింది. నాడి చూచుకున్నాడు. కొంచెం ధైర్యం వచ్చింది.

"ఇదంతా జ్వరమే కారణము" అని నిశ్చయించుకున్నాడు. "అయితే జ్వరానికి నీవు లోబడ్డావన్న మాట" అని అన్నది అదే అంతఃకరణము. ప్రతి మాట తన నోటిని కట్టినట్లుంటున్నది. సమాధానం ఇచ్చేంత శక్తి ఉడిగింది. "జ్వరానికిబద్ధుడై ఉన్నవానికి స్వాతంత్ర్యం ఎక్కడ నుండి లభించింది? స్వతంత్రుడ వెట్లయినావు? స్వతంత్రుడవు కాకమునుపే నీవు చేసినది సత్యమైన ప్రజాసేవ యెట్లవుతుంది?" అది సూదిపోటులాగా ఒక్క ప్రశ్న వేసింది, మళ్ళా అంతఃకరణం. స్తబ్ధుడైనాడు. మాటాడలేక సొమ్మసిల్లాడు పక్కమీద.

ఈ అవస్థ చూచుచున్న సరళ చాలా విచారించింది. అంతలో యేదో కేసు రావటం వల్ల హాస్పిటలుకు వెళ్ళింది. భర్త కొద్దిగా నిద్రపోయినాడు కదా అని.

"పోస్టుమాన్."

"ఉత్తరాల్లు ఇక్కడ ఇవ్వండి."

ఒక ఫ్యాను ఉత్తరాలు తీసికొనివచ్చి తన పక్కమీద పెట్టి మంచి నీళ్ళిచ్చి విసురుతూ నిలబడ్డారు.

పచ్చకవరు బుక్‌పోష్టు ముందు ఆకర్షించింది. తీసి చూచాడు. "గణపతి జయంతి" ఆహ్వానం. ప్రోగ్రామ్స్ చూచాడు. ఆనాటి సాయంకాలం 5 గంIIలకు శివానంద యోగిగారు "ప్రజాసేవ" అను దానిపై మహోపన్యాసమని చదివాడు. ఆశ్చర్యపడ్డాడు. అంతవరకు మోహన్‌కు యోగులంటే అంతనమ్మకం ఉండేది కాదు. సంసారము యీదలేక యోగులై ప్రజలను మోసగించి ధనంగుంజి తమ పొట్టనింపుకుంటూ తిరుగుతారనే మూఢవిశ్వాసం బాగా నాటింది. ఆ అభిప్రాయాన్ని దీనికి చూడ భేదం కనిపించింది. యోగులు ప్రజాసేవ లక్షణాలు చూపించేవారా? అని ఆశ్చర్యపడ్డాడు కాని, తాను చేసేది నిజమైన ప్రజాసేవ కాదని నిశ్చయించుకున్నాడు, కాబట్టి వారు చెప్పదానిలో సత్యం యేమైనా యుండిన గ్రహింపవలసిన బాధ్యత తనయందుపడింది. పోవాలని బుద్ధిపుట్టింది; దానితో శక్తి వచ్చింది.

"ఫ్యాన్! కారు రడీచెయ్యమను డ్రైవరును" అని ఆర్డరిచ్చాడు శక్తితో లేచినుంచొని.

"బాబూ, నుంచోలేరు; కొద్దిగా విశ్రాంతి తీసుకొండి!"

"మాట్లాడక కారు రెడిచెయించు. 5 గంటలకల్లా త్యాగరాయనగరానికి వెళ్ళాలి."

"చిత్తము" అని వెళ్ళాడు ఫ్యాన్.

o o o

భాద్రపదమాసం. ప్రజాసేవ రూపమున మేఘుడు ప్రజానాయకుడై నిరంకుశుడగు సూర్యుని కప్పివేసి, వర్షము కురిపించి, ప్రజలను ఆనందపడునట్లు చేయు రోజులవి. ఆ ఆనందసమయమున మంగళవిగ్రహుడగు విఘ్నేశ్వరుని పూజలు దేశమంతట జరుపుచుండుట ఆంధ్రుల అలవాటు.

త్యాగరాజనగరు బాగుగా అలంకరింపబడింది. 5 గంటలకు శివానంద యోగిగారు ఉపన్యసించారు. మోహన్. ఆ ఉపన్యాసముతో తన సంశయాలు తీరినై "దానిలో తాను గ్రహించింది: మానవుడు నిరామయుడు. అట్టి నిరామయ తను గల్గియున్నవానికి రోగపీడితుడయి దుఃఖభాజగుడగుట అనునది తప్పు. తాను సచ్చిదానందుడు, తన రూపమునకు తెలిసినవారికి జబ్బువల్ల దుఃఖమెన్నడును కల్గదు. అవాంతరములను నివారించుటకు మాత్రము ఇప్పటి డాక్టర్లు మందు ఖీయగలరు గాని, ఆనందము నివ్వజాలకున్నారు. అట్టి సమయమున

డాక్టర్లు మావద్ద కొంత ట్రైనింగు నేర్వవలసియున్నది. ఈ పని యోగము ద్వారా కావలయును. అట్టిది మేము ఇచ్చుటకు సంసిద్ధులము. దీనిద్వారా నేటి ఆధునిక ఆశయాస్వతంత్రులకు ప్రజాసేవాసందర్భ కలుగునుగాని,వట్టి మందులతో సేవలతో కుదురునన్న మాట సున్న!"అన్న మాటలు గాఢంగా నాటినై మనస్సులో మోహన్‌కు. శివానంద దర్శనానికై లోపలికి వెళ్ళాడు. నమస్కరించి వినయ విధేయతలతో తలయొగ్గి నమస్కరించాడు. ''దైవమాయ అచింత్యము. క్షణ ములో ఒక నాస్తికుడు ఆస్తికుడైనాడు" తన సంశయం వారితో చెప్పి దాన్ని నివారించుటకు మార్గము చూపించమని కాళ్ళమీద పడ్డాడు.

కరుణామయులగు శివానందులు అతనిని ఆశీర్వదించారు. వినయముతో కూడిన అతని ముఖం శివానందులను ఆకర్షించింది. ''లే నాయనా! ఏం కావాలి నీకు?'' అని తిన్నగా లేపారు. మోహన్‌కు ఒక్క యేతాం చిక్కినట్లయింది- ఆవేశంతో ఇట్లన్నాడు: "గురూజీ! నేను మీరు చెప్పినట్టి ప్రజాసేవకాక యేదో ప్రజాసేవ పేరున చేస్తున్న ఒక జీవిని. మీరు చెప్పినట్లు ఆ ప్రజాసేవ చేయు క్రమము నాకు నేర్పండి.

''అంతేకాదు, మరో కోరిక. దానిని నేను పూర్తిగా నేర్చి ఆచరణలో పెట్టిందాకా నావద్దనే ఉండాలి మీరు"అని గ్రుక్కత్రిప్పకుండా అని వినమ్రుడై ఊరుకున్నాడు.

శివానందయోగి అందుకు అంగీకరించారు. వారి సహాయంగా నిరామయ యోగసేవ నేర్చుకున్నాడు. హాస్పిటలులో సిస్టములు మారినవి. ''ప్రతి రోగికి జబ్బుమందు ఉచితముగా ఇవ్వబడును. అందులకు ప్రతిక్రియగా రోగి ఈ నిరామయయోగాన్ని జబ్బునయమయింతరువాత నేర్చికొనిపోవలయును దీనివల్ల రోగికి మరల జబ్బు, దానివల్ల కలుగు దుఃఖాలు వెనుకంజవేయగల్గుతవి" అని ప్రకటించాడు మోహన్.

మొదట కష్టంగా ఉన్నా తర్వాత లోకం సత్యాన్ని గ్రహించింది. విద్యాశాఖవారు దీనిలో సత్యం కనిపెట్టారు. స్కూళ్ళల్లో కూడా ప్రవేశపెట్టాలని ప్రయత్నించారు. అనేక వదాన్య సంస్థలు మోహన్ చేస్తున్న వినూత్న ప్రయోగాలను మెచ్చుకొని భూరి విరాళాలు అందించాయి. ఆధ్యాత్మిక ప్రాతిపదిక మీద సాగించే హాస్పిటలుకు ఆర్థిక వనరులు అవంతట అవే అమరుతాయన్న ఒక విశ్వాసాన్ని మోహన్ ప్రజాసేవ ఉద్యమం పరోక్షంగా వ్యాఖ్యానించింది.

మదనమోహనుడు పూర్తిగా మారిపోయాడు. రోగుల ఆరోగ్యాలు భౌతికంగా మానసికంగా కూడా బాగుపడటం మొదలైనవి. దానిని చూచిన తర్వాత

తనకు మనశ్శాంతి చిక్కింది. డాక్టర్లు చేయవలసిన పని ఏదో, యేది ప్రజాసేవో, యేది స్వాతంత్ర్యమో తెలిసివచ్చింది!*

—15 డిసెంబరు, మేధావి 1951.

---

* 1950 నుండి 1955 దాకా మా పెద్దన్నగారైన బిదురు వెంకటశేషయ్య గారి వద్ద ఉండి చదువుకుంటుండేవాణ్ణి. వారితోపాటు నేను కూడా బ్రహ్మశ్రీ సాధు శ్రీనివాసశాస్త్రిగారనే మహాత్ముణ్ణి ఆధ్యాత్మిక గురువుగా స్వీకరించాను. ఆ రోజుల్లో వారి ఆధ్యాత్మిక ప్రబోధాలు నన్ను పరవశుణ్ణి చేస్తుండేవి. భావి జీవితానికి ఏవో కొన్ని వెలుగుబాటలు చూపిస్తుండేవి. వారి శిష్యులు "ఆత్మ విజ్ఞాన కళాశాల" అనే పేరుతో ఒక సంస్థను నడిపేవారు. పూజ్యులు శ్రీ శ్రీనివాసశాస్త్రిగారు దానికి ఆచార్యులు. హైదరాబాదులోని దోమలగూడలో నున్న ఆ సంస్థ పక్షాన 'మేధావి' అనే మాస పత్రిక వెలువడుతుండేది. దానికి మా పెద్దన్నగారు సంపాదకులు. నేను వారికి సహాయం చేస్తుండేవాణ్ణి. అందువలన నాకు ఎన్నో లాభాలు కలిగాయి. ఆధ్మాత్మిక సాహిత్యంలోనూ, పత్రికా రచనలోనూ సంపాదకత్వంలోనూ, పత్రికా ముద్రణ ప్రచురణానుభవంలోనూ ఎన్నో విషయాలు నేర్చుకోగలిగాను. ఆ పత్రికలో నా సొంత పేరుతో, మారు పేర్లతో కూడా అప్పుడప్పుడు రచనలు రాయటం జరిగేది. ఇది ప్రతి పత్రికలోనూ సాగే వంటయింటి రహస్యమన్న సంగతి అందరికీ తెలుసు. మా గురువుగారి శిష్యులలో డాక్టర్ పి. మాణిక్యరాజుగారని ఒక ఆదర్శ మూర్తి ఉండేవారు. వారు మోజంజాహిమార్కెట్ వద్ద నున్న బన్సీలాల్ హాస్పిటల్‌లో డాక్టరుగా పనిచేస్తుండేవారు. వారు మా గురువుగారి ఆశయాలతో స్వంత వైద్యశాల ఒకటి ఇంట్లో నడుపుతుండేవారు. వారిని చూచి వారివలన వైద్యసౌకర్యం పొందిన పేదలు, పౌరులు (నాలాగా) ఎందరో ఉన్నారు. పై మూర్తిత్రయం నాలో కలిగించిన స్పందనకు ఈ రచన ఒక గుర్తు. ఇంటర్ విద్యార్థిని నేను. గ్రాంథిక వ్యావహారిక భాషల సాంకర్యంగా ఉంటుంది రచన. కుదుటబడని అప్పటి నా శైలికి, సంవిధానం చేయటం ఇంకా చేతగాని కథా నిర్మాణ పద్ధతికి ఈ కథ ఒక మచ్చుతునక. నిజానికి ఇది నా మొదటి కథ; 'అంతలోనే మార్పు' రెండో కథ. అయితే, ప్రచురణలో వెనుకముందుగా వెలువడ్డాయి. ఆ గుర్తులు చెడిపోకుండా ఈ రచనలను అలాగే ఇప్పుడు ప్రచురిస్తున్నాను.

—రచయిత.

కథానిక:

# ప్రతశీల

'అమ్మయ్య' అంటూ నడుం వాల్చింది పడక కుర్చీలో సుశీల. ప్రక్క నున్న పుస్తకాన్ని తెరచి పుటలు తిరగవేస్తున్నది.

బయట యెండ కొంచెం తీవ్రంగా ఉన్నది. గాలిలేక ఉబుసు పోవటం లేదు. సుశీల పుటల్లో పొందుతున్న భావాలు మాదిరే ఆకాశాన చిన్న చిన్న మబ్బుతునకలు కదులుతూ మెలికలు పడుతున్నవి. నూలుకండెలు విడివడి చిక్కుపడ్డట్లుగా తెలిమబ్బులు చిక్కు పడుతున్నవి, విడదీస్తున్న చిన్ని హస్తాలుగా సూర్యకిరణాలు మబ్బుల్ని తేల్చివేస్తున్నవి.... సన్నగా సుశీల గొంతుకలో మ్రోసిన రాగతంత్రుల కదలికలో గాలి స్పందించినట్లయినది.

"అలయక మంత్ర తంత్ర వివిధౌషధభంగులఁజేసి యెంతయున్
వలతురు నాథులంట మగువా! కడుబేలతనంబు దాన మున్
గలిగిన ప్రేమయుం బొలియుఁగాని యొకండును సిద్ధిబొంద ది
ప్పొలతుకతోడిమన్కి యహిపొత్తుగ జూచు విభుం డెఱింగినన్"

అని భారత పద్యం పలికింది. సుశీల నుదుట స్వేదాంకురాలు మొలచినవి. కన్నుల నిండ హర్షాంబువులు విరిసినవి. తనకు తెలియకుండగనే 'అబ్బ యెంత కమ్మగ చెప్పాడు ఎఱ్ఱాప్రగడ?' అంటూ భావలీనత్వాన్ని పొంది విలీన దృక్కులతో ఆకాశం వంక చూస్తున్నది కిటికీలోగుండా. మొదటి చూపులో అక్షర ప్రపంచమై, భావజగత్తయి, రససాక్షాత్కారియై చేసిన కావ్యకన్నిక నృత్యంలో వాలియున్న పయిట అంచుల్లా నిలచినది సుశీల కన్నుగవసౌరు. ఆమెచూపు బహిఃప్రసారితమైనా నిజంగా అంతఃప్రకాశితము.

'సత్యభామ ఎంత కలుకు మనిషి! తా గీచినగీటు దాటనన్న భర్తనా!- తన కౌఁగిలికి ఇంద్రుణ్ణి జయించి పారిజాతం తన పెరట్లో పాతిన ప్రేమ

మూర్తినా-ప్రేటుపడ్డ యురగంగానగా నాడు తాను చేసిన పాదప్రహారానికి ఓర్చి ఓదార్చిన ఆరాధ్య మూర్తినా - ఆమె సంశయించడం? ఆయనను వశపరచు కోడానికి మందులు మాకులు వెదకుతుందా? ద్రౌపది మంచి మాట అన్నది. బాగా దెబ్బ తీసింది.'

పెరటిలో పొన్నచెట్టు పూచి ఉంది. గుబురుగా పెరిగిన చెట్టుమీద సగం మేర మేడనీడలు వ్యాపించినవి - ప్రౌఢములైన సూర్య కిరణాలు మిగిలిన సగాన్నిచక్కలిగింతలు పెట్టుతున్నవి. శ్రీకృష్ణుని సన్నిధానాన తన మనోకుసుమం విరిసినా ప్రణయకలహం చాలించని సత్యభామలా తోచింది పొన్న. సుశీల భావనకు తనకే నవ్వువచ్చింది.

"ఏమిటి మరదలూ వొంటిగా, నవ్వుతున్నావ్?" అంటూ ప్రవేశించింది పంకజమ్మ.

"ఏముంది - పుస్తకంలో ఏదో పద్యాన్ని చదువుకొని నవ్వుకున్నాను. రా! కూర్చో....ఏమిటమ్మా విశేషాలు? ఈ మధ్య మాయింటికి బొత్తుగా రావడమే మానివేసినావుగా. నేడన్నా జ్ఞాపకము వచ్చాము"అన్నది సుశీల కుర్చీనుంచి లేచి వచ్చిన పంకజమ్మకు ఆసనం చూపిస్తూ.

"ఎంతమాటమ్మాయీ - నేను నిన్ను మరచిపోతానా? ఏదో యింట్లో చికాకుగా ఉండటం వల్ల ఈ మధ్య వారం రోజులబట్టి రాలేకపోతున్నాను" అని ముగించింది పంకజమ్మ.

"నిక్షేపంగా అన్నగారు సర్వం తీర్చిదిద్దుతుంటే ఏమిటొదినా నీకంత చికాకు పెట్టిన సంసారపు గొడవ?''అంది చనువుగా సుశీల పుస్తకంలో గుర్తుపెట్టి బుక్ షెల్ఫ్‌లో ఉంచుతూ.

''ఎంతైనా మీరు మీరు ఒకటే.... ఎంత సంపాయించి పెట్టినా ఇంటి చాకిరి చెయ్యడం మాత్రం యమయాతన అమ్మాయి! నీవేమన్నా అను.... పొద్దున్నే లేవంగానే కాఫీఫలహారాలు, పిల్లల చద్ది అన్నాలు - ఇవన్నీ సంబా ళించుకొని టైముకల్లా వార్చి పెట్టాలాయె. అదైంతర్వాత పాడిబర్రె, సంసారం

ఈదాలాయె. ఇంత నగుములు విరుచుకున్నా మధ్యాహ్నము ఒంటిగంటకుగాని తెమలవివన్నీ" అని దొర్లించింది చిన్న గాలివీచినట్లు.

"పనిమనిషి లేదుటమ్మా- అది కొంతపని చేస్తుందిగా?" అని సాగదీసింది సుశీల.

"ఇంక చెప్పక చెప్పక పనిదానిమాటే చెప్పాలి. అది వట్టి దొంగ - పనిదొంగ - ప్రొద్దస్తమానం చేస్తునే ఉంటుంది. పిసరంత పని పెకలదు. ఏం చేసినా నాల్గంట్లు బొచ్చలు తోమడం, గుడ్డలుతకటం, ఇళ్ళూడ్వటమేగా....ఇంతటి తోనే తెల్లవారిందీ మనపని?"

''హేమలత, సుజాత, కామాక్షి ఉన్నారు కదా వదినా! వాళ్ళతో ఏమైనా సహాయం తీసుకొంటూ ఉండాలిసింది" అన్నది సుశీల కనుబొమ్మలు కొద్దిగ పైకెత్తి.

"మా అమ్మాయిలా! వాళ్ళేమిటో వాళ్ళ కథలేమిటో గాని నాకు చేస్తారటమ్మా? ప్రొద్దున్నే వాళ్ళ మేకప్పులు, ఫలహారాలు అయ్యేసరికే బడివేళవుతుంది. సాయంకాలం కొంపకు రాగానే ఆటలు, రాత్రిపూట చదవటమాయె - ఈ కాలపు చదువుకుండే పిల్లలు పనిచేద్దామన్నా, పెద్దలకింత సాయపడదామన్నా తమకు తాము సంబాళించుకొనేసరికి భల్లున తెల్లవారుతుంది" అన్నది పెదవి విరుస్తూ పంకజమ్మ.

పెరట్లో ఆవుదూడ ''అంబా" అని పిలిచింది. సుశీలకు ఆవన్నా, ఆవు దూడన్నా ప్రాణం. దాని ముఖంలో ప్రసన్నత లాస్యం చేస్తుంది. వాత్సల్యం ప్రతిబింబిస్తుంది. ఆ ప్రతిబింబంలో తన హృదయాన్ని పాదుగా నిలుపుకుంటుంది సుశీల.

దూడకు నీళ్ళు పట్టుతున్నది సుశీల పంకజమ్మ కూడ పెరట్లోకి వచ్చింది. ''మరదలమ్మా!'' అని సాగించింది. 'మా బట్టె దూడ కూడ ఇంతే. నీళ్ళకోసం పాడు అరుపులు అరుస్తుంది. మధ్యాహ్నం ఒక్క కూర్కు పోనీయదు. తవుడూ గింజలంటాను. ఇవన్నీ ఆయన కేమీ పట్టకపోయె. సాయంకాలం 6 గంటలకు వస్తారు. ఇంటి సామానులు అన్నీ తీసుకొని రమ్మంటే చిర్రుబుర్రులాడతారు. విసుక్కుంటారు."

''పాపం, ఆయన అఫీసు నుండి రాగానే పురమాయిస్తే అలసట మీద అలా కసురుకుంటారేమో నని అనుకుంటా" అంటూ చప్పరిర్ంచింది సుశీల దూడకు వొళ్ళు కడుగుచూ,

"అదుగో, నీవు గూడా అల్లాగంటే ఎల్లా? ఉదయం 8 గంటల నుండి సాయంకాలం 6 గంటల్దాకా ఆఫీసులోనే ఉండివస్తున్నే ఆమాత్రం పని ఆకాస్త సేపటిలో చూచుకోకపోతే సంసారం గడిచే విధం చెప్పు?" అని కసకస మాట్లాడింది పంకజమ్మ.

''అంత కాకపోతే వదినా, నీవుగాని అమ్మాయిలుకాని మీ రామారావు గాని ఎవరోకరు బజారుకుపోయి ఆ మాత్రం బజారు సామాను తెచ్చుకుంటే సరిపోతుందిగా?" అని ముగించింది కొంచెం తెల్లముఖం చేసి సుశీల.

"వాళ్ళట్టి పసిపిల్లలమ్మాయ్! వాళ్ళకు డబ్బిలిచ్చి బజారుకు పంపిస్తే దుబారా ఖర్చు చేస్తారు."

"అని వాళ్ళకు బజారు వ్యవహారాలు నేర్పకుండా ఉంటే బాగుంటుందా? మహా డబ్బులు ఖర్చుపెట్టితే ఒకటి రెండు రూపాయలు ఒకటి రెండు రోజులు పెట్టేరు. అంతమాత్రానికే భయపడి అటు అన్నగారికి, ఇటు నీకు అక్కరకు రాకుండా వాళ్ళను పెంచితే ఏట్లా?'' అన్నది దూడముందు మేతవేస్తూ సుశీల.

"పనిపాటల విషయంలో పిల్లల్నే అనవసరం లేదు. మీ అన్నయ్య కూడా అంతే. ఆఫీసునుంచి వస్తారా కోటు, లాల్చీ వంకెన పారేస్తారు. ఆ వరుసన పోయి పండుకుంటారు. పైపెచ్చు ఇల్లంతా గోలగా ఉందని కూకలు వేయడం. అందుకని మా యింట్లో శుభ్రం లేకపోగా అరణ్యంలాగా ఉంటుంది. నేను మటుకు ఎందుకు చేయాలి అని నేనూ ఊరకుంటాను" అని ముక్కు చిట్లించి కనుబొమలు ముడివేసింది పంకజమ్మ.

"అన్నగారికి క్రమమైన అలవాట్లు లేవని మనం అనడం కన్న పగలంతా ఆఫీసులో చాకిరిచేసి అలసివచ్చిన వాళ్ళను మనం ఆప్యాయంగా ఉపచరిస్తేచాలు, వారి హృదయాలు తెరుకుంటాయి. అంతేగాకుండా ఇల్లుచూచి ఇంటి ఇల్లాలిని చూడాలన్నారు. మనం సిల్కు చీరలు కట్టగానే సరిగాదు. ఇంటిని, పిల్లలను అదుపులో పెట్టుకోవాలి. ఇల్లు అద్దంలా గుండాలి, మనం ఆదర్శం కావాలి.

అట్లా గాకుండా అన్ని బాధ్యతలు మగవాళ్ళమీదనే త్రోసివేస్తే వారేం ఉరి పోసుకుంటారా?" సుశీల ముఖం కొద్దిగా ఎఱ్ఱపారింది. సూర్యకాంతి దట్టంగా ముఖం మీద పడింది. కనుబొమల నీడలో కళ్ళు తళతళలాడినవి.

పంకజమ్మ ఒక గుక్క మ్రింగినది. "ఇదో మరదలూ, అవన్నీ నీకు చెప్పితే అర్థమయ్యే విషయాలు కావు. రేపు నీకూ ఇంకా ఇద్దరు కలిగితేగాని బాగా తెలిసిరాదులే - అయ్యో, మర్చిపోయినా గుడ్డల కొట్టువాడు ఒక చీరె శాంపులు పంపుతానన్నాడు. వెళ్ళి రావాలమ్మా!''

"ఇప్పుడే వచ్చావు ఇప్పుడే వెళతానంటున్నావు!"

"మళ్ళీ వస్తానుగా...." అంటూ పంకజమ్మ గుమ్మం దాటింది.

సుశీల మళ్ళా కుర్చీలో కూర్చున్నది. పెరట్లో పొన్న చెట్టు మాతృమూర్తిలా శోభిస్తున్నది. దానిచుట్టూ వ్యాపించి ఉన్న సూర్యరశ్మి - దాని కాంతిలో భాసిస్తున్న ఆకుజొంపాల వైగనిగ్యమూ ఒడిలో పాపను భర్తకు చూపుతున్న బాలెంతలా భాసించింది. ఆ రస్మికి, ఆ లావణ్యానికి అవినాభావ సంబంధం పెనబడి ఉంది. ఆ సంబంధానికి మూలతత్త్వం ఏది? అది యింత దృఢతరం కావడానికి కారణం ఏమిటి? భార్యాభర్తల మధ్యనున్న సంబంధము వంటిదేనా?....

పంకజమ్మ వదినను మొగుడు ఎందుకు చీదరించుకోవాలి - ఆమెది మాత్రం తనవంటి కాపురం కాదా? భార్యాభర్తల మధ్య చీదరించుకోటాలు, కోపగించుకోటాలు ఉండవా? సారవంతమై నిండిన మధురస్వప్నాలు కనుటయే లక్ష్యంగా సాగుతూన్న నా సంసారయాత్రలో ఏనాడూ అట్టి అనుభూతే లేదే.... అంతరంగికమైన వేరే ఒక కారణం ఉండి యుండాలి. ఏమైయుంటుందబ్బా?

మరలా సుశీల ఫాలభాగాన స్వేదబిందువులు నిలిచినవి. కిటికీ నుండి పిల్ల గాలి తెర ఒకటి పొరలింది. సుశీల మరలా పుస్తకం తీసి చదవటం ప్రారంభించింది. ఒక్క సూర్యకిరణం పుస్తకం మీద పడింది. సుశీల దృక్కిరణం శతాబ్దాలమీద పడింది. సూర్యకిరణం పుస్తకాన్ని కాంతిమంతం చేసింది. ఆమె భావ కిరణం హృదయాన్ని కాంతిమంతం చేసింది.

"తగియెడు వేళలందు నియతంబుగ మజ్జనభోజన క్రియల్
దగ నొదగూర్తు భర్తలకు (పాండవులకు) ధాన్యధనంబులు రిత్తమై వ్యయం
బగుటకు నోర్వనెప్పుడు గృహస్థల భాండవిశోధనంబు లి
మ్ముగ నొకనాడు వేమఱు ప్రమోదము సల్పుదు బందుకోటికిన్,"

ద్రౌపది మహాసాధ్వి. ఒక ఆదర్శ గృహిణి. నియమిత వేళలో తన కార్యక్రమాన్ని అంచెలచెంలుగా ముగించగల ధీర- భర్తలు పంచపాండవులు...!

నెలకు 900 రూపాయల ఆదాయం. ఒక భర్తతో కాపరం చేస్తున్న మా పంకజమ్మ వదిన సంసారం దిద్దుకోవడం యింత అవిశ్రాంతి పడుతున్నదే. ద్రౌపది మహారాజ్ఞి, అయిదుగురు భర్తలు, నూరువేల మంది సేవకులు, చతురంగ బలాలు, ఆలమందలు, బ్రాహ్మణోత్తములు, లంకంత ఇళ్ళు, రాజసౌభాగ్యము- ఇవన్నీ రోజూ స్వయంగా సంబాళించుకొనేదటకదా! తన సంసారం దిద్దుకోవడానికి వదినకు 24 గంటలు చాలకపోతే ఆమె సంసారం ప్రతిదీ తానై చేసుకున్నప్పుడు ఎట్లా సాధ్యమైయుంటుంది?"

మఱలా పఠనం ప్రారంభించింది.

"వేగ జాము గలుగ వెడనిద్రఁ బొందుదు
గాని రాజ్యభార కార్యయుక్తి
నబ్జనయన నాకు నాహార నిద్రల
కెడయులేదు సువ్వె యెల్లప్రొద్దు"

o o o

అట్టివర్తనముల నెపుడు బాండవులకు
రగిలి ప్రియముసేయఁ దగితి.

"నవ్వుచున్న చందమామను చూస్తుంటే నీ వెప్పుడూ మరపుకు రావు సుశీ!"

"మీ అభిమానం."

"చెదరక పోషింపబడే నీ ముఖ వికాసం చంద్రుణ్ణి గేలి చేస్తుంది."

"మీ పక్షపాతం."

"అర్ధనిమీలితాలైన నీ నేత్రాలు నెమరువేస్తున్న ఆవు ముఖంలో చిందులాడే నిర్భరత్వాన్ని పుక్కిట పట్టినట్లు తోస్తుంది."

"మీ భావనాశక్తి."

"పాప నాడిస్తున్న నీ వాత్సల్యమూర్తిని చూస్తే పండ్ల బరువుకు వంగిన చూతవృక్షమ తల్లిని తలపిస్తావు."

"మీ రూపకల్పన."

"నీవు కమ్మనిరాగంతో పాటగాని పద్యంగాని ఆలపిస్తే గైరికాఝురీ నాదానందాన్ని పొందుతాను."

"మీ రసజ్ఞత."

"నీ గృహకార్య నిర్వహణం సర్వనీతి సత్తముడగు మంత్రివర్యుని విషయవిభాగంలా నడచిపోతుంది. అతనిప్రాపున భోగలాలనుడైన చక్రవర్తిలా నీ ప్రాపున సుఖిస్తా."

"మీ అతిశయోక్తి."

"నా ప్రతిబింబం నీయందు హెపగా చూచుకుంటున్న నాకు జన్మజన్మాలు ఇలాగే సాగిపోవాలని ఆకాంక్షిస్తున్నా."

"నా అదృష్టం."

అతనిమోము వెన్నెలై మెరిసింది. ఆమెమోము వెన్నయై కరిగింది. ప్రక్కనున్న పాపమోము ముద్దులొలికింది.

తానొక ధన్యజీవి. తనకు సమర్థమైన అండ దొరికిందని నిశ్చింతగా తనవైపు చూస్తున్నాడు. అమృతభాండం దొరికిన దేవతలా కేకిసలాడుతూ పాపాయి ప్రశాంతంగా నవ్వుతూ తనను చూస్తోంది. వారిద్దరి చూపులు గంగా యమునా నదుల సంగమమై తానొక ప్రయాగ క్షేత్రమైనది.

తనకీ పవిత్రత యెక్కడిది? తన కీగౌరవ మెందుకు?

"సుశీ! నీయందు నాకింతగాఢమైన మమకారం ఎందుకు?" భర్త ఆకాంక్షపు జల్లులు చల్లుచున్న చల్లనిచూపులు నిలిపాడు.

"........మీ........" మెల్లనిచూపులను అతనితో కలిపింది సుశీల.

"అట్టివర్తనముల నెపుడుఁ బాండవులకుఁ
దగిలి ప్రియము సేయఁదగితి"....

అన్నభావం సుశీల హృదయంలో రేగి, వారిద్దరిని పెనవేసివైచింది.

—నారిలోకం : ఫిబ్రవరి 1957 (1.6)
(స్త్రీజనాభ్యుదయ-మాసపత్రిక,
సంపాదకురాలు : కె. రంగమ్మరెడ్డి)

కథానిక:

# పుట్ట జు

ముగిసిన దినగాథకు భరతవాక్యంలా - మొదలయ్యే క్రొత్త కథకు నాందీ వాక్యంలా హాస్పిటలు వరండాలోని గోడగడియారం పన్నెండు కొట్టింది. అక్కడికి ఇరవై గజాల దూరంలో అందంగా కత్తిరించబడ్డ పచ్చిక తివాచీమీద కూర్చున్న అతడు మొదటి గంటకు ఉలిక్కిపడ్డాడు. తరువాతి పదకొండు గంటలూ కన్నార్పకుండా చెవులు నిక్కించి విన్నాడు. గడియారం కొట్టిన గంటల శబ్దం ఆ ప్రశాంత నిశీధిలో చల్లని 'గాలి తల్లి' ఒడిలో కునుకుతీసింది. అతడు మరలా ఒంటిగాడైనాడు.

కాలచక్రం మైలురాయి దాటింది. విశ్రాంతి నెరుగని ఆ చక్రానికి మైలు రాళ్ల లెక్కకేరావు. కాని, మైలురాళ్ల నంటిపట్టుకున్న జీవులకు మాత్రం దాని చప్పుడు మేలుకొల్పులు పాడిపోతూంటుంది.

అతనికి ఆ క్షణంలో నిద్ర మేల్కొన్నంత పనైంది. అనాధ శరణాలయంలోని రిజిష్టరుప్రకారం అతని కానాడు పుట్టినరోజు. 25 సంవత్సరాలక్రితం అదేరోజున 24 గంటల కాలంలో ఏ క్షణంలో ఈ లోకానికి వచ్చాడో అతనికే తెలియదు. ఎవరు తెచ్చారో అంతకన్నా తెలియదు. అట్టి అస్పష్టావస్థలో అతడు జీవిస్తూ పుట్టిన రోజును జ్ఞాపకం చేసుకుంటున్నందుకు తనలో తాను నవ్వుకున్నాడు.

ఆరోజు పూర్ణిమ. పొగమబ్బులు ఆకాశాన్ని ఆవరించి ఉన్నాయి. అతడమాయకంగా చంద్రునివైపు చూచాడు. కన్ను తెరచీ తెరవని పసిపాపలా జాబిలి గోచరించిం దాతనికి. ఇంతలో—ఎక్కడో మంటలార్పి ఇంటికి వెళ్తున్న 'ఫైరింజను' నెమ్మదిగా గంటలు కొట్టుకుంటూ ప్రక్క రోడ్డుమీద ముందుకు దూసుకుపోయింది. కలతనిద్ర లేచిన రోడ్డు దుమ్ము పుడమితల్లి ఒడిలో మరలా పవ్వళించింది. అతడూ పచ్చికమీద ఒరగిల్లాడు. కలచబడ్డనీటితరగల్లా అతని మెదడులో భావాలు దూరదూరాలకు ప్రాకటం మొదలుపెట్టాయి.

"మరపుకు వచ్చిన యీ స్మృతిని ఎవరు జ్ఞాపకం చేశారు?.... ఈ గోడ గడియారమా?.... కాదు, ఇంతకు పూర్వమే....గౌరి. ఆమె ఇప్పుడే కాదు.... ఎప్పణ్ణుంచో జాగ్రత్తగా గుర్తుంచుకొని ఎన్నోసార్లు జ్ఞాపకం చేసింది.... ఆమెకు జ్ఞాపకం ఉంది కాబట్టే నా పుట్టినరోజు బ్రతికింది, లేకపోతే మసిఅయ్యే కాగితం, మసి అయ్యే దేహం- ఇవ్వే నా పుట్టినరోజుకు ఆధారాలు!"

ఇంతలో కొద్ది దూరంలోనున్న ఒక చెట్టు క్రింద నిద్రపోతున్న బిచ్చ గాడు నిద్రలో నీల్గి ఆవులించాడు గట్టిగా - అర్థంలేని అతని ఆవులింతను అమాయకంగా విన్నాడాతడు; అనుకోని అంతరాయం కల్గినట్లు కన్నుల్లో నీరసించాడు.

"గడియారం కొట్టిన గంటలూ.... మసకబారిన చంద్రుడూ.... ఫైరింజను గంటలూ, బిచ్చగాని ఆవులింతలూ .... ఇవీ నా పుట్టిన రోజున మొదటి అనుభవాలు. వీటికీ నా పుట్టిన రోజుకూ సంబంధం ఏమిటి?...." మూగ నవ్వు నవ్వాడు. ''మానవుడు తానసుభవిస్తున్న భావాల కనుగుణంగా ప్రకృతికి వ్యాఖ్యానం చెప్పుకుంటాడు" అంటూ చప్పరించాడు తనలో.

లేడీ డాక్టరు నర్సుతో మాట్లాడుతూ ఆమె క్వార్టర్సు నుండి వచ్చి అస్పత్రి తలుపు తెరుచుకొని లోనికి పోయింది. అతని కన్నుల్లో రెండు నక్షత్రాలు వెల్గాయి; ముఖం గ్రుడ్డి వెన్నెల కద్దమైంది. అతడు లేచాడు. అస్పత్రి వాకిలిదాకా పోదామనుకున్నట్లు ముందుకు సాగాడు. కాని, వెంటనే ఆగి పోయాడు. "గౌరికి కడుపు పండబోతున్నది. పిచ్చిపిల్ల! కొడుకు కోసం కోటి కలలు కన్నది. 'అమ్మ!' అనిపించుకోవాలని దానిఆశ." అప్రయత్నంగా అతని నోటి నుండి వెలువడ్డా యీ మాటలు. ప్రక్కనే గోడ కల్లుకొన్న మల్లె తీగెకు పూచిన పూవొకటి అతని ముఖంవైపు చూచి గేలి చేసింది. అతడు దానిని గోరంట నొక్కి చొక్కా గుండీపై నిలిపాడు.

గుండెపై నున్న మల్లెపూవు వాసనలు విరజిమ్మింది. మెదడులో నున్న భావాలు పూర్వానుభూతుల్ని ఎగజిమ్మాయి.

''గౌరీ! ఈ రోజెంత సుదినం! కోకిలమ్మ తొలిసారి కూత కూసిందికదూ యీ వేళ?" గుండెపై గౌరి మల్లెపూవులా వాలియున్న శోభన ముహూర్త మధి,

"కాకులచేత కష్టాలు........" ఆమె రుద్ధకంఠంతో అతని చెక్కిళ్ళను కనురెప్పలతో పులిమివైచింది. వెచ్చని అశ్రుకణాలు అతని ఆత్మను అభిషేకం చేసినవి. కులబంధాలను త్రెంచుకొని ఆమె అతనికి ఆత్మార్పణం చేసికొన్న అమృత సమయమది.

"ఈ మావి కొమ్మ నిలిచినన్నాళ్ళు నీకెట్టి లోపంలేదు గౌరీ!" అతని కంఠం శ్రావణ మేఘంలా గంభీరంగా మ్రోగింది. ఆమె గుండెల్లో నెమళ్ళు పురులు విప్పి ఆడాయి.

"ఇక అన్నిటికీ ఆ జగన్నాథుడే ఉన్నాడు" అంటూ - కోర్కె పెనవేసి కొన్నట్లు ఆమె నాతనిని కౌగిలించింది. అత డర్ధనారీశ్వరుడయ్యాడు.

ఆ రోజున స్వయంగా తాను ఆమె చేతులకు బంగారు గాజుల జత నలంకరించాడు. ఆమె కొప్పులో బొండు మల్లెలు తురిమాడు. ఆమె చల్లగాలికి చలించిన మొగలిపూవయింది.

"మీ సొమ్మును నేను; నాకెందు కింకా యీ సొమ్ము?" - ఆమె సిగ్గుతో ముద్దులు వోయింది.

"నా పుట్టిన రోజు కానుక."

"కాదు, మీకు ఇన్‌కంటాక్సు." ఇద్దరూ ఫక్కున నవ్వారు.

"లేపకే నాయెంకి.... లేపకే నిదుర" అని నిషారాగాలు తీస్తూ సైకిలుమీద పోతున్న వాడొకడు బెల్లుకొట్టాడు, రోడ్డు మధ్య నిద్రపోతున్న కుక్క మొఱుగు కుంటూ ప్రక్కకుపోయి పడుకుంది. ఆ శబ్దం అతని భావసమాధిని భగ్నం చేసింది. గాలికి త్రోయబడ్డ పడవలా అతడు పది గజాల దూరం నడిచి మరలా పచ్చిగడ్డిమీద చతికిలపడ్డాడు.

దేనికొఱకో అతడు ఆరాటపడుతున్నాడు. అతడు బుద్ధిజీవి. తనకూ, తన చుట్టూ ప్రకృతిలో జరిగే సంఘటనలకూ సమన్వయం కుదిరేంతవరకూ సతమత పడతాడు. ప్రతిదాన్నీ మనసుదాకా తీసికొని ఆలోచిస్తాడు. అందుకే ఆ పుట్టిన రోజున ఆ ఆర్భాటం.

"పుట్టటం గిట్టటం అనేవి ప్రతిప్రాణికి లక్షణాలే. అయితే పుట్టటం చావడమంత తేలికగాదు. చచ్చినవాడికి ఒకే పండుగ, బ్రతికినవానికి ప్రతిరోజూ పండుగే. అయినా ప్రతి వాడు చావుతో అంతమౌతాడు. అందులో అదృష్టవంతుడు కీర్తిశేషుడౌతాడు. దురదృష్టవంతుడు భస్మశేషు డౌతాడు. అంతే తేడా. లక్ష్యానికి, అదృష్టానికి, జీవితానికి సమన్వయం కుదిరిన బ్రతుకులు శాశ్వతాలు; సమన్వయం కుదరని నాబోటివారివి చెదలుపట్టిన తాటాకు గ్రంథాలు."

జీవితము, అదృష్టము, లక్ష్యమూ అనుకుంటుంటే అతని భావనలో ఎప్పటిదో ఒక మెరుపు మెరిసింది.

o o o

"నీకీ విజయంతోపాటు పుట్టిన రోజు కూడా కలిసివస్తున్నందుకు నా అభినందనలు."

"నా పుట్టిన రోజా?" అతడు విస్తుపోయాడు.

"అవును: మొన్న డ్రిల్లు మాస్టరు చెప్పారుగా.... నీ పుట్టినతేదీ చెప్తూ నీ వయసుకు తగ్గ ఒడ్డూ పొడుగూ, తెలివి తేటలూ మీ క్లాసులో నీకొక్కడికే ఉన్నట్లు" - గౌరి మెరుపులా మాట్లాడింది.

అత డొక క్షణం నిశ్చేష్టుడయ్యాడు. తనను గురించి ఆలోచించే వ్యక్తి లోకంలో మరొకరున్నారని తెలిసిం దానాడే - అతనికి. అతనికీ ఒక పుట్టిన రోజంటూ ఉన్నదని విన్నది ఆనాడే. వెంటనే తనకు బహుమానంగా ఈయబడ్డ పుస్తకాన్ని తీసి ఆమె చేతిలో పెట్టుతూ "ఇదిగో, నా పుట్టినరోజు కానుక--తీసికో గౌరీ!" అని అన్నాడు.

"అలాకాదు. అది నీవు డిబేటులో గెల్చినందుకు గుర్తు."

"కావచ్చు కాని, దానికి నేను మరొక హోదా కల్పిస్తున్నా .... ఇది నా స్నేహానికి చిహ్నం." అతని కన్నుల్లో నీరు తిరుగుతూ ఉంటే గౌరి చూడలేకపోయింది. చేతులు చాచి తీసికొనబోయిందా పుస్తకాన్ని. కాని, వెంటనే ఆగిపోయింది. అతనికి ఒళ్ళు తెలిసింది కాదు. వెంటనే ఆమె చేతులు పట్టుకొని దోసిలిలో పుస్తకాన్నుంచాడు. పుస్తకంకన్న ముందే అతని అశ్రుబిందు వొకటి ఆమె దోసిట్లో ముత్తెపు చిప్పలోని స్వాతిచినుకులా నిలిచింది. చుట్టూ మూగిన విద్యా

ర్థులు చప్పట్లు కొట్టటంతో వాళ్ళిద్దరూ ఈ లోకానికి వచ్చి రివ్వున ఎగిరిపో యారు.

పాఠశాలా జీవితంలో జరిగిన ఒక మధురఘట్టం అతనికి జ్ఞాపకం వచ్చింది. ఆనాటి నుండి అతని ప్రతి పుట్టినరోజు పండుగా గౌరితో పెనవేసి కొనిపోయి డైరీలో కెక్కుతూ వచ్చింది....

o o o

ఇంతలో హాస్పిటలు తలుపు తెరచుకొని నర్సు వరండాలో ఒక మూల గదిగానున్న "స్టోరురూము"లోకి పోయి ఇంజక్షనొకటి తీసికొని మరలా తలుపు మూసుకొని లోనికి వెళ్ళింది. తలుపు తెరచినప్పుడు రెండు మూడుసార్లు ఆర్ద్రంగా గౌరి బాధపడుతున్న కంఠస్వరం వినవచ్చింది.

అతనికి భూమిమీద కాలు నిలువలేదు. వస్తుతః గౌరి మీద ఈగవాలితే బాధపడేవాడతడు. ఆమె బాధపడుతూ ఉంటే తాను సహించలేకపోయాడు.

అయితే, ఇందులో అతనికి ఒక విధమైన సంతృప్తి కూడా ఉంది. గౌరి దృష్టిలో ఆ బాధ బాధకాదు. ''వర్షానికి ముందు మేఘాలు క్రమ్ముతవి, ఉరుము తవి, మెరుస్తవి, వర్షం కురిసి వెలిసిపోతవి'' అని తనకు ధైర్యం చెప్పి ఉంది. అందువల్లనే ఆ సమయంలో కూడా కొంత ధైర్యంతో పూర్వస్మృతులను నెమరువేసుకోగల్గాడు.

o o o

"గౌరీ! ఈ ప్రశాంత వనాంతరంలో కూర్చున్న మనం ప్రకృతిమాత ఒడిలోని పావల్లా లేమూ?" ఆ మాటలంటున్నప్పు డత డతనిలో లేనట్లు గోచరిం చాడు.

''అమ్మను మింగిన హంతకురాలిని, నాకేం తెలుస్తుంది చెప్పండి?" ఆమె ఒక్కసారిగా అతని ఎడమ బుజంమీద వాలి వెక్కివెక్కి ఏడ్చింది.

ఎదురుగా చెట్టు తొర్రలో నుంచి చిలుకపిల్ల ఒకటి చెంగున కొమ్మమీది కెగిరి బిత్తరచూపులు చూస్తూ, వచ్చీరాని కూతలు గొణిగింది. "పిచ్చిపిల్లా! ఆ చిలుకపిల్లను చూడు. ధైర్యం చెబుతున్నది .... నీవు వెన్నవు కాబట్టి కరిగి పోయావు. నేను రాయిని కాబట్టి కరుడుకట్టాను.'' అతని గొంతుక చివరకు బొంగుర్పుపోయింది.

తల్లి చిలుక ఎక్కడినుంచో రెపరెప చప్పుడు చేస్తూ వచ్చి జామపండు గుజ్జును పిల్ల నోట్లో ఉమ్మింది. ఆ పిల్ల చిన్న రెక్కల్ని అల్లల్లార్చుకుంటూ గోరుముద్దను అరమోడ్పు కన్నులతో ఆరగించింది. తల్లి చిలుక కొమ్మమీద గంతులు వేస్తూ రెక్కలతో దానిని పరామర్శించింది.

అతడూ ఆమే కన్నులార్పకుండా ఆ దృశ్యాన్ని ఎంతసేపో చూచారు. ఒకరికొకరు తెలియకుండా కౌగిలించుకొన్నారు. వారి చెక్కిళ్ళమీద మందారాలు సొమ్మసిల్లాయి. వారి కన్నులలో మకరందాలు జాలువారాయి. వారి మైదీవలు మంచుకణాలలో మునిగిపోయాయి. తీవెల పాదాలపై వ్రాలి ఎండిపోయిన పూల కదంబాలు తమకన్న వేయి రెట్లు అదృష్టం చేసుకున్నాయని అనుకున్నారు.

చల్లని తల్లి చూపు నోచుకొని బాలలకు ఆ దృశ్యాలు సలసల కాగే భూమి మీద స్వాతి చినుకుల్లా గోచరించడంలో ఆశ్చర్యంలేదు! ప్రతి వర్షబిందువూ వారి లోని సెగలనూ, పొగలనూ వెళ్ళదీస్తుంది; చల్లదనానికి దారితీస్తుంది.

ఆ రోజు రాత్రి పాఖాల అరణ్యంలోని గెస్టు హౌసులో గడిపారు. కాకతీయుల చల్లని హృదయం ద్రవించి గూడు కట్టుకున్న పాఖాల సరస్సుమీద నుండి కరుణార్ద్రమైన గాలులు వీస్తుంటే వారు పొత్తిళ్ళలోని పాపల్లా అమాయకంగా నిద్రపోయారు.

అర్ధరాత్రి నిద్రలో గౌరి కెవ్వున కేకవేసింది. అతడు కలతనిద్రలో లేచి తుఫాను నెదుర్కొన్న మామిడి కొమ్మలా ఆపాదమస్తకం వణికిపోయాడు. గౌరి పండుటాకులా వాడిపోయింది. చిగురాకులా కదలిపోయింది. అతడు పిచ్చివాడులా "గౌరీ!"అని కేకవేసి ఆమెను గట్టిగా కౌగిలించుకున్నాడు. ఆమె స్వప్న లోకం నుండి క్రమంగా నిదుర తెరలను దాటి జాగృతికి వచ్చింది. అతని శరీరంలోని వేడి, అతని చూపుల్లోని ఆత్రం, అతని ముఖంలోని వాత్సల్యం, అతని కన్నుల్లోని ఆర్ద్రం ఆమెను అరఘడియలో మనిషిని చేసినై. దోసిలిమధ్య దీపంలా కొంతసేపటి కామె తేరుకుంది. అప్పు డాతని లాలనలో గౌరి చెప్పిన మాటలు పాఖాల చెరువులో నక్షత్రాలు పడ్డంత చప్పుడుతో వినవచ్చిన వాతనికి.

"——ఏమండీ! ఆ చిలుక తల్లిని పొంచి ఉన్న గండుపిల్లి ఒకటి గొంతు కొరికిందండీ! అది సొమ్మసిల్లి పడిపోయింది....అదేం చిత్రమో-ఆ పిల్లి చిలుక పిల్లను ముద్దు పెట్టుకొని తొర్రలోకి తీసుకుపోయింది. పోతూ చిలుక ఎక్కణ్ణుంచో

మందార పుష్పాన్ని ముక్కుతో పట్టుకొనివచ్చింది. పడిపోయిన భార్యను చూచి గుండె పగిలి దానిమీదపడి తానూ చనిపోయింది. దాని ముక్కులో ఉన్న మందారంలో నుండి ఒక మకరందపుబొట్టు తల్లి చిలుకమీద పడింది. ఆ తల్లి బ్రతికింది. రెక్కలు విదిల్చి త్వరవైపు వస్తున్న తల్లి చిలుకను చూచి పిల్లి పిల్ల గొంతు కొరికింది. ఆ పిల్ల కెవ్వు కెవ్వున కేకలువేసింది మరల మాట్లాడలేదు. తల్లి ఒళ్లు మండిపోయి పిల్లి గ్రుడ్లు పీకేసింది.నా గుండె లపిసిపోయాయి. మీరేదో నామీద వర్షం కురిపించి నన్ను తేర్చారు." గౌరి ఆ మాట అంటూంటే అతని కన్నులలో తెల్లమబ్బులు సారెలు కట్టుకున్నవి.

"ఈ కల ఇంతటితో అయిపోయిందంటారా?" గౌరి అమాయకంగా అడిగింది. ఆమె చెక్కిళ్ళమీద మల్లెపూవులు దొంతులు కూర్చుకొన్నవి.

అతనికి సమాధాన మేమీ తోచలేదు; కాని అతనికి తెలియకుండగనే నోరు మాట్లాడింది. "లేదు ఇంకా ఉంది. ఆ మందార మకరందంతో ఆ తల్లి-ఆ పిల్లను, ఆ తండ్రిని పునర్జన్మ నెత్తిస్తుంది."

"అమ్మయ్య!" ఆమె అతనిపై వాలిపోయింది. ఒక్క క్షణం ఇద్దరూ శ్వాసలను లెక్కించుకొన్నట్లు పండున్నారు. "ఏమండీ! నా కమ్మనయ్యే అదృష్టం ఉందా!" అన్నది శ్వాసధ్వనితో. ఆమె గంభీరమైన గోదావరిలా గోచరించింది.

"నీకేం? నీ వెప్పుడో అమ్మవైపోయావు" అంటూ బాలుడి మాదిరిగా ఆమె వక్షాన్ని ముఖంతో పులుముకొన్నాడు.

o o o

అంతలో ఏదో చప్పుడు.... దాయి హాస్పిటలు తలుపు తెరచుకొని తన వైపు త్వరగా వస్తున్నది. అతడు ఆత్రంతో ముందుకు నడిచాడు.

"దొరా! డాక్టరమ్మ ఈ చీటీ మీకియ్యమంది. అమ్మగారికి కొడుకో, కూతురో పుట్టబోతున్నారు. అపైన ఈ సూదులు వాడాలట. అయ్యేమో మనూర్లో దొరకవంట. ఆస్పిటాలులో అయిపోయాయంట! టౌనుకెల్లి తీసుకురమ్మంటున్నారు. అటి పేర్లు డాక్టరమ్మగోరు దీనిమీద రాసింద్రు" దాయి చీటీ అతనిచేతి కందించింది.

స్టాండులోనున్న సైకిలు పైకిలాగి టౌనువైపు పట్టించా డతడు. టౌను ఆ వూరికీ రెండు మైళ్ళుంది. ఆవూ రంత పెద్దదీ కాదూ, అంత అనాకారిదీ కాదు. కాని టౌను ప్రక్కన ఉండటం మూలాల కొన్ని టౌను కళలు క్రమంగా ఏర్పడుతూ ఉన్నాయి. హైస్కూలూ, లైబ్రరీ, ఆస్పత్రి - (ప్రసూతిశాఖ వేరుగా) క్రమంగా మూడు నెల్ల క్రితమే ఆ వూళ్ళో ఏర్పడ్డవి. ఇంకా గ్రామం అభివృద్ధి కావాలి. ప్రస్తుతానికి మాత్రం పదేళ్ళ పిల్లలకు బెనారసు చీర కట్టినట్లున్నది, ఆ వూరు.

గౌరికి పదోనెల మొన్ననే వచ్చింది. తెల్లవారితే భర్తకు పుట్టినరోజని నిన్న ఇల్లంతా అలంకరించింది. క్రొత్త ధోవతులచాపు, సిల్కులాల్చీ స్వయంగా బజారుకు వెళ్ళి కొని తెచ్చింది. నిండు చూలాలైనా ఆమె బొండు మల్లియలా నట్టింట సంబరాలతో విరిసింది. పగలంతా శ్రమపడటంచేత ఆనాటి సాయం కాలం కొంచెం బడలిక చేసింది. క్రమంగా ఆమె కదో విధంగా తోచడం ప్రారంభించింది.రాత్రి 11 గంటల కామెను ఆస్పత్రిలో చేర్చా డాతడు.ఆమెకు సహాయంగా దాయి 'మల్లి' ఉంది.

సైకిలు ఎక్కుతుంటే గడియారం 3 కొట్టింది. అతని ఆవేశం సైకిలు గావేశించింది. టౌనువైపు గాలితో పోటీపడుతూ సైకిలు పరుగెత్తింది. సైకిలు చక్రాలతోపాటు అతని భావనలు సుడులు తిరిగి ముందుకు సాగాయి.

"గౌరి మాతృశ్రీ! ఆమె తల్లి ప్రేమను ఎరుగదు కాబట్టే దాని కొరకంతగా అర్రులు సాచింది. దేవుడు కన్ను తెరిచాడు. ఆమె తల్లి ఔతుంది; ఆమె దేవత అవుతుంది."

ఆకాశాన చంద్రుడు మేఘపంజరం నుండి తప్పించుకొని ఒక్కసారి లోకాన్ని తన చల్లని చేతులతో కౌగిలించుకొన్నాడు. మాతృ ప్రేమలా వెన్నెల లోకంమీద ఒలికిపోయింది. ఆ వెన్నెల మధ్య మంచుగడ్డల్ని చీల్చుకుంటూ ధృవంవైపు ముందుకుసాగే "ఆటమిక్ పవర్ స్టీమరు" మాదిరి ముందుకు పోతున్నా డాతడు.

"తొలిగుత్తివేసిన ద్రాక్షతీవెలాగా గౌరిని చూచి ఏమని పల్కరించేది?.... గౌరి పసివాణ్ణి చూపిస్తూ 'ఇదుగో బాబూ! నాన్నగారు!' అంటుంది కాబోలు!.... నాన్ననంటే నా కెంధుకో గుండెల్లో ఫెన్న కరుగవేసినట్లుంది!...."

చంద్రుడు తన చేతులు ముడుచుకొని నల్లమేఘంచాటున ఒదిగికొన్నాడు. పొగ చీకటి రోడ్లుమీద పొరలు పొరలుగా వ్యాపించింది. రోడ్డు కొంత బాగుండకపోవడంచేత కుదుపుల్లో సైకిలు అదురుతూ నడుస్తున్నది.

"గౌరి కోరుకున్న కోర్కె తీరింది. ఇక ఆమెకు పసిబాబే లోకం. బాబును పోషించడంతో - ముద్దు మురిపాలతో దినమంతా గౌరికి క్షణంలా కరిగి పోతుంది.... గౌరికీ నాకూ మధ్య ఇదివరకులాగా ఎడతెగని అనురాగం కొన సాగుతుందా? నాకో భాగస్థు డేర్పడ్డాడు".... ఆ భావనకు ఉలిక్కిపడ్డాడు. సైకిలు చక్రం బండిగాడిలో పడి ఎగిరి ఆవలికి దూకింది.

"ఛా! ఛా! ఏమిటీ గతుకులు. తిన్నగా నడిచిపోయే బాటలో నడుములు విరగ్గొట్టే గోతులు!" అని చీదరించుకొన్నాడు.

మరలా మెత్తని దోవనపడ్డాడు. "నాన్న పుట్టినరోజునే కొడుకు పుట్టాడు. ఇకముందు ప్రాతపండుగకు క్రొత్త తీపివస్తుంది. గౌరి రెండు కన్నులతో ఇద్దరికీ నీరాజనం పట్టుతుంది. కొడుకు నెత్తుకొని ముద్దుల వర్షం కురిపిస్తుంది. అందుట్లో నేను తడిసిపోతాను."

అతడు ముచ్చెమటలతో టౌనుకు చేరాడు.

o o o

మల్లి హాస్పిటలు వాకిలివద్ద ఆత్రంతో నిలబడి ఉంది. అతడు రెక్కలు కట్టుకు గిర్రున తిరిగి వచ్చాడు ఇంజక్షన్లతో. దాయికి ఎదురుగా సైకిలు నిలిపాడు. చేతులు వణికిపోతూ ఆమె చేతిలో ఇంజక్షన్ల నుంచాడు.

"ఏం మల్లీ! ఎట్లా ఉంది గౌరికి?"

"........అమ్మగారికా దొరా?........" నీళ్ళు నమిలింది.

మల్లి ముఖం చెమటలతో కరిగిపోతున్నది.

"ఏమిటి మల్లీ!....ఏం జరిగింది? త్వరగా చెప్పు!" అతని గుండెల్లో పిడుగుల వర్షం కురుస్తున్నది.

"అమ్మగారికి బహు కష్టంమీద కాన్పయింది."

"గౌరి క్షేమమే కదా!"

"ఆ! - అయితే, చాల నీరసంగా ఉన్నారు"

"బాబు !.

"బాబు ఒక్కసారి ఏడ్చాడు.... అంతే.... మళ్ళా అలికిడి లేదు."

మల్లి తడబడి పోయింది.

అతడు మసిపట్టిన తుమ్మచెట్టయ్యాడు. తారుపూసిన గండ శిల అయినాడు.

"దొరా! లోనికిపోతా. సూది మందు డాక్టరమ్మగారికిస్తా, కాచుకుని ఉంటారు" - మల్లి లోనికి వెళ్ళిపోయింది.

అత డేమీ మాట్లాడలా. అతడు చంద్రుని చూస్తూ అలాగే నించున్నాడు. గడియారాన్ని చూస్తూ అలాగే నించున్నాడు. ముందున్న రోడ్డును చూస్తూ అలాగే నించున్నాడు. ప్రక్కనున్న పచ్చికను చూస్తూ అలాగే నించున్నాడు. అతని చెవుల్లో మంటలార్పిన ఫైరింజను గంట మ్రోతలు, కుక్కపిల్ల ఆర్త నాదం, బైరాగి ఆవులింత ఒక్కొక్కటి మారు మ్రోగాయి.

"ఇవి నా భవితవ్యానికి మూలాలా? లేక నా పుట్టిన రోజుకు వ్యాఖ్యానాలా? "....పున్నమనాడు కూడా చంద్రుడు మబ్బుచాటు కెందు కెళ్ళాలి? తన కళల్ని ఎందుకు దాచుకోవాలి? ఫైరింజను మొలకెత్తిన అగ్ని శిఖను ఎందు కార్పాలి?.... రోడ్డుమీద దుమ్ము ఎందుకు లేవాలి?.... కుక్కపిల్లలోని శాంతి, బిచ్చగాని నిద్ర ఎందుకు భగ్నం కావాలి?.... వీటి కన్నిటికీ కారణ మేదో ఉంది. నా కన్నులు నన్నే మోసగించాయి....నా గౌరి నాకు దూరమై ఉంటే.... ఇవన్నీ కలిసి నన్ను మోసగించాయి. గడియారం నా పుట్టిన రోజును జ్ఞాపకం చేసింది.... ఇదీ మోసమే. నా గౌరి తప్ప ఈ లోకంలో అంతా మోసమే.... కంటికి కనపడ్డ దీపాన్ని ఆర్పి, నా గౌరినిగూడా ఆ కిరాతక బ్రహ్మ సుడి గుండంలో త్రోశాడు.... ఇక నా గౌరి తల్లి కావడం కల్ల.... నేనీ రోజున పుట్టి ఉండి ఉండటం కల్ల...."

అతని తల తిరిగింది. గౌరి కలవరింతలో బావురుమన్నట్లయింది. తనకు ఇన్‌కంటాక్సు ఆఫీసులో ఉద్యోగం ఊడినట్లనిపించింది.

అచ్చటికి 100 గజాల దూరంలో ఉన్న లేడీ డాక్టరుగారింట్లో ఎవరో పిల్లవాడు తెల్లవారు ఝామున లేచి 'పారడైజ్ లాస్ట్'లోని కవితా భాగాన్ని కంఠస్థం చేస్తున్నాడు. ఆతని చెవుల్లో పల్లేరుగాయలు పోస్తున్నట్లయింది.

❦ ❦ ❦

తూర్పురేకలు తెల్లవారుతున్నాయి. దాయి ముందు నడుస్తుంటే అతడు బరువుగా అడుగులు వేస్తూ మెటర్నిటీ వార్డు వైపు నడుస్తున్నాడు.

అతడు కన్నుల్లో నీటి మూటలు కట్టుతున్నాడు. గౌరి ముఖం చూడటానికి అతనికి భయం వేసింది. చివరకు ఆమె యెదుటకే అతడు వచ్చాడు.

ఆమె అతనిని నిండు కన్నులతో చూచింది. కనుకొలకుల్లో నుండి రెండు అశ్రుకణాలు జారినవి ఆమెకు. అతడు కంటికి కడవ కట్టాడు. మళ్లి అతన్ని ఎంతో ఓదార్చింది. గౌరి అతనిని దగ్గరకు తీసుకుంది.

ఆమె కన్నులలో సూర్యుని కోల్పోయిన సాంధ్యారుణ కాంతులు పోగువడ్డాయి. అతడు తెల్లబోయి ఆమె కన్నుల్లో వెర్రి చూపులు చూచాడు.

"మీరేకదూ.... నేనిదివరకే అమ్మనైనా నన్నారు?"

"అవును" అంటూ బావురుమన్నా డతడు.

"రాత్రి రాకాచంద్రుడు మబ్బుచాటున మాయమైనాడు.... అంతే.... మరలా మన జీవితంలో మరో పున్నమ వస్తుందేమో...."

సూర్యోదయ మౌతున్నది కాని, నల్ల మబ్బులు దట్టంగా తూర్పున అలమి ఉన్నాయి. ఆ వైపుచూచి అనుకున్నా డాతడు....

"జగత్సాక్షి కనుమరిగిన రోజే జగన్నాధరావు పుట్టిన రోజు."

—)o(—

(జ్యోత్స్న - సికిందరాబాదు కళాశాల వార్షిక సంచిక - 1966.)

గల్పిక :

# రెండు పుంఖాలు

1976 లో తొలి సూర్యోదయమైంది.

శ్రీవారు కప్పుకున్న రగ్గును నెమ్మదిగా తీసి తొలి కప్పు కాఫీ వాసన చూపించాను. చిలిపి చూపులు చూస్తూ చిరునవ్వుతో చివాలున లేచి కూర్చున్నారు. చుక్కపొడిచిందాకా చదివించిన 'మండుతున్న సూర్యుడు' గుండెల మీద నుంచి జారిపడ్డాడు. కాఫీ తాగుతున్న ఆయన 'నవ్వుతున్న సూర్యుడు'లా కనిపించారు.

వారు నాకు నూతన సంవత్సర శుభాకాంక్షలు చెబుతారేమో ననుకున్నా! కాని, 'థాంక్యూ!' అన్నమాట వినపడింది. కాఫీ కప్పు నోటికందిం తర్వాత కాంతను మరిచిపోయిన గడియలు ఎన్నో ఉన్నాయి. ఆయన అప్పుడే క్యాలెండర్ చూస్తున్నారు. 'కవితాలహరి' ఆవిష్కరణం ఇంకా నాలుగే రోజులుంది. ఇంకా కలం కాగితం మీద పెట్టలేదు. కలవరిస్తున్నట్లు మొదలుపెట్టారు.

'మీరు నిద్రలేచి కాఫీ తాగుతున్నారు, ఇంకా కలవరింతలేనా?!"

"కాఫీ అన్నది మిష. నీ కెప్పుడు నిద్ర లేపాలో బాగా తెలుసు."

"మీ యువభారతి నిద్రపోనిస్తేగా - నేను లేపటానికి!"

"ఒకరు నిద్ర రానివ్వరు - ఒకరు నిద్ర పోనివ్వరు."

"రానివ్వని వారిని గురించే రాత్రింబవళ్ళు ఆలోచిస్తుంటారు కాబోలు."

"అవునూ.... రాత్రి రాసిన 'ఆలోచనం' ఫేర్‌కాపీ చేశావా?"

"నాకు తెలీక అడుగుతాను.... ఆ రాసిందేదో నాకు తెలిసేటట్టు రాయకూడదూ!"

"కొత్త సంవత్సరంలో నీ తొలి విమర్శ నా ఆలోచనం మీదనే నన్నమాట!"

"ఇది విమర్శకాదు స్వామీ! పరామర్శ"

"మరో కొత్త ప్రక్రియా!.... నేను లక్షణాన్ని వెదకాలి."

ఆయన పక్కమీది నుంచి లేచి నించున్నారు.

"లక్షణాలు వెదికితేన్నా కనపడతాయి. మీరు బయల్దేరితే ఎక్కడుంటారో తెలియద్దు."

"బయలుదేరటం ప్రగతి లక్షణం, ఆగకపోవటం అభ్యుదయ శీలం!"

"ఇది పి. టి. క్లాసు కాదు; బెడ్ రూం."

"అందుకే నీకు పాఠం చెబుతున్నాను."

నేనొక పుస్తకం రాయాలనుకుంటున్నాను."

"నేను మేల్కొని ఉన్నాననే కదూ నీ వన్నా విప్పుడు."

"నా మాట కలేం కాదు. సాహితీ వాహినీ సీరీస్‌కు రాస్తాను."

"సీరీస్‌కు ముందు శీర్షిక కావాలి. మేం సాహితీ మిత్రులకు చెప్పాలి."

"సరే....రాసుకోండి....రచయితల భార్యలూ - రాత్రి జాగరణలూ."

"యతి కలిసింది.... బాగానే ఉంది."

"అందులో మీరు అక్షరం తగ్గించటానికి వీల్లేదు."

"సంపాదకుణ్ణి నేను - నన్నలా శాసించకూడదు."

"నేను సంపాదించకపోయినా మిమ్మల్ని శాసించే హక్కుంది నాకు."

"మహిళా సంవత్సరానికి మంచి నినాదం."

"ఇంతకూ.... మహిళల కవితా సంపుటి అచ్చైందా?"

"ఇదుగో ఇప్పుడెళ్ళి పీఠికరాయాలి."

"ఇప్పుడు వెళ్ళితే ఎప్పుడు రాక?"

ఆయన వినిపించుకోకుండా స్టడీరూంలోకి వెళ్ళారు. వెనకనే నేనూ వెళ్ళాను. మండుతున్న సూర్యుణ్ణి రాక్‌లో పెట్టి, కృష్ణశాస్త్రిగారి ఊర్వశిని తీస్తున్నారు.

"ఈ రోజు నాకో మాట ఇవ్వాలి."

"ఒక మాట!.... జనవరి ఒకటో తేది కాబట్టా?" నవ్వు.

"శుభాకాంక్షలు లేకపోగా సానుభూతికి కూడా కరువా?"

ఆయన ఉలిక్కిపడి నా వైపు చూచారు. భుజం మీద చేయివేసి 'చెప్పు' అన్నారు.

"మీరు పెందలాడే ఇంటికి రావాలి....ఇది కొత్త సంవత్సరం తీర్మానం."

ఆయన ఒక్కక్షణం ఆలోచించారు. పెద్దగా నవ్వారు.

"సుశీ! ఈ తీర్మానానికి తిరుగులేదు. చెయ్యి భుజంమీద వేసినా చేతులో వేసినట్లే. పెందలాడే రావాలంటే నేను పెందలాడే బయలుదేరాలి!" అంటూ

ముందుకు సాగిపోయారు - భవిష్యత్తును వెదుక్కుంటూ పోతున్న బాటసారిలా. ఆయన సామాన్యంగా వెనక్కు తిరిగి 'టాటా' చెప్పరు.... కారణం అడిగితే 'గతా న్నంత తేలిగ్గా వదల్లే'నంటారు.

o o o

రాత్రి పన్నెండు కొట్టింది. ఆయన తలుపుతట్టారు. తలుపుతీశాను. నేనేం మాట్లాడలేదు. ఆయనే మొదలు పెట్టారు:

"దాశరథి వ్యాసాన్ని పూర్తిచేసి, ప్రెస్ కిచ్చి వచ్చాను."

"నేనూ ఇంట్లో దాశరథి శతకాన్ని పూర్తిచేశాను."

"మనమిద్దరమూ ఎక్కడున్నా ఒకేలాగా స్పందిస్తాం."

"దాశరథి ఎన్నడూ మాట తప్పలేదు."

"నేనూ తప్పలేదు."

"ఇప్పుడే ఒకటవ తేదీ వెళ్ళిపోయింది. మీ తీర్మానం వీగిపోయింది."

"లేదు. నిన్న రాత్రి ఇదే వేళకు వచ్చాను. అంతకంటే ఎవరూ పెంద లాడే రాలేరు."

"సమర్థనమే రాబోలు సద్విపుర్శ!"

ఆయన నవ్వి గడియారంవైపు చూస్తూ అన్నారు : "ఆ రెండు ముళ్ళకు మల్లేనే పాతకు భరత వాక్యం పాడి, కొత్తకు నాందీ వాక్యాన్ని పలికే అదృష్టం ఏ దంపతులకు లభిస్తుంది చెప్పు!"

'దంపతులకు బదులు తిరుపతి కవులని అనలే'దని వేంకటేశ్వరస్వామికి మ్రొక్కాను.

(నందిని-జనవరి, 1976)

గల్పిక :

# నామకరణం

మొన్న మా బంధువులింట్లో నామకరణోత్సవమైతే వెళ్ళాను. లేకలేక వాళ్ళకో ఆడపిల్ల. ఆ యజమాని తన బిడ్డకు 'సీత' అని పేరు పెట్టుకోవాలని ఉబలాట పడుతున్నట్లున్నాడు. పురోహితుడు పేరు పెట్టే వేళను సూచించాడు. ఆయన వెంటనే 'సీత' అన్నాడు. బాలెంత 'ఉండండి? మరీ అంత తొందరైతే ఎలాగు?' అని కూనిరాగం తీసింది.

'ఏం, ఏమైందీ ఆపేరుకు?' అని గద్దించా డాయన.

'ఏంటో బాబూ,' ఆ పేరు పెడితే ఎన్నో ఇక్కట్లు పడాలిసి ఉంటుంది' అన్నది బిక్కుబిక్కుగా.

'అయినా రాముడులాంటి మొగుడు దొరుకుతా ళ్ళే' అన్నా డాయన ధీమాగా.

'ఎవరో ఏదో అన్నారని అడవుల్లో వదలటానికా?'

'అదా నీ సందేహం?'

'అదికాదు. సీత అంటే నాకు అడవి జ్ఞాపకం వస్తుంది.'

'రావణాసురుడు జ్ఞాపకం రాడూ?'

'వాడే తిప్పల కన్నిటికీ మూలం.'

'వాడుంటేనే రాముడికి కీర్తి! సీతకు ప్రతిష్ఠా!'

'అట్లని మరో రామాయణం కావాలనా మీ ఉద్దేశం?'

'బాగానే ఉంది నీవరస. మరి భద్రాద్రి సీతారాములకు మొక్కుకున్నావుగా నీవు?'

'మొక్కుబడి చెల్లిద్దాం.'

'మొక్కుబడికి సీత పనికివస్తుంది గాని, ముద్దుగా పేరు పెట్టుకోవటానికి పనికిరాదా?'

'వాళ్ళు దేవుళ్ళండీ - వాళ్ళ పేర్లు మన కెందుకు?'

'మరి మన పేర్లన్నీ దేవుళ్ళవేగా! నీ తమ్ముడి పేరు నరసింహం. మరి వాడికి సింహం తలకాయలేదే? ఎవడి పేగులుతోడాడు వాడు?'

'అబ్బ, మీతోటి ఎప్పుడూ ఇంతే.'

'సీత దేవత కాదు.'

'అయితే ఎవరు?'

'మంచి ఇల్లాలికి మారుపేరు?'

'అయితే జానకి అన్న పేరు పెడదాం.'

'వరాన్వేషణ నా కొక సమస్య కావటానికా?'

'అమ్మాయికి మొగుడు ఎక్కడో పుట్టి ఉంటాడండీ!'

'మనింట్లో పుచ్చిపోయిన వెదురుబద్దైనా లేదే?'

'కోటీశ్వరుడైతే చాలు, కోదండం లేకపోయినా ఫరవాలేదు.'

'కోటీశ్వరుడైతే కొనుక్కోవాలి. మనదగ్గర అంత శక్తి ఉండవద్దూ?'

'పేరు పెట్టలేదు, అప్పుడే పెళ్ళిదాకా పోయారు.'

'పెళ్ళి పత్రికలమీద మంగళశ్లోకం ఏంటి?'

'అందులో మొదట జానకి అనే ఉంటుంది.'

'జానకి అయినా, సీత అయినా పేరులో ఏముంది? దాని జాతకం ముఖ్యం.'

'అయితే, జాతకం చూసే పేరు పెడుతున్నారా?'

'కాదు, నా జాతిని చూచి పేరు పెట్టుకున్నాను. సీత సుమంగళి, సీత వదువు, సీత పత్ని, సీత సంతానవతి, సీత పతివ్రత, సీత ఒక ధర్మం.'

ఆమె మాట్లాడలేదు. ఆయన పేరు వ్రాసేస్తున్నాడు. ఎదురుగ్గా ఉన్న కోదండరామ పటంలో ఏదో కాంతి మెరిసింది.

(నందిని - సెప్టెంబరు, 1976)

# ఆచార్య జీ.వి. సుబ్రహ్మణ్యం రచనలు

1. వీర రసము (ఆంధ్ర సారస్వతము) - (1961)
(1960లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి పొందిన గ్రంథం.)
2. తిరుపతి వేంకట కవుల కావ్య సమీక్ష (రచన. 1962 ప్రచురణ 1995)
3. సారస్వత సౌరభము (సాహిత్య వ్యాస సంపుటి) - (1970)
4. ప్రథమాంధ్ర మహాపురాణము - ప్రబంధ కథామూలము - (1973)
(పి హెచ్. డి., సిద్ధాంత వ్యాసము)
5. నవ్యాలోకము (సాహిత్య వ్యాస సంపుటి) - (1973)
6. పిల్లలమర్రి పినవీరభద్ర కవి కృతులు - సమీక్ష - (1973)
7. శ్రీనాథుని కవితా వైభవము - (1974)
8. పురాణ వాఙ్మయము - (1974 & 1975)
9. తిరుపతి వేంకటకవుల కవితా వైభవము (1977)
10. రసోల్లాసము (సాహిత్య వ్యాస సంపుటి) (1980)
(ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి 1983 సం॥ ఉత్తమ సాహిత్య విమర్శ పురస్కారం పొందిన గ్రంథం)
11. రామకథ : సాయిసుధ - (1982) & (1995)
12. అభినవలోచనం (సాహిత్య వ్యాస సంపుటి) - (1983)
13. ఆంధ్ర సాహిత్య విమర్శ - ఆంగ్ల ప్రభావం - (1983)
(కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం (1986) పొందిన గ్రంథం)
14. అక్షరాల ఆలోచనలు (సాహిత్య వ్యాస సంపుటి) - (1985)
15. కలంతో కాలమ్ (పత్రికా వ్యాస సంపుటి) - (1990)
16. సాహిత్యచరిత్రలో చర్చనీయాంశాలు (వ్యాససంపుటి) - (1991)
17. జీవియస్ వ్యాసాలు (సాహితీవ్యాసాలు) - (1993)
18. కాలమానమ్ (పత్రికా వ్యాసాలు) - (1995)
19. విశ్వనాథ : నవ్య సంప్రదాయం (వ్యాసాలు) - (1995)
20. జీవియస్ రూపకాలు (నాటకాలు, నాటికలు) - (1996)
21. జీవియస్ : మధురాద్వైతం (కవితా సంపుటి) -
22. జీవియస్ నవలలు, కథానికలు